# హిందూ ధర్మ వైభవం

రచన మరియు సంకలనం
**మన్నవ గిరిధరరావు**



నవయుగభారతి ప్రచురణలు
భాగ్యనగర్ - 500 027

# హిందూ ధర్మ వైభవం

రచన మరియు సంకలనం :

మన్నవ గిరిధరరావు


మొదటి ప్రచురణ : 1997

రెండవ ప్రచురణ : 1998

మూడవ ప్రచురణ : 2002

ప్రచురణ :

నవయుగభారతి ప్రచురణలు

3-4-852, బర్కత్‌పుర

హైదరాబాద్ - 500027

గ్రాఫిక్స్ :

జాగృతి గ్రాఫిక్స్,

3-4-705/4, నారాయణగూడ

హైద్రాబాద్ - 29

ముద్రణ :

ఆకృతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్,

చిక్కడపల్లి,

హైదరాబాద్ - 500020

ప్రతులకు :

సాహిత్యనికేతన్

3-4-852, బర్కత్‌పుర

హైదరాబాద్ - 500027

ఫోన్ : 7563236

సాహిత్యనికేతన్

ఏలూర్ రోడ్

గవర్నరు పేట

విజయవాడ - 500 002

ఫోన్: 667421



రచయిత చిరునామా :

మన్నవ గిరిధరరావు

S-2, సత్యసాయి హోమ్స్

6వ లైను, 15వ అడ్డ రోడ్డు,

బ్రాడీపేట, గుంటూరు - 522002

ఫోన్ : 238331



మూల్యం : రూ. 100/-

శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి
శ్రీ కంచికామకోటి పీఠం

కాంచీపురం

# శుభాశీస్సులు

హిందూధర్మ మొక జీవన విధానము. భారతీయులకే గాక సమస్త మానవాళికి ఇది మార్గదర్శకమైనది. ఇది విశ్వశ్రేయస్సును కాంక్షించునది.

శ్రీ మన్నవ గిరిధరరావు శ్రీ కంచికామకోటి పీఠమునకు సుపరిచితులు. మా ఆశీస్సులతో వారు ''భారతీయ మార్గము'' పత్రికకు *1983* నుండి సంపాదకులుగా నున్నారు. రచయితగా వారు సుప్రసిద్ధులు. ''హిందూ ధర్మ వైభవము''ను వారు సంకలనం చేసి వెలువరించుట కడు ముదావహము.

ఈ గ్రంథములో మహర్షులు మన ముందుంచిన ఉత్తమ జీవనము ఎట్టిదో, పవిత్ర గ్రంథ పారాయణము వలన ఎట్టి సంకటములు తొలగునో చక్కగా వివరించారు. దైవ ప్రార్థన వలన కొందరు వ్యక్తులు ఏయే క్లేశముల నుండి విముక్తి పొందినారో తెలుపు స్వానుభవము లిందు పేర్కొన్నారు.

ముఖ్యముగా హిందూ మతములో బహు దేవతారాధన ఎందుకేర్పడినదో, దాని ఆంతర్యమేమిటో విపులముగా వివరించారు. ఇది ఎల్లరు తెలుసుకోదగియున్నది.

వేదములు, పురాణములు, ఉపనిషత్తులలో, ఏయే విషయములు చర్చింపబడినవో సంక్షిప్తముగ తెలిపినారు. శ్రీమద్రామాయణమును ఆధునికులు ఎందుకు చదువవలెనో భారత భాగవతములలోని ప్రత్యేకత ఏమిటో, శ్రీకృష్ణ తత్త్వములోని అంతరార్థమేమిటో విశదీకరించబడినది.

అన్నిటికంటె ప్రధానముగా హిందూమతమును ప్రేమించిన పాశ్చాత్య మేధావుల గురించిన అధ్యాయము కొనియాడతగియున్నది. మన మంత్ర శాస్త్రమును గురించి పరిశోధన చేసి లోకానికి వెల్లడించిన సర్ జాన్ ఉడ్రాఫ్ గారిని మనము సదా గుర్తు చేసుకోవలసి యున్నది.

దైవభక్తితో బాటు దేశభక్తిని గూడ మన మలవరచుకోవలసిన అగత్యమెంతైనా యున్నది. అందుకు తగినట్లు ''దేశభక్తి స్వరూప స్వభావాలు'' గురించి చక్కని రచన యిందున్నది.

ఇంత చక్కని గ్రంథమును రూపొందించిన 'శిల్పి' శ్రీ మన్నవ గిరిధరరావును శ్రీ కంచి కామాక్షీదేవి అనుగ్రహించి సర్వశుభములను చేకూర్చవలెనని ఆశీర్వదించు చున్నాను.

ఓం తత్సత్

# సమర్పణ

హే భగవాన్!

ఆశ్చర్యం! అద్భుతం! అనిర్వచనీయం నీ లీలలు!

ఇంకా తల్లి గర్భంలో ఉండగానే ఒక మాంసపు ముద్దకు సర్వావయవములు తీర్చిదిద్ది శిశువుగా రూపొందించు మహా శిల్పివి నీవు.

బిడ్డ జన్మించుటతోడనే మాతృ రక్తాన్ని క్షీరముగా మార్చి, ఆహారాన్ని సిద్ధం చేసెడి పాకశాస్త్ర ప్రవీణుడవు.

మానవులకు, పశుపక్ష్యాదులకు అనుక్షణము ప్రపంచమును వీక్షించుటకు అద్భుతమైన రీతిలో చక్షువుల నమర్చిన ఘనవైద్యుడ వీవు.

తమ ప్రమేయము లేకుండగనే సకల ప్రాణులచే ఉచ్వాస నిస్వాసములను జరిపించి, చెడు రక్తమును మంచి రక్తముగ మార్చి జీవులను జీవింపజేస్తున్న ప్రాణదాతవు నీవు.

ఆడ, మగ అనే రెండు తెగలను సృజించి జీవుల నడుమ అనురాగాన్ని, ఆప్యాయతను, అనిర్వచనీయమైన అనుబంధాన్ని కలిగించి జీవులకు అతిగొప్ప వ్యాపకాన్ని సృజించిన ఇంద్రజాలికుడ వీవు.

నెమలి పింఛానికి అతి సున్నితంగా రంగులు అద్దడమేగాక, పచ్చని ఆకులనడుమ రంగుపూలు పూయించడమేగాక, ఎక్కడో మహాసముద్రంలో వుండే జలచరములను సైతము రంగులతో అలంకరించెడి చిత్రకారుడ వీవు.

ఎట్టి ఆధారము లేకుండా ఇంత పెద్ద భూ ప్రపంచమును నిలబెట్టుచు, రాత్రింబవళ్ల నేర్పరచి జీవులకు శ్రమకు, విశ్రాంతికి తగు వీలు కల్పించిన పరిపాలనా దక్షుడవు.

అవ్యయుడవు, సర్వవ్యాపివి, సర్వశక్తిమంతుడవగు ఓ సర్వేశ్వరా! శిరము వంచి సాష్టాంగ ప్రణామము లాచరించి ఈ చిన్న గ్రంథమును నీ పాద పద్మముల కడ సమర్పించు చున్నాను.

– రచయిత

# ముందుమాట

హిందుధర్మం విశ్వజనీనమైనది, సార్వకాలికమైనది. ''ఆత్మ వత్సర్వభూతాని'', ''లోకాస్సమస్తా సుఖినోభవంతు'' లాంటి పరమోత్తమ లక్ష్యాలను మానవుల ఎదుట ఉంచినది. ఇది సకల మానవాళికి ఐహిక, ఆముష్మిక సుఖశాంతులను చేకూర్చునట్టి పరమధర్మము.

ఐనను ఇటీవలి కాలంలో పలు విమర్శలకు గురియైనది. హిందూ మతమునునది మూఢాచారములపుట్ట, దురాచారముల కేంద్రం అనే అపోహాలు పలువురిలో ఏర్పడినవి. అసలు 'హిందూ' అంటేనే 'కమ్యూనల్' అనీ, సంకుచితత్వమనీ కొందరు చిత్రీకరిస్తు న్నారు. అందుచేత హిందువులలోనే హిందూధర్మం ఎడల నిర్లిప్తత ఏర్పడింది. చాలామంది తమను తాము హిందువులమని అనుకోడానికే వెనుకాడుతున్నారు. వారు తను ధర్మం గురించి తెలుసుకోడానికి ప్రయత్నించడంలేదు. ఏదైనా పండుగవస్తేనో, కష్టం వస్తేనో దేవుడు గుర్తుకు వస్తున్నాడు. అంతేతప్ప అనుదినం దైవస్మరణకు సమయం వెచ్చించడం లేదు.

మరొక ముఖ్యమైన సంగతికూడా వున్నది. మానవులను సత్ప్రవర్తకులుగా తీర్చదిద్దే శక్తి మతానికున్నదని 1984 డిసెంబరులో చైనా కమ్యూనిస్ట్ నాయకులు ప్రకటించారు. అందుచేత తమదేశంలో మత బోధనను, దైవారాధనను ప్రోత్సహించ గలమని చెప్పారు.

చైనాలో యువతరంలో త్రాగుడు, నేరప్రవృత్తి విశృంఖలంగా పెరిగి పోతున్నాయనీ, వాటిని ఆపడానికి మతం యొక్క ఆవశ్యకతను వారు గుర్తించారనీ తెలుస్తున్నది.

అలాగే పూర్వపు కమ్యూనిస్టు రష్యాలో శ్రీకృష్ణభక్తి వ్యాప్తికి ఆనాటి అధికారులు అనుమతించారు. కీవ్, లెనిన్‌గ్రాడ్, రీగా మొదలైన 15 పట్టణాలలో హరేకృష్ణ కేంద్రాలు నడుస్తున్నాయి. పిన్న వయసులోనే త్రాగుడు, వ్యభిచారములాంటి నేరాలకు యువకులు లోనుగాకుండా వారికి సత్ప్రవర్తన అలవరచడానికి హరేకృష్ణ ఉద్యమం తోడ్పడగలదని వారు భావించారు.

దేశం ఆర్థిక ప్రగతి సాధించడం అవసరమే. కాని దానికంటే ముఖ్యంగా ప్రజల నైతిక విలువలను పరిపోషించడం అత్యవసరం. అందుకు ధర్మప్రబోధమే సరియైన మార్గం. శ్రీరామకృష్ణ పరమహంస, భగవాన్ రమణమహర్షి, షిర్డీ సాయిబాబా లాంటి యోగిపుంగవు లీగడ్డ మీద ఎందరో అవతరించారు. 'నేను, నాది' అనే భావనకు వారు అతీతులు. వారి ప్రేమమయజీవనం జనుల ప్రవర్తన మీద సత్ప్రభావం కలిగియున్నది. ఆవిధంగా ప్రజలను

పశుత్వంనుండి మానవత్వానికి, మానవత్వం నుండి దైవత్వానికి గొనిపోయే శక్తి మతానికున్నది.

హిందూ సమాజంలో అస్పృశ్యత, వరకట్నం, కులతత్వం లాంటి దురాచారాలు చోటుచేసుకున్నాయి. వాటిని పరిహరించుకొని మనల్ని మనం సంస్కరించుకోవలెనేగాని శతాబ్దాలతరబడి ప్రపంచానికే జ్ఞానభిక్ష పెట్టిన హిందూ ధర్మాన్ని నిర్లక్ష్యం చేయడం తగదు. కేవలం కర్మకాండకు, దైవస్తోత్రాలకు పరిమితం కాకుండా మనుష్యుని ప్రవర్తనను మెరుగుపరచే ఉత్తమసాధనంగా హిందూ ధర్మాన్ని అర్థం చేసుకొని ఆచరించవలసిన అవసరం ఎంతైనా వున్నది.

అందుచేత జాతి శ్రేయస్సు కొరకు హిందూధర్మంలోని విశిష్ట విషయాలను ఆధునికులకు రుచించేరీతిలో సహేతుకముగా మరల చెప్పవలసిన అవసరం చాలా వున్నది. ఐతే హిందూధర్మం అనేది మహాసముద్రం. దానిని సంక్షిప్తంగా వివరించడం చాలా కష్టమైన పని. ఇందులో ఏఒక్క అంశమునైనా సాకల్యంగా వర్ణించవలెనంటే గ్రంథం పెరిగిపోతుంది. అందుచేత అద్దంలో పర్వతాన్ని చూపినట్లు సామాన్య పాఠకులు అవగాహన చేసుకోవడానికి వీలుగా హిందూ ధర్మం విశదీకరించబడినది.

1983 విజయదశమి నుండి శ్రీ కంచికామకోటి పీఠాధిపతుల ఆమోదంతో, ఆశీస్సులతో ''భారతీయమార్గము'' మాసపత్రిక శ్రీ శంకర సేవాసమితి పక్షాన నడుపుచున్నాము. ఆ పత్రికలో వెలువడిన అత్యంత విలువైన ఇష్టాగోష్ఠులు తదితర రచనలు ఈ పుస్తకంలో చోటుచేసుకున్నాయి.

హిందూసోదరులలో ఆత్మవిశ్వాసం పెంపొందడానికి, తమ ధర్మం ఎడల అనురక్తి కలగడానికి, వైభవోపేతమైన సంస్కృతికి తాము వారసులమని గుర్తు చేసుకోడానికి ఈ గ్రంథం తోడ్పడగలదని ఆశిస్తున్నాను.

– మన్నవ గిరిధరరావు

# ధన్యవాదాలు


ఈ గ్రంథమును 1997లో యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ తరపున మొదట ప్రచురించాము. 1998లో పునర్ముద్రణ చేశాము.

1998నుండి నాకు అస్వస్థత కారణంగా యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ ద్వారా ప్రచురణలన్నిటిని నిలిపి వేయవలసి వచ్చింది.

2002లో నవయుగ భారతి ప్రచురణలు, హైదరాబాదు వారు దీనిని ప్రచురించుట కంగీకరించారు. అందులకు ఆ సంస్థ అధ్యక్షులు డా. చిలుకూరు సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, కార్యదర్శి, ''జాగృతి'' సంపాదకులు శ్రీ వడ్లమూడి రామమోహనరావు గారికి మనసారా ధన్యవాదాలు తెలుపుచున్నాను.

– రచయిత

మాజేటి వెంకట రామకోటి ముత్యాలు
అధ్యక్షులు, యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటి

అరండల్‌పేట,
గుంటూరు - 2

# భూమిక

సమాజంలో నైతిక విలువలు లుప్తమైపోతున్నాయి. జీవితమే దుర్భరమవుతున్నది. సమాజం దారీతెన్నూ తోచని స్థితిలో వున్నది. మేధావులందరు ఆలోచించవలసిన విషయమిది.

చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె ఒక చిన్న దీపం వెలిగించడం మంచిది. సమాజం మొత్తాన్ని మనం సరిదిద్దలేము. కాని మనచుట్టూ వున్న ప్రజలలో మనకు తెలిసినంతలో మంచిని పెంచవచ్చు. ఇది సత్యము- ఇది అసత్యమనీ, ఇది చీకటి- ఇది వెలుగు అనీ విశదీకరించవచ్చు.

1969లో శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారు విద్యార్థుల స్థాయిలో నైతిక బోధన ఆవశ్యకతను గుర్తించారు. యువతరానికి దేశభక్తి, కార్యశీలత, వ్యక్తిగత శీలము, కర్తవ్య నిర్వహణ లాంటిగుణములను పెంపొందించుట కొరకు శ్రీ మన్నవ గిరిధరరావు కార్యదర్శిగా ''యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ'' ని స్థాపింపజేశారు. దాని ద్వారా అనేక ప్రచురణలను వెలువరించాము.

మేము ప్రచురించిన కాంతిరేఖలు - 1,2,3 భాగములు యువకులకు నిజముగా 'కాంతిరేఖలే' అని విజ్ఞుల అభిప్రాయం. స్వామి వివేకానందుడు వాంఛించినట్లు 'మనిషిని తయారుచేసే విద్య' కొరకు ఇవి అత్యంత ఉపయుక్తముగా నున్నవి.

మేము ప్రచురిచిన ''మన మాతృభూమి'' ప్రతి రాష్ట్రము గురించిన సాంస్కృతిక వారసత్వంతో అలరారుచున్నది. ఈ పుస్తకంలో భారతదేశాన్ని గురించి గర్వించదగిన వివిధ విషయాలు పేర్కొనబడినవి. ఇలాంటివే పనికొచ్చే కథలు - 1,2 భాగాలు. మణిపూసలు - 1,2 భాగాలు. సూక్తిసుధ వగైరా పుస్తకములన్నీ పాఠకుల మన్ననలు పొంది ఐదారు ప్రచురణలనందినవి.

ఇపుడు ప్రచురిస్తున్న ''హిందూధర్మ వైభవం'' అత్యంత విలువైనదని చెప్పవచ్చును. వేదకాలం నాటి నుండి నేటివరకు వెలువడిన అనంతమైన హిందూధార్మిక సాహిత్యంలో ప్రసిద్ధమైన విషయాలను ఆధునికులకు రుచించే రీతిలో వివరించడం జరిగింది. ప్రతివిషయాన్ని హేతుయుక్తంగా జీవితానికి అన్వయింపజేస్తూ చెప్పడం జరిగింది. మన ధర్మం యొక్క ఘనతతో బాటు మనం సరిదిద్దుకోవలసిన లోపాలను గూడ ప్రస్తావించడం జరిగింది. ఈ గ్రంథం పాఠకుల మన్ననలు పొందుతుందని విశ్వసిస్తున్నాము.

పాఠకుల నుండి సూచనలను, సలహాలను ఆహ్వానిస్తున్నాం.

-ఎం. వి. ఆర్. కె. ముత్యాలు

# మాతృ పితృ వందనం

ఈ గ్రంథ ప్రచురణ సందర్భంగా
నా పితృదేవులు
స్వర్గీయ మన్నవ సీతాపతిరావు
(బ్రాంచి పోస్టు మాస్టరు, మన్నవ గ్రామం)

నా మాతృదేవి
స్వర్గీయ మన్నవ సామ్రాజ్యమ్మ గార్లకు
వినయపూర్వకముగా
వందనము లర్పించుచున్నాను.

– రచయిత

# విషయసూచిక

## మొదటి అధ్యాయము
### సృష్టిక్రమము



## రెండవ అధ్యాయము
### భగవంతుని గురించి అవగాహన



## మూడవ అధ్యాయము
### ఉత్తమ జీవనము

## నాల్గవ అధ్యాయము

## దేవాలయాల ప్రత్యేకత



## ఐదవ అధ్యాయము

## పవిత్ర గ్రంథముల పారాయణ



## ఆరవ అధ్యాయము

## ప్రార్థన వలన ప్రత్యక్ష ఫలితాలు

ఏడవ అధ్యాయము

బహుదేవతారాధన



ఎనిమిదవ అధ్యాయము

వేదములు-పురాణములు



తొమ్మిదవ అధ్యాయము

రామాయణ విశేషాలు



పదవ అధ్యాయము

మహాభారతంలో ప్రత్యేకతలు

## పదునాలుగవ అధ్యాయము

### సందేహ నివృత్తి



## పదునైదవ అధ్యాయము

### హిందూ మతమును ప్రేమించిన పాశ్చాత్యులు



## పదహారవ అధ్యాయము

### హిందువుల ఔన్నత్యం

## పదిహేడవ అధ్యాయము

### ఆత్మవిమర్శ



## పదునెనిమిదవ అధ్యాయము

### ప్రత్యేక అంశములు

గ్రంథ సమీక్ష: ''ఆంధ్రభూమి'' 14-9-97

# హిందూ సముద్ర మథనం

''హిందూ ధర్మమొక జీవన విధానము. భారతీయులకేగాక సమస్త మానవాళికిని ఇది మార్గదర్శకమైనది. ఇది విశ్వ శ్రేయస్సును కాంక్షించునది'' అని చెప్పిన కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారి శుభాశీస్సులతో మన్నవ గిరిధరరావు గారు వెలువరచిన సంకలన గ్రంథమే ''హిందూ ధర్మవైభవం''. దీనిలో అనేక ప్రముఖులతో జరిపిన ఇష్టాగోష్ఠులు, ప్రశ్నోత్తరాలు, వ్యాసాలు, అభిప్రాయాలు స్వామి వారి మాటలకు భాష్యాలుగా నిలుస్తాయి. అనేక ముఖాలుగా విస్తరించిన హిందూ ధర్మ విశేషాలను, వాటి ఆంతర్యాలను వివరించే గ్రంథం ఇది.

నైతిక విలువలు పడిపోతున్న ఈ రోజుల్లో ధార్మిక బోధనలు, వాటి వెనుక వున్న రహస్యాలను తెలుసుకోవడం చాలా అవసరం. దీనివల్ల మానవుడు తన కర్తవ్యమేమిటో, ఆధ్యాత్మిక ఆది భౌతికంగా తన బాధ్యత లేమిటో గుర్తించగలుగుతాడు. అలా గుర్తించి, తన ప్రవర్తనలో మార్పు తెచ్చుకున్నప్పుడు సమాజంలో బాధ్యతాయుతమైన వ్యక్తిగా నిలబడుతాడు. మానవత్వానికీ దాని ద్వారా సమాజ శ్రేయస్సుకి ఊపిరి పోసిన వాడవుతాడు. ఈ ఆవశ్యకతను గుర్తించి వెలువడిన గ్రంథం ''హిందూ ధర్మ వైభవం''.

చాలా పురాతనమైన హిందూ ధర్మంలో ఆధునికమైన సాంఘిక, రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక విశేషాలు కూడా తరచిన కొద్దీ కనిపిస్తాయి. కాబట్టి జరుగవలసిన పని హిందూ సముద్ర మధనం. ఈ కార్యాన్ని 18 అధ్యాయా లలో చక్కగా నిర్వర్తించింది ఈ పుస్తకం. మన సంస్కృతిలోని విశిష్టత, ఔన్నత్యం, హేతువాదం, సందేశాత్మక సంకేతాత్మక ఉపదేశాలు, వాటి ప్రయోజనాలు చర్చించి పరమార్థాన్ని బోధిస్తుంది. సామాన్య జనానికి అర్థమయ్యేటట్లుగా, ఎందరో ప్రముఖుల స్వీయ అనుభవాలు, వారి విజ్ఞాన విశేషాలతో పాటు, హిందువులు నేర్చుకోవలసిన ఆత్మ విమర్శ కూడా ఇందులో లభించడం ముదావహం. అందరూ చదవాల్సిన గ్రంథం ఇది.

— వేమూరి వెంకటేశ్వరశర్మ

# భరతమాత

సగర మాంధాతాది షట్చ్రక్రవర్తుల

అంకశీమల నిల్పినట్టి సాధ్వి

కమలనాభుని వేణుగాన సుధాంబుధి

మునిగి తెలిన పరిపూత దేహ

కాళిదాసాది సత్కవికుమారుల గాంచి

కీర్తినందిన పెద్ద గేస్తురాలు

బుద్ధాది మునిజనంబుల వసంబున మోద

భాష్పము ల్విడచిన భక్తురాలు

సింధు గంగానదీ జలక్షీరమెపుడు

గుడిపి బిడ్డల బోషించుకొనుచునున్న

పచ్చిబాలెంతరాలు మా భరతమాత

మాతలకు మాత సకల సంపత్సమేత

- గుఱ్ఱం జాషువా

ఓం గం గణేశాయనమః

# హిందూ ధర్మ వైభవం

# అధ్యాయము - 1

# సృష్టి క్రమము

## 1. సృష్టి ఎలా జరిగింది?

- డా. జి.ఎల్.ఎన్. శాస్త్రి, ఎం.ఎస్‌సి. పి. హెచ్‌డి.

(గుంటూరు తెల్లాకుల జాలయ్య పోలిశెట్టి సోమసుందరం కళాశాలలో ఫిజిక్స్ శాఖాధ్యక్షులుగా నున్న డా. జి.ఎల్.ఎన్. శాస్త్రిగారితో ఇష్టాగోష్ఠి)

ప్రశ్న : ఈ సృష్టి ఎలా ఏర్పడింది? ఇది దేనినుండి వచ్చింది?

జవాబు : మనం ఒక మఱ్ఱిచెట్టును చూస్తాము. దానియందు కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పూలు, పండ్లు వివిధ రంగులలో కనిపిస్తాయి. అయితే అవి అన్నీ ఒక అతిచిన్న విత్తనం నుండి వచ్చాయి. ఆ మఱ్ఱి విత్తనం ఒక చైతన్య కేంద్రం. దానిలో రంగులు, రుచులు, వాసనలు లేవు. అలాగే ఒక నిత్యము నిర్గుణము అయిన చైతన్యములో నుండి ఈ సృష్టి ఏర్పడుచున్నది.

ప్ర : ఆ చైతన్య శక్తియే సృష్టి కర్త అంటారు. మరి, సృష్టికీ సృష్టికర్తకూ నడుమ గల అంచెలు ఎలాంటివి? వివరిస్తారా?

జ : ఒక ఉదాహరణ చెప్పుకుందాము. మన నోట్లో నుండి ఒక వాక్యం వెలువడుతున్నది. ''నేను భోజనం చేస్తాను'' అనే మాట అన్నారు. ఈ వాక్యం వెలువడడం ఒక సృష్టి. ఈ సృష్టి ఎలా జరిగిందో, ప్రపంచ సృష్టి, మానవ సృష్టి అలాగే జరిగాయి.

ప్ర : వాక్యం నోటితో ఉచ్చరిస్తే వెలువడిందిగదా?

జ : నోటితో ఉచ్చరించడం బయటికి కనిపించే స్థితి. అది వ్యక్తమైన వాక్యం యొక్క భౌతిక స్థితి. అది బయటకు రావడానికి లోపల యింకా మూడు స్థితులున్నాయి.

ప్ర : ఏమిటా స్థితులు?

జ : ''నేను భోజనం చేస్తాను'' అనే వాక్కు మొదట మనసులో ఒక సంకల్పంగా ఆరంభమవుతుంది. దానినే వాంఛించడం అనవచ్చు. ఇది మొదటి స్థితి. ఆ వాంఛను ఆధారం చేసుకొని మనస్సులో ఒక భావన (Out line) తయారవుతుంది. ఈ భావనకు భాష ఉండదు. ఇది రెండవ స్థితి.. పిదప ఆ భావానికి మనస్సులో కొన్ని సంకేతాలు ఏర్పడుతాయి. ఆ సంకేతాన్ని గురించిన పేర్లు మన మనస్సుకు తగులుతాయి. ఇది భాషతో గూడిన మానసిక చిత్రణ. ఇది మూడవ స్థితి... మనస్సులో ఏర్పడిన సంకేతాలు ఉచ్చారణ రూపంలోబయటికి వినిపిస్తాయి. ఇది నాలుగవ స్థితి.

అందుచేత 1. సంకల్పము (Will) 2. భావము (Import) 3. సంకేతము (Symbolic language) 4. ఉచ్చారణ (Utterance) అను నాలుగు స్థితులలో వాక్కు సృష్టి అవుతున్నది. ఇందులో ఉచ్చారణ మాత్రమే లోకానికి వినిపిస్తున్నది. మిగతా మూడు వినిపించకుండ లోపలే ఉండిపోతాయి. ఉచ్చరించేవాడు 'బ్రహ్మ'. ఉచ్చరించేది సరస్వతి అని పురాణాలు సంకేతిస్తాయి.

ప్ర : ఇలాగే యావత్తు సృష్టి జరుగుచున్నదా?

జ : ఇలాగే సృష్టిలో గూడా నాలుగవ దశ మాత్రమే బయటికి కనిపిస్తుంది. మూడు దశలు బయటికి కనిపించవు.

ప్ర : దీనిని గురించి మన మహర్షులు ఏమైనా పేర్కొన్నారా?

జ : పురుష సూక్తంలో సృష్టి యొక్క మూడు భాగాలు లోపల జరుగుతాయని, ఒక భాగం మాత్రమే బహిర్గత మవుతుందనీ చెప్పబడింది.

ప్ర : ఏమిటి నాలుగు భాగాలు?

జ : ఇపుడు మనం చెప్పుకున్నదే. ఇందు ప్రతి దశకూ అధిష్టాన దేవతలున్నారు.

1. సంకల్పము... అధిష్టాన దేవత - ఈశ్వరుడు

2. భావము... అధిష్ఠాన దేవతలు - 12 మంది ఆదిత్యులు

3. స్పందన (లేక శక్తి)... అధిష్ఠాన దేవతలు - 11 మంది రుద్రులు

4. ద్రవ్యాత్మకం ... అధిష్ఠాన దేవతలు - 8 మంది వసువులు

ప్ర : బాగున్నది. ఈ సృష్టి విధానం మానవ సృష్టి పరంగా చెప్పండి?

జ : అదే చెప్పబోతున్నాను. ఒక ప్రాణి జన్మించాలంటే సంకల్పం ఒకటి వుంటుంది. అది తల్లిదండ్రుల మనస్సులలో వాంఛగా బయలుదేరుతుంది. అది మొదటి అంచె. తాను సృష్టిగా మారాలనే కోరిక కలిగిన భగవంతుని పేరు 'మహా కామేశ్వరుడు'. ఆ కోరిక, 'మహాకామం' వెలువడిన సృష్టి స్వరూపిణి 'మహా కామేశ్వరి'.

ఈ వాంఛ వలన శుక్ల శోణితములు కలిసినప్పుడు ఒక భావనయాత్మక మైన సృష్టి జరుగుతుంది. దీనితో ఏక కణముగా ఆరంభమైనది మానవకణముగా మార్పు చెందుతుంది. ఇది (Cosmogenesis) రెండవ అంచె.

మూడవ స్థాయిలో మానవకణము పూర్తి మానవ రూపను తీసుకుం టుంది. దీనిని (Anthropogenesis) అంటారు. ఇది పైన చెప్పిన సంకేతస్థాయితో సమన్వయ పరచవచ్చును. నాలుగవ స్థాయిలో అట్టి శిశువు బయటికి ప్రసవించబడు తుంది. దీనిని వాక్కు యొక్క ఉచ్చారణ స్థాయితో సమన్వయ పరచవచ్చును.

ప్ర : భాగవతంలో దీని ప్రసక్తి ఉందా?

జ : అసలు భాగవతం 12 స్కంధాల్లోను మొదటి 9 స్కంధాలలో అంటే 3 పాళ్లు జీవి తయారవడంలో గర్భంలోపల జరిగే కథలుంటాయి. దశమ స్కంధంలో జీవి (అనగా కృష్ణుడు) ప్రసవించబడి, 10,11,12 స్కంధాల్లో ఆయన బాహ్యకథ వుంటుంది. అంటే నాలుగోవంతు బాహ్యకథ అన్నమాట.

ప్ర : దీనిని గురించి పురుష సూక్తంలో ఏమైనా ప్రస్తావించారా?

జ : ''పాదోఽస్య విశ్వాభూతాని

త్రిపాదస్యాఽమృతందివి'' అన్నారు పురుష సూక్తంలో. విశ్వములో కనబడు భౌతిక సృష్టి అంతయు నాలుగవ వంతు మాత్రమే. మిగిలిన మూడు భాగములు లోపలనే ఇమిడి యున్నవని చెప్పారు.

ప్ర : వాక్కు యొక్క నాలుగు స్థాయిల గురించి మహర్షులేమైనా చెప్పినారా?

జ : ఋగ్వేదంలోని సరస్వతీ సూక్తంలో దీనిని గురించి చెప్పారు. వాక్కుకు నాలుగు స్థాయిలుంటాయని, అందు మొదటి మూడును గుహలో ఇమిడియుండి బయటికిరావనీ, నాలుగవ స్థాయిలోని వాక్కును మాత్రమే మనుష్యులు పలుకుచున్నారని, సరస్వతీ సూక్తంలో ఈ క్రింది మంత్రములో చెప్పారు.

చత్వారి వాక్పరిమితా పదాని

తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః

గుహాత్రీణి నిహితా నేంగయంతి

తురీయం వాచో మనుష్యావదంతిః !!

ప్ర : బాగున్నది. మరి ఈ నాలుగు స్థాయిలకు పేర్లేమిటి?

జ : ఈ నాలుగు స్థాయిలపేర్లు : పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీ. ఈ పేర్లు లలితా సహస్రనామంలో ఈ క్రింది శ్లోకంలో చెప్పబడినది.

పరా ప్రత్యక్చితీ రూపా పశ్యంతీ పరదేవతా

మధ్యమావైఖరీ రూపా భక్తమానస హంసికా!!

ప్ర : మంచి విషయం చెప్పారు. అయితే మరొక సందేహం. ఇందాక మీరు సృష్టి యొక్క నాలుగు స్థితులకూ అధిష్టాన దేవతలను పేర్కొన్నారు గదా, ఎవరు వారు? వారి అవసరమేమిటి?

జ : మంచి ప్రశ్న అడిగారు. సావధానంగా వినండి. ఏపని జరగాలన్నా దానికి తగిన సిబ్బంది కావాలి. సృష్టి కార్యం జరగడానికి ఆ సిబ్బంది 33 మంది వున్నారు. ఈ విషయం ఈ క్రింది శ్లోకంలో చెప్పారు.

త్రయత్రింశత్ సహస్రాణి

త్రయ త్రింశత్ శతానిచ

త్రయ త్రింశత్చ దేవానామ్

సృష్టి స్సంక్షేప లక్షణా!!

సృష్టి జరగడానికి 33 చొప్పున దేవతల వర్గము అవసరమగునని పై శ్లోకము చెపుతున్నది.

ప్ర : ఎవరా 33 మంది దేవతలు?

జ : వీరిలో 12 మంది ఆదిత్యులున్నారు. వీరిని ప్రజ్ఞామయ (consciousness) లేక దేవలోకము (light)నకు సంబంధించిన దేవతలు. వీరిని Lords of the plane of Radiation అంటారు.

పిదప 11 మంది రుద్రులున్నారు. వీరు స్పందనాత్మక లేక శక్త్యాత్మక (Force) లోకమునకు అధిపతులు. వీరిని Lords of the plane of vibration అంటారు.

పిదప 8 మంది వసువులు. వీరు ద్రవ్యాత్మక లోకమునకు (Matter) అధిపతులు. వీరిని Lords of the plane of Materialisation or precipitation అంటారు.

ప్ర : వీరంతా కలసి 31 మంది అయినారు. మిగతా ఇద్దరెవరు?

జ : అదే చెప్పబోతున్నాను. మొత్తము సృష్టి యొక్క ప్రారంభమునకు సంబంధించిన దేవత Lord of the inauguration of creation ఒకరున్నారు. సృష్టి అంతమునకు సంబంధించిన దేవత మరొకరున్నారు. అనగా జననము, మరణములకు వీరు అధిదేవతలు. వీరికి అశ్వినీ దేవతలనిపేరు, వీరి పేర్లు నాసత్యుడు, దస్త్రుడు. వీరిని కలుపుకుంటే 33 మంది దేవతలు. వీరినే మనవాళ్ళు 33 కోట్లదేవతలన్నారు.

ప్ర : వీరు ఒక్కొక్కరేగదా. కోటి ఎలా అవుతారు?

జ : కోటి అంటే ఇక్కడ అర్థం నూరు లక్షలు అని కాదు. కోటి అనగా సమూహమని అర్థం. ఒక్కక్క దేవత ఒక్కొక్క సమూహానికి సూచనగా చెప్పబడినది. (కోటి అంటే అంచు, వర్గము, నూరులక్షలు - ఇలా చాలా అర్థాలున్నాయి. కామకోటి అంటే కామానికి పై అంచులో వున్నది. అంటే మోక్షం అని అర్థం. అంతేగాని కోటిరెట్లు కామం అని అర్థం కాదు. 'శిష్యకోటి' అంటే శిష్యవర్గము అనే అర్థం చేసుకుంటాంగదా!)

చాలా ధన్యవాదాలు శాస్త్రిగారు !

*(ఏప్రిల్ 1988)*

# ౨. భారతీయ పంచాంగ విశ్లేషణ

- శ్రీ వడ్లమూడి వెంకటేశ్వరరావు, ఎం.ఎస్.సి.

(గుంటూరు హిందూ కళాశాలలో గణిత శాస్త్రాచార్యులుగను, వైస్ ప్రిన్సిపాల్‌గను పనిచేసిన శ్రీ వడ్లమూడి వెంకటేశ్వరరావు గారితో ఇష్టాగోష్ఠి)

ప్రశ్న : నేడు ఉగాది గనుక పంచాంగ శ్రవణం వాడవాడలా జరుగుతుంది. ఆ సందర్భంగా భారతీయ పంచాంగం గురించి మీరు చెపితే వినదలచాను.

జవాబు : చాలా సంతోషం. అడగండి చెప్పుకుందాం.

ప్ర : ఈ సంవత్సరాన్ని 1985 అంటున్నాంగదా. క్రీస్తుశకం మినహా మనకు మనదైన శకమంటూ ఏదీలేదా?

జ : లేకేమి! మనం వాటిని మరచిపోయాం. మనకు మొట్టమొదటిది యుధిష్ఠిర శకం. ధర్మరాజు రాజ్యానికి వచ్చిన సంవత్సరంతో అది ఆరంభ మయింది. దాని ప్రకారం ఇప్పుడు 5085వ సంవత్సరం. 5121 సంవత్సరాల క్రిందట యుధిష్ఠర శకం ఆరంభమైనది. ఇది కలియుగ ప్రారంభానికి పూర్వం 36 సంవత్సరాల ముందు ఏర్పడింది. అనగా క్రీస్తుకు పూర్వం 3136 సంవత్సరాల నాటిది.

ప్ర : మంచిది. మనదైన యుధిష్ఠిర శకాన్ని వదిలేసి క్రీస్తు శకాన్ని వాడుకలోకి తెచ్చుకున్నాం. పంచాంగాల్లో మాత్రం దీన్ని పేర్కొనడం జరుగతున్నది... మరి, మన సంవత్సరాలు 60 పేర్లతో ప్రభవ, విభవ మొదలైనవి చెప్పబడ్డాయి. ఈ 60 సంఖ్య ఎందుకు తీసుకున్నారు.?

జ : ఆకాశంలో రాశి చక్రం చుట్టూ గ్రహాలు పరిభ్రమిస్తున్నాయి. వాటిలో శని ఒకసారి రాశి చక్రం చుట్టి రావడానికి 30 సంవత్సరాలు పడుతుంది. బృహస్పతికి 12 సంవత్సరాలు పడుతుంది. బుధునికి, రవికి ఒక్కొక్క సంవత్సరం పడుతుంది. ఈ గ్రహాల ప్రయాణకాలాల కనిష్ఠ సామాన్య గణిజం 60. అనగా 60 సంవత్సరాలకు అన్ని గ్రహాలు మరల ప్రారంభించిన స్థానానికే వస్తాయి. ఇందుచేత మనం 60 సంవత్సరాల పరిమితి పెట్టుకున్నాం. అందుకే వ్యక్తులు షష్ఠిపూర్తి ఉత్సవం చేసుకుంటారు.

ప్ర : మంచిది... మరి సంవత్సరానికి 365 రోజులు ఎలా ఏర్పడ్డాయి?

జ : సూర్యుని చుట్టూ భూమి ఒక పరిభ్రమణం చేయడానికి 365 (1/4) దినములు పడుతుంది. అదే ఒక సంవత్సరమైంది. నాలుగేళ్ళ

కొకసారి ఒక లీపు సంవత్సరంలో 366 రోజులుండడం ద్వారా ఆకొరవ పూరింప బడుతుంది.

ప్ర : మరి చాంద్రమానం అంటే ఏమిటి? 12 నెలలు ఎలా ఏర్పడ్డాయి?

జ : ఏ మాసంలో చంద్రుడు పౌర్ణమినాడు ఏ నక్షత్రకక్ష్యలోకి వస్తాడో ఆ నక్షత్రం పేరుతో ఆ మాసం పిలువబడుతుంది. ఉదాహరణకు : చైత్రమాసంలో పౌర్ణమినాడు చిత్రానక్షత్రం వుంటుంది. అలాగే వైశాఖ పౌర్ణమినాడు విశాఖ, జ్యేష్ఠ పౌర్ణమినాడు జేష్ఠా నక్షత్రం. ఇలా 12 మాసాల పేర్లు ఏర్పడ్డాయి. ఇదే చాంద్రమానం అంటే.

ప్ర : వారాల పేర్లు ఎలా ఏర్పడ్డాయి?

జ : వారం హోరను బట్టి వస్తుంది. భూమినుండి గ్రహకక్ష్యల అవరోహణ క్రమంలో హోరలు నిర్ణయింపబడుతాయి. అవి శని, గురు, కుజ, సూర్య, శుక్ర, బుధ, చంద్రులు. ఈ ఏడు సుమారు ప్రతి గంటకు వరుసగా అధిపతులవుతారు. నిత్యం సూర్యోదయం ఏ హోరతో ప్రారంభమవుతుందో, ఆ దినం ఆ హోర పేరుతో పరిగణింపబడుతుంది. ఆదివారం నాడు సూర్యోదయం రవి హోరతో ప్రారంభమవుతుంది. అలాగే సోమవారం నాడు సూర్యోదయం చంద్రహోరతో ప్రారంభమవుతుంది. మంగళవారం నాడు కుజహోరతోను, బుధవారం నాడు బుధహోరతోను సూర్యోదయాలు ప్రారంభమవుతాయి. ఇలా వారాల పేర్లు ఏర్పడ్డాయి.

ప్ర : ఈ వారాలలో దేనికైనా ప్రత్యేక ప్రాముఖ్యమున్నదా?

జ : శుక్రవారం జగజ్జనని యగు పరదేవత ఉపాసనకు ముఖ్యమైనది. ఆదివారం సూర్యోపాసనకు ముఖ్యం. అలాగే గురువారం గురువుల నుపాసించుటకు సుదినం.

ఉదాహరణకు రాఘవేంద్రస్వామి, షిర్డీసాయిబాబా భక్తులు గురువారాన్ని పవిత్రంగా భావిస్తారు.

ప్ర : మరి, తిథులెలా ఏర్పడ్డాయో చెపుతారా?

జ : సూర్యచంద్రుల మధ్య దూరం అనుసరించి గణింపబడేది తిథి. ఉదాహరణకు పౌర్ణమినాడు సూర్యుడు అస్తమించునపుడు చంద్రుడు తూర్పున ఉదయిస్తాడు. అపుడు భూమిని కేంద్రం చేసి చూచినట్లయితే సూర్య చంద్రుల నడుమ 180 డిగ్రీల కోణముంటుంది. ఈ కోణం రోజుకు 12 డిగ్రీలు చొప్పున తగ్గుతూ అమావాస్య నాటికి 0 డిగ్రీ అవుతుంది. ఈ తారతమ్యంతో తిథులు ఏర్పడుతున్నాయి.

ప్ర : ప్రతి దినమునకు ఒక నక్షత్రం ఎలా నిర్ణయింపబడుతుంది?

జ : మనకు కనిపించే ఖగోళ పరిధిలో సూర్యచంద్రులు ప్రయాణిస్తున్నారు. వారు ఒకమారు ప్రదక్షిణం చేయుటకు 27 రోజులు పడుతుంది. ఒక్కొక్క రోజుకు 13 డిగ్రీల చొప్పున చంద్రుని నడక సాగుతుంది. ఆ రోజున ఆకాశంలో ఏ నక్షత్ర సమూహానికి దగ్గరగా చంద్రుడు సంచరిస్తున్నట్లు కనిపించునో ఆ రోజునకు ఆ నక్షత్ర సముదాయము పేరు ఇవ్వబడినది. ఇలా 27 నక్షత్రాలను వ్యవహరిస్తున్నారు.

**ప్ర : పంచాంగంలో మిగతా రెండు అంశాలైన యోగము, కరణముల ప్రాముఖ్యం ఏమిటి?**

జ : వాటికంత ప్రాముఖ్యం లేదు.

**ప్ర : వర్జ్యము అనగానేమి?**

జ : ఒక్కొక్క నక్షత్రం సుమారు 60 ఘడియలుంటుంది. (ఘడియ = 24 నిమిషాలు). ఇందులో ఒక్కొక్క నక్షత్రానికి ఎక్కడో ఒక 4 ఘడియలు వర్జింపతగినవి అని పెద్దలు చెప్పారు. ఉదాహరణకు అశ్వనీ నక్షత్రానికి 50 నుండి 54వ ఘడియ వరకు వర్జనీయము. ఇలా ప్రతి నక్షత్రానికీ వర్జింపదగిన నాలుగు ఘడియలు వుంటాయి. ఆ సమయంలో ముఖ్యమైన పనులు చేయరాదు.

**ప్ర : మన ప్రాచీన ఖగోళ శాస్త్రవేత్తలు ఎలాంటి ఆధునిక ఉపకరణములు లేకుండా ఇంతటి విజ్ఞానాన్ని ఎలా కనిపెట్టగలిగారు?**

జ : ఈ విజ్ఞానానికి నిధి వేదమే. ఆ వేదాలు మహర్షులచే దర్శింపబడినవి.

**ప్ర : ప్రాచీన భారతీయ ఖగోళ శాస్త్రజ్ఞులలో ఎవరు ప్రసిద్ధులు?**

జ : సూర్యుడు, వశిష్ఠుడు, ఆర్యభట్టు, భాస్కరాచార్యుడు, బ్రహ్మ గుప్తుడు, కేశవాచార్యుడు మున్నగువారంతా ఖగోళ శాస్త్రమును వెల్లడించారు.

**ధన్యవాదాలు వెంకటేశ్వరరావు గారూ! చాలా చక్కని విషయాలు చెప్పారు.**

***(1985 మార్చి)***

## సైన్సు - మతము

విజ్ఞాన శాస్త్రజ్ఞులు, సిద్ధ పురుషులు పరస్పర వ్యతిరేక దిశలలో వర్తులాకార బాట మీద పయనిస్తున్న వారివలె నున్నారు. ఆధునిక మానవునికి ఇరువురి ఆలోచనలతో అవసరమున్నది.

**-ప్రొ. జయంతి ఆర్. జోషి**

# అధ్యాయము - 2

# భగవంతుని గురించిన అవగాహన

## 3. కనపడని దేవుని పూజించడమెందుకు?

- శ్రీ మన్నవ గిరిధరరావు

నిత్యానందులూ నేనూ కలిసి ఏదో వూరు వెళుతున్నాం. బస్సు ఎక్కగానే ఎదురుగా 'దేవుని స్మరింపుము' అని బోర్డు కనిపించింది.

నాకు నవ్వొచ్చింది. ''ఆ బోర్డు పెట్టడానికి ఇదే తగిన చోటు'' అన్నాను. ఆయన కూడా నవ్వాడు.

బస్సు కదిలింది. చల్లగాలి వీస్తున్నది. మేము మాటల్లో పడ్డాం. ''దేవుని స్మరించమన్నారు గదా. కనిపించని దేవుణ్ణే స్మరించడ మెందుకూ?'' అని అడిగాను.

''కనిపించనివన్నీ లేవనుకోవడం పొరబాటు. నిజానికి సృష్టిలో కనిపించే దానికన్నా కనిపించని భాగమే అధికంగా ఉంది. కనిపించని దానివల్లనే కనిపించేవన్నీ నడుస్తున్నాయి.''

''అదెలాగ స్వామీ?'' అన్నాను.

''చెట్టు వేళ్లు భూమిలోపలికి జొరబడి ఎంతో లోతుకు విస్తరించడం వల్లనే కనిపిస్తున్న కొమ్మలకూ రెమ్మలకూ జీవరసం లభిస్తున్నది. ఆ వేళ్లు లేకపోతే చెట్టు లేదు. అవి కనిపించవు... మనం కూర్చున్న ఈ బస్సు కనిపించని డీజిల్ ఆయిల్ వల్ల నడుస్తున్నది. ఆయిల్ లేకపోతే ఇది శవంలాగ పడి ఉంటుంది... అలా కనిపించకుండా ఉండి జీవులను నడిపిస్తున్న శక్తియే భగవంతుడు.''

''మంచి ఉపమానాలే చెప్పారు. కనిపించని శక్తి ఉన్నదని నమ్మడం ఎలా?''

''భూమికి ఆకర్షణ శక్తి ఉన్నది కదా. అది కంటికి కనబడదు. దాని ప్రభావం వలన పైకి ఎగరేసిన రాయి క్రింద పడుతుంది. అలాగే శక్తి ఏదీ కంటికి కనిపించదు. విద్యుచ్ఛక్తి కూడా లైటువెలగడం వలన వున్నదనుకోవాలేగాని దాన్ని చూచే వీలులేదు. దాని అసలు స్వరూపం కనిపించేది కాదు. దైవశక్తి కూడా దాని ప్రభావం వల్లనే తెలియబడుతుంది.''

''అవుననుకోండి... 'శక్తి' కాకుండా ఇంకా ఏమైనా కనిపించనివి ఉన్నాయా?'' అని అడిగాను.

''ప్రేమ, దయ, కోపం, అసూయ, కృతజ్ఞత వగైరా గుణాలేవీ కనిపించవు. ఒక వ్యక్తికి నీమీద గౌరవం ఉన్నదో లేదో కనిపించదు. అతడు నీతో ప్రవర్తించే తీరును బట్టి గ్రహించగలవు. తల్లి బిడ్డను ముద్దుపెట్టుకోవడమే ఆమెకు బిడ్డమీద ప్రేమ ఉన్నట్లు తార్కాణం. మన చర్యలు కంటికి కనిపిస్తాయి. ఆలోచనలు కనిపించవు. ఆలోచనల ఫలితమే చర్యలు.''

''దేవుణ్ణి ఎలా అర్థం చేసుకోవాలి?''

''దేవుడు అనే పదం మనల్ని తప్పుదారి పట్టిస్తున్నది. దేవుడు అనగానే అతడు రెండు కాళ్లూ నాలుగు చేతులూ కలిగి పురుషరూపంలో పైనుండి దిగివస్తాడని భావించడం పొరబాటు. 'దైవశక్తి' అనేమాట సరియైనది. ఆ శక్తి పురుషుడూ కాదు. స్త్రీ గూడా కాదు. అది తన అనంతమైన, అవ్యయమైన, అనిర్వచనీయమైన సామర్థ్యంతో సృష్టిని నడిపిస్తున్నది. ఐతే అది మహాశక్తి గనుక పురుష వాచకంతో పిలుస్తున్నాం.''

''ఇంతకూ దేవుడు నిరాకారుడా? సాకారుడా?''

''రెండూను!'' అన్నారు నిత్యానందులు.

'' రెండూ ఎలా అవుతుంది?'' అని ఆశ్చర్యంగా ప్రశ్నించాను.

''విద్యుచ్ఛక్తి తీగలో ప్రవహిస్తూ మన కంటికి కనిపించకుండా వున్నప్పుడు నిరాకారం. బల్బు ద్వారా అది ప్రకటితమైనపుడు సాకారం'' అన్నారాయన.

''దేవుడు మనల్ని నడిపించే శక్తి అని ఎలా చెప్పగలం?''

''కన్నులకేది కనిపించదో, దేనివలన కన్నులు చూచుచున్నవో అదియే దైవము'' అని కేనోపనిషత్తు చెపుతోంది.

అసలు మరొకరు చెప్పనవసరం లేదు. ఎవరికివారు ఆలోచించుకుంటే తెలుస్తుంది...మనం తినే ఆహారాన్ని రక్తంగా మారుస్తున్నదెవరు? మన ఇంద్రియాలకు ఆయా ధర్మాలను కలిగించినదెవరు? నాలుకకు రుచి, కంటికి చూపు ఎవరిచ్చారు? అసలు మన ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు కారణం ఎవరు? మనమా? కాదే, అవి మన ఆధీనంలో లేవే.

ఎట్టి ఆధారంలేకుండా భూమి ఎలా పరిభ్రమిస్తున్నది? సూర్యాస్తమయాలు ఎలా జరుగుతున్నాయి. వర్షాన్ని ఎవరు కురిపిస్తున్నారు? పువ్వులు ఎలా పుష్పిస్తున్నాయి?

వీటన్నింటికీ కారణం చైతన్య శక్తి. అదే దైవం అని అనుకోవడం సమంజసం కదా!

''అవుననుకోండి, ఆ శక్తి ఎడల భక్తి చూపడం దేనికి? స్మరించడం దేనికి? పూజలెందుకు?'' అన్నాను.

''ఉద్యోగమిచ్చి ఆదుకున్న వారినీ, రోగం నయంచేసి ప్రాణం కాపాడిన వారినీ జీవితాంతం తలుచుకుంటాం. జన్మనిచ్చిన తల్లిదండ్రుల యెడ కృతజ్ఞులమై యుంటాం. మరి, మన మనుగడకు ఆధారమైన ఉచ్ఛ్వాస నిశ్వాసాలను జరిపిస్తున్న దేవుని ఎడల కృతజ్ఞులమై యుండనవసరంలేదా?... ఆ కృతజ్ఞతను వెల్లడించడమే దైవస్మరణ, అర్చన వగైరాలు'' అన్నాడాయన.

## సర్ థామస్ మన్రో పొందిన అనుభవం

ఈస్టిండియా కంపెనీ పరిపాలనాకాలంలో బళ్లారి జిల్లా కలెక్టరుగా 1800లో సర్ థామస్ మన్రో నియమించబడ్డాడు. 1812లో కంపెనీ ప్రభుత్వం ఒక ఆజ్ఞ జారీ చేసింది. దాని ప్రకారం ప్రజలు నిర్వహిస్తున్న దేవాలయాల ఈనాములను ప్రభుత్వం స్వాధీనం చేసుకుటుంది. అట్టి ఈనాములను పొందిన వ్యక్తులు ఇంకా సజీవంగా వున్నట్లయితే మాత్రం వాటిని స్వాధీనం చేసుకోదు. ఆదోని తాలూకా మంత్రాలయంలో శ్రీరాఘవేంద్రస్వామి వారి జీవసమాధిని బృందావనమంటారు. 1593లో వారు సమాధి చెందారు. వారికి ఆదోని నవాబు మంచాలగ్రామాన్ని ఈనాముగా ఇచ్చారు. మంత్రాలయంలో జరిగే నిత్య సంతర్పణ, పూజాదికముల కొరకు ఈనాము యొక్క ఆదాయం వినియోగమవుతున్నది. ఈనాముపొందిన రాఘవేంద్రస్వామివారు లేరు గనుక 1812లో సర్‌థామస్‌మన్రో ఈనామును ప్రభుత్వ అధీనంచేయడానికై మంత్రాలయం వచ్చాడు. సిరస్తదారు, ప్రభుత్వోద్యోగులు వెంటవచ్చారు. అప్పటి మఠాధిపతులు కలెక్టరుకు నచ్చజెప్పడం కొరకు వచ్చారు.

''ఇదేనా రాఘవేంద్రుల జీవసమాధి?'', అని కలెక్టరు ప్రశ్నించగా 'అవునని' అచటివారు పలికారు. ఇంతలో ఒక అద్భుత సంఘటన జరిగింది. శ్రీరాఘవేంద్రస్వామి వారు మానవరూపంలో సమాధినుండి బయల్వెడలి వచ్చి కలెక్టర్ మన్రోతో ఆంగ్లంలో సంభాషించారు (స్వామి వారు జీవించియున్న కాలంలో ఎన్నడూ ఆంగ్లభాషనెరుగరు). ఈ మంచాలగ్రామమును తనకు ఆదోని నవాబు ఈనాముగా ఇచ్చినట్లు స్వామివారు మన్రోకు తెలిపి అదృశ్యమైనారు. మన్రోకు మంత్రాక్షతల నొసంగి వాటిని తన అన్నములో కలిపి వండించి భుజించమని చెప్పారు. మంత్రాక్షతలు మన్రో చేతిలో ఉన్నాయి. కాని స్వామివారు అదృశ్యమైనారు. స్వామివారు అక్కడున్న మరెవ్వరికీ కనిపించలేదు. మన్రో మంచాలగ్రామ ఈనామును ప్రభుత్వం స్వాధీనపరచుకోరాదని నివేదిక పంపాడు. ఈ సంఘటన యావత్తూ అప్పటి మదరాసు ప్రభుత్వ గెజెట్‌లోను, తరువాత మద్రాస్ ప్రోవిన్స్ గెజిటీర్స్ Chapter 11, page213లో ప్రచురింపబడినది.

# 4. కథల ద్వారా దైవత్వ అవగాహన

– ''సౌమిత్రి''

కంటికి కనిపించని దివ్యశక్తిని అవగాహన చేసుకోవడం ఎలా అనేది చిక్కు ప్రశ్న.

''పైన చూచిన కొద్దీ సృష్టిలో ప్రతిదానికీ ఒక దానినుంచి ఇంకోదానికి భిన్నత్వం ఎక్కువగా కనపడుతుంది. లోతుగా చూడగలిగిన కొద్దీ భిన్నం చెయ్యడానికి వీలులేని ఏకత్వం తోస్తుంది. ఆ ఏకత్వమే ఈశ్వరుడు'' అన్నారు గుడిపాటి వెంకటచలం.

వీరు చెప్పిన రీతిలో ఆలోచిస్తే సృష్టి అంతటా అనేకత్వం కానవస్తుంది. లోతుగా భావన చేయగలవారికి ఆ అనేకత్వం వెనుక అంతర్లీనంగా ఏకత్వం గోచరిస్తుంది. అదే భగవంతుడు.

ఆయన చక్కగా చెప్పారు గాని అలా ఏకత్వాన్ని దర్శించే మార్గం ఏమిటి? ఇందుకొక చక్కని కథ వున్నది.

శైవ సంబంధమైన గ్రంథాలను ''తురుముట్టై'' అంటారు. అవి పన్నెండు. ఆ సంప్రదాయానికి చెందిన తిరుమూలర్ అనే యోగీశ్వరుడు వ్రాసినది మొదటి తిరుముట్టై. ఆయన అందులో ఒక పద్యంలో ఇలా వ్రాసారు :

ఆలయానికి ఏనుగు కావలసి వచ్చింది. దానిని చేయమని ఒక వడ్రంగికి చెప్పారు. అతడు తయారుచేసిన తరువాత మరొక వడ్రంగి దానిని చూడడానికి వెళ్లాడు. అతనితో అతని కూతురు గూడ వెళ్లింది.

ఆ ఏనుగును చూడగానే అతని కుమార్తె భయపడి ''నాన్నా! ఏనుగు దగ్గరకు వెళ్లకు. అది నిన్ను ఏమైనాచేస్తే కష్టం'' - అని తండ్రిని హెచ్చరించింది.

కాని ఆ తండ్రి ఆ హెచ్చరికను లెక్కచేయక దగ్గరకుపోయి ''ఆహా! ఎంత చక్కని చెక్క! ఎంత చక్కని చెక్క!'' అని ఆ కఱ్ఱ ఏనుగును చూస్తూ ఉండిపోయాడు.

అది దారువా? లేక దంతియా? ఒకరికి దారువు, మరొకరికి దంతి. వడ్రంగికి ఏనుగు కనిపించలేదు. చెక్క కనిపించింది. కుమార్తెకు ఏనుగు కనిపించింది. లోపలి చెక్క మనసుకు తగలలేదు.

ఈ పంచభూతాలనూ, అనేకత్వాన్నీ చూచే వారికి ఏనుగు కానవస్తుంది. ఈ అనేకత్వం లోపల అంతర్లీనంగా వున్న ఏకత్వాన్ని దర్శించగలవారికి 'చెక్క' కనబడుతుంది. ఈ కథను శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారు చెప్పారు. ఇచట ఏనుగు అనేకత్వంతో గూడిన ప్రపంచానికీ, చెక్క ఏకత్వానికి అనగా భగవంతునికీ ప్రతీకలు.

ఇలాంటిదే మరొక కథ : కల్పిత కథ అయినను ఇదియొక సందేశాన్నిస్తుంది.

ఒక గ్రామంలో గొప్ప ధనికుడున్నాడు. భోగభాగ్యాలతో జీవించాడు. తుదకు వృద్ధాప్యం వచ్చి మరణశ్యయపై వుండగా తన ఆస్తిని ముగ్గురు కొడుకులకు విభాగం చేస్తూ వీలునామా వ్రాసి చనిపోయాడు.

కొడుకులతనికి శ్రద్ధగా అంత్యక్రియలు చేశారు. మరునాడు తీరుబాటుగా కూర్చొని వీలునామా తీసి చూశారు. దానిలో వారి తండ్రి తనకు గల 17 ఏనుగులను కొడుకులకు పంచుతూ, పెద్దకుమారునికి 1/2 వంతు రావాలనీ, రెండవ కుమారునికి 1/3వ వంతు రావాలనీ, మూడవ కుమారునికి 1/9వ వంతు రావాలనీ నిర్దేశించాడు.

17 ఏనుగులను ఆవిధంగా విభాగం చేయడం కుదరదు. అందుచేత ఆ ముగ్గురు కొడుకులు కలహించుకుంటున్నారు.

ఆ దేశపురాజు ఏనుగునెక్కి ఆ దోవన పోతూ, వీరి తగవు చూచి దగ్గరకు వచ్చాడు. వీరి సమస్యను సాకల్యంగా విన్నాడు.

రాజు తన ఏనుగును తెచ్చి వీటితో కలిపాడు. అపుడవి 18 ఏనుగులయినాయి. వీలునామా ప్రకారం వాటిని పంచుకోమన్నాడు.

పెద్దకుమారునికి 1/2వ వంతు 9 ఏనుగులు, రెండవ కుమారునికి 1/3వ వంతు 6 ఏనుగులు, మూడవ కుమారునికి 1/9వ వంతు 2 ఏనుగులు వచ్చాయి. ఇలా 9+6+2=17 ఏనుగులు సరిపోగా రాజుగారి ఏనుగు మిగిలిపోయింది. రాజు దాన్ని తీసుకొనిపోయాడు.

జీవితంలో మనకు వచ్చే చిక్కు సమస్యలు ఇలాంటివే. వాటిని పరిష్కరించుకోవడానికి రాజుగారి ఏనుగులాంటిదేదో కావాలి. అదే దైవానుగ్రహం.

**ఇలాంటిదే మరొక కథ :**

షిర్డీసాయి జీవితములో ఒక విశిష్టమైన సన్నివేశమున్నది.

ఒకమారు తాత్యాకోటే పాటీలు అను భక్తుని భార్య బాబాను తన యింట విందారగింప రమ్మని ప్రార్థించింది. అందులకు బాబా తను సాయంకాలము ఆరు గంటలకు తప్పక వచ్చెదనని, తనను కసరకూడదని పలికినాడు.

ఆమె పోళీలుచేసి పళ్లెము నిండుగా వుంచి బాబారాగానే పూజించి భోజనమిడు నుద్దేశ్యముతో ఎదురుచూస్తున్నది. ఇంకను రాలేదేమాయని దంపతులిరువురు వేచియున్నారు. సరిగా ఆరు గంటలకు ఒక కుక్క వచ్చి పోళీలు తిన బోయినది. అంతనామె ఆ కుక్కపై ఇనుప ఊచ విసరినది. ఆ శునకము ఆ వ్రేటు నుండి తప్పించుకొని అతి దీనముగా ఆమెవైపు చూచుచు వెళ్లిపోయినది.

ఆ దంపతులు రాత్రి వరకు ఎదురుచూచారు. బాబా రానందుకు మిగుల విచారపడుచు మసీదునకు వెళ్లి బాబాను దర్శించి ఏల రాలేదని ఆమె బాబాను అడిగినది. ''తల్లీ! నేను మాట తప్పువాడనుగాను, నేను వచ్చితిని. నీవు నన్ను తరిమివేసితివి'' అని అన్నాడు బాబా.

అంత ఆమెకు కుక్క వచ్చుట, తాను తరుముట గుర్తుకువచ్చి తాను అజ్ఞానురాలనని తన అపరాధమును మన్నించి మరునాడు తప్పక దయచేయమని ప్రార్థించినది. బాబా అటులనే అని చెప్పినాడు.

మరునాడు గూడ ఆమె సకల సన్నాహములు చేసుకొని బాబా రాకకై ఎదురుచూచు సమయమున పొరుగువారి గేదెవచ్చి తినుబండారములను బయటి నుండియే తినుటకు ప్రయత్నించగా, ఆమె బాబా లీలను గుర్తించలేక ఒక కర్రతీసుకొని దానివీపుపై కొట్టగా దానికి పెద్ద గాయమై రక్తము చిందినది. అది అటనుండి వెళ్లిపోయినది.

ఆనాడుగూడ బాబా తన గృహమునకు రానందున ఖిన్నురాలై ఆమె బాబా దరికేగగా, బాబా తన వద్ద కూర్చున్న వారికి తన వీపుపై గాయము చూపుచున్నాడు. ఆమె దానిని చూచి యిది ఏమియని అడుగగా - నీ యింటికి విందారగింప వచ్చితిని. కాని నీవు కఱ్ఱతో కొట్టి తరిమితివి అన్నారు బాబా. అంత ఆమె

''బాబా! మీరు తెలిపినను గ్రహించలేని మూఢురాలను. నేనెంతటి అపరాధము గావించితినో'' అని విలపింపసాగింది. అంత బాబా ఆమెనోదార్చి తిరిగి తాను భుజించుటకు వస్తానని పలికెను.

ఆ మరునాడు గండుచీమల రూపమున వచ్చి విందారగించెను. ఆమె దానిని గ్రహింపలేక మరునాడు బాబా సన్నిధికిపోయి రాలేదేమియని అడుగగా తాను వచ్చియుంటిననియు ఆమె యొసగిన ఫేణీలు ప్రేమతో ఆరగించితిననియు కావలయునన్న చూడుమని అంగీని పైకి తీసి చూపగా బాబా బొడ్డు చుట్టును అనేకములగు గండుచీమలు నోట ఫేణి ముక్కలను కరచుకొని యున్నవి.

దైవస్వరూపుడగు బాబా సకల జీవుల రూపములో నున్నానని తెలుపుటకే ఇట్లు చేసెను. సకల ప్రాణులతో భగవంతుని చూడవలయునను ప్రబోధమునకు ఈ కథ తార్కాణముగా నున్నది.

## ఐన్‌స్టీనుకు ఉత్సాహమిచ్చిన గ్రంథం

1948-49లో డా. బి.ఎం. గుప్తా అను భారతీయ విద్యార్థి విజ్ఞాన శాస్త్రంలో పరిశోధనకై అమెరికా వెళ్ళాడు.

ప్రపంచ ప్రఖ్యాతి చెందిన డా. ఐన్‌స్టీన్ మహాశయుని కలుసుకొన డానికై ప్రిన్స్‌టన్ విశ్వవిద్యాలయానికి వెళ్ళాడు.

ఐన్‌స్టీన్ అతిథిని లోపలికి ఆహ్వానిస్తూ ఇంగ్లీషులోగాక సంస్కృతంలో పలకరించాడు. భారతీయ విద్యార్థి తాను సంస్కృతంలో ప్రత్యుత్తర మివ్వజాల నందుకు అశక్తతను తెలియపరచాడు.

యువకుడైన భారతీయ విజ్ఞాన శాస్త్రజ్ఞునికి సంస్కృత జ్ఞానం లేనందుకు ఐన్‌స్టీన్ విస్మయం చెందుతూ ఇలా అన్నాడు : ''హిందూ విద్య లకు జన్మస్థలమైన ఇండియా నుండి మీరు వస్తున్నారు. ఐనను సంస్కృతం నేర్చుకోడా నికి మీరు శ్రద్ధ వహించలేదు. లోపలికి రండి, ఎన్ని సంస్కృత గ్రంథాలు నా బీరువాలో ఉన్నాయో చూడండి. భగవద్గీతతో సహా అనేక సంస్కృత గ్రంథాలను నేను పఠించాను.

అంతేకాదు, నా విజ్ఞాన శాస్త్ర పరిశోధనలకు నూతన సిద్ధాంతములను రూపొందించుటకు నేను భగవద్గీతను ప్రధాన ఉత్సాహ కేంద్రముగను, మార్గదర్శికముగను స్వీకరించాను''.

(కల్యాణ కల్పతరు *1976* జులై సంచిక నుండి)

# అధ్యాయము - 3

# ఉత్తమ జీవనము

## 5. మహర్షులు బోధించిన ఉత్తమ జీవితము

- డా. అనుమాలసెట్టి రాఘవరావు, ఎం.ఎస్.

*(గుంటూరు మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్‌గా పనిచేసిన డా. ఎ.రాఘవరావు M.S., F.I.C.S., F.I.M.S.A. గారితో ఇష్టాగోష్ఠి)*

ప్రశ్న : **మానవుడు ఆనందంగా జీవించాలంటే ఎలా నడచుకోవాలి? మన మహర్షులు ఈ విషయంలో ఏమి బోధించారు?**

జవాబు : మానవుడు ఒక ప్రయాణీకునివలె జీవించాలి. ఇది నా స్వంతం, నేను దీని యజమానిని అనే భావన రానివ్వకూడదు. అప్పుడతడు ఆనందంగా జీవితం గడపగలుగుతాడు.

మీరు ఢిల్లీ పోదామని రైల్లో బెర్తు రిజర్వుచేసుకున్నారనుకోండి. ఆ బెర్తు 'మీది' కాదు. కొన్ని గంటలు మాత్రమే దాన్ని రిజర్వు చేసుకుంటారు. దిగేటపుడు ఆ సీటును మీ వెంట తీసుకుపోరు. ఇదే భావాన్ని గృహము ఎడల, భార్య బిడ్డల యెడ, వస్తు సామాగ్రి యెడల కలిగియుండాలి. ఇవన్నీ నావి అనుకున్నప్పుడు వాటిని మీరు పోగొట్టుకున్నపుడు గాని, వదలుకొనవలసినపుడుగాని దుఃఖపడ తారు. 'నాది' అనే భావన లేకుండా జీవితంలో లభించిన దానిని అనుభవించండి. ఇదే ఆనందానికి మన మహర్షులు బోధించిన ఏకైక మార్గం.

ప్ర : **మరి దీని యజమాని ఎవరు?**

జ : దీనంతటికీ యజమాని భగవంతుడు. మనం ఎక్కిన రైలు బోగీ, బెర్తులు, ఇంజను, రైలు పట్టాలు, రైలు స్టేషన్లు - అన్నిటి యజమాని రైల్వే డిపా ర్టుమెంటు. అది కంటికి కనిపించదు. ఆయా వస్తువుల రూపంలో వుండి పని చేస్తుంది. అలాగే ఈ ఋళ్లు, వాకిళ్లు, నగరములు, పర్వతములు, పొలాలు, గనులు, వృక్షములు అన్నిటి యజమాని కంటికి కనిపించని భగవంతుడే. అతడే వీటికి

ప్రాణశక్తి నిస్తున్నాడు. నీటికి మనం ప్రాణం పొయ్యడంలేదు. కొంతసేపు నీటిని వాడుకుంటున్నాం. అంటే నీటిని 'నాది' అనుకోకూడదు.

ప్ర : మరి బంధు మిత్రులయెడ అనురాగం చూపగూడదా?

జ : వివిధ ప్రాణుల యెడల అనురాగము, దయ, కారుణ్యము చూపండి. వాటిలో అంతర్లీనంగా వున్న చైతన్యాన్ని గుర్తించండి. అంతేగాని తిరిగివారు నిన్ను ప్రేమిస్తారని ఆశపడవద్దు. ప్రతిఫలాపేక్ష లేకుండా మీ విధి మీరు నిర్వర్తించండి. ఎందుకంటే భాగవతంలో బలిచక్రవర్తి వామనునితో ''మిత్రులు దొంగలు, సుతులు ఋణగ్రస్తులు, కాంతలు సంసార కారణములు'' అన్నాడు. మీ వద్ద వున్న ధనముకొరకే ఈ బంధుత్వాలు పనిచేస్తాయి. అందుచేత 'నీవాళ్ళు నా వాళ్ళు' అనే మమకారాన్ని వీడి, కర్తవ్య భావంతో జీవించాలి.

ప్ర : మీరు చెప్పే నిష్కామకర్మను ఆచరణలో పెట్టడం యొక్క అవసరమేమిటి?

జ : మానవుడు ఎక్కువకాలం జీవించాలంటే నిష్కామకర్మను తప్పనిసరిగా అలవరచుకోవాలి. ఇటీవల ఒకడు తన డబ్బు ఏడాదిలో రెండు రెట్లు అవుతుందని పదిలక్షలు పెట్టి షేర్లు కొన్నాడు. అవి 20 లక్షలు కాకపోగా తుడిచిపెట్టుకుపోయినవి. అతని దుఃఖాన్ని ఎవరు ఆపగలరు? ఫలితం ఎటువంటిదైనా స్వీకరించే మనస్తత్వం వుండాలి. లేకపోతే రక్తపు పోటు, గుండె జబ్బు, ఆత్మహత్యలూ తప్పవు. నిష్కామకర్మ సిద్ధాంతాన్ని జీవితంలో ఆచరణలో పెట్టుకోవాలి. అది చాల గొప్ప సిద్ధాంతం.

ప్ర : ఫలితం ఎటువంటిదైనా స్వీకరించే మనస్థితిని ఎలా సాధించవచ్చు?

జ : భగవద్గీతలో స్థితప్రజ్ఞుని లక్షణములు వర్ణింపబడినవి. మానవుడు ద్వంద్వములకు అతీతుడుగా వుండగలగాలి. ద్వితీయాధ్యాయం 56వ శ్లోకం చూడండి. ''దుఃఖములందు అతని మనస్సు ఏ విధమైన క్షోభయు చెందదు. అట్లే సుఖములు ప్రాప్తించినపుడు ఉబ్బిపోడు''. ఇట్టి మనస్తత్వాన్ని అలవరచుకుంటే మనిషి ఆనందం పొందగలడు. 38వ శ్లోకంలో గూడ ఇదే విషయం చెపుతూ 'సుఖదుఃఖములందును, లాభ నష్టములందును, జయాపజయములందును సమబుద్ధి కలిగి యుండు'మన్నాడు.

ప్ర : అలాంటి సమబుద్ధి కలిగియుంటే జయముకొరకు మనిషి ఎందుకు కృషి చేస్తాడు? అసలు అలాంటి వాడికి పని మీద ఎందుకు ఆసక్తి వుంటుంది?

జ : కర్మలు చేయకుండ ఎవరును ఒక్క క్షణమైన ఉండలేరు. గాలి పీల్చుట, నడచుట, తినుట గూడ కర్మలే. ఎవరి విధ్యుక్త ధర్మమును వారు నిర్వర్తించాలి. తనకు ఈ మూడు లోకములలో పొందవలసినది ఏదీ లేకున్నను తాను గూడా కర్మలు చేయుచునేయున్నానని శ్రీకృష్ణుడు చెప్పాడు. కనుక పని యెడల వైముఖ్యం చూపగూడదు.

ప్ర :జీవితాన్ని ఆనందంగా గడపడానికి ఇంకా ఏమి చేయాలి?

జ : 1. మనస్సును లోక విషయాల నుండి దూరం చేసి దైవత్వానికి దగ్గర చేసుకోవాలి. ఇది క్రమంగా గాని జరుగదు.

2. భగవంతుడు అంతరాత్మ రూపంలో తనలోనే వున్నాడని గ్రహించాలి.

3. సర్వభూతములలోను భగవంతుడున్నాడు. కనుక నీవు జీవిస్తూ పరులను జీవించేటట్లు చెయ్యి. ఈ సత్యాన్ని ఆచరణలో పెట్టడమే భగవంతునికి దగ్గరయ్యే మార్గం. ఆనందానికి గూడా ఇదే మార్గం.

ధన్యవాదాలు డాక్టరుగారూ!

## గాయత్రీ మంత్ర శక్తి

గాంధీగారి హత్య రోజుల్లో ఒక యువకుడు భగవాన్ రమణ మహర్షి వద్దకు వచ్చి ఉగ్రంగా చూస్తూ ''గాడ్సే గాంధీని చంపి వినుతికెక్కాడు. నేను నిన్ను చంపి కీర్తికెక్కుతాను'' అని బెదిరించాడు భగవాన్‌ని.

''చంపు నాయనా, నాకీ దేహబాధ తప్పిపోతుంది'' అన్నారు భగవాన్. అక్కడున్నవాళ్ళు అతన్ని అటకాయించి తోసెయ్యాలని చూశారు. కాని భగవాన్ అతన్ని తన దగ్గరే వుంచుకొని తనతో భోజనానికి తీసుకు వెళ్ళారు. రెండు రోజులాశ్రమంలో ఉండిపోయాడతను.

మూడవ రోజున భగవాన్ దగ్గరకు పోయి ''నన్ను క్షమించండి. నాకు మతిస్థిమితం ఉండుండి తప్పిపోతుంది. నా మతి సరిగ్గా ఉండడానికి ఏదైనా ఉపదేశించండి'' అన్నాడు.

''గాయత్రి చెయ్యి'' అన్నారు భగవాన్.

అలా చేసి కొన్ని నెలలకు తిరిగి వచ్చాడు. అతని పిచ్చి అంతా పోయి గొప్ప భక్తుడైనాడు.

ఈ కథ ''రమణవాణి''లో ప్రచురింపబడింది.

# 6. ఆనందానికి నాలుగు సోపానాలు : పురుషార్థాలు

– శ్రీ మన్నవ గిరిధరరావు

హిందూమతం అనగానే ఇది సర్వ సుఖాలకూ దూరంగా వుండాలని బోధి స్తుందనీ, ప్రతి మనిషికీ మోక్షం గురించి నూరిపోస్తుందని పలువురి అభిప్రాయం. ఐహిక జీవితంలో అనేక ఆశలూ ఆకాంక్షలూ గలవారు హిందూ మతం అనగానే దూరదూరంగా పోతుంటారు. ఇదంతా కొన్ని విషయాలను సవ్యంగా అర్థం చేసుకోక పోవడం వలన కలుగుతున్న అపోహ మాత్రమే.

**సుఖం కొరకు మానవుడు పరితపిస్తాడు :**

ప్రపంచంలో సకల ప్రాణులూ సుఖాన్ని కోరుతాయి. ఎండలో నడిచే బాటసారి నీడ కోసం పరితపించినట్లు అన్ని జీవులూ సుఖం కొరకు, హాయి కొరకు ఆనందం కొరకు ఉవ్విళ్ళూరుతుంటాయి. అలాంటపుడు మోక్ష సామ్రాజ్యానికి మార్గం చూపుతానంటే వంటపట్టేదెవరికి?

మోక్షమనేది ఆఖరి మెట్టు. దానికి దిగువన అర్థ, కామ, ధర్మములనే మూడు సోపానములున్నాయి. వీటి అన్నిటి గురించి సాకల్యంగా పరిశీలించవలసిన అవసరం ఎంతైనా వున్నది.

**'నేను'లోని నాలుగు పొరలు :**

ప్రతి ఒక్కడూ 'నాకు' సుఖం కావాలని కోరుకుంటాడు. అయితే ఈ 'నేను' అనగా ఎవరు? 'నేను'ను విడదీసి చూస్తే ఏమి ఉంటాయి?

'నేను'లో పరిశీలించి చూస్తే నాలుగు పొరలున్నాయి.

1. 'నేను బజారుకు పోతున్నాను' అన్నపుడు 'నేను' అనగా దేహము.

'నేను చూస్తున్నాను, నేను వింటున్నాను' అన్నపుడు నేను అనగా ఇంద్రియములని అర్థము.

ఇంద్రియములతోగూడిన శరీరం 'నేను'లోని మొదటి పొర.

2. 'నేను ఆలోచిస్తున్నాను, నేను ఉద్యోగం చేయాలనుకుంటున్నాను., నాకు సినిమా చూడాలని వుంది' అన్నపుడు నేను అనగా మనస్సు. అది నిరంతరం ఆలో చిస్తూ వుంటుంది. కోరికలను కోరుతూ వుంటుంది.

3. 'నేను వివాహం చేసుకోవాలో, ఉద్యోగం చేయాలో ఇంకా నిర్ణయించు కోలేదు' అన్నపుడు 'నేను' అంటే బుద్ధి. ఇది జడ్జి లాంటిది. నిర్ణయాలు చేస్తూ వుంటుంది.

4. 'నేను ఉన్నాను' అన్నపుడు నేను అంటే 'ఆత్మ' అని అర్థం.

మానవుడు ఆనందంగా సంతృప్తిగా జీవించాలంటే అతనిలో అంతర్భూతంగా వున్న ఈ నాలుగింటినీ సమాధాన పరచాలి. అందుకొరకు చతుర్విధ పురుషార్థాలు అనే లక్ష్యాన్ని మన ముందుంచారు మహర్షులు. శరీరం కొరకు అర్థము, మనస్సు కొరకు కామము, బుద్ధి కొరకు ధర్మము, ఆత్మ కొరకు మోక్షము సాధించవలసిన పురుషార్థములుగా నిర్దేశించబడినవి.

**అర్థము :**

ఆకలి అనేది మానవుల సహజ లక్షణం. అది తీరడం కొరకు జరిగేదే యావత్తు ఆర్థిక కార్యకలాపం.

బిడ్డ తల్లితో ''అమ్మా! నేను నిద్రపోతాను. నాకు ఆకలయినపుడు నన్ను లేపవే'' అన్నదట! అందుకాతల్లి 'నీ ఆకలే నిన్ను నిద్ర లేపుతుందిలే' అన్నదట. మనుష్యులలో అనంతమైన కార్యశీలతకు, శ్రమజీవనమునకు ప్రేరణ ఆకలి.

మానవునికి కడుపు నిండగానే సరిపోదు. శారీరక సుఖాలను, వసతులను సమకూర్చే అనేక ఉపకరణాలు అతనికి కావాలి. వాటిని సమకూర్చుకోవడానికే అతడు తలమునకలవుతుంటాడు. సృష్టిలో పశు పక్ష్యాదులకు లేనటువంటి ఒక ప్రత్యేక బాధ్యత మానవులకున్నది. పశువులకు, పక్షులకు గల అవసరాలు అత్యల్పం. వాటిని అవి ప్రత్యేకించి తయారు చేసుకోనవసరం లేదు. ప్రకృతిలో సహజంగా అవి లభ్యమవుతాయి.

మనుష్యుని విషయం అలా కాదు. అతనికి దుస్తులు, ఆహారం, గృహవసతి, మందులు, రేడియోలు, స్కూటర్లు వగైరా ఎన్నో కావాలి. ఇవన్నీ అప్పళంగా ప్రకృతిలో లభించేవి కావు. తన చేతులతో తయారు చేసుకోవాలి. కనుక మానవుడు 'వస్తు నిర్మాత'. అతని శారీరక సుఖాలన్నీ వస్తు సముదాయంతో ముడిపడి వున్నాయి. ఇవన్నీ డబ్బు పెట్టి కొంటే వస్తాయని పలువురు భావిస్తారు. ఇదొక రకమైన అవివేకం. అసలు వాటిని ఎవరో ఒకరు ఉత్పత్తి చేస్తే గదా నీవు డబ్బులు పెట్టి కొనుక్కొనేది. నీ చేతిలోకి డబ్బు ఎలా చేరుతుంది, నీవు గూడ ఎదో ఒక వస్తూత్పత్తో, ఇతరమైన సేవలో చేయకపోతే?

కనుక శారీరక సుఖాలన్నింటికీ మూలం ఆర్థికం. దానికి మూలం వస్తూత్పత్తి. అందుకై వ్యక్తికి నిరంతర క్రియాశీలత అత్యవసరం. ''ఉత్పత్తి చెయ్యి లేదా నశించు''. అని పాశ్చాత్యుల నినాదం. 'కృషితోనాస్తి దుర్భిక్షం' అని మనవాళ్ళు చెప్పారు. ఈ రెండు సూక్తులను అర్థం చేసుకొని అమలుపరచడమే 'అర్థము'ను సాధించే మార్గం. అందుకై పని ఎడల ఆసక్తి, నిరంతర క్రియాశీలత అలవర చుకోవాలి.

**కామము :**

కామము అన్గా కోరిక అని అర్థము. సామాన్యంగా లైంగిక వాంఛనే కామము అని వ్యవహరిస్తుంటారు. దానిని అరిషడ్వర్గాలలో ఒకటిగాను, వర్జింపతగినదిగాను చెపుతారు. కాని విస్తృతమైన అర్థంలో మానసికమైన ఆకాంక్షలన్నింటినీ కామ్యము లుగానే పరిగణించవలసి వుంటుంది.

శారీరక సుఖాలను అనుభవించాలంటే మానసిక ప్రశాంతత, సంతోషము చాల అవసరం, మనస్సు విషాదంలో మునిగియున్నపుడు అన్నం తినాలనిపించదు. సినిమా చూడాలనిపించదు.

పండుగనాడు ఇష్టమైన పిండివంటలు చేయించుకొని ఒకడు భోజనానికి కూర్చున్నాడు. ముద్ద నోట్లో పెట్టుకోబోతుండగా ఎవరో వచ్చి ''ఏమండీ! మీ పాప రోడ్డు దాటుతూ లారీ క్రిందపడింది'' అని చెప్పారు. అతడు తినబోతున్న అన్నం ముద్దను వదలిపెట్టి వీధిలోకి పరుగెత్తాడు. ఏం? ఎందుకు తినలేక పోయాడు?

మనస్సుకు ఆనందం లేనపుడు ఇంద్రియాలు వేటినీ అనుభవింపజాలవు. అందుచేత సుఖపడదలచినవాడు మనస్సును సంతోషంగా వుంచుకోవాలి.

కోరికలన్నీ కామము క్రిందికే వస్తాయి. వాటిలో హీనమైన కోరికలు ఉంటాయి. ఉదాత్తమైన కోరికలూ వుంటాయి. సుఖాలకు ప్రవేశ ద్వారం కోరికలు. అవి వ్యక్తి యొక్క ఉన్నతికి, పురోగతికి ఉపకరించాలేగాని పతనానికి నాశనా నికి దారి తీయకూడదు.

దారి దోపిడీ చేయాలనీ, జూదమాడాలనీ, మత్తుమందులు పుచ్చుకోవాలనీ కోరికలు కలుగుతాయి. ఇట్టి కోరికలు మనిషిని పశుత్వానికి దిగజారుస్తాయి. గడ్డిపరక కంటే హీనునిగా తయారు చేస్తాయి.

అలాగాక జ్ఞానార్జన చేయాలనీ, ఆరోగ్య పరిరక్షణ చేసుకోవాలనీ, సమష్టి ప్రయోజనం కొరకు కృషి చేయాలనీ, నలుగురినీ కలుపుకుపోవాలనీ, కోరికలు కలుగుతాయి. అట్టి ఉదాత్తమైన కోరికల వలన మనిషి మనీషిగా పెంపొందుతాడు. నశించని కీర్తి పొందుతాడు.

అయితే ఏవి హీనమైన కోరికలో, ఏవి ఉత్తమమైన కోరికలో తారతమ్యం గ్రహించడానికి 'బుద్ధి' కావాలి. సంస్కారం ద్వారా, సత్సాంగత్యం ద్వారా బుద్ధి వికసిస్తుంది. దాని నుండి వివేకం ఆవిర్భవిస్తుంది. ఆ వివేకమే 'ధర్మాన్ని' నిర్ణయిస్తుంది.

**ధర్మము :**

'ధృ' అనే ధాతువు నుండి ధర్మము పుట్టింది. దీనికి వహించునది అనగా లోకమును మంచి స్థితిలో ఉంచునది అని అర్థము. పుణ్య కర్మను ధర్మమనీ పాప కర్మను అధర్మమనీ స్థూలంగా చెప్పుకోవచ్చు.

'లోకమున జీవులు ధర్మముచే తేలికైనవారై తెప్పలవలె తేలిపోవుదురు. పాపముచే భారము చెందిన వారై నీటిలో విడిచిన శస్త్రములవలె మునిగిపోవుదురు' అని భారతములో చెప్పబడినది.

మానవులకు వృత్తి ధర్మము, కుటుంబధర్మము, సంఘ ధర్మము, వర్ణ ధర్మము, ఆశ్రమ ధర్మము మున్నగు బహు విధములగు ధర్మములున్నవి. ధర్మ బద్ధమైన అర్థము, ధర్మ బద్ధమైన కామము సాధించవలెనని మనవాళ్లు చెప్పారు.

ఒక ఘన వైద్యుడున్నాడు. చాలా పేరున్నవాడే. అతని తల్లీ తండ్రీ అదే నగరంలో మరొక ఇంట్లో ఉంటున్నారు.

తండ్రికి పక్షవాతం వచ్చింది. కొడుకు వెళ్ళి మందులూ ఇంజక్షనులూ ఇచ్చి నయం చేశాడు. చికిత్స పూర్తి అయిన తరువాత తండ్రికి బిల్లు పంపించాడు. రూ. 2,000/- లు అయింది చెల్లించమని.

ఈ సంగతి తెలిసిన ఇరుగు పొరుగు వాళ్లు ముక్కుమీద వేలువేసుకున్నారు. డాక్టరుకు బుద్ధిలేదన్నారు. ఎందువల్ల?

వ్యక్తి తనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులకు కృతజ్ఞత చూపవద్దా?. అలా చూపడం అతని 'ధర్మం'. అంతేగాని 'బిల్లు' పంపిస్తాడా? బిల్లు?

ఒక చిన్న కథ :

ఒక వ్యక్తి చేతికర్రను ముందుకూ వెనుకకూ ఊపుకుంటూ వీధిలో నడుస్తున్నాడు. అతని వెనుకనే మరొకడు నడిచి వస్తున్నాడు.

ముందువాడి చేతికర్ర ఆ ఊపులో వెనుకవాడి ముక్కుకు తగిలింది. వెనుకవాడు ముందు నడిచేవాడితో 'ఏమయ్యా! నళ్లు దగ్గరుంచుకొని నడువు. నీ చేతికర్రకొన వచ్చి నా ముక్కుకు తగిలింది' అన్నాడు.

అందుకు ముందువాడు ''ఈ దేశపు పౌరుడుగా నా చేతికర్రను ఊపు కుంటూ నడిచే స్వేచ్ఛ నాకున్నది. నువ్వెవరవు అడగడానికి?'' అన్నాడు దురుసుగా.

అందుకు వెనుకవాడు ''నీకు స్వేచ్ఛ ఉన్నమాట నిజమే కానివ్వు. కాని నా ముక్కు ఎక్కడ ఆరంభమవుతుందో నీ స్వేచ్ఛ అక్కడ అంతమవుతుంది'' అన్నాడు.

కర్ర వెనుకవాడి ముక్కుకు తగలనంతవరకే ఇతని స్వేచ్ఛ. అందుచేత మనం అనుభవించే స్వేచ్ఛలు, సుఖాలు ఇతరుల క్షేమానికి భంగం కలిగించకూడదు. ఇది ఒకరకమైన ''ధర్మము''.

అందుకే ''ఇతరులు నీ యెడ ఎలా ప్రవర్తిస్తే నీకు అయిష్టం కలుగుతుందో నీవు ఇతరుల యెడ అట్లు ప్రవర్తించక పోవడమే ఉత్తమ ధర్మము'' అని భారతము చెపుతున్నది.

''నీకు ఇతరులు ఏది చేయాలని కోరుకుంటావో అదే నీవు ఇతరులకు చెయ్యి'' అని బైబిలు చెపుతున్నది.

''చేప కదలికకు నీరు ఎలా తోడ్పడునో, ధర్మము జీవుల కదలికకు అట్లు సహాయపడును'' అని వర్ధమాన మహావీరుడు చెప్పాడు.

ధర్మము యొక్క ఆవశ్యకతను గురించి రామాయణంలో ఒక చక్కని సన్నివేశమున్నది.

శ్రీరాముడు అరణ్యానికి పోయేముందు తల్లి ఆశీస్సులను పొందడానికై కౌసల్యవద్దకు వెళ్లాడు. ''అమ్మా! జనకుని ఆనతి ప్రకారం 14 ఏళ్లు అరణ్య వాసానికి పోతున్నాను ఆశీర్వదించు'' అన్నాడు.

కౌసల్య ఈ మాట వినగానే దుఃఖంతో మూర్ఛపోయింది. కొంతసేపటికి తెప్పరిల్లి శోకించింది. తానుగూడ రాముని వెంట వస్తానన్నది.

''అమ్మా! భర్త జీవించి యున్నంతవరకు భార్య పతి వెంటనే ఉండాలి. అందుచేత నా తండ్రిగారయిన దశరధునికి సహాయపడుతూ నీవు అయోధ్యలోనే ఉండవలసినది. నన్ను అరణ్యానికి పోనివ్వవలసినది'' అని రాముడు కోరినాడు.

ఆఖరుకు కుమారుడు అడవికి పోవడం తప్పదని గ్రహించి పురోహితులను రావించి రాముని శ్రేయస్సుకై దేవతలను పూజిస్తుంది. ''ఓ ఇంద్రుడా! అడవిలో నా రాముణ్ణి కాపాడు. ఓ అగ్ని దేవుడా! నీవు నా రాముణ్ణి రక్షించు. ఓ సకల దేవతలారా! మీరు అడవిలో నా రాముని ఆదుకొనండి'' అని ప్రార్థనలు చేసింది.

తుదకు ఓరామా ఏ ధర్మమునైతే నీవు ఆచరిస్తున్నావో ఆ ధర్మమే నిన్ను కాపాడుతుంది. ''ధర్మత్వా మ భిరక్షతు'' అని అన్నది.

అంటే ఏమన్నమాట? మానవుణ్ణి కష్టకాలంలో కాపాడేది అతడు ఆచరించే ధర్మమే. అతని సద్గుణములే.

ఇక, సామాజికంగా ఆలోచించినపుడు ధర్మము యొక్క అర్థమేమిటి, అవసరమేమిటి?

మనుష్యుడు తానొక్కడే భూమిమీద జీవించడం లేదు. ఒక కుటుంబంలో సభ్యుడుగా, ఒక సంఘంలో సభ్యుడుగా జీవిస్తున్నాడు. అనుక్షణం అతనికి ఇతరులతో లావాదేవీలున్నాయి. ఒకే వస్తువును ఇద్దరు కోరినపుడు వారి నడుము ఘర్షణ, కలహం తప్పవు. హత్యలకు, అత్యాచారాలకు మూలమిదే. అందుచేత వివిధ వ్యక్తులు వారిలో వారు ప్రవర్తించునపుడు ఒక నియమావళి అవసరం. అదియే ''న్యాయము, కర్తవ్యము, నీతి, నిజాయితీ, కృతజ్ఞత, ప్రేమ, కారుణ్యము, సత్యము'' - వీటి అన్నిటి యొక్క సమిష్టి నామమే ధర్మము.

వ్యక్తి, కుటుంబము, సమాజము - ఈ మూడును మూడు వృత్తములు. అవి ఒకదానిలో నొకటి ఇమిడి ఉన్నాయి.

వ్యక్తి ఒక పని చేయబోయేముందు అది తనకు లాభదాయకమా అని చూచుకుంటాడు. వెంటనే చేసివేస్తాడు.

అలాగాక అతడు అది తన కుటుంబానికి లాభదాయకమా అని కూడా ఆలోచించుకోవాలి. అయితేనే ఆ పనిచేయాలి. తనకు లాభదాయకమైనా కుటుంబానికి ఇబ్బందిగాని అవమానంగాని కలిగించేపని అయితే దాన్ని చేయగూడదు. తన సుఖం కుటుంబసుఖంలో అంతర్భాగమని గ్రహించాలి.

అంతేగాదు. ఆ పని తన సమాజానికి, దేశానికి ప్రయోజనకరమా లేక అపకారం కలిగిస్తుందా అనిగూడా యోచించాలి. తనకు వ్యక్తిగతంగా లాభదాయక మైనప్పటికీ దేశ శ్రేయస్సుకు భంగకరమైతే ఆ పని చేయకూడదు. దేశంలో ఉన్నత పదవులలో వున్న వారిలో సహితం ఇట్టి అవగాహన లేనందువలననే ఎన్నో అక్రమాలు, కుంభకోణాలు జరుగుతున్నాయి.

ఇలా విస్తృతమైన అర్థంతో ధర్మాన్ని ఆచరించాలి. ధర్మబద్ధమైన నడవడియే మానవులకు సుఖసంతోషాలను సమకూర్చగలదు.

మోక్షము :

మోక్షమనగా విడుదల అని అర్థము. ఆధ్యాత్మికంగా దీనినే ముక్తి, కైవల్యం, సాయుజ్యం అని కూడా అంటారు. పునరావృత్త రహితమైనది మోక్షము. అనగా జనన మరణ పరంపర అనే బంధం నుండి త్రెంచుకొని విముక్తి పొందడం.

యోగులకు, సన్యాసులకు, సర్వసంగపరిత్యాగులకు మోక్షము కావలె గాని జీవితమును అనుభవింపదలచు వారికి మోక్షముతో పనియేమి?

నిజమే. ఇది అందరికొరకు కాదు. ప్రపంచంలో ఏదైనా సరే దానిని కోరువారికే గాని అందరికీ కాదు.

ఐతే ఇక్కడొక తమాషా ఉన్నది. సృష్టిలో మరణం అనేది ఒకటున్నది. దాన్ని అందరూ ఈసడించుకుంటారే గాని తప్పించుకొనలేరు. మరణానికి కనీస వయస్సు అనేది లేదు. ఏ వయసులోనైనా రావచ్చు. మానవుడు నిర్మించుకొనే ఊహా సౌధాలను నేలమట్టంచేసేది మరణం. అతడు అనుభవింపగోరే సర్వ సుఖాలను బుగ్గిపాలు చేసేది మరణం.

ఏరికోరి వివాహమాడిన సుందరి తన కళ్లముందే లోకాన్ని వీడిపోతే, ఐదేళ్ళపాటు వుంటుందనుకున్న మంత్రి పదవి నెలతిరగకముందే అంతమైతే, లక్ష కాస్తా పది లక్షలవుతాయనుకొని కొన్న షేర్లు వందలస్థాయికి పతనమైతే - ఇలా సుఖాలన్నీ దుఃఖాలుగా మిగిలిపోతూ వుంటే మానవునికి ఆనందమెక్కడ? హాయి ఎక్కడ?

ఈ మౌలికమైన సమస్య గురించి మన మహర్షులు కూలంకషంగా ఆలోచించారు. వారు కనుగొన్నదేమంటే ''నాది'' అనబడే ప్రతి వస్తువూ ఏదో ఒకనాడు నశిస్తుంది, లేదా తనకు కాకుండా పోతుంది.

ఐతే ఈ ప్రాణులన్నింటికీ ఆధారమైనటువంటి చైతన్య పదార్థం ఒకటున్నది. అది మాత్రమే శాశ్వతమైనది, చావులేనిది. దాన్ని అనుభవంలోకి తెచ్చుకోవడమే నశించనటువంటి ఆనందానికి మార్గం అన్నారు. దానినే విముక్తి అనీ మోక్షం అనీ అన్నారు.

''నేను ఎపుడు మోక్షము పొందెదను?'' అని శ్రీరామకృష్ణ పరమహంసను ఎవరో అడిగారు.

''నేను నశించినపుడు'' - అన్నారాయన.

నేను అనేది నశిస్తే ఇక నాకు మోక్షమెందుకు? అని ఎవరికైనా అనిపించవచ్చు. కాని అర్థం అదిగాదు.

నాది అయినటువంటి ఇల్లు, వాకిలి, భార్య, బిడ్డలు, పదవులు ఎల్లకాలం నాతో వుండవు. ఎప్పటికైనా నాకు దూరమయ్యేవే. కనుక వాటిమీద మమకారాన్ని క్రమంగా తగ్గించుకుంటూ వుండాలి. జీవితానికి ఆఖరు మజిలీ అయిన శ్మశానాన్ని తరుచు గుర్తుచేసుకుంటూ ఉండాలి.

'నేను' ''నాది'' అనేటువంటి అహంకారమమకారాలను క్రమంగా తగ్గించుకుంటూ పోవాలంటే తన స్వంతానికి సంబంధించిన విషయాలకొరకు తాపత్రయపడడం తగ్గించి ఇతర ప్రాణుల, ఇతర వ్యక్తుల ప్రయోజనాలకొరకు సమయాన్ని వినియోగించాలి. క్రమంగా స్వార్థంనుండి స్వార్థ రాహిత్య దిశగా ప్రయాణం సాగించాలి.

''ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి'' అని భగవానుడు గీతలో చెప్పినట్లు, ఈశ్వరుడు సర్వప్రాణుల హృదయాలలో నివసిస్తున్నాడు. కనుక ఇతర ప్రాణులకు సుఖం అందించడం ద్వారా ఆత్మానందాన్ని పొందవచ్చు. ఇదియే మోక్షమునకు, నశించనటువంటి ఆనందానికి అర్హత కలిగిస్తుంది. మోక్షమనగా లోక విషయములమీద మోహము నశించుట.

మునిమాణిక్యం నరసింహారావుగారు ఒక జరిగిన కథ వ్రాశారు :

ఒకనాడు చింతా దీక్షితులుగారు వీరింటికి వచ్చారు. వాకిట్లో అరుగుమీద గుడ్డ పరచుకొని పడుకున్నారు. వీధిలో సినిమా కాగితాల బండి మేళం వాయించుకుంటూ పోతున్నది. రంగురంగుల కాగితాలకోసం పెద్దలు పిన్నలు ఎగబడి తీసుకుంటున్నారు.

ఐదేళ్ళ బాలుడొకడు బండి వెంట పరుగెత్తి రంగు కాగితాలు చేతికందక ఏడుపొచ్చి బిగ్గరగా ఏడ్చాడు.

దీన్ని చూస్తున్న దీక్షితులుగారు పై గుడ్డ నడుముకు చుట్టుకొని బండివెంట పడి ఓ పది కాగితాలు వాళ్లనుండి తీసుకొచ్చి ఆ పిల్లవాడికిచ్చాడు. పిల్లవాడు ఏడుపాపి కన్నీరు తుడుచుకుంటూ చిరునవ్వు నవ్వాడు. అది దీక్షితులు గారిలో మహదానందం కలిగించింది. అదే ఆత్మానందం. నేను, నాది అనేవి తగ్గించు కుంటూ పోయే మార్గమిలా వుంటుంది.

రమణ మహర్షి అనుదినం పశుపక్ష్యాదులకు ఆహారం పెట్టి ఆనందించే వారు. షిర్డీ సాయిబాబా ప్రతిదినం కడవలతో నీరు తోడి తెచ్చి మొక్కలకు పోసేవారు. జిల్లెళ్ళమూడి అమ్మ వచ్చిన వారికల్లా అన్నం పెట్టి ఆనందించేది. ఒకనాడు ఆమె చుట్టుప్రక్కల గ్రామాలనుండి పశువులను రప్పించి వాటికి కుడితి, పచ్చిగడ్డితో సంతర్పణచేసింది. ఈ విధంగా అహంకార మమకారములను వదులుకొని ఆత్మానందం పొందేవారు.

ఇలా ధర్మ, అర్థ, కామ మోక్షములనెడి పురుషార్థములు మానవుల సుఖ జీవనానికై నిర్దేశింపబడిన నాలుగు సోపానములు. ఇవి భౌతిక ఆధ్యాత్మిక సమన్వయానికి ప్రతీకలు. మానవ సమగ్ర వికాసానికి వెలుగుబాటలు.

మోక్షం పొందడానికి కావలసిన పరిపక్వత ధర్మార్థ కామములు అనే మూడు పురుషార్థములను సక్రమంగా సాధించడం ద్వారానే కలుగుతుందని చెప్పబడినది.

## సాహసము

ఒక జాతి యొక్క విజయము ఏ ఇతర సుగుణము కంటె మిన్నగా సాహసము మీదనే ఆధారపడి ఉంటుంది. ధైర్యాన్ని అలవరచుకోకుండా ఏ జాతీ ఉన్నత స్థానాన్ని ఆక్రమింపజాలదు. కనీసం తన స్వతంత్రము నైనా నిలబెట్టుకోజాలదు. సాహసం లేకుండా ఏ జీవనరంగంలో గూడా ముందుకు పోజాలదు. పిరికితనం గల జాతులు పతనం కాక తప్పదు.

– *డి.జి.ఐ. హోల్*

# 7. భారతీయ సంస్కృతి ప్రతిపాదించే ఉత్తమ జీవనము

-డా. మోపిదేవి కృష్ణస్వామి, ఎం.ఎ., పి.హెచ్.డి.

(విజయవాడలో ''మానవ ధర్మ శిక్షణా సంస్థ''ను నిర్వహించిన స్వర్గీయ డా. మోపిదేవి కృష్ణస్వామితో ఇష్టాగోష్ఠి)

ప్రశ్న : మనం ఆరోగ్య రక్షణ కొరకు అలవరచుకోవలసిన అలవాట్లు ఏమిటో తెలుపుతారా?

**జవాబు :** మొట్టమొదటి అలవాటు ఏమిటంటే మనుష్యుడు ప్రతిదినం సూర్యోదయానికి రెండు గంటలు ముందు నిద్ర లేవాలి. అనగా 4 గంటలకే మేల్కొని కాలకృత్యాలు తీర్చుకొని దినచర్యకు సిద్ధంకావాలి.

ఈరోజుల్లో 100కి 99మంది సూర్యోదయానంతరమే నిద్ర లేస్తున్నారు. కాని బ్రహ్మీముహూర్తంలో అనగా వేకువజామున 4 గంటలకు నిద్ర లేవడం యొక్క ప్రయోజనం చాలా ఉంది.

ప్ర : ఏమిటది?

 జ : యావత్తు సృష్టి సూర్యోదయాన్ని స్వాగతిస్తుంది. పక్షులు, జంతువులు అన్నీ మేల్కొని సూర్యుని కాంతికొరకు ఎదురుచూస్తాయి. ''మానవులారా! ఇంకా మీరు పడుకుంటే మీ పనులు కావు కావు'' అన్నట్లు కాకులు అరుస్తుంటాయి.

సూర్యాస్తమయం నుండి సూర్యోదయం వరకు జరిగిన గాథనే అరవిందుడు ''సావిత్రి'' అనే కావ్యంగా రచించాడు. మరలా సూర్యోదయ మగునట్లు చేయుశక్తికే సావిత్రి అని పేరు. చీకటిలో ఆమె యమధర్మరాజును వెంటాడి సూర్యుని తీసుకొని వస్తుంది. సూర్యునికే సత్యవంతుడని పేరు. ప్రభాత సమయంలో సృష్టియావత్తూ చాలా alert వుంటుంది. అపుడు మనం మేల్కొని వుంటే ఆ alertness మనలో గూడ వస్తుంది.

ప్ర : 4 గంటలకు నిద్రలేచి ఏమి చేయాలి?

జ : మొదట కాలకృత్యాలు తీర్చుకోవాలి. ముఖ ప్రక్షాళనం పూర్తిచేసిన పిదప వంటికి దూమెరుగుగా నువ్వులనూనె రాచుకొని 30 నిమిషాలపాటు యోగాసనాలు వెయ్యాలి.

ప్ర : ''యోగాసనాలు'' యోగులు వెయ్యాలిగాని మనలాంటి సంసారులకు, సామాన్యులకు ఎందుకు?

జ : యోగాసనాలు అందరు మానవులకొరకు ఏర్పడినవి. దీర్ఘాయుష్షు, ఆరోగ్యం కోరే ప్రతి వ్యక్తీ యోగాసనాలు వేయాలి. ఆస్ట్రేలియా వగైరా అనేక దేశాల్లో ప్రజలు వీటిని అనుదినం అభ్యాసంచేసి ప్రయోజనం పొందుతున్నారు. మహర్షులు మనకు అందించిన విలువ కట్టలేని ''ఆరోగ్య నిధి'' యోగాసనాలు. మనం కోల్పోయిన ఈ సంపదను పాశ్చాత్యులు సంపాదించుకొని పదిలపరచుకుంటు న్నారు. వాళ్లను చూచి అయినా మనం నేర్చుకోవాలి.

ప్ర: అలాగా! అయితే చెప్పండి?

జ : మనకు వళ్లు వంగాలంటే యోగాసనాలు వేయాలి. వాటివలన దేహము, ప్రాణము, మనస్సుల అనుసంధానము జరిగి అవి క్రమబద్ధము, పటిష్టము అవుతాయి. ఒక్కమాటలో చెప్పాలంటే యోగాసనాలు శరీరంలో వ్యాధి నిరోధక శక్తిని పెంచుతాయి. అనేక వ్యాధులు రాకుండా చేస్తాయి.

ప్ర : ఏఏ ఆసనాలు వేయాలి?

జ : మొత్తం తొమ్మిది ఆసనాలు చెపుతాను. వీటి పేర్లు మాత్రమే చెపుతాను. ఎలా అభ్యసించాలో తెలిసినవారి నుండి నేర్చుకోవాలి. ఈ ఆసనాలు మూడు రకాలు:

1. కూర్చొని వేసేవి : ఎ. పద్మాసనం బి. అర్థమత్స్యేంద్రాసనం సి. యోగముద్ర

2. వెల్లికిలా పడుకొని చేసేవి : ఎ. సర్వాంగాసనం బి. హలాసనం సి. మత్స్యాసనం

3. బోర్లాపడుకొని వేసేవి : ఎ. భుజంగాసనం బి. శలభాసనం సి. ధనురాసనం

ఈ తొమ్మిదింటినీ ఒక్కొక్కటి ఒకటి రెండు నిమిషాల చొప్పున (లేదా కొన్ని సెకండ్ల కాలం)వేసి తుదకు శవాసనంతో ముగించాలి. ఇవన్నీ కలిపి 20 లేక 30 నిమిషాలు చేయవచ్చు.

ప్ర : పిదప ఏమి చేయాలి?

జ : ఆ తరువాత 3 లేక 4 నిముషాలసేపు ప్రాణాయామం చేయాలి. ఉచ్ఛ్వాస నిశ్వాసాల మీద మనసు నిలుపుతూ వుండాలి. ఆ తరువాత ప్రవాహ

జలములో స్నానంచేయాలి. నదీ స్నానం శ్రేష్ఠమైనది. ప్రవాహజలములో విద్యుత్త రంగాలుంటాయి. అవి మనలోని శక్తియుక్తుల్ని తాకి మేల్కొల్పుతాయి. నదీ ప్రవాహం సమీపంలో లేనట్లయితే కాలువలోగాని, నూతివద్దగాని, సూర్యోదయా త్పూర్వమే స్నానం చేయాలి. అట్టి స్నానం ఆరోగ్యాన్ని ఆయుస్సును పెంచుతుంది.

ప్ర: పిదప ఏమి చేయాలి?

జ : పిదప సూర్యోదయ సమయంలో ఇష్టదేవతా ప్రార్థన చేసుకొని ఆ తర్వాత దైనందిన జీవితంలో ప్రవేశించాలి. ఐతే, ప్రాణాయామము, ఆసనములు అనేవి సత్ఫలితాల నివ్వాలంటే యమనియమాలను మానవుడు అనుసరించాలి.

ప్ర : మీరు భయంకరమైన మాట చెప్తున్నారు. యమనియమాలు అనేవి **యోగులు, సన్యాసులు ఆచరింపవలసినవిగాని సామాన్యులకు అవి ఎందుకూ అని?**

జ : మనుషులకు అడ్డమైన వ్యాధులు వస్తుంటే ఆసుపత్రులలో వాళ్లకు ముక్కుల్లోకి ఆక్సిజన్ ఎక్కించీ, శరీరంలోకి రక్తం ఎక్కించీ, మూత్రపిండాలు మార్పిడిచేసీ, బైపాస్ ఆపరేషన్లు - ఇవన్నీ చూస్తుంటే భయంకరంగా ఉండడం లేదూ? యమనియమాలు అలా భయంకరమైనవి కావు. మనిషి తనను తాను బాగుచేసుకొని నిశ్చింతగా జీవించడానికి పతంజలి మహర్షి మనకందించిన జీవిత నియమావళియే యమనియమాలు.

ప్ర : ఏమిటవి? కాస్త వివరించండి?

జ : యమనియమాలను ఆచరణలో పెడితే మనస్సు శాంతిని పొందుతుంది. మనస్సుకు స్థిరత్వం లభిస్తుంది. మనలో చాలామంది మనస్సులకు ability వుంటుందేగాని Stability ఉండదు. Stability వున్న మనస్సు మాత్రమే ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో శ్రుతి కలుపుతుంది. కర్తవ్యం వైపు చూస్తుంది. ఆ Stability కొరకు యమనియమాలను అనుసరించాలి.

ప్ర : ఏమిటవి?

జ : యమములు తనను తాను అదుపుచేసుకొనడం కొరకు ఏర్పడినవి. నియమములు తాను అలవాటుచేసుకోవలసినవి.

**యమములు ఐదున్నాయి**

1. అహింస : ఇతర ప్రాణులను హింసించే బుద్ధిని అదుపుచేసుకోవాలి.

2. సత్యము : అనగా ఋజు వర్తన. straight forwardness ప్రక్కదారులు, అడ్డదోవలు త్రొక్కకుండా వుండడం.

3. అస్తేయము : దొంగిలించే బుద్ధిని అదుపు చేసుకోవడం. ఇతరులకు చెందిన వాటిమీద ఆశపడకుండా వుండడం.

4. బ్రహ్మచర్యము : దాంపత్య జీవితాన్ని పవిత్రంగా నడుపుకోవడం.

5. అపరిగ్రహము : ఎప్పుడూ మనం చేసే సేవ ఎక్కువ, పుచ్చుకొనే ప్రతిఫలం తక్కువగా ఉండాలి. ఈనాడు తక్కువ చేసి ఎక్కువ పుచ్చుకుంటు న్నారు. అలాగాక reasonableగా స్వీకరించాలి.

ఈ ఐదు రకాలుగా మన బుద్ధిని అదుపులో పెట్టాలి.

ప్ర : మరి నియమాలు ఏవి?

జ : మనం అలవాటు చేసుకోవలసిన నియమాలు ఐదున్నాయి.

1. శౌచము : శారీరకంగాను, మానసికంగా శుచిగా ఉండడం.

2. సంతోషము : నిరంతరం ఉల్లాసంగా నవ్వుతూ ఉండడం.

3. స్వాధ్యాయము : ఉత్తమ గ్రంధాలను పఠించడం. రోజూ నిర్ణీతకాలంలో మన కిష్టమైన పవిత్ర గ్రంథాన్ని చదవాలి.

4. తపస్సు : తపస్సు అనగా ఒక కార్యసాధనకై తపించడం. పని జరిగితే జరుగుతుంది. పోతే పోతుంది అనుకోకూడదు. ఎవడు తపిస్తాడో అతనికి దానిని సాధించే మార్గాలు, పరిష్కారమార్గాలు తెలుస్తాయి. ఈనాడు దేశంలో మంచి పనుల సాధనకై తపించేవారు తగ్గిపోతున్నారు. తప్పించుకొనేవారి సంఖ్య పెరిగింది. అదే నేటి దుస్థితికి కారణం.

5. ఈశ్వర ప్రణిధానము : మనస్సును హృదయంలో వున్న వెలుగునకు శరణాగతి చెందడాన్ని అలవాటు చేయాలి.

ప్ర : మీరు చాలా క్లిష్టమైన సంగతులను సులభంగా చెప్పివేశారు. తపస్సు గురించి చక్కగా చెప్పారు. బాగుంది. ఐతే మనస్సును హృదయంతో అనుసంధానం చేయమన్నారు. కాస్త వివరించండి?

జ : భగవంతుడు ఎక్కడో లేడు. ఆయన ప్రతి మనుష్యుని హృదయంలో వెలుగొందుతున్నాడు. అందుచేత మనస్సును హృదయమునందు కుదురుకొను నట్లు చేయాలి. దీనికి మార్గము ఏమిటంటే, ప్రాణాయామము ద్వారా మనస్సును

ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో శ్రుతికలిపి, తద్వారా హృదయాన్ని చేరుకొని అక్కడున్న దైవంతో ఏకత్వ స్థితిని పొందగలగాలి.

**ప్ర : దీనినే ఇంకాస్త వివరించండి?**

**జ :** మనస్సు నరుడు. బైబిలులో దీనినే మానవరాజ్యమంటారు. హృదయం నారాయణుడు. బైబిలులో దీనినే దేవుని రాజ్యం అన్నారు. నరనారాయణుల నడుమ సఖ్యతయే యోగము. వారిరువురూ శరీరమనే ఒకే రథముపై ప్రయాణము చేయుచున్నారు. ''మానవ రాజ్యము నుండి దేవుని రాజ్యానికి నడిపించడానికి నేను వచ్చాను'' అని బైబిలులో ఏసుక్రీస్తు చెపుతాడు. ఈశ్వర రాజ్యం ఎక్కడో లేదు. అది నీ హృదయంలోనే వున్నది.

**ప్ర : ఈవిధంగా మనస్సుకు హృదయానికీ నడుమ సఖ్యతను సాధిస్తే కలిగే ఫలితం ఏమిటి?**

**జ :** దాన్ని సాధించితే మానవుడు కర్తవ్య భావంతో జీవితం గడుపుతాడు. స్వార్థము, అక్రమము అతని దరిజేరవు. ప్రాణాయామముతో ప్రారంభించి క్రమముగా సమాధిస్థితి చేరుకుంటాడు. ఐతే దైనందిన జీవితంలో అన్ని పనులు నిర్వహిస్తూనే వుంటాడు. సంగత్వం లేకుండా జీవితం కొనసాగిస్తాడు. హృదయస్థుడైన దైవం యొక్క సారధ్యంలో జీవితం నడిపే స్థితి యిది.

**ప్ర : మీరు చెప్పిన ఈ యోగసాధన, ఈ ఉత్తమ జీవితం సామాన్యులు సాధించగలరా?**

**జ :** యోగసాధన దేహధారులైన అందరికొరకు ఏర్పడింది. ఒకప్పుడు భారతదేశంలో ప్రతి యొక్కరూ ఈ మార్గాన్ని అనుసరించి దీర్ఘాయుష్షుతో జీవించారు.

**చాలా చక్కని విషయాలు సామాన్యులకు అర్థమయ్యేటట్లు చెప్పారు.**

ధన్యవాదాలు !

## భగవంతుడు

మన మందరము భగవత్స్వరూపులమే, కాని కోరిక వలన మానవులుగా వున్నాము.

భగంతుడు + కోరిక = మానవుడు

మానవుడు - కోరిక = భగవంతుడు

–గుమ్మలూరి సత్యనారాయణ

# అధ్యాయము - 4

# దేవాలయాల ప్రత్యేకత

## 8. దేవాలయాలు - ఆరాధన

-శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామివారు
శ్రీకంచి కామకోటి పీఠం

పరమాత్మ సర్వవ్యాపి. అయితే ఒక సందేహం కలుగవచ్చు. ఆయనకు దేవాలయాలు నిర్మించడం ఎందుకు అనే ప్రశ్న రావచ్చు.

పరమాత్మ సర్వవ్యాపి అనేది సత్యమే. అయితే ఆయన మనకు ఎలా తోడ్పడగలడు? మనమందరం ఆయన అనుగ్రహం కొరకు పరితపిస్తున్నాం. అందువలన ఆయనను ఆరాధించి అనుగ్రహం పొందాలి. దానిని పొందడం ఎలా?

ఎలాగో, ఏం చేయాలో, ఎలాచేయాలో ఆగమ సూత్రాలు తెలియజేస్తాయి. సూర్యకిరణాలు అనంతమైన ఉష్ణశక్తిని కలిగియున్నాయి. మనం చిన్న గుడ్డ పీలికను ఎండలో పెడితే అది తనంతట తానుగా మండిపోయి కాలిపోదు. కాని ఒక కటకము సహాయముతో ఆ సూర్యకిరణాలను ఆ గుడ్డ మీద కేంద్రీకృత పరిస్తే కొంతసేపటికి అది దగ్ధమైపోవడం చూస్తాము. అలాగే విద్యుచ్ఛక్తి పెట్రోలులో ఉన్నది. కాని దానిని నిత్యావసర వినియోగానికి తీసుకొని రావలెనంటే జనరేటర్ల సహాయముతో ఆ శక్తిని నిర్మాణంచేసి అవసరమైన ప్రాంతాలకు దానిని సరఫరా చేయవలసి ఉంటుంది. ఆవిధంగానే సర్వవ్యాపి అయిన పరమాత్మ అనుగ్రహం పొందాలంటే ఆలయాలను నిర్మించి దైవశక్తిని ఒక విగ్రహమూర్తిలో కేంద్రీకృతపరచి దానిని అర్చించుటద్వారా దైవానుగ్రహం పొందవచ్చు.

అందువలన మన దేశంలో అనేక దేవాలయాలు నిర్మించడం జరుగుతున్నది. ఇతర మతాలలో కూడా ఆరాధనాలయాలు చాలా ఉన్నాయనుకోండి.

కాని అక్కడ మన దేవాలయాలలోవలె విగ్రహ ప్రతిష్ఠ అనేది లేదు. వారికి ఒక విశాలమైన ప్రార్థనా మందిరం ఉంటుంది. అక్కడ భక్త బృందము సమావేశమై ప్రార్థనలుచేసి కొంత మనశ్శాంతిని పొంది వెళ్ళిపోతారు. కాని మన దేవాలయాలలో విగ్రహాలను ప్రతిష్ఠించి ఆ విగ్రహాలకు దైవత్వాన్ని ఆపాదిస్తాం. అందువలన ఒక విధమైన పవిత్రత చేకూరుతుంది.

ఒక నిర్ణీత ముహూర్తం ఆసన్నమయ్యేవరకు స్థపతి ఆ శిల్పాలను చెక్కుతుంటాడు. కాని ఆ నిర్ణీత సమయం రాగానే ఆ శిల్పం దైవత్వాన్ని సంతరించుకుంటుంది. దానితో మనం ఆ దేవతామూర్తులకు అభిషేకం, అర్చన, దీప హారతి వంటి అనేక ఆరాధనలు చేయనారంభిస్తాము. ఆ మూర్తి దివ్యశక్తినీ చైతన్యాన్నీ పొందుతుంది. మన విగ్రహాలలో మనం దైవత్వాన్ని దర్శిస్తాం. అందుకే అభిషేకం, అలంకారం, నైవేద్యం, హారతి, ఇంకా అనేక ఇతర ఉపచారాలు చేస్తాం.

దైనందిన ప్రార్థనలు

హరినామస్మరణ ప్రాతఃకాలమున, హరనామ స్మరణ సాయం సమయమున చేసినచో అపూర్వమైన సత్ఫలితాల నీయగలవు. ఇది మన ప్రాచీనమైన ఆచారము.

మనము నిద్రలేవగానే

''కరాగ్రే వసతే లక్ష్మీ కరమధ్యే సరస్వతీ
కరమూలే మహద్గౌరీ ప్రభాతే కరదర్శనం''

అని స్మరిస్తాము. చేయి పైభాగమున లక్ష్మి, మధ్య భాగమున సరస్వతి, చివర భాగమున గౌరీదేవి ఉన్నందున ప్రాతఃకాలమున మన రెండు చేతులను కళ్ళకద్దు కుంటూ ఈ శ్లోకం పలకాలి.

పిదప కాలిని నేలమీద పెడుతూ

''సముద్రవసనేదేవీ పర్వతస్తనమండలే
విష్ణుపత్నీ నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే''

అంటూ భూదేవికి నమస్కరించి మన పాదస్పర్శతో ఆమెను బాధించు చున్నందుకు ఆమెకు క్షమాపణ చెప్పుకుంటూ కాలిని నేలకు ఆనించాలి.

''బ్రహ్మామురారి త్రిపురాంతకారీ భానుశ్శశీ భూమి సుతో బుధశ్చ
గురుశ్చ శుక్ర శ్శని రాహుకేతవః కుర్వంతుసర్వే మమ సుప్రభాతమ్''

త్రిమూర్తులు, నవగ్రహాలు, సర్వులూ నాకు మేలు చేయుదురుగాక అంటూ ప్రభాతసమయంలో స్మరణ చేయాలి. నిత్యకృత్యములను పూర్తిచేసుకొని స్నానాంతరం తెల్లబట్టలు ధరించి దైవధ్యానం చేయాలి. తెలుపు సత్వగుణ సంకేతం.

ఇక నిత్య కార్యక్రమములో మనము ఒక సక్రమమైన రీతిలో మన జీవితమును నడుపుకొనవలసియున్నది.

''మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం మహాత్మనాం''. బట్టలు ధరించడం లోను మరొక అంశంలోను మ్యాచింగ్ చూచుకుంటాం. అసలు మనం గుర్తించవలసిన మాచింగ్ - మనస్సు, మాట, క్రియ, ఈ మూడు ఒకదానికొకటి సంబంధించి ఉన్నవా అని. అనుదినం సూర్యనమస్కారములు చేయాలి. దీని వలన ఆరోగ్యము, కంటికి మంచి ప్రకాశము, సద్బుద్ధి లభిస్తాయి. ''ఆరోగ్యం భాస్కరాదిత్య'', కనుక సూర్యుని అనుగ్రహం వలన ఆరోగ్యం సిద్ధిస్తుంది. ఏది భుజించినా భగవంతుని ప్రసాదంగా తీసుకుంటే శరీరం, మనస్సు, బుద్ధి పవిత్రంగానే ఉంటాయి. ఇంటి నుండి ఎక్కడకు బయలుదేరినా

''వనమాలీగదీ శర్ఙ్గీ శంఖీ చక్రీచ నందకీ
శ్రీమన్నారాయణో విష్ణుః వాసుదేవోభి రక్షతు''

అని అనుకొని బయలుదేరాలి. విదేశీయుల నుండి టాటా అనడం అనుకరిస్తున్నాం. దాని అర్థం పోతున్నాను మళ్ళీ రాను అన్న విపరీతార్థమే.

ప్రతినిత్యం సాయం సమయంలో దీపారాధన చేసి ప్రశాంతులం కావాలి. రాత్రి నిద్రపోబోయేముందు దైవస్మరణ చేసి నిద్రిస్తే దుస్వప్నాలు నివారింపబడతాయి. ఇవన్నీ ప్రతివారూ సులభంగా చేసుకోగలిగే పనులే. ఇట్టి సులభమైన పనుల వెనుక గొప్ప ఫలితాలను పొందగలిగే శక్తి నిక్షిప్తమై వున్నది.

## జర్మనీలో ప్రభుత్వ కార్యాలయంలో ఆంధ్రుని చిత్రపటం

శ్రీమతి ఇందిరాగాంధీ ప్రధానమంత్రిగా వున్న కాలంలో భారతదేశం నుండి పశ్చిమ జర్మనీకి ఒకరు రాయబారిగా వెళ్ళారు. అక్కడి అధికారులు ఈ రాయబారికి తమ కార్యాలయాలను చూపుతూ అచట గల ఒక భారతీయుని చిత్రపటం చూపి ఈయన ఎవరో మీకు తెలుసా? అని అడిగారు. తనకు తెలియదని భారత రాయబారి అన్నాడు. అపుడు జర్మన్ అధికారులే ఆ ఫోటోలోని వ్యక్తి పేరు చెప్పి అతనికి తమ దేశంలో అంతటి ప్రాముఖ్యం రావడానికి కారణం గూడా చెప్పారు. ఆ వ్యక్తి పేరు దండిభట్ల విశ్వనాథశాస్త్రి. రాజమండ్రి వాస్తవ్యులు. సంస్కృత మహాపండితులు. యజుర్వేదానికి కర్మకాండపరంగా, తాంత్రిక విద్యాపరంగా, ఆధ్యాత్మికంగా, వైజ్ఞానికంగా నాలుగు విధాలుగా అర్థం చెప్పగలిగిన మేధావి. 1938లో జర్మన్ గూఢచారులు ఇండియా వచ్చి ఆయనను జర్మనీకి గొనిపోయారు. వేద శాస్త్రములలో గల వైజ్ఞానిక విషయాలను వీరి నుండి జర్మన్ శాస్త్రవేత్తలు గ్రహించి యుద్ధకాలంలో ఆయుధ నిర్మాణానికి వాటిని వినియోగించుకున్నారు. వీరి ఎడల కృతజ్ఞతా సూచకంగా వీరి చిత్రపటాన్ని తమ విదేశాంగ శాఖ కార్యాలయంలో పెట్టుకున్నారు.

– శ్రీ జి. పుల్లారెడ్డిగారి అభినందన సంచిక 'మధుకోశం' నుండి

# 9. షోడశోపచార పూజ అంతరార్థం

- శ్రీ గొల్లపూడి గౌరీ శంకర శాస్త్రి

(శ్రీ గొల్లపూడి గౌరీశంకర శాస్త్రిగారు గుంటూరు బరోడా బ్యాంకులో ఉద్యోగం చేస్తున్నారు. వీరి వంశము వేదాధ్యయనానికి పేరొందినది. వీరితో జరిపిన ఇష్టాగోష్ఠి)

ప్రశ్న : మనం దేవునికి ''షోడశోపచార పూజ'' చేస్తాము. ఈ మాటకు అర్థమేమిటి? దీని అంతరార్థమేమిటి?

**జవాబు :** షోడశ అనగా 16. పదహారు అనేది పూర్ణ సంఖ్య. చంద్రుడు పూర్తిగా ప్రకాశించునపుడు 16 కళలు కలిగియుంటాడు. శుక్లపాడ్యమి నుండి బహుళ పాడ్యమి వరకు 16 రోజులలో చంద్రుడు వృద్ధి చెందుతాడు. అందుచేత దేవునికి గూడ మనము 16 ఉపచారములతో గూడిన పూజ చేస్తాము.

ప్ర : ఈ పూజలోని మూల సూత్రమేమిటి?

జ : మొదట భగవంతుడు వేరు, నేను వేరు అనే భావంతో పూజించడం ఆరంభించి, తుదకు ఆ భగవంతుడు నాలోనే ఉన్నాడు అనే భావనకు భక్తుడు చేరుకుంటాడు. ఇదే ఇందలి మూలసూత్రం.

విగ్రహరూపంలో వున్న దేవుని మొదట అర్చించి, క్రమంగా నిరాకారుడైన దివ్యశక్తిని భక్తుడు భావన చేస్తాడు.

ప్ర : ఈ విషయాన్నే నాకు వివరంగా చెప్పండి - మొదట 16 ఉపచారము లేమిటి?

జ: అవి ఇలా ఉన్నాయి : 1. ఆవాహనం 2. ఆసనం 3. పాద్యం 4. అర్ఘ్యం 5. ఆచమనం 6. స్నానం 7. వస్త్రం 8. ఉపవీతం 9. గంధం 10. పుష్పం 11. ధూపం 12. దీపం 13. నైవేద్యం 14. తాంబూలం 15. ప్రదక్షిణం 16. విసర్జనం.

వీటిలో పదవదియగు పుష్పం అనేచోట అష్టోత్తర లేక సహస్రనామపూజ చేస్తాము. 14వది యగు తాంబూలం సమర్పించిన పిదప నీరాజనమిచ్చి మంత్రపుష్పం చదువుతాము. ఆ తరువాత ప్రదక్షిణం చేస్తాము.

ప్ర : ఈ పదహారు ఉపచారముల యొక్క అంతరార్థమేమిటి?

జ : దైవం అనేది ఒక ''శక్తి''. దానిని ఒక విగ్రహంలోకి ఆహ్వానించి

పూజిస్తాము. ఒక అతిథి మన ఇంటికి వస్తే ఎలా ఉపచారములు చేసి మర్యాద చేస్తామో దేవుని గూడ మనవలె ఒక రూపం ధరించిన వ్యక్తిగా ఊహించుకొని అర్చిస్తాము. మొదట ఒక రూపంలోకి దేవతా శక్తిని ఆవాహన చేస్తాము. ఉదాహరణకు : పాలను సీసాలోపోస్తే సీసారూపం, కప్పులో పోస్తే కప్పురూపం పొందినట్లు. ఏ రూపమూ లేని దైవశక్తిని శివునిలోనికో, హనుమంతుని విగ్రహంలోనికో, సత్యనారాయణస్వామి విగ్రహంలోనికో ఆహ్వానించినట్లయితే, దైవశక్తి ఆ విగ్రహ రూపం దాలుస్తుంది. కనుక మొదట ఆవాహన చేస్తాము. అంటే ఆ దేవతా శక్తిని ఒక చోట స్థిరపరచడమన్న మాట.

ప్ర : ఆ తరువాత?

జ : దేవతామూర్తి యొక్క రూపాన్ని మూడు విధాలుగా శుభ్రపరుస్తాము. పాదము నుండి శిరస్సు వరకు ఉదకముతో స్పృశిస్తాము. మొదట 'పాద్యం'- అనగా పాదములను కడుగుట, రెండవది 'అర్ఘ్యం' - చేతులను శుభ్రపరచుట - మూడవది 'ఆచమనం' - అనగా ముఖమును నీటితో తాకుట. ఇలా శరీరం యొక్క అధో భాగం, మధ్య భాగం, ఊర్ధ్వ భాగములకు ఉదకముతో ఉపచారములు చేస్తాము. ఇాదువల్ల శక్తి శాంతము చెందుతుంది.

ప్ర : ఆ తరువాత?

జ : తరువాత స్నానం. నీటిలో ప్రాణశక్తి వున్నది. నీటిలో ప్రాణ వాయువు వున్నదని సైన్సు చెపుతున్నది. అందుచేత విగ్రహానికి ప్రాణం పోస్తున్నట్లు, ప్రాణశక్తిని ప్రతిష్ఠిస్తున్నట్లు ఊర్ధ్వ భాగం నుండి అధోభాగానికి నీటితో అభిషేకం చేస్తాము. ఒక్క రుద్రుడికే గాక అందరు దేవతామూర్తులకు అభిషేకం చేయవచ్చు. ''రుద్రుడు'' గనుక శివునికి రౌద్రం శాంతించడం కొరకు నీటితో అత్యధికంగా అభిషేకం చేస్తాము. ఆ తరువాత స్నానానంతరం వస్త్రం సమర్పిస్తాము. ఆ శరీరం యొక్క అధోభాగానికి ఉపవీతం అనగా ఉత్తరీయం ఊర్ధ్వ భాగానికి సమర్పిస్తాము. ఉపవీతాన్ని యజ్ఞోపవీతం వలె ధరింపచేయాలి.

ప్ర : ఆ తరువాత?

జ : పిదప శరీరానికి సమశీతోష్ణస్థితిని కలిగించే గంధాన్ని సమర్పిస్తాము. ఆ తరువాత పుష్పాలు సమర్పిస్తూ అష్టోత్తర నామాలతోనో, సహస్ర నామాలతోనో దేవతామూర్తి గుణగణాలను వర్ణిస్తూ పూజిస్తాము. పూజ అక్షతలతోగాక పూలతోనే చేయాలి.

ప్ర :పుష్పముల ప్రాధాన్యమేమిటి?

జ : ''నా హృదయం ఈ పుష్పము వలె వికసిస్తున్నది. నా హృదయాన్ని ఈ పుష్పముల రూపంలో నీకు సమర్పిస్తున్నాను'' అనే భావంతో పూజ చేయాలి.

ప్ర : ఆ తరువాత?

జ : పిదప ధూపం చేయాలి. అగరు వత్తులు వెలిగించడం ద్వారా కాక, సాంబ్రాణి పొగ వేయాలి. ఈ ధూపం వలన పరిసర వాతావరణం శుభ్రమవుతుంది. ఆ తరువాత విగ్రహాన్ని ఆపాదమస్తకం పరిశీలించడం కొరకు దీపాన్ని చూపించాలి. దూరంగా కూర్చున్నవారికి గూడ కనిపించడం కొరకు ఎక్కువ వత్తులు వేసి దీపాలను వెలిగించవచ్చు.

ప్ర : ఆ తరువాత?

జ : ఈ ప్రపంచానికి యజమాని భగవంతుడు ఆయన ఇవ్వడం వలననే మనకు ఆహారం లభిస్తున్నది. ఆయన వలన వచ్చిన ఆహారాన్ని మొదట ఆయనకు సమర్పించి పిదప దానిని మనం భుజించాలి. అందుకై మనం ఆనాడు భుజించబోయే వాటిని నైవేద్యంగా సమర్పించాలి. ఆ తరువాత తిన్న ఆహారాన్ని సక్రమంగా జీర్ణం చేసే గుణం తాంబూలానికి వున్నందున తాంబులాన్ని సమర్పించాలి.

ప్ర : ఆ తరువాత ?

జ : పిదప నీరాజనమిచ్చి మంత్ర పుష్పం చదువుతాము. హారతి యొక్క భావమేమి టంటే హారతిలో కర్పూరం తగ్గుతూ వెలుగు వృద్ధి చెందుతూ వుంటుంది. ఆ కర్పూరము వలె పాపాలు హరించుకుపోవాలి, ఆ వెలుగు వలె యజమాని ఆయుష్షు, తేజము వృద్ధి చెందాలని దీని భావము. భూత ప్రేత పిశాచములు ఆ వెలుగును చూచి పారిపోతాయి. పిదప మంత్ర పుష్పం చదువుతాము.

ప్ర : మంత్ర పుష్పం ప్రాధాన్యత ఏమిటి?

జ : ఇప్పటివరకూ విగ్రహ రూపంలో వున్న దేవతామూర్తిని - దేవుడు వేరు, నేను వేరు అనే భావంతో పూజించాము. ఇపుడు దేవుడు నాలోనే వున్నాడు, దేవుడూ నేను ఒకటే అనే అద్వైత భావం కలగడం కొరకు మంత్ర పుష్పం చదువుతాము.

ప్ర :ఏమిటి దీనిలోని అర్థం?

జ : మంత్రపుష్పాన్ని బ్రహ్మదేవుడు ఇంద్రునికి చెప్పాడు. ఇంద్రుడు దీన్ని

నలుదిక్కుల వ్యాపింపజేశాడు. 'ఇది తప్ప మోక్ష ప్రాప్తికి మరొక మార్గం లేదు' అని ఇందులో చెప్పబడింది. భగవంతుని గురించి ఇందులో అద్భుతమైన వర్ణన ఉన్నది. మంత్ర పుష్పాన్ని అర్థసహితంగా వింటూ వుంటే శరీరం గగుర్పొడుస్తుంది. దేవుని వర్ణిస్తూ అతడు సర్వవ్యాపి అని చెప్పబడింది. అతడు లోపల, బయటగూడ వ్యాపించి వున్నాడు. అతడు అనంతుడు, అవ్యయుడు, సర్వము తెలిసినవాడు. ప్రతి వ్యక్తిలోను ముడుచుకున్న కమలమువలె నాభికి పై భాగమునందు హృదయ కమలమున్నది. దానికి అగ్రభాగాన అగ్ని శిఖయందు పసుపుపచ్చ వర్ణముతో వడ్లగింజముల్లు వలె పరమాత్మ అణురూపంలో వున్నాడు అని వర్ణించబడింది. చేతిలోకి పుష్పములను తీసుకొని ''మంత్రపుష్పము'' చదివిన పిదప దేవునికి సమర్పించి నమస్కారము చేసి ఆ పుష్పాలను శిరస్సు మీద వేసుకున్నట్లయితే విగ్రహామునకు మొదట్లో ఆపాదించబడిన దైవశక్తి మనలో ప్రవేశిస్తుంది.

**ప్ర :ఆ తరువాత ఏమి చేయాలి?**

జ : ఆ తరువాత ఆత్మప్రదక్షిణం చేయాలి. దేవుడు తనలోనే వున్నాడనే గ్రహింపు మంత్ర పుష్పం ద్వారా కలిగింది గనుక తనలో వున్న దేవుని చుట్టూ తిరగడం కొరకు ఆత్మప్రదక్షిణం చేస్తాము. ఈ విధంగా విగ్రహారాధనతో ఆరంభమైన పూజ సర్వత్ర వ్యాపించియున్న నిరాకారుడైన పరమాత్మను అర్థం చేసుకోవడంతో ముగుస్తుంది.

**ప్ర : 16వ ఉపచారం ఏమిటి?**

జ : రేపటి రోజు మరల పూజ చేయడానికై దేవతామూర్తికి ఉద్వాసన చెపుతాము.

**ప్ర : ఇంకా ఏమైనా చెపుతారా?**

జ : మరొక్క సంగతి గూడా వున్నది. పంచభూతాత్మకమైనది ఈ ప్రపంచం. అందుచేత పంచభూతముల యొక్క గుణములకు సంబంధించిన ఐదు పూజా ద్రవ్యములను దేవునికి సమర్పిస్తాము. శబ్దమునకు ఘంటానాదం, స్పర్శ కొరకు గంధము, రూపమునకు దీపము, గంధమునకు ధూపము, రసమునకై నైవేద్యము సమర్పిస్తాము.

ధన్యవాదాలు గౌరీశంకరశాస్త్రిగారూ!

# 10. సత్కర్మల నాచరిస్తేనే ప్రార్థన వలన ప్రయోజనం

- పూజ్యశ్రీ బ్రిజమోహన్‌గార్

*(హరిద్వార్‌లోని ''గాయత్రీ పరివార్ యుగ నిర్మాణ యోజన''కు చెందిన పూజ్యశ్రీ బ్రిజమోహన్‌గార్‌గారు 7-10-87న గుంటూరు విచ్చేయగా వారితో జరిపిన ఇష్టాగోష్ఠి)*

**ప్రశ్న: దేవుని గురించి, ఆధ్యాత్మికతను గురించి ఆలోచించడానికి నేటి మానవునికి తీరిక లేకుండా వుంది. ఆహారం సంపాదనకై శ్రమించడానికే అతనికి రోజంతా సరిపోతున్నది. మన పూర్వులు గంటలకొద్దీ ధ్యానం చేసే ఆరాధనా పద్ధతులను మనకందించారు. అంత సమయం వెచ్చించడానికి నేటి సగటు మనిషి సిద్ధంగా లేడు. అసలు దైవవిశ్వాసం ఎందుకు? నాస్తికులు గూడా సుఖంగా జీవిస్తున్నారే....నేను దేవుని ఎందుకు స్మరించాలి? అని అతడు అడుగుతున్నాడు.**

**జవాబు :** ఒక వ్యక్తికి దైవవిశ్వాసం వుండవచ్చు, ఉండకపోవచ్చు. కాని జీవితంలో ప్రతి వ్యక్తికీ ఏవో దాటజాలని కష్టాలు వస్తాయి. అవి వచ్చినపుడు ఒక మానవాతీతమైన శక్తి మీద నమ్మకము ఏర్పడుతుంది. రెండు మూడు గంటలు ప్రార్థించనవసరం లేదు. కొలది నిముషములైననూ చాలును. ఒక చైతన్య శక్తి ఈ విశ్వమంతటా నిండి వున్నదనే గ్రహింపు ముఖ్యం.

భగవంతుని ప్రార్థిస్తే మనపై కరుణ చూపుతాడనీ ప్రార్థించకపోతే క్రోధం వహిస్తాడనీ అనుకోకూడదు. ఆయన ఒక న్యాయమూర్తి. మన చర్యల ఫలితాలనే మనకు ఇస్తాడు. దైవ ప్రార్థన ద్వారా మనం సరియైన మార్గంలో నడవడానికి కావలసిన కాంతి లభిస్తుంది.

**ప్ర : సాధారణ హిందువు ఏమనుకుంటున్నాడంటే, దేవుని ఆరాధిస్తే అన్ని పనులు వాటంతటవి జరుగుతాయనీ, మనం ఏ మాత్రం పనులు చేయనక్కరలేదని అనుకుంటున్నాడు. మన మతం మనలను సోమరులుగా తయారు చేస్తున్నదని విమర్శ వున్నది. మీరేమంటారు?**

జ : అలా భావించడం తప్పు. పూర్వం ప్రజలకు విశ్రాంతి ఎక్కువ గనుక ధ్యానంలో ఎక్కువ సమయం గడిపారు. ఇపుడు మనం నేర్చవలసినది 'పనియే

ప్రార్థన'. మానవుడు కార్యశీలిగా, శ్రమజీవిగా రూపొందాలి. ఎట్టి స్థితిలోను మనం అకర్మణ్యాతకు తావివ్వకూడదు.

ప్ర : క్రైస్తవ మతం ప్రేమయే దేవుడంటుంది. ఇస్లాం సహోదరత్వానికి ప్రాముఖ్యమిస్తుంది. ఆ రెండు సూత్రాలను తేలికగా అర్థం చేసుకోవచ్చు. హిందూ మతం 'భక్తి'కి ప్రాధాన్యమిస్తుంది. భారం యావత్తూ భగవంతునిమీద వదలి తాను ఏమీ చేయకుండా వుండటమే 'భక్తి'గా తయారవుతున్నది. అంతేగాదు. భగవంతునికి శరణాగతి చెంది దేవునికి స్తోత్రములు చేయడం జరుగుతూ వున్నది. స్వయం కృషి రాహిత్యానికీ ఆత్మవిశ్వాసం కోల్పోవడానికీ ఇది దారితీస్తున్నది. దీనికి మీరేమంటారు?

జ : మంచి ప్రశ్న అడిగారు. దైవ విశ్వాసం యొక్క ప్రయోజనం ఆత్మవిశ్వాసాన్ని దృఢ పరచడానికే. ఆత్మవిశ్వాసం లేని వాడికి దైవ విశ్వాసం కూడా ఉండదు. దైవవిశ్వాసం ద్వారా ఉల్లాసం, పరస్పర సహకారం, కష్టసహిష్ణుత, ధైర్యము, బాధ్యత వహించుట, స్వార్థరాహిత్యం, దుర్మార్గాన్ని ఎదిరించే లక్షణం - ఇవి ఒనగూడాలి. ప్రార్థనకంటే వీటిని అలవరచుకోవడం ముఖ్యం. దేవుణ్ణి ప్రార్థిస్తే అన్నీ సమకూరుతాయనుకోవడం వల్లనే మనలో క్షీణత ప్రారంభమయింది. ''ప్రార్థనలు చేసి ఆ తరువాత దుష్కార్యములు చేయడం కంటే అసలు ప్రార్థనలు చేయకుండా ఉండండి. సత్కార్యములు చేస్తూ ప్రార్థనలు చేయండి. నీవు సత్కార్యములు చేయకపోతే ప్రార్థనలు చేయడం దండగ'' అన్నారు గురువర్యులు పండిత శ్రీరామశర్మ ఆచార్యగారు. మంచి పనులుచేస్తూ ప్రార్థనలు చేస్తే అవి అత్యుత్తమ ఫలితాలనిస్తాయని వారు చెప్పారు.

ప్ర : హిందూమతం వ్యక్తియొక్క మోక్షానికి మార్గం చూపుతుంది. ఆత్మ సాక్షాత్కారమనేది వ్యక్తికి చెందిన విషయం. గొప్ప భక్తుడు కూడ స్వీయముక్తికోసం తపిస్తాడేగాని తనచుట్టూ వున్న సమాజం ఏమవుతున్నదా అని ఆలోచించడు. సామాజిక బాధ్యత అనేది మన మతంలో చెప్పబడలేదనే విమర్శకు మీ సమాధానమేమిటి?

జ : మన ఉపనిషత్తులలో 'ఓం సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై. తేజస్వినావధీతమస్తు, మావిద్విషావహై, ఓం శాంతిః శాంతిః శాంతిః'' అని చెప్పారు.

ఇది సామాజిక దృష్టిని బోధిస్తుంది. వివేకానందుడు ''నాదేశంలో ఒక కుక్క అయినా తిండిలేక బాధపడకుండా వుండునంతవరకు నేను స్వీయముక్తిని కోరను'' అన్నాడు. అలాగే మనం స్మరించే గాయత్రీ మంత్రం యొక్క అర్థం ''ఓ సర్వేశ్వరా! మా బుద్ధులను సరియగు త్రోవలో నడపించు'' అని. ''నా బుద్ధిని''

# 10. సత్కర్మల నాచరిస్తేనే ప్రార్థన వలన ప్రయోజనం

- పూజ్యశ్రీ బ్రిజమోహన్‌గౌర్

(హరిద్వార్‌లోని ''గాయత్రీ పరివార్ యుగ నిర్మాణ యోజన''కు చెందిన పూజ్యశ్రీ బ్రిజమోహన్‌గౌర్‌గారు *7-10-87*న గుంటూరు విచ్చేయగా వారితో జరిపిన ఇష్టాగోష్ఠి)

ప్రశ్న: దేవుని గురించి, ఆధ్యాత్మికతను గురించి ఆలోచించడానికి నేటి మానవునికి తీరిక లేకుండా వుంది. ఆహారం సంపాదనకై శ్రమించడానికే అతనికి రోజంతా సరిపోతున్నది. మన పూర్వులు గంటలకొద్దీ ధ్యానం చేసే ఆరాధనా పద్ధతులను మనకందించారు. అంత సమయం వెచ్చించడానికి నేటి సగటు మనిషి సిద్ధంగా లేడు. అసలు దైవవిశ్వాసం ఎందుకు? నాస్తికులు గూడా సుఖంగా జీవిస్తున్నారే....నేను దేవుని ఎందుకు స్మరించాలి? అని అతడు అడుగుతున్నాడు.

జవాబు : ఒక వ్యక్తికి దైవవిశ్వాసం వుండవచ్చు, ఉండకపోవచ్చు. కాని జీవితంలో ప్రతి వ్యక్తికీ ఏవో దాటజాలని కష్టాలు వస్తాయి. అవి వచ్చినపుడు ఒక మానవాతీతమైన శక్తి మీద నమ్మకము ఏర్పడుతుంది. రెండు మూడు గంటలు ప్రార్థించనవసరం లేదు. కొలది నిముషములైననూ చాలును. ఒక చైతన్య శక్తి ఈ విశ్వమంతటా నిండి వున్నదనే గ్రహింపు ముఖ్యం.

భగవంతుని ప్రార్థిస్తే మనపై కరుణ చూపుతాడనీ ప్రార్థించకపోతే క్రోధం వహిస్తాడనీ అనుకోకూడదు. ఆయన ఒక న్యాయమూర్తి. మన చర్యల ఫలితాలనే మనకు ఇస్తాడు. దైవ ప్రార్థన ద్వారా మనం సరియైన మార్గంలో నడవడానికి కావలసిన కాంతి లభిస్తుంది.

ప్ర : సాధారణ హిందువు ఏమనుకుంటున్నాడంటే, దేవుని ఆరాధిస్తే అన్ని పనులు వాటంతటవి జరుగుతాయనీ, మనం ఏ మాత్రం పనులు చేయనక్కరలేదని అనుకుంటున్నాడు. మన మతం మనలను సోమరులుగా తయారు చేస్తున్నదని విమర్శ వున్నది. మీరేమంటారు?

జ : అలా భావించడం తప్పు. పూర్వం ప్రజలకు విశ్రాంతి ఎక్కువ గనుక ధ్యానంలో ఎక్కువ సమయం గడిపారు. ఇపుడు మనం నేర్పవలసినది 'పనియే

ప్రార్థన'. మానవుడు కార్యశీలిగా, శ్రమజీవిగా రూపొందాలి. ఎట్టి స్థితిలోను మనం అకర్మణ్యతకు తావివ్వకూడదు.

ప్ర : క్రైస్తవ మతం ప్రేమయే దేవుడంటుంది. ఇస్లాం సహోదరత్వానికి ప్రాముఖ్యమిస్తుంది. ఆ రెండు సూత్రాలను తేలికగా అర్థం చేసుకోవచ్చు. హిందూ మతం 'భక్తి'కి ప్రాధాన్యమిస్తుంది. భారం యావత్తూ భగవంతునిమీద వదలి తాను ఏమీ చేయకుండా వుండటమే 'భక్తి'గా తయారవుతున్నది. అంతేగాదు. భగవంతునికి శరణాగతి చెంది దేవునికి స్తోత్రములు చేయడం జరుగుతూ వున్నది. స్వయం కృషి రాహిత్యానికీ ఆత్మవిశ్వాసం కోల్పోవడానికీ ఇది దారితీస్తున్నది. దీనికి మీరేమంటారు?

జ : మంచి ప్రశ్న అడిగారు. దైవ విశ్వాసం యొక్క ప్రయోజనం ఆత్మ విశ్వాసాన్ని దృఢ పరచడానికే. ఆత్మవిశ్వాసం లేని వాడికి దైవ విశ్వాసం కూడా ఉండదు. దైవవిశ్వాసం ద్వారా ఉల్లాసం, పరస్పర సహకారం, కష్టసహిష్ణుత, ధైర్యము, బాధ్యత వహించుట, స్వార్థరాహిత్యం, దుర్మార్గాన్ని ఎదిరించే లక్షణం - ఇవి ఒనగూడాలి. ప్రార్థనకంటే వీటిని అలవరచుకోవడం ముఖ్యం. దేవుణ్ణి ప్రార్థిస్తే అన్నీ సమకూరుతాయనుకోవడం వల్లనే మనలో క్షీణత ప్రారంభ మయింది. ''ప్రార్థనలు చేసి ఆ తరువాత దుష్కార్యములు చేయడం కంటే అసలు ప్రార్థనలు చేయకుండా ఉండండి. సత్కార్యములు చేస్తూ ప్రార్థనలు చేయండి. నీవు సత్కార్యములు చేయకపోతే ప్రార్థనలు చేయడం దండగ'' అన్నారు గురువర్యులు పండిత శ్రీరామశర్మ ఆచార్యగారు. మంచి పనులుచేస్తూ ప్రార్థనలు చేస్తే అవి అత్యుత్తమ ఫలితాలనిస్తాయని వారు చెప్పారు.

ప్ర : హిందూమతం వ్యక్తియొక్క మోక్షానికి మార్గం చూపుతుంది. ఆత్మ సాక్షాత్కారమనేది వ్యక్తికి చెందిన విషయం. గొప్ప భక్తుడు కూడ స్వీయముక్తికోసం తపిస్తాడేగాని తనచుట్టూ వున్న సమాజం ఏమవుతున్నదా అని ఆలోచించడు. సామాజిక బాధ్యత అనేది మన మతంలో చెప్పబడలేదనే విమర్శకు మీ సమాధానమేమిటి?

జ : మన ఉపనిషత్తులలో 'ఓం సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై. తేజస్వినావధీతమస్తు, మావిద్విషావహై, ఓం శాంతిః శాంతిః శాంతిః' అని చెప్పారు.

ఇది సామాజిక దృష్టిని బోధిస్తుంది. వివేకానందుడు ''నాదేశంలో ఒక కుక్క అయినా తిండిలేక బాధపడకుండా వుండునంతవరకు నేను స్వీయముక్తిని కోరను'' అన్నాడు. అలాగే మనం స్మరించే గాయత్రీ మంత్రం యొక్క అర్థం ''ఓ సర్వేశ్వరా! మా బుద్ధులను సరియగు త్రోవలో నడపించు'' అని. ''నా బుద్ధిని''

కాదు. ''మా బుద్ధులను'' అని దానిలోని అర్థం. అందుచేత అందరి క్షేమం కొరకు కృషిచేయడం అందరి కర్తవ్యం.

**ప్ర : దేవుని సమక్షంలో మానవులందరూ సమానులే. కాని మన దేవాలయాలలో తరతమ భేదాలను చూపుతారు. ఇది సబబా? గాయత్రీ మంత్రమును కొందరు మాత్రమే అనుష్ఠించవచ్చునని, ఇతరులు అనుష్ఠించరాదనీ నియమం గురించి మీ అభిప్రాయ మేమిటి?**

జ : దేవుని ఎదుటేగాక సర్వత్రా మనిషిని మనిషిగా గౌరవించడం నేర్చుకోవాలి. తరతమ భేదాల వలన మన సోదరులనే మనం దూరం చేసుకుంటాం. ఇది తగదు. గాయత్రీ మంత్రాన్ని ఒకప్పుడు స్త్రీలతో సహా అన్ని వర్ణాలవారూ అనుష్ఠించేవారు. వాల్మీకి రామాయణంలో సీతాదేవి సంధ్యా వందనం చేసినట్లు ఉన్నది. వేదకాలంలో అందరూ త్రికాల సంధ్యావందనం చేశారు. ఇపుడు 'గాయత్రీ పరివార్' సంస్థలో అన్ని కులాల హిందువులకేగాక - హైందవేతరులకు, స్త్రీలకు గూడ మంత్రాన్ని ఉపదేశిస్తున్నాం.

**ధన్యవాదాలు స్వామిజీ! సాధారణ వ్యక్తులకు కలిగే సందేహాలను మిమ్మ అడిగాను. మీరు చక్కని సమాధానాలిచ్చారు. చాలా సంతృప్తి కలిగింది.**

***(1987 నవంబరు)***

## భగవంతుడు కోరేది ప్రేమ ఒక్కటే

ప్రతి నిత్యం స్నానం చేస్తే దేవుడు సాక్షాత్కరించేటట్లయితే
వెంటనే నేను తిమింగిలాన్నవుతాను, ఆఖాతంలో;
దుంపలూ, పళ్ళూ తిన్నంత మాత్రాన తెలిసేటట్లయితే ఆయన,
నేను మేక జన్మ ఎత్తితేనే బాగుండు ననుకుంటాను;
జపమాల తిప్పితేనే ఆయన బయటపడతాడంటే
రాకాసి పూసల పేరుతోనే జపాలు చేస్తాను;
రాతిబొమ్మలకు మొక్కడం వల్లనే ఆయన తెరమరుగు విడుస్తాడంటే,
పాషాణమయమైన పర్వతాన్నే పూజిస్తాను సవినయంగా.
పాలు తాగితేనే ఆయన్ను ఒంట బట్టించుకోవచ్చునంటే
ఎన్నో పాడి దూడలకూ పసిపిల్లలకూ ఆయనీ పాటికి తెలిసిపోయే ఉండాలి.
సతిని విడిచినంత మాత్రాన దేవుడికి పిలుపందుతుందంటే
వేలకొద్దీ జనం నపుంసకులైపోరామరి?
మీరాబాయికి తెలుసు, దేవుణ్ణి కనుక్కోడానికి
తప్పకుండా ఉండవలసింది 'ప్రేమ' ఒక్కటేనని. – మీరాబాయి

# 11. హిందువుల ఆరాధనా విధానం

– ''సౌమిత్రి''

ప్రపంచంలో సైన్సు పెరిగినా దైవ విశ్వాసం నశించదు. సైన్సు వలన భౌతిక జీవనం సుఖవంతమవుతుంది. దైవవిశ్వాసం వలన మనుషుల నడుమ సంబంధాలు మెరుగవుతాయి.

అమెరికాలో కరెన్సీ నోటు మీద "In God we trust" దేవునిలో మేము విశ్వాసముంచుతాము అని ముద్రించబడి ఉంటుంది.

ఫ్రాన్స్‌లో వోల్టేర్ అను రాజనీతి వేత్త ఉండేవాడు. ఆయన 'భగవంతుడు లేనట్లయితే అట్టి వాణ్ణి కనిపెట్టడం అవసరం' (If God did not exist, it would be necessary to invent him) అని వ్రాశాడు.

ఫ్రెంచి చక్రవర్తి నెపోలియన్ ''అసమానతలులేని సమాజం అసంభవం. నైతిక ప్రవర్తన లేకుండా అసమానతలు భరింపరానివి. దైవ విశ్వాసం లేకుండా నైతిక ప్రవర్తన ఏర్పడదు'' అని అన్నాడు. అందుచే మనుష్యులకు ఋజువర్తన అలవడాలంటే దైవవిశ్వాసం అవసరం.

**దేవాలయమెందుకు?**

భగవంతుడున్నాడని అంగీకరించినా, ఆ దేవుడు సర్వత్రా వ్యాపించి ఉన్నాడు గదా. వేరే దేవాలయము లెందుకు? అనే ప్రశ్న వస్తుంది. ఎవరి ఇళ్ళలో వారు కూర్చొని ఆరాధిస్తే సరిపోదా?

దీనికి శ్రీరామకృష్ణ పరమహంస చక్కని సమాధానం చెప్పారు. ''ఆవు శరీరమంతటా పాలున్నప్పటికీ వాటిని పొదుగు వద్దనే గ్రహించాలి. అలాగే సర్వత్రా వ్యాపించి యున్న చైతన్యశక్తిని ఆరాధించడానికై ఒక ప్రత్యేక స్థానమున్నది. అదియే దేవాలయం'' అన్నారాయన.

హిందూ దేవాలయం కేవలం ఒక మందిరం కాదు. ఆగమశాస్త్రానుసారం దైవశక్తిని ఆహ్వానించి నిలిపియుంచిన ప్రదేశమది. ఒక ఇనుప ముక్కను అయస్కాంతంగా మార్చినట్లు ఒక విగ్రహంలోకి దైవశక్తిని ఆవాహన చేస్తారు. ఆ శక్తిని అచట నిరంతరం పదిల పరచటానికై నిర్ణీత సంఖ్యలో జపము చేసి ధారపోస్తారు. ఆలయ నిర్మాణం జరిగినపుడు మహా కుంభాభిషేకం నిర్వర్తిస్తారు. తరువాత కొన్ని

దినములకు మండలాభిషేకం చేస్తారు. ఇందువలన దేవతామూర్తిలోని దైవత్వం మరింత అధికమవుతుంది. అందుచేతనే మన దేశంలో ఆర్తితో మనుష్యులు పిలిస్తే పలికే దేవతలు ఎన్నోచోట్ల వున్నారు. అందుకు సాక్ష్యంగా ఎందరో భక్తుల అను భవాలు ఉన్నాయి.

**బహుదేవతారాధన**

ఇతర మతాలలో ఎవరో ఒక్క దేవునే ఆరాధిస్తారు. మన హిందూ ధర్మంలో విష్ణువు, శివుడు మున్నగు అనేక దేవుళ్ళను ఎందుకు ఆరాధిస్తామనే ప్రశ్న ఆధునికు డైన ప్రతి యువకుని మదిలోను మెదలుతుంది. దీనికి సంతృప్తికరమైన సమాధానం తెలుసుకోవాలి.

చదువురానివాని దృష్టిలో 'విద్య' అంటే అదొక అనంతమైన సాగరం. అందులో గణితం, సాహిత్యం, చరిత్ర, వైద్యశాస్త్రం, ఆర్థిక శాస్త్రం వగైరా అసంఖ్యాకమైన శాస్త్రాలున్నాయి. అలాగే సామాన్యుని దృష్టిలో దైవత్వం అనగా ఒకే ఒక దైవశక్తి. దానినే చైతన్యమనవచ్చు. కాని తెలుసుకున్న కొద్దీ అందులో చాలా వైవిధ్యం వున్నది. ఎన్నో అంతర్భాగములు, రూపాంతరాలు వున్నాయి.

''ఒక సూర్యుడు సమస్త జీవులకు తానొక్కొక్కడై తోచుపోలిక'' అన్న పోత నగారి వాక్యం పరమ సత్యం. వివిధ ప్రాణుల అవగాహనా శక్తిని బట్టి ఆవశ్యకత లనుబట్టి, అనుభూతులను బట్టి ఒక చైతన్య శక్తి అనేక రీతులలో ఆరాధింపబడు చున్నది.

ఒక్క మాటలో చెప్పవలెనంటే జ్ఞానం ఏ విధంగా అనంతమో, దైవశక్తి కూడా అదే విధంగా అనంతమైనది. నీకు ఇష్టమైన చదువు - ఇంజనీరింగో, వైద్య మో, ఆర్థిక శాస్త్రమో మరొకటో చదివి ఎలా తృప్తి నొందుతావో, నీ కిష్టమైన, నీ కవసరమైన దేవతా రూపాన్ని ఉపాసింప వచ్చును. విద్య కొరకు సరస్వతిని, ధనము కొరకు లక్ష్మీదేవిని, ఆరోగ్యము కొరకు సూర్యుని, ప్రాణ రక్షణ కొరకు మృత్యుంజయుని, వివాహము కొరకు అర్థనారీశ్వరుని, భూతప్రేతముల నుండి రక్షణ కొరకు నృసింహ స్వామిని - ఇలా వివిధ దేవుళ్ళను ఆరాధింపవచ్చును. అయితే ఈ అందరు దేవుళ్ళు ఒకే ఒక పరమాత్మ యొక్క రూపములనే ఎరుక కలిగి వుండాలి.

**హిందూ మతంలో ఐదు విధములైన ఆరాధనలు**

హిందూ ధర్మం ప్రకారం భగవంతుని అయిదు విధాలుగా ఆరాధించడం జరుగుతున్నది.

1. మొదటి రూపంలో ఆయన నిర్గుణుడు, నిరాకారుడు, సర్వ వ్యాపకుడగు పరమాత్మ. పురుష సూక్తములో ఈయన గురించిన వర్ణన యున్నది. వేద మంత్రములీయనను ఉపాసించుచున్నవి.

2. రెండవ రూపములో భగవంతుడు సృష్టి, స్థితి, లయములను చేయునపుడు బ్రహ్మవిష్ణు మహేశ్వర నామములతో తెలుసుకొనబడుచున్నాడు. శక్తికి ప్రతీకములగు సరస్వతి, లక్ష్మీపార్వతులు త్రిమూర్తులతో కలిసి వారు చేయు కార్యములకు తోడ్పడుచున్నారు. ఇట్లు త్రిమూర్తుల ఆరాధన ఏర్పడినది.

3. మూడవ విధానములో భగవంతుడు శ్రీకృష్ణుడు, శ్రీరాముడు మున్నగు అవతారములను దాల్చియున్నాడు. ఈ ప్రపంచము కొన్ని మతములు చెప్పునట్లు 6000 సంవత్సరముల క్రిందట మాత్రమే ప్రారంభము కాలేదు. అంతకు పూర్వము కృతయుగము, త్రేతాయుగము, ద్వాపర యుగములు గడచినవి. వాటి తాలూకు 38 లక్షల సంవత్సరములు గడిచినవి. ఆయా యుగములలో భగవంతుడు దాల్చిన అవతారములను గూడా మనము అర్చించుచున్నాము.

శ్రీకూర్మములో కూర్మావతారమునకు, కంచిలో వామనావతారమునకు అర్చనలు జరగడం మనం చూస్తున్నాం.

4. భగవంతునికి గల నాలుగవ రూపము అధికార పురుషులు. ఇంద్రుడు, అగ్ని, వాయువు, వరుణుడు మున్నగు దేవతలు ఈ కోవకు చెందినవారు. జిల్లా కలెక్టరు, న్యాయమూర్తి, పోలీసు అధికారి మున్నగువారు తమ పదవులకు సంబంధించిన బాధ్యతలను నిర్వహించుచున్నట్లే, ఈ దేవతలు గూడా ప్రకృతి యొక్క నడకకు దోహదము కలిగించే గురుతర బాధ్యతలను నిర్వహిస్తున్నారు. వాయువు గాలిని వీచునట్లు చేస్తాడు. వరుణుడు వర్షమునకు అధిదేవత. ఈ దేవతలను కూడా పూజిస్తాము.

ఆయా దేవతలు పూజలందుకుంటున్నారనడానికి ఆదిభట్ల నారాయణ దాసుగారి జీవితంలో ఒక తార్కాణమున్నది. విజయనగరంలో ఒకమారు వర్షాలు లేక, త్రాగు నీరు లేక ప్రజలు బాధపడుతుంటే వారి తల్లి కోరికపై ఆయన ఒక రోజు ఉపవాసముండి వరుణ జపం చేసి సాయంకాలం పార్వతీకళ్యాణం హరికథ చెప్పగా అందరూ ఆశ్చర్యపడునట్లు కుండపోతగా వర్షం కురిసింది. నగరమంతా జలార్ణవమైనదని వారు తమ ఆత్మకథలో వ్రాశారు. మానవ జీవితం మీద ప్రభావం కలిగిన నవగ్రహముల ఆరాధన గూడ ఇట్లే ఏర్పడింది.

5. ఇంతేగాక, మానవులుగా జన్మించినను, పరమేశ్వరునితో ఆత్మాను సంధానం చెందిన మహర్షులను గూడా పూజిస్తున్నాం. రాఘవేంద్రస్వామి, షిర్డీసాయి బాబా, వీరబ్రహ్మేంద్రస్వామి ఇట్టివారు. వీరిని దేవుళ్ళుగా ఎందుకు పరిగణిస్తున్నా రనే సందేహం చాలామందికున్నది.

ఆయా మహర్షులు జీవితాలను చాలించి జీవ సమాధి చెందిన పిదపగూడ భక్తులననుగ్రహిస్తున్నారు. ఆయా భక్తుల బాధలు తొలగడమే వారినారాధించడానికి కారణం. అంతేగాక మరొక కారణం గూడా వున్నది.

భగవంతుని మానవుని ఈ క్రింది సమీకరణంలో ఇమడ్చడం జరిగింది.

భగవంతుడు + కోరిక = మానవుడు.

కోరిక వలన భగవంతుడే మానవ రూపం ధరిస్తున్నాడు. ఈ సమీకరణాన్ని మరొక విధంగా గూడా వ్రాయవచ్చు.

మానవుడు - కోరిక = భగవంతుడు.

ఏ మానవుడైతే సంపూర్ణముగా వాంఛా రహితుడవుతాడో అతడు భగవంతునితో సమానం. అతడే 'గురువు' కాగలడు. పైన పేర్కొనబడిన మహనీయులు జీవించియున్నంత కాలం గురువులుగా ప్రసిద్ధి చెంది, జీవసమాధి నొందిన పిదప దైవ స్వరూపులుగా ఆరాధింపబడుచున్నారు.

ఇట్లు హిందూ ఆరాధనా విధానము ఎంతో వైవిధ్యము కలిగియున్నవి. వైవిధ్యాన్ని చూచి కంగారు పడగూడదు. ప్రతి వ్యక్తి తన మానసిక స్థితికి, అవసరానికి, అనురక్తికి తగిన దేవతా మూర్తిని ఉపాసించవచ్చు. అయితే అందరు దేవతలు ఆ పరమాత్మ అనెడి దివ్యశక్తి నుండి వెలువడిన శరీరములే అనెడి గమనిక వుండాలి.

**ఒక దేవాలయం కథ**

మన దేశంలో పిలిస్తే పలికెడి దేవుళ్ళు గల దేవాలయములు చాలా ఉన్నాయి. అలాంటి ఒక దేవాలయం గురించి ఆంధ్రశేషగిరిరావుగారు వ్రాశారు. అది ఇలా వున్నది.

''కొబ్బరి కాయ కొట్టి కొత్త కార్యక్రమం తలపెట్టడం, దేవాలయాలలో కొబ్బరికాయలు కొట్టి నైవేద్యం పెట్టడం మన దేశంలో ఆది నుండి ఆచారంగా వస్తున్నది. అయితే కేరళలోని ఒక దేవాలయంలో కొబ్బరి కాయలు కొట్టడానికి ప్రత్యేకమైన ప్రాముఖ్యమున్నది.

కేరళ రాజధాని తిరువనంతపురంలో వినాయకుడి గుడి వున్నది. అచట వినాయకుణ్ణి 'వజవన్‌గాడి పిళ్ళయార్' అని పిలుస్తారు.

ఒకప్పుడు ఆ వినాయక విగ్రహం ఒక వట వృక్షం క్రింద వుండేది. కేరళ రాజు మార్తాండవర్మ యుద్ధానికి వెళ్ళేముందు ఆ విగ్రహం ఎదుట కొబ్బరి కాయలు కొట్టి వెళ్ళేవాడు. అతడు ఒక్క యుద్ధంలో కూడా ఓటమి ఎరుగడు.

అతడు వినాయకునికి దేవాలయం కట్టించి దాని యాజమాన్యం తన సైనికాధికారికి అప్పగించాడు. అనుదినం అర్చనాదులు సైనిక శాఖ యొక్క అజమాయిషీలో నడుస్తాయి. ఇపుడు గూడా భారత సైనిక శాఖవారే యాజమాన్యం చేస్తారు.

ఆ గుడికి వచ్చే ప్రతి భక్తుడూ కనీసం ఒక కొబ్బరి కాయ అయినా కొడతాడు. ఒక్కొక్కపుడు తన మొక్కు బడిని బట్టి ఎక్కువ కాయలు సమర్పిస్తాడు. ఆ కొబ్బరి చిప్పల మీద ఏడాదికి 26వేల రూపాయల ఆదాయం దేవాలయానికి వస్తుంది.

కేరళలో వర్షాలు అత్యధికం. ఫలానా రోజున వర్షం కురిపించవద్దు అని స్వామికి మొక్కుకుని టెంకాయలు కొట్టే సందర్భాలు గూడా వుంటాయి. 1963లో తిరువనంతపురంలో అధిక వర్షాల వలన ఏళ్ళు కోళ్ళు ఏకమైనాయి. జిల్లా కలెక్టరు స్వయముగా వజవన్ గాడి పిళ్ళయార్ గుడికి వెళ్ళి 101 కొబ్బరికాయలు కొట్టాడు! మరునాడు వానలు తగ్గు ముఖం పట్టాయి.

సినిమా ప్రోడ్యూసరు ఒకడు తన పరివారంతో చిత్ర నిర్మాణం పని మీద తిరువనంతపురంలో మకాము చేశాడు. అతడు అక్కడ అడుగుపెట్టినది మొదలు తెరిపి లేని వర్షాలు. పక్షం రోజులు వేచివున్నాడు కాని ఆకాశం చిల్లి కట్టుబడలేదు. షూటింగు నిలిచిపోయింది.

అప్పుడొక స్నేహితుని సలహా మీద ప్రోడ్యూసర్ వజవన్ గాడిపిళ్ళయార్ గుడికి వెళ్ళి ఒక కొబ్బరి కాయ కొట్టి అర్చన చేశాడు. మరు నిమిషంలో వాన వెలిసింది. బాగా తెరిపి ఇచ్చాక తన పని పూర్తి చేసుకొని ఆ ప్రొడ్యూసర్ వెళ్ళిపోతూ ఆ వినాయకునికి వెయ్యిన్నొక్క కొబ్బరికాయలు కొట్టి తరువాత వార్షికంగా 101 కొబ్బరికాయలు కొడుతూ వుండటానికి శాశ్వతమైన ఏర్పాటు చేశాడు''.

# అధ్యాయము - 5

# పవిత్ర గ్రంథముల పారాయణ

## 12. పవిత్ర గ్రంథముల ప్రత్యేకతలు

-డా. ఎ.వి.ఎల్. నరసింహం

*(పాతగుంటూరు వాస్తవ్యులు, శ్రీ విద్యా ఉపాసకులు డా. ఎ.వి.ఎల్. నరసింహంగారితో ఇష్టాగోష్ఠి)*

ప్రశ్న : రామాయణము, భారతము, భగవద్గీత, భాగవతము - వీటిని పలువురు పారాయణ చేస్తుంటారు. అందువలన ప్రయోజనమేమిటి? శ్రీ రాముని వలె ధర్మాత్ముడై వుండాలి. భగవద్గీత చదివి కార్యశీలుడుగా రూపొందాలి. అంతే గాని అనుదినం కొన్ని శ్లోకాలు, అధ్యాయాలు పారాయణ చేయడమెందుకు కంఠశోష తప్ప?

జవాబు : మంచి ప్రశ్న అడిగారు. జవాబు చెపుతాను ఓపికతో వినండి. ఈ గ్రంథాలను సాధారణ వ్యక్తులు వ్రాయలేదు. త్రికాలజ్ఞులైన మహర్షులు రచించి మనకందించారు. మిగతా పుస్తకాల వలె ఇవి ఏదో ఒకే ఒక ప్రయోజనం కొరకు వ్రాయబడలేదు. బహుళ ప్రయోజనముల కొరకు వీటిని రచించారు. వీటిలో ఇతిహాసమున్నది, యోగమున్నది, ధర్మమున్నది, భారతీయ నాగరికత, సంస్కృతి వున్నాయి. భక్తి వున్నది. వీటి అన్నిటితోబాటు మరొక ఆశ్చర్యకరమైన సంగతి గూడ వున్నది.

అదేమంటే, మానవులకు జీవితంలో కొన్ని బాధలు, క్లేశములు సంభవిస్తాయి. వాటిని మీరు డబ్బుతోగాని, అధికారంతోగాని, మందులతోగాని నివారణ చేయలేరు. అలాంటి క్లేశములను తొలగించే అద్భుతమైన శక్తి ఈ గ్రంథములలోని కొన్ని అధ్యాయములకు, శ్లోకములకు, ఘట్టములకు ఉన్నది. అందుకే అనేకులు వీటిని పారాయణ చేస్తుంటారు.

ప్ర : ఏమిటా క్లేశములు? ఎలా తొలగింపబడుతాయి? మీ స్వానుభవంలో జరిగిన సంగతులు చెప్పండి. మనుష్యుల పేర్లు చెప్పనక్కరలేదు.

జ : అలాంటివే చెపుతాను. అన్నీ స్వానుభవం నుంచే పేర్కొంటాను.

ఒకనాడు ఒక వూరి నుండి హైస్కూలు ఉపాధ్యాయిని మా ఇంటికి వచ్చింది. అవివాహిత. ఆమెకు 37 ఏళ్ళు. తనకు వివాహమయ్యే మార్గం చెప్పమని కోరింది.

''పదకొండు శుక్రవారాలు శివపార్వతుల పటం ముందు పెట్టుకొని 'పార్వతీ సహస్రనామం' పారాయణ చేసి పటిక బెల్లం నివేదన చేసి, ప్రసాదాన్ని మీరే పుచ్చుకోండి'' అని చెప్పాను. అలాగే ఆమె ఇంటికి వెళ్ళి నిష్ఠతో చేసింది. 12వ వారంలో ఆమెకు అదే నగరంలో పని చేస్తున్న ఒక కాలేజి లెక్చరర్‌తో వివాహం నిశ్చయమైనది. ఏడాది పిదప కవల పిల్లలతో భార్యాభర్తలు మా ఇంటికి వచ్చారు.

**ప్ర : పార్వతీ సహస్రనామం ఏ గ్రంథంలోనిది?**

జ : ఇది శివపురాణములోనిది. పార్వతీదేవి శివుని గూర్చి తపస్సు చేసి శివుని పరిణయమాడినది. ఆమె సహస్రనామాలు పఠిస్తే ఆమె చేసిన తపస్సులో కొంత భాగాన్ని ఈ పిల్లకు ప్రసాదింపజేసి వివాహానికి తోడ్పడునట్లు చేస్తుంది. ఇది లలితా సహస్రనామం కాదు. పార్వతీ సహస్రనామమనే పేరుతో వేరే వున్నది.

**ప్ర : సంతోషం నరసింహంగారూ! ఇలా ఎంతమందికి మీరు సలహాలిచ్చి తోడ్పడ్డారు?**

జ : పది పదిహేనుమంది అవివాహితలైన కన్యలు ఇలా పఠించి ప్రయోజనం పొందారు. కొందరికి ''రుక్మిణీ కళ్యాణం'' పఠించమని చెప్పాను. దీనిని వరుసగా 40 దినములు పారాయణ చేసి శ్రీకృష్ణునికి పటిక బెల్లం నివేదన చేయాలి. దీనిని అమ్మాయిగాని, ఆమె తరపున తండ్రిగాని చేయవచ్చును. రుక్మిణీ కళ్యాణం భాగవతంలోనిది. పార్వతీ సహస్రనామాన్ని మాత్రం పెళ్ళి కావలసిన కన్యలు పఠించాలి.

**ప్ర : పార్వతీ సహస్రనామంలోను, రుక్మిణీ కళ్యాణంలోను గల ఈ శక్తికి కారణమేమిటి?**

జ : లోకంలో కొన్ని విషయాలకు మనం హేతువులు చెప్పలేము. అనాది నుండి అలా జరుగుతున్నది గనుక, ఫలము సిద్ధిస్తున్నది గనుక జనులు పారాయణ చేస్తున్నారు. అయినా ఒక కారణం చెప్పవచ్చు. పార్వతీ సహస్రనామంలో

శివపంచాక్షరీ మంత్రము, రుక్మిణీ కళ్యాణములో నారాయణ మంత్రము అంతర్భూతంగా వున్నాయి. అదే ఈ శక్తికి కారణం.

**ప్ర : సంతానం లేనివారికి మీరేదైనా సలహా ఇస్తారా?**

జ : సంతానం లేని స్త్రీలు 11 వారాలపాటు ప్రతి ఆదివారము సుబ్రహ్మణ్య సహస్రనామం పఠించాలి. పటిక బెల్లం నివేదన చేయాలి. ఆ రోజున తొరిగిన కూర తినరాదు. కూరలు తొరగరాదు. రాత్రి భోజనం చేయకుండా ఫలహారం మాత్రమే చేయాలి. నేల మీద శయనించాలి. ఈ సుబ్రహ్మణ్య సహస్రనామం స్కాంధపురాణం లోనిది. ఇలా చేసి ఎందరో సత్ఫలితం పొందారు.

**ప్ర : సంతానం లేకపోవడానికి కారణం ఏమిటి?**

జ : డాక్టరు చెప్పే కారణాలు వేరు. కాని మన పూర్వుల అభిప్రాయం ప్రకారం స్త్రీకి గర్భంలో సర్పదోషం వున్నట్లయితే సంతానం కలుగదు. భార్యాభర్త లిరువురికి దోషమున్నట్లు తెలిస్తే వారు రామేశ్వరం వెళ్ళి నాగ ప్రతిష్ఠ గనుక చేస్తే సంతానం కలుగుతుంది.

**ప్ర : మరి, గాయత్రీ మంత్రం యొక్క ప్రత్యేకత ఏమిటి?**

జ : కొంతకాలం క్రిందట ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో పనిచేసి రిటైరయిన ఆర్.ఎన్.గారు నా వద్దకు వచ్చారు. ఆయనకు ప్రతి రోజు రాత్రి 12 గంటలకు ఒక నీడవంటి రూపం కళ్ళ ఎదుటికి వస్తుంది. దాని వెంటబడి ఇతడు పోతాడు. సూర్యోదయానికి నీడ అదృశ్యమవుతుంది. ఈలోగా పదిమైళ్ళు నడిచి వుంటాడు. ఆ తరువాత ఇంటికి తిరిగి వస్తాడు. ఇలా 12 సంవత్సరాల నుండి బాధింపబడుతున్నాడు.

దీనికి మార్గాంతరమేమిటని వచ్చి నన్ను అడిగాడు. ప్రతిదినం సాయం కాలం 6 గంటలపుడు సహస్రగాయత్రీ జపం చేయమన్నాను. అలా చేసి ఆయన స్వస్థత పొందాడు.

**ప్ర : నరసింహంగారూ! ఇన్ని రకముల క్లేశములు మనుష్యులకున్నవా? వాటిని నివారణ చేసే శక్తి మంత్రములకు మన పవిత్ర గ్రంధములకు ఉన్నదా?...మీరు స్వానుభవంతో చెపుతున్నారు గనుక నమ్ముతున్నాను. మరొక సంగతి చెప్పండి వింటాను.**

జ : భార్యాభర్తలిద్దరున్నారు. భర్తకు ఏదో ఉద్యోగం, అతడు ఇంట్లో వున్నంత సేపూ భార్యను వేధించుకు తింటాడు. అంతేగాక కర్రతో కొడు[illegible]డు.

అతడు ఆఫీసుకు పోతేనే ఆమెకు కాస్త హాయిగా వుంటుంది. ఇంటికి వచ్చింది లగాయతు ఆమెను కొడతాడు.

ఆమె నా దగ్గరకు వచ్చి చెప్పుకున్నది. అతనికి అంత రౌద్రం ఎందుకు వస్తుందో తెలియదు. సరేనని ఆమెను ''శ్రీ లక్ష్మీ నరసింహస్తోత్రం'' చదువుకో మని చెప్పాను. ఆమె అలాగే చేసింది. రోజూ ఎన్నోసార్లు చదివేది. పదిరోజులు గడిచాయి. ఆమెకు ప్రహ్లాదుని స్థితిలోకి వెళ్ళినట్లు తోచింది. దెబ్బలు కొట్టినా ఆమెకు నొప్పి అనిపించలేదు. భర్తకే చేతులు నొప్పి పుట్టి ఆఖరుకు కొట్టడం మానివేశాడు. ఇదీ జరిగిన సంగతి. బాధలు పడేవారికి శ్రీలక్ష్మీ నరసింహ స్తోత్రం కవచంలాగ పనిచేస్తుంది.

**ప్ర : చాల ఆశ్చర్యంగా వున్నదే. మహాభారతంలో కూడా పారాయణకు తగిన భాగములున్నవా?**

జ : విరాటపర్వమునకు ఒక శక్తి వున్నది. ఎందుకున్నదో తెలియదు. విరాటపర్వం పఠిస్తే వర్షం కురుస్తుంది. అది ధర్మరాజు పాత్రయొక్క మహత్యం కావచ్చు. అంతేగాక వేయి బిందెలతో శివునికి అభిషేకం చేస్తే వర్షం కురుస్తుంది. నేను స్వయంగా పొత్తూరు అనే గ్రామంలో నిష్ఠతో అభిషేకం చేయగా మబ్బులు పట్టి వర్షం కురిసింది.

**ప్ర : రామాయణంలో ఏ కాండకు ఇలాంటి ప్రాధాన్యమున్నది?**

జ : మానవుడు జీవితంలో దారీ తెన్నూగానక మనోవ్యాకులంతో క్రుంగి యున్నపుడు సుందరాకాండ రోజూ ఒక సర్గ చొప్పున పారాయణ చేయాలి. ప్రారంభంలోనూ ఆఖరులోనూ ఆంజనేయునికి కొబ్బరికాయ కొట్టి నివేదన చేయాలి.

**ప్ర : భాగవతంలో ఏఏ ఘట్టాలు ఇలాంటి ప్రసిద్ధి కలిగి యున్నవి?**

జ : భాగవతం యావత్తూ ఇలాంటి బాధల నివారణకు ఉపకరిస్తుంది.

1. మానవునికి ఏ దోవా తోచక గుండె బేజారెత్తిపోయినపుడు గజేంద్ర మోక్షం పఠించడం చాలా గొప్పగా ఉపకరిస్తుంది.

2. పై అధికారులతో పేచీలు వచ్చి వృత్తిపరమైన చిక్కులు ఏర్పడినపుడు అంబరీషోపాఖ్యానం చదువుకోవాలి.

3. గర్భిణీస్త్రీలు సుఖంగా ప్రసవించడానికి శ్రీకృష్ణ జననం పారాయణ చేయాలి.

ప్ర : మీరు చెప్పిన వాటికి సంబంధించి ఏవైనా జరిగిన ఉదాహరణలు చెపుతారా?

జ : చెపుతాను....తెనాలిలో 'డి.ఎస్.' అనేవారున్నారు. వారికి భాగవత మంటే మక్కువ జాస్తి. వారికి ఆరుగురు మనుమరాళ్ళున్నారు. రుక్మిణీ కళ్యాణం పారాయణ చేసి వారికి సంబంధాలు నిశ్చయం చేశారు. వారు గర్భవతులు కాగా శ్రీకృష్ణ జననం వారికి వినిపించి సుఖప్రసవం జరిగేటట్లు చేశారు. డాక్టర్లు కాన్పు కష్టమన్న సందర్భంలో గూడ సుఖప్రసవం జరిగింది.

ప్ర : భగవద్గీత గురించి ఏమైనా చెపుతారా?

జ : ఎంతైనా చెప్పవచ్చు. నా మిత్రులొకరు జీవితంలో ఒడుదుడుకులు లేకుండా, ఎప్పటి అవసరాలకు తగినట్లు అపుడు డబ్బు సమకూరుతూ జీవితం వెళ్ళబోస్తున్నాడు. నీ ఈ ప్రశాంతమైన, తృప్తికరమైన జీవితానికి హేతువేమిటి? అని అడుగగా ''నేను రోజూ భగవద్గీత ఒక అధ్యాయం పారాయణ చేస్తాను. అంతకంటే నాకేమీ తెలియదు'' అన్నాడు.

ప్ర : మీరు చెప్పిన అన్నిటిలోకీ భాగవతంలో పారాయణ చేయడానికి ఎక్కువ ఘట్టములున్నట్లు కనిపిస్తున్నది. ఎందువల్ల?

జ : భాగవతము కేవలము శ్రీ మహావిష్ణువు యొక్క కథ మాత్రమే కాదు. అందులో ప్రహ్లాదుడు, గజేంద్రుడు, అంబరీషుడు లాంటి విష్ణుభక్తుల గాథలు చాలా ఉన్నాయి. మనము దేవుని కథలేకాక దైవభక్తుల గాథలను పఠించినా క్లేశములు తొలగుతాయి.

అందుకే హనుమంతుడు ఇలా అన్నాడు : ''నా రాముణ్ణి మీ కోరికలతో బాధ పెట్టకండి. నన్ను అడిగితే నేను మీ కోరికలు తీరుస్తాను''. అయితే ఒకటి ప్రధానం. శ్రద్ధ, భక్తి, విశ్వాసం - ఈ మూడు లేకుండా మన ప్రార్థనలు సఫలం చెందవు.

ప్ర : ఒక ఆఖరు ప్రశ్న అడుగుతాను...ఇలా మంత్రములను లేదా పారాయణ గ్రంథాలను నెలల కొలది, ఏండ్ల కొలది పారాయణ చేసేవారు అంతా దేవుడే చేస్తాడని స్వయంకృషిని, ప్రయత్నాన్ని మానివేసి సోమరులుగా మారిపోరా? నన్ను అపార్థం చేసుకోకుండా సందేహం తీర్చండి?

జ : నేను అపార్థం చేసుకోను. మీరు అడగవలసిన ప్రశ్నే అడిగారు. మనం చేసే పవిత్ర గ్రంథ పారాయణ వలన మనలో మానసిక శాంతి, మనోధైర్యము

ఏర్పడుతాయి. మనకు అపకారం చేసేవారి మనస్సులలో మన మీద సానుభూతి, సదభిప్రాయం ఏర్పడుతాయి. మన శరీరాన్ని ఉత్సాహపరిచి పని చేయించే శక్తి మనకు ఒనగూడుతుంది. మనము కార్యోన్ముఖులమవుతామే గాని సోమరులము కాము. కారులో పెట్రోలు పోసేది కారును నడిపించడానికేగాని పడవేసి వుంచడానికి కాదుగదా!

ప్ర : మరొక ప్రశ్న. ఈ విధంగా పారాయణ చేసినందువలన నూటికి నూరుమందికీ బాధలు తొలుగుతాయా? విఫలమైతే ఎందువలన?

జ : ఇవన్నీ సైన్సు లేబరేటరీలో ప్రయోగానికి కనబడే మాదిరి సంగతులు కావు. నాలుగు నాలుగులు పదహారు అన్నంత కచ్చితంగా ఫలితాలు ఉండవు. అయినా ఒక సంగతి చెపుతాను.

అంతయు మానవుడు దివ్యశక్తికి శరణాగతి పొందడం మీద ఆధారపడి వుంటుంది. నీవే తప్ప ఇంకే అండా నాకు లేదు అనే భావన కలగాలి. తరువాత, సూదంటురాయి ఇనుప సూదిని ఆకర్షిస్తుందనే మాట నిజమే. కాని ఆకర్షణ అనేది ఆ సూదంటు రాయికి గల శక్తి, ఇనుప వస్తువు యొక్క బరువు మీద ఆధారపడి వుంటుంది. అలాగే ఆయా శ్లోకముల పారాయణ ద్వారా మనస్సులో ఎంతటి తపోశక్తి సమకూర్చబడినది, అతని క్లేశముల యొక్క తీవ్రత ఎట్టిది అనే దాన్ని బట్టి ఫలితాలు ఉంటాయి. సత్ఫలితములు కొందరికి కలిగినా, అవి సత్యమునకు దాఖలాలే గదా!

ప్ర : ఇంకా ఏమైనా చెపుతారా?

జ : అన్నట్లు ముఖ్యమైన సంగతి చెప్పడం మరచాను. వ్యాధి పీడితుడుగాని, బలమైన శత్రువును ఎదుర్కొనేవాడుగాని ''ఆదిత్య హృదయం'' అనుదినం పారాయణం చేయాలి. దీనివలన నూటికి ఎనుబది మంది సత్ఫలితం పొందారు. దీనిని అగస్త్య మహర్షి శ్రీరామునికి ఉపదేశించాడు. రావణాసురునితో యుద్ధం చేయబోయే ముందు శ్రీరాముడు దీన్ని పఠించాడు. ఇది అత్యంత ప్రయోజనకర మైన పారాయణ స్తోత్రం.

ధన్యవాదాలు నరసింహంగారూ! చాలా మంచి విషయాలు చెప్పారు.

(1985 జనవరి)

# 13. విపత్తు నుండి కాపాడిన లలితా సహస్రనామ మంత్రం

- శ్రీ కె.జి.సి. హరివిఠల్,ఎం.ఎస్.సి

**(విజయవాడ ఎస్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్. ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ కె.జి.సి. హరివిఠల్‌గారితో ఇష్టాగోష్ఠి)**

ప్రశ్న : సకల బాధా నివారణ కొరకు మహర్షులు మనకు విష్ణుసహస్రనామ స్తోత్రం, లలితాసహస్ర నామస్తోత్రం అనుగ్రహించారు గదా! ఈ సహస్ర నామాలలో ప్రతి శ్లోకం ఒక మంత్రంగా ఉపకరిస్తుందని అంటారు గదా! ఈ విషయంలో మీ స్వానుభవం ఏదైనా వుంటే చెప్పండి?

జవాబు : ఎవరికో అలా జరిగిందనీ ఇలా జరిగిందనీ చెప్పేకంటే నా స్వంత అనుభవం చెపితే ఎక్కువ విశ్వసించతగినదిగా వుంటుందని ఇలా అడుగుతున్నారా?

ప్ర : అవును. పాఠకులు బాగా స్వీకరిస్తారు.

జ : అయితే చెపుతాను వినండి. 1983 డిసెంబరులో కాళహస్తిలో నాకు రైలు ప్రమాదం జరిగింది. రైలు ఎక్కుతుండగా కాలుజారి రైలు పట్టాల ప్రక్కన పడిపోయి స్పృహ కోల్పోయాను. కాలి ఎముక విరిగింది. తలకాయ దెబ్బతిన్నది. వీపు నిండా గాయాలు, రక్తపు మడుగులో వున్నాను.

ప్ర : అపుడేమి జరిగింది?

జ : నన్ను తిరుపతి ప్రభుత్వ ఆసుపత్రిలో చేర్చారు. 48 గంటలు గడిస్తే తప్ప ఏమీ చెప్పలేమన్నారు. తగిన వైద్య చికిత్స కోసం వెంటనే రాయవెల్లూరు ఆసుపత్రికి తీసుకుపొమ్మని సలహా ఇచ్చారు. నా విద్యార్థులు, బంధువులు నన్ను రాయవెల్లూరు మిషనరీ ఆసుపత్రిలో చేర్చారు.

ప్ర : అపుడేమి జరిగింది?

జ : నాకు 24 గంటలకు స్పృహ వచ్చింది. కళ్ళు తెరిచి చూస్తే

రాయవెల్లూరు ఆసుపత్రిలో వున్నాను. అసలు నేను బ్రతుకుతానా? బ్రతికినప్పటికీ జీవితాంతం మంచంలో ఉండవలసి వస్తుందా? అనే పరిస్థితిలో వున్నాను. అచటి డాక్టర్లు మిషనరీ జీల్‌తో పనిచేసే అత్యంత నిపుణులైనవారు. వాళ్ళు నన్ను సాకల్యంగా పరీక్షించి ''మీకు పూర్తిగా నయం కావడానికి 6 నెలలు పడుతుంది. ఆరు నెలలు ఇక్కడ వుంటారా? మిమ్మ్మ కాళ్ళతో నడిపించి ఇక్కడ నుండి పంపిస్తాం'' అన్నారు.

ప్ర : పిదప ఏమి జరిగింది?

జ : మొదటవాళ్ళు నా వీపుకు ప్లాస్టిక్ సర్జరీ చేసి చర్మం వేసి కుట్టారు. అది మిగతా చర్మంతో కలిసిపోవాలంటే 7 రోజులు పడుతుంది. ఆ 7 రోజులూ పక్కమీద బోర్లా పడుకోవలసిందే తప్ప వీపు ప్రక్కకు తిప్పకూడదు అని చెప్పి పడుకోబెట్టారు. ఒక్క గంట గూడా అలా పడుకోలేము. 7 రోజులు ఎలా పడుకోగలను?

ప్ర : అపుడు మీరేమి చేశారు?

జ : దేవుని స్మరిస్తూ అలాగే బోర్లా పడుకున్నాను. నాకు శ్రీ లలితాసహస్ర నామం నోటికి వచ్చు. స్తోత్రాన్ని చదువుకుంటున్నాను. అసలు మన శరీరం జగన్మాత యొక్క అంశతో ఏర్పడింది. మన అవయవాలన్నింటిలోనూ ఆమె సుప్రతిష్టతమై వున్నది. అందుచేత నాకు చర్మం కలిసిపోయి గట్టి పడాలి గనుక చర్మమునందు అమ్మవారి స్వరూపమును వర్ణించే శ్లోకమును మనస్సులో నెతకడము ఆరంభించాను.

అపుడు శ్రీలలితా సహస్రనామంలో 99వ శ్లోకం గుర్తుకు వచ్చింది. అందులో

''పాయసాన్న ప్రియాత్వక్స్థా పశులోక భయంకరీ
అమృతాది మహాశక్తి సంవృతా డాకినీశ్వరీ''

అనే శ్లోకంలో ''త్వక్స్థా'' అంటే త్వగింద్రియాది దేవతయై చర్మమునందు ఉండునది అని అర్థం. అందుచేత ''ఓం ఐం హ్రీం శ్రీం త్వక్స్థాయై నమోనమః'' అనే మంత్రాన్ని రాంత్రింబళ్ళు నా సతీమణిచేత జపింపచేసి ఆ తీర్థాన్ని పుచ్చుకున్నాను.

ఆశ్చర్యమేమంటే, 7 రోజులలో -కలిసిపోవలసిన చర్మం ఒక్క రోజులో కలిసిపోయి గట్టిపడింది! డాక్టర్లు వచ్చి చూసి ఆశ్చర్యపోయారు. ఇది ఎలా జరిగిందని అడిగారు. నేను చేసిన పని చెప్పాను. ఇది మహర్షులు అందించిన మంత్రశక్తి ప్రభావమని చెప్పాను. వాళ్ళు నిర్ఘాంతపోయారు.

ప్ర : ఆ తర్వాత ఏమి జరిగింది?

జ : ఆ తర్వాత వాళ్లు నా కాలు విరిగిన చోట ఎముకలు సరిచేసి కట్టుకట్టారు. ఎముకలు అతుక్కోవడం కొరకు మరల శ్రీ లలితా సహస్రనామ స్తోత్రం పరిశీలించాను. అందులో 106వ శ్లోకం ఇలా వుంది :

''మూలాధారాంబుజారూఢ పంచవక్త్రా స్థి సంస్థితా

అంకుశాదిప్రహరణా వరదాది నిషేవితా''

ఇందులో ''అస్థిసంస్థితా'' - ఎముకలందు నివసించియుండుదానా అని చెప్పబడినది. అందుచేత 'ఓం ఐం హ్రీం శ్రీం అస్థి సుస్థితాయై నమోనమః' అనే మంత్రాన్ని జపింపచేసి ఆ ఫలాన్ని పొందాను. ఎముకలు గూడ త్వరగా కలుసుకున్నాయి. దీనంతటి ఫలితంగా 6 నెలల్లో పొందవలసిన చికిత్సను 2 నెలల్లో ముగించుకొని ఇంటికి వచ్చాను. డాక్టర్లు మిక్కిలి ఆశ్చర్యం చెందారు.

ప్ర : మీ చికిత్సా కాలంలో జరిగిన సంగతులు ఇంకేమైనా ఉన్నాయా?

జ : డాక్టర్లు తాము ఇచ్చే ఆహారమే భుజించాలన్నారు. అందులో నానవేసి వండిన పెసలు ఆహారంగా ఇచ్చారు. అవి తింటే ఎముకలకు బలం కలుగుతుందని అన్నారు. సరేనని తింటున్నాను.

మరల నేను శ్రీ లలితాసహస్రనామం పరిశీలించాను. అందులో ఎముకలందు అభివసించియున్న అమ్మవారికి 'సాకిని' అని పేరు చెప్పబడినది. ఆమె ''ముద్గౌదనాసక్త చిత్తా'' అని వర్ణింపబడినది. అనగా ఈమె మనస్సు పెసలు కలిపి వండిన అన్నమునందు ఆసక్తి కలదియై యుండునని అర్థము. ఈ విధంగా నిపుణులైన వైద్యులు నిర్ణయించిన ఆహారము, ఎముకలందు నివసించు అమ్మవారు ఇష్టపడే ఆహారము ఒకటే అయినది!

ప్ర : అత్యంత ఆశ్చర్యకరమైన సంగతి చెప్పారు. మంత్రశక్తి గురించి ఇంకొక ఉదాహరణ చెపుతారా?

జ : ఒక వేదపండితున్నాడు. ఆయన కొడుకు బి.ఎస్.సి. చదువుతున్నాడు. పరీక్షలు తప్పుతున్నాడు. మూడవ సంవత్సరం చదువుచున్నప్పటికీ మొదటి సంవత్సరం పరీక్షలింకా వ్రాస్తూనే వున్నాడు. అతని తండ్రి నా వద్దకు వచ్చి చెప్పుకున్నాడు. మీరు వేదపండితులు గదా! దీనికి మార్గం చూడలేకపోయారా అన్నాను. తనకు తోచలేదన్నాడు.

విద్యలకు అధిదేవత హయగ్రీవుడు. అట్టి హయగ్రీవ మంత్రం ప్రతిదినం పిల్లవాడి చేత 108సార్లు జపింపచేసి ఆ తరువాత చదువు ప్రారంభించమను అన్నాను. ఆయన అలాగే చేయించాడు. కుర్రవాడు చక్కగా చదువుకొని ఇంజనీరింగు చదివి ఇప్పుడు ఉద్యోగం చేస్తున్నాడు.

చాలా చక్కని విషయాలు చెప్పారు. శ్రీ లలితాసహస్రనామ స్తోత్ర మహాత్యం కళ్ళకు కట్టినట్లు చెప్పారు. చదువులో వెనుకబడినవారు వృద్ధిలోకి వచ్చేమార్గం గూడా చెప్పారు. ధన్యవాదాలు!

*(అక్టోబర్ 1992)*

## మద్యము

సింహము ఎదుటకు వెళ్ళినపుడు భయపడకు
అది నీ పరాక్రమమునకు గీటురాయి;
కరవాలమునకు నీ కుత్తుక నందించునపుడు భయపడకు
అది నీ బలిదానమునకు మంచి మచ్చుతునక;
పర్వతాగ్రము నుండి క్రిందికి దుముకునపుడు భయ
పడకు, అది నీ తపమునకు సరియైన సాధన;
అగ్నిజ్వాలలు నలుదెసల నలము కొనునపుడు
భయపడకు, అది నీ సహనశక్తికి గట్టి పరీక్ష;
కాని, మద్యమునకు మాత్రము తప్పక భయపడు
అది పాపములకు, అనాచారములకు కన్నతల్లి.

–గౌతమబుద్ధుడు

# అధ్యాయము - 6

# ప్రార్థన వలన ప్రత్యక్ష ఫలితాలు

## 14. దైవ ప్రార్థన గొప్పసాధనము

హిందీ : పండిత శ్రీరామశర్మ ఆచార్య – తెలుగు: శ్రీ తుర్లపాటి శంభయాచార్య

ప్రార్థన అత్యంత శక్తి సంపన్నమైన సాధనము. దాని ప్రత్యక్ష ఫలితాలు అనంతాలు. నిష్కామ ప్రార్థన వలన మానవునకు ఆంతరంగిక ప్రశాంతి లభిస్తుంది. మనస్సులోని మాలిన్యములు మటుమాయమవుతాయి.

ప్రార్థన ద్వారా భక్తుడు భగవంతునితో తాదాత్మ్యము చెందగలుగుతాడు. సర్వార్థసిద్ధిని సాధించగలుగుతాడు. ప్రార్థనా మాహాత్మ్యము గురించి, దాని ప్రత్యక్ష చమత్కారముల గురించి కొన్ని సంగతులు తెలుసుకుందాము.

బాబరు చక్రవర్తి యొక్క ప్రియపుత్రుడు హుమాయూన్ జబ్బు పడ్డాడు. అతని పరిస్థితి క్షీణించింది. రాజవైద్యులు తమ అశక్తతను వెల్లడించారు.

''చూడండి ప్రభూ! మీకు అన్నింటికంటే అత్యంత ప్రియమైన వస్తువును హుమాయూన్ ప్రాణానికి బదులుగా ఇచ్చివేయండి. పరమేశ్వరుడు మీపై కరుణ చూపవచ్చు. హుమాయూన్ సంపూర్ణ ఆరోగ్యవంతుడు కావచ్చును'' అన్నారు.

అందులకు బాబరు ''నాకు అన్నిటికంటే ప్రియమైనది నా ప్రాణమేగదా. దానిని నేను హుమాయూన్ కొరకు ఇచ్చివేయడానికి ఏ మాత్రము సంకోచిం చను'' అని ప్రత్యుత్తరమిచ్చాడు. ఆ తరువాత బాబరు తన కుమారుని శయ్య చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేశాడు. కన్నులు మూసుకొని ఏకాగ్రతతో చేతు లు మోడ్చి ''హే పరమేశ్వరా! నా కుమారుడు హుమాయూన్ ఆరోగ్య వంతుడై బ్రతుకగలిగితే నేనాతని కొరకు నా ప్రాణములర్పించడానికి సిద్ధంగా వున్నాను. హుమాయూన్ రోగమంతా నాకు ఆవహించవలెను. అతడు పరిపూర్ణ ఆరోగ్యవం తుడు కావాలి. నన్ను కరుణించు ప్రభూ!'' అని దీనాతిదీనంగా భగవంతుని ప్రార్థన చేశాడు.

ఈశ్వరునిలీల విచిత్రమైనది. సర్వార్పణ భావంతో బాబరు చేసిన ప్రార్థనను భగవానుడు విన్నాడు. మరుసటి రోజు నుంచీ హుమాయూన్ క్రమంగా కోలు

కున్నాడు. బాబరు ఆరోగ్యం మాత్రం క్షీణించసాగింది. మనస్ఫూర్తిగా చేసిన ప్రార్థన మన్నించబడింది. అతడు 1530 డిసెంబరు 26న ఆగ్రాలో మరణించాడు.

ఇటువంటివే ప్రచారంలో వున్న అనేక సంఘటనలను, వ్యక్తిగత అనుభవాలను ఆధారం చేసుకొని మనము ప్రార్థనకు పరమాద్భుతమైన శక్తి కలదని గ్రహించవచ్చును. శరణాగతులై ప్రార్థన చేసిన వ్యక్తులెందరో వారి జీవితములో అనేక అనుభవాలను పొందారు.

పండిత శివదత్తాజీ శర్మ అనువారు తనకు పరిచితుడైన ఒక వ్యక్తి యొక్క వృత్తాంతమును తెలిపినారు. ఒకప్పుడు వారి కుమార్తె తీవ్రముగా జబ్బుపడింది. క్రమముగా మరణాసన్న స్థితికి చేరుకున్నది. తండ్రి మానవ ప్రయత్నాలన్నీ నిష్ఫలమైనాయని గ్రహించి అందరికీ దూరంగా ఒక్కడే తన ఇంటిపైన మూడవ అంతస్థులోనికి వెళ్ళి దుఃఖించసాగాడు. ఆకాశంవైపు చేతులు జోడించి భూమివైపు ముఖం పెట్టి సాష్టాంగంగా క్రిందపడిపోయాడు. అత్యంత దైన్యభావంతో ''ఓ భగవంతుడా! కరుణామయా! నా ప్రయత్నాలన్నీ సమాప్తమైపోయినాయి. నా ఆశలన్నీ అడియాసలైపోతున్నాయి. ఇపుడు నీవే నాకు దిక్కు. నీ శరణు వేడు కుంటున్నాను. నా బిడ్డకు ప్రాణ దానం చేసి ఆమెను రక్షించడం నీ చేతిలో వున్నది. స్వామీ! ఈ దాసుణ్ణి కరుణించు. ఈ బిడ్డను బ్రతికించు'' అని ప్రార్థించాడు.

నిరంతర అశ్రుధారా ప్రవాహంతో హృదయంలో నున్న పరమేశ్వరుని పాద పద్మాలకు అభిషేకం చేశాడు. తరువాత క్రిందికి దిగి వచ్చాడు. ఆయన కమితాశ్చర్యం కలిగింది. తన బిడ్డ స్పృహలోకి రాగలుగుతున్నది! రోగము నయమై బిడ్డ కోలుకుంటున్నది.

ఈ విధంగా పరమేశ్వరుని కొలువులో చేయబడే ప్రతి ఆంతరంగిక ప్రార్థన వెంటనే ఫలిస్తుంటుంది. మహాత్మా తుకారాం, మీరాబాయి, సూరదాసు, తులసీదాసు మొదలగు భక్త శిఖామణుల దివ్య ప్రార్థనలు జగత్ ప్రసిద్ధములు. అపుడు ఆ మహాత్ముల మనస్సు ఆ పరాశక్తితో తాదాత్మ్యం చెందుతుంది. అదే సమస్త సిద్ధులకు చమత్కారాలకు మూలస్థానం. ఆ దైవజగత్తులో ప్రవేశించి తమ ఆత్మశక్తితో వారు కోరిన తత్త్వమును ఆకర్షించుకుంటారు. చైతన్య తత్త్వముతో తాదాత్మ్యము పొందుతారు. ఆ కారణంగా వారు ప్రార్థన ద్వారా సమస్త రోగాలను, శోకాలను భయాలను, వ్యాధులను బాధలను పోగొట్టుకుంటారు.

## అధునికుల దృష్టిలో ప్రార్థన

ఈనాడు ప్రార్థనను ప్రజలు తప్పుగా అర్థం చేసుకొంటున్నారు. ఈ శతాబ్దపు విద్యావంతులైన యువకులు ప్రార్థనను ఒక డంబాచారంగాను, మోసంగాను భావిస్తున్నారు. విమానంలో ఇంజనీరు నడిపే చేయి, లేక పరమాణు బాంబుద్వారా సృష్టిని

విధ్వంసం చేయగల గుండె మరొకరిని వినయ విధేయతలతో బిక్ష అడగడంగాని, దయాదాక్షిణ్యాలను యాచించే మనస్తత్వమునుగాని ఒప్పుకొనడం లేదు.

ఈశ్వరుడనీ, దైవశక్తులనీ ఏవో ఉంటే ఉండవచ్చును. నవీనులు మాత్రం తమకు తామే అన్ని విధాల సర్వసమర్ధులమనీ, బలవంతులమనీ భావిస్తూ ప్రార్థన ద్వారా యాచించడం అనుచితమని భావిస్తారు. ప్రార్థన అంటే వారి దృష్టిలో వ్యర్థ ప్రలాపము. వారి భావనలో దంభము గర్వము ఉన్నవి. వాస్తవ సత్యాన్ని వ్యర్థపరచే స్వార్థమున్నది. ప్రార్థన యొక్క సత్యస్వరూపాన్ని వారు తప్పుగా అర్థం చేసుకుంటున్నారు.

**ప్రార్థన వలన అసంఖ్యాక ప్రయోజనాలు**

దండెములు తీయుట, బస్కీలు తీయుట, ఆసనములు వేయుట ద్వారా శరీరము బలిష్టమవుతుంది. అట్లే ప్రార్థన అనెడి ఆధ్యాత్మిక వ్యాయామం వలన మానవుని మనోబలం సుదృఢమవుతుంది. ఆత్మవిశ్వాసము, ఇచ్ఛాశక్తి పెంపొం దుతాయి.

ప్రార్థన వలన మనస్సులో ఒక సువ్యవస్థ, చిత్త ప్రవృత్తిలో సుస్థిరత, మేధస్సులో తేజస్సు భాసిస్తాయి. వివేకం జాగృతమవుతుంది. ఔన్నత్యం కలుగు తుంది. ప్రార్థన ఒక విధమైన ప్రాయశ్చిత్తము వంటిది. వివిధ రకాలైన వ్యాకులతలను స్వార్థములను, చింతలను, రోగములను, వ్యాధులను, బాధలను, బలహీనతలను ప్రక్షాళనం చేసుకొనడానికి ప్రార్థన సర్వోత్తమమైన సులభ సాధనము.

## బలముతో కూడిన మంచితనం ఆవశ్యకత

'అశక్తుణ్ణి ఏడిపించడం అందరికీ సరదా' అని ఒకరు వ్రాశారు. కర్రలేని వాణ్ణి గొఱ్ఱె అయినా కరుస్తుందని సామెత. ఈ రెండు మాటలు మనకొక హెచ్చరిక చేస్తున్నాయి.

సామాన్యంగా మనం మంచితనానికి ప్రాధాన్యమిస్తాము. అంతేగాని బలము, ధైర్యము కలగియుండాలని అనుకోము. బలములేని మంచితనం నిరుపయోగం. ఎవరి జోలికీ పోని వాణ్ణి, తన పని తాను చూచుకొనేవాణ్ణి మంచివాడంటున్నారు. మంచి వాడంటే భయస్తుడు, స్వ విషయం చూచుకొనేవాడు, ఆయుధం ముట్టనివాడు అనే అభిప్రాయం ఏర్పడింది.

ఈ దురభిప్రాయం పోవాలి. బలం కలిగి వుండడం మంచితనంలో భాగం కావాలి. ప్రపంచంలోను, దేశంలోను హింసా ప్రవృత్తి పెరుగుతున్నది. స్త్రీలకు రక్షణ లేకుండా పోతున్నది. వీటిని ఎదుర్కొనాలంటే మంచివారు బలాన్ని గూడ పెంపొందించుకోవాలి.

మనం పూజించే శ్రీరాముడు కోదండపాణి, శ్రీకృష్ణుడు సుదర్శన చక్రధారి. వాళ్ళు దుర్మార్గులను ఎదుర్కొన్నారే గాని దాసోహమనలేదు. కనుక శక్తియుతమైన సౌశీల్యం మన లక్ష్యం కావాలి.

– ''సౌమిత్రి''

# 15. శ్రీరామనామ మహిమ

- శ్రీ దేవగిరి వెంకటరెడ్డి

**(గుంటూరు సమీపంలోని అంకిరెడ్డి పాలెంలో ఉపాధ్యాయులుగా పనిచేసిన స్వర్గీయ దేవగిరి వెంకటరెడ్డిగారు తన స్వానుభవమును ఇందు వివరించారు)**

అది 1933వ సంవత్సరం. నాకపుడు 14 సంవత్సరాలు. విపరీతమైన దగ్గుతో కళ్లెతో బాధపడుచున్నాను. గుంటూరులో అల్లోపతి వైద్యులకు చూపించారు. క్షయవ్యాధి అన్నారు. మందులు వాడుతున్నారు. గుణం కనిపించడంలేదు.

24 గంటలలో ఏ ఒక్క గంటో పరుండే వాడిని. మిగతా రోజంతా కూర్చొని వుండవలసిందే. నాటుమందులు గూడా వాడాను. ప్రయోజనంలేదు. ఇలా మూడు సంవత్సరాలు జబ్బుతో పోరాడుతున్నాను. ఇది తగ్గే జబ్బుకాదని రూఢి అయినది. అందుచేత మా నాన్నగారు నన్ను వదిలిపెట్టి నా తమ్మునికి వివాహం చేశారు.

ఇలా వుండగా ఒకరోజు గుంటూరులో జరిగే శ్రీరామకోటి ఉత్సవాలను చూద్దామని వెళ్లాను. ఇపుడున్న రామనామ క్షేత్రం అప్పటికి నిర్మాణం కాలేదు. అగ్రహారంలో నరసింహస్వామి గుళ్లో ఉత్సవాలు జరిపారు. ఎవరో వచ్చి శ్రీరామనామ మహిమను గురించి ఉపన్యాసం ఇస్తుంటే విన్నాను. ఇపుడు రామ నామక్షేత్రం నిర్వహిస్తున్న శ్రీ రాగం ఆంజనేయులుగారు ఆ సభను నిర్వహించారు.

ఆనాటి ఉపన్యాసకుడు ''శ్రీరామనామము ఎంతో మహత్తరమైనది. ఆ నామము జపించినా, శ్రీరామకోటి వ్రాసినా మన కష్టాలు తొలగిపోతాయి. వ్యాధి గ్రస్తులకు జబ్బులు నయమవుతాయి. బిడ్డలులేనివారికి సంతానం కలుగుతుంది. రామనామంలో వున్న మహత్తు మాటలలో వర్ణించలేము. అది ఎంతో శక్తివంతమైనది'' అని చెప్పారు.

నేను ఆ ఉపన్యాసం విన్నాను. నాకు జబ్బు నయంకాదని అందరూ పెదవి విరిచారు. అందుచేత మందులు పూర్తిగా ఆపివేసి శ్రీరామకోటి అత్యంత భక్తితో వ్రాయడమారంభించాను. నెలకు లక్షనామములు వ్రాస్తున్నాను. కొంతకాలం వ్రాసేసరికి క్రమంగా క్షయవ్యాధి నుండి విముక్తుడనైనాను. నాకే ఆశ్చర్యం వేసింది.

2 సంవత్సరాల 4 నెలలకు ఒకకోటి నామం వ్రాశాను. నాకు ఎక్కడలేని

ఆనందం కలిగింది. నాకు చచ్చిపోయి బ్రతికినంత సంతోషం కలిగింది. ఊళ్లో వాళ్లు కూడా శ్రీరామనామం వల్లనే బట్టకట్టావు అన్నారు. ఒకకోటి నామం పూర్తికాగానే వూళ్లో పెద్ద సమారాధన చేశాను. ఎద్దుబండిలో శ్రీరామకోటి పుస్తకాలు పెట్టి మేళతాళాలతో ఊరేగిస్తూ గుంటూరు పోయి శ్రీరామనామ క్షేత్రంలో వాటిని సమర్పించి వచ్చాను.

అదే రీతిలో అనుదినం రామకోటి వ్రాస్తూనే ఉన్నాను. రోజుకు వెయ్యి నామం వ్రాస్తాను. ఇపుడు నా వద్ద 2కోట్ల నామం వ్రాసి ఉన్నది. వీటిని భద్రాచలం వెళ్లి దేవాలయంలో సమర్పించాలనుకుంటున్నాను.

తరువాత నాకు వివాహమైనది. నలుగురు బిడ్డలు కలిగారు. అందరు ఆరోగ్యంగా ఉన్నారు. ఉన్నత చదువులు చదివారు. కొంతకాలం క్రిందట పిల్లల బొమ్మల రామాయణం చూచాను. నాకుగూడ రామాయణాన్ని చిత్రములుగా గీయాలనీ, ఆ చిత్రములను శ్రీరామ నామంతో అలంకారం చేయాలనీ కోరిక కలిగింది. ఆవిధంగా పెద్దసైజులో 52 బొమ్మలు రంగులతో తీర్చి దిద్దాను. వాటిలోకెల్ల సుందరాకాండ గురించిన బొమ్మలు నా హృదయానికి మహదానందం కలిగిస్తాయి.

అనుదినం శ్రీరామకోటి వ్రాసిన పిదప సుందరాకాండలో ఒక సర్గ పారాయణచేస్తాను. అశోకవనములో ఆంజనేయుని సంభాషణ నాకు చాలా ఇష్టమైనది. సాయంకాలం భగవద్గీతలో ఒక అధ్యాయం పారాయణ చేస్తాను. ఇప్పటికి 114 సార్లు గీతా పఠనం చేశాను.

నా జీవితంలో ఎపుడు కష్టం వచ్చినా శ్రీరాముని స్మరిస్తాను. అపుడు ఆంజనేయస్వామి వెన్నుతట్టినట్లు అనిపిస్తుంది. ఆ దశరథతనయుని, కోదండ రాముని స్మరిస్తే చాలు నాకు ధైర్యము ఉత్సాహము కలుగుతాయి.

## భారతీయులు

'భ' అనగా కాంతి అని అర్థం. రతి అనగా మునిగి యుండుట. భారత అనగా వెలుగులో, కాంతిలో జ్యోతిలో తన్మయుడై యుండువాడని అర్థము. భారతీయుడనగా అంధకారమును, అజ్ఞానమును వర్జించి కాంతిని వెలుగును జ్ఞానాన్ని స్వీకరించు వాడని అర్థము. అట్టి వ్యక్తులుగల దేశం భారతదేశం.

– స్వామి చిన్మయానంద

# 16. సహస్ర ఘటాభిషేకానంతరం కుంభవృష్టి

- శ్రీ వణుకూరి శూరారెడ్డి

(గుంటూరు సమీపంలోని పొత్తూరు గ్రామ వాస్తవ్యులు శ్రీ వణుకూరి శూరారెడ్డిగారు తమ అనుభవాన్ని యిలా వ్రాసినారు)

వర్షములులేక మా గ్రామంలో చేలు ఎండిపోయినవి. రైతులు ఆవేదన పడుతున్నారు. త్రాగుటకు నీరు లేక జనులు నానా యాతన పడుతున్నారు.

ఈ సంగతి మా స్నేహితుడగు పొత్తూరు సత్యనారాయణ వరప్రసాద్ (పార్ట్నర్, సత్యశ్రీ ఆగ్రో కెమికల్స్)తో చెప్పగా ''మా గురువుగారున్నారు. వారు వర్షము వచ్చుటకు దైవ ప్రార్థన ద్వారా ఏదైనా చేయవచ్చునేమో అడుగుదాము'' అన్నారు.

మేమిద్దరము శ్రీవిద్యా ఉపాసకులగు డా. ఎ.వి.ఎల్. నరసింహంగారిని గుంటూరులో కలుసుకున్నాము.

వారినీవిషయం అడుగగా ''ప్రశాంత వాతావరణములో శివాలయములో సహస్రఘటాభిషేకము చేసి వందమందికి తక్కువ కాకుండా భోజనములు పెట్టినచో తప్పక వర్షము కురియగలదని'' చెప్పారు. అందుకు మేము అంగీకరించాము.

గుంటూరుకు 6 కిలోమీటర్ల దూరములోగల పొత్తూరు గ్రామానికి వారిని తీసుకొని వెళ్లాము. 20-9-87 ఆదివారం ఉదయం 8 గంటలకు శివాలయంలో అభిషేకం చేయడమారంభించారు. 20 మంది శిష్యులు కడవలతో నీరుతెచ్చి అందించగా ఒక శిష్యుడు నామావళి చదువుచుండగా నలుగురు శిష్యులు స్వామికి అభిషేకం చేశారు.

శ్రీ నరసింహంగారు యోగ విధానమున సంధానముచేసి శివలింగమునకు ప్రక్కగా కూర్చున్నారు. ఎండ చాలా తీవ్రముగానున్నది. దూరం నుండి నీరు తెస్తున్న మిత్రులు బాగా అలసిపోతున్నారు. కాని పట్టువిడువక అభిషేకము నిరంతరాయంగా కొనసాగిస్తున్నారు. మధ్యాహ్నము 12-45ని. అయినది. ఆకాశంలో మబ్బులులేవు. తల, కాళ్లు మాడుచున్నవి. మేము వర్షము కురవదనుకున్నాము.

అభిషేకము గం.1-15ని.లకు పూర్తి అయినది. శ్రీ నరసింహంగారు గర్భగుడి నుండి బయటికి వచ్చి నిలబడ్డారు. అంతే 5 నిమిషములలో మబ్బులు కమ్ముకొని వచ్చి చక్కటి వర్షం కురిసింది. ఆ ఊరి రైతులు సమారు 400 మంది వర్షంలో తడుస్తూ గొంతెత్తి శివ నామమును గానం చేశారు. మేము ఆశ్చర్యం చెందాము. శ్రీ నరసింహంగారు చిరునవ్వుతో ''రెడ్డీ! భోజనం చెయ్యి'' అన్నారు.

''ఇంతవాన కురిసింది. కడుపు నిండింది. ఇంకా భోజనమెందుకు?'' అన్నాను. ''భోజనం కోసమే ఈ వర్షం'' అని సెలవిచ్చారు. అభిషేకము యొక్క ప్రాధాన్యతను వారు అందరికీ వర్ణించి చెప్పారు.

## కొబ్బరికాయ కొట్టడంలో అంతరార్థం

కొబ్బరికాయను కొట్టడమంటే భక్తుడు తనకు తాను దేవునికి అర్పించుకొనడమే.

కొబ్బరికాయ పిలక - అహంకారం

బెరడు - స్థూలదేహం

కొబ్బరి - సూక్ష్మదేహం

నీరు - కారణదేహం

కాయను పగులగొట్టుట - జీవత్వాన్ని వదలి శివత్వాన్ని పొందుట.

టెంకాయ పగులగొట్టిన పిదప దాని పిలకను తీస్తారు. అనగా అహంకారమును పరిత్యజించుట. జీవుడు తన సమస్తాన్ని-స్థూల, సూక్ష్మ, కారణ శరీరములతో గూడిన ఉపాధిని భగవంతునికి అర్పించుట.

# 17. వేదాద్రి క్షేత్ర మహిమ

– శ్రీ తుర్లపాటి వెంకట మల్లికార్జున వరప్రసాదరావు

కృష్ణానదీ తీరమునగల నృసింహక్షేత్రములలో వేదాద్రి ప్రసిద్ధమైనది. ఇది విజయవాడ హైదరాబాద్ ప్రధాన రహదారిలో చిల్లకల్లు కూడలికి పది కిలోమీటర్ల దూరములో నున్నది.

ఇది పంచ నారసింహక్షేత్రము. వేదాద్రి శిఖరము మీద జ్వాలా నరసింహమూర్తిగాను, కృష్ణానది గర్భమందు సాలగ్రామ నరసింహాకృతిలోను, పర్వత మధ్యమందు ఋష్యశృంగునిచే ప్రతిష్ఠింపబడిన యోగ నరసింహుడుగాను, వనదేవతా ప్రార్థనచే లక్ష్మీ నరసింహ మూర్తిగాను, సమీపములోని గరుడాద్రిపై వీరనరసింహాకృతిలోను స్వామి దర్శనమిచ్చుచున్నాడు.

యాత్రికులు తమ కోర్కెల సాఫల్యంకోసం యోగనరసింహ దేవాలయంలో ప్రదక్షిణలు చేస్తారు. కొన్ని దినములపాటు ఇచటి సత్రములలో వుండి స్వామిని సేవించి రుగ్మతల నుండి కాపాడబడిన వారి స్వానుభవములు కొన్ని యిలా వున్నాయి : ముఖ్యముగా గ్రహబాధా పీడితులు స్వస్థత పొందగలరు.

1. రిటైర్డ్ పంచాయితీరాజ్ ఇంజనీరింగ్ సూపర్వైజరు శ్రీ తుర్లపాటి వెంకటప్పయ్యగారి కుమారుడు శ్రీ నాగేశ్వరరావు ఎం.ఎస్.సి. చేసినాడు. అతడు గ్రహబాధలు, చేతబడి వలన మనస్థిమితము కోల్పోయినాడు. మదరాసులో ప్రపంచ ప్రఖ్యాతిచెందిన మానసిక వైద్యనిపుణులు శ్రీ కళ్యాణరామన్‌గారి వద్దగూడ నయముకాలేదు. ఆఖరి ప్రయత్నముగా శ్రీ స్వామివారికి ప్రదక్షిణలు చేయగా 1988లో స్వస్థత చేకూరినది. పిదప వివాహం చేసుకొని సుఖముగా నున్నాడు.

2. మహబూబాబాద్‌కు చెందిన వంగిపురపు శ్రీనివాసు చేతబడికి గురియై కుక్కవలె మొరుగుచూ అనేక అవస్థలు పడి తుదకు స్వామివారి సేవలో అచిరకాలములోనే స్వస్థత పొందారు.

3. ఖమ్మంజిల్లా మల్లన్నపాలెం గ్రామస్థుడు శ్రీ నెల్లూరు వెంకటేశ్వర్లు కుమారుడు శ్రీనివాసరావుకు నరాల బలహీనత వలన కాళ్లు, చేతులు చచ్చుబడి పోయినవి. 2 సంవత్సరముల పాటు ఎన్నో వైద్యములు చేయించారు. తుదకు హైదరాబాదు నిజాం ఆసుపత్రిలో చేర్పించి 20వేల రూపాయల ఖర్చుపడి చికిత్స చేయించినా గుణము కనిపించలేదు. అన్ని ఆశలూ వదులుకొని నైరాశ్యముతో నుండగా బంధువులలో ఒకరి సలహాపై ఆ బాలుని వేదాద్రి తీసుకొని వచ్చి భక్తితో

ప్రదక్షిణములు చేయించగా అతనికి 5 నెలలలో పూర్తి ఆరోగ్యము సమకూరినది (1987). ఇపుడా బాలుడు 7వ తరగతి చదువుకొనుచున్నాడు.

4. జగ్గయ్యపేట మండలము గండ్రాయి వాస్తవ్యుడు శ్రీ జిడుగు సీతారాములు చేతబడికి గురియై అనేక ఆసుపత్రులు, భూతవైద్యులను ఆశ్రయించినను ఫలితము లేకపోయినది. చివరి ప్రయత్నముగా స్వామివారి ఆలయములో ప్రదక్షిణలు చేసి గ్రహబాధలనుండి విముక్తి పొంది ప్రస్తుతము ఇదే దేవాలయంలో ఉద్యోగము చేయుచున్నాడు.

5. గుంటూరు జిల్లా నరసారావుపేటకు చెందిన శ్రీ డి.వి. సుబ్బారావు రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థలో డ్రైవరుగా పనిచేయుచున్నారు. ఆయనకు రెండు కాళ్లు చచ్చుబడిపోయి నడువలేని, కదలలేని స్థితిలో ఆలయమునకు వచ్చి స్వామివారిని సేవించి అనతికాలములోనే దైవకృపకు పాత్రుడై తిరిగి తన రెండు కాళ్లను పొంది మరల డ్రైవరుగా జీవనము సాగించుచున్నారు. తరచు స్వామివారిని సేవించుటకై ఇచటికి వచ్చుచున్నారు.

6. గుంటూరు జిల్లా భృగుబండకు చెందిన వేదాద్రియను భక్తుడు తీవ్రమైన కడుపునొప్పితో బాధపడుతూ రెండు పర్యాయములు మదరాసు ఆసుపత్రిలో ఆపరేషన్ చేయించుకున్నారు. అయినను బాధ నివారణకాక మూడవ పర్యాయము ఆపరేషన్ చేయించుకొనవలసిన పరిస్థితిలో చివరి ఆశగా స్వామివారిని దర్శించి, పదిరోజులిచట నివసించుటకై వచ్చి ప్రదక్షిణలు చేయుచుండగా స్వామి వారు స్వప్నమునందు సాక్షాత్కరించి, ఏ శస్త్ర చికిత్సతోనూ అవసరములేకుండా కేవలము రెండు మాత్రలు ప్రసాదించి అతనికి పూర్తి ఆరోగ్యము ప్రసాదించారు. ఏ ఆపరేషనుగాని, వైద్యముగాని లేకుండా అతి స్వల్పవ్యవధిలో కేవలం 40 రోజులలో స్వామివారి కృపతో సంపూర్ణ ఆరోగ్యము పొందిన ఇట్టి సంఘటన వైద్య చరిత్రలోనే అత్యంత ఆశ్చర్యకరమైన విషయము. ఇది 1995లో జరిగినది.

శ్రీ వేదాద్రి నరసింహస్వామి వారి మహిమను వేనోళ్లచాటు నట్టి సంఘటనలు అనేకములున్నాయి. స్వామివారిని తలచి, కొలచి, సేవించినచో వారిని శారీరక, మానసిక రుగ్మతల నుండి కాపాడుటయేగాక సంతాన హీనులకు సంతానము, గ్రహబాధలనుండి విముక్తి శ్రీ స్వామి వారు ప్రసాదించి కాపాడుచున్నారు.

## అస్పృశ్యత

అస్పృశ్యత మన సమాజంలోని అసమానతలలో అత్యంత దుఃఖకరమూ దురదృష్టమూ అయినట్టిది. అమెరికాలో బానిసత్వాన్ని నిర్మూలించిన అబ్రహాం లింకన్ ''బానిసత్వం నేరం కాకపోతే ప్రపంచంలో ఏదీ నేరంకాదు'' అన్నాడు. అదేవిధంగా ''అస్పృశ్యత తప్పు కాకపోతే ప్రపంచంలో ఏదీ తప్పుకాదు'' అని మన మందరం ప్రకటించవలసి ఉంది.

# 18. శ్రీరాముని అర్చించిన ఆంగ్లేయ కలెక్టరు

\- శ్రీ ఆకొండి రాజారావు

మద్రాసుకు 50 మైళ్ళ దూరంలో మధురాంతకం అనే క్షేత్రం వున్నది. అక్కడ శ్రీరాముడు మహేశ్వరుని గురించి తపస్సు చేసినట్లు, శ్రీరామానుజ స్వామి ఈ తావునందే తమ గురువుల అనుగ్రహంతో జ్ఞాన జ్యోతిని పొందినట్లు గాథలున్నాయి.

ఆ గ్రామంలో ఒక పెద్ద తటాకం, ఆ తటాకపు ఒడ్డున శ్రీరామాలయం వున్నాయి. వర్షఋతువులో చెరువుకు వరదలు వచ్చి ఆ ప్రాంతమంతా జలమయం కావడం వల్ల ఊరంతా మునిగిపోయి ఆస్తినష్టం, ప్రాణ నష్టం సంభవించేది.

అది తూర్పిండియా కంపెనీ పరిపాలనా కాలం. 1795 ప్రాంతంలో అవటికి కర్నల్ నెక్లీస్ అనునతడు జిల్లా కలెక్టరుగా వచ్చాడు. అతడు ఆ గ్రామానికి వరద దెబ్బ రాకుండా చేయాలని యోచించాడు. ఎంతో వ్యయ ప్రయాసలతో చెరువు మధ్యగా ఒక గోడ కట్టించి కొంత నీటిని మరొక వైపుకు మళ్ళింప చేశాడు. కాని వర్షాకాలంలో ఉధృతమైన ప్రవాహానికి తట్టుకోలేక గోడ విచ్చిపోయింది. ఒకసారి పడిపోయిన డామును మరల కట్టించాడు. మరు సంవత్సరం మరల పడిపోయింది.

చెరువు గట్టున శ్రీరామాలయం జీర్ణావస్థలో వున్నది. గ్రామస్తులు ఆలయోద్ధరణ కొరకు చందాలు వసూలు చేస్తున్నారు. అందరినీ అర్థించినట్లుగానే కలెక్టరును గూడా అర్థించారు విరాళమివ్వమని.

''అయితే ఈ చందాలు వసూలు ఎందుకోసం?'' అన్నాడు కలెక్టరు.

''జీర్ణ రామాలయోద్ధరణకు'' అని వారు జవాబు చెప్పారు.

''ప్రతి ఏటా చెరువుకు వరదలు వచ్చి పల్లె ప్రజల ప్రాణాలను బలిగొంటూ వున్నది. ఆ చెరువు గట్టునే కాపురం పెట్టుకున్న మీ శ్రీరామచంద్రుడు తనకు కాబట్ట లేదన్నట్లుగా ఉదాసీనంగా ఊరుకున్నాడే. వరద ప్రమాదం నివారించటం కోసం డాము కట్టిస్తే మీ దేవుడు డామును కూడా నిలబెట్టలేక పోయెనే. మీ రాముడే గనుక నిజంగా - మహిమ గలవాడయితే నే కట్టించే డాము కూలిపోకుండా చెయ్య మనండి చూద్దాం. అలా జరిగితే దేవాలయోద్ధరణకు కావలసిన సొమ్ము యావత్తూ నేనే భరిస్తాను'' అన్నాడు కలెక్టరు.

చందాల కోసం వచ్చినవారు ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు. డామును శ్రీరామచంద్రుడు రక్షిస్తాడని ఎవరు పూచీ పడగలరు?

ఆ వచ్చిన వారిలో ఒకరు మాత్రం సవినయంగా ''అయ్యా! మీరు నిండు మనసుతో రాముని ప్రార్థించి కార్యాచరణకు పూనుకుంటే, మీరు కట్టించే డాముకు ఎట్టి ప్రమాదం రాదు'' అని భక్త ప్రహ్లాదుని వలె పలికినాడు.

కలెక్టరుగారు ఆ సంవత్సరంలో మరల డామును కట్టించారు. యధా ప్రకారము వరదలు వచ్చినవి. డాము ఏమైపోవునో అని అందరూ తల్లడిల్లినారు.

కలెక్టరు అర్ధరాత్రి చేతి లాంతరు పట్టుకొని ఒంటరిగా చెరువు గట్టున వున్న శ్రీరాముని విగ్రహము నెదుట మోకరిల్లి ప్రార్థిస్తూ వున్నాడు. అంతట మెరుపు వంటి కాంతిపుంజము అతని కన్నులకు పొడగట్టినది. అతడు ఆనంద పారవశ్యము చెందినాడు. వరదకు డాము ఎదురు నిలిచినది. ఏదో అదృశ్య హస్తం ప్రభావం వలన వరద వెల్లువ తగ్గిపోయినది.

దేవాలయోద్ధరణ కలెక్టర్ స్వయముగా చేయించాడు. ''డాము పడిపోకుండా రక్షించిన శ్రీ సీతారాముల వారికి కృతజ్ఞత తెల్పుకొనుటకు కర్నల్ నెక్లీస్ కట్టించిన దేవాలయం'' అనే శిలాశాసనం ఇప్పటికీ సాక్ష్యంగా నిలిచి వున్నది.

## నిష్కామకర్మ

ఫలమును గూర్చి నీవెన్నడాత్ర పడవలదు. ప్రయత్నము మట్టునకే నీ పని. నీవు చేయ వలసినదంతియే. అది పూర్ణముగా చేయుటయే నీ విధి. ఫలము దైవాధీనము. అది వచ్చినా సరే రాకున్నా సరే. అట్లాచరించితివేని నీకు దుఃఖమెక్కడిది? నీకు నిరుత్సాహమెక్కడిది? నీకు ధైర్య శూన్యత యెక్కడిది?

నీవు నీ భార్యను ముద్దిడుకొందువు. తిరుగ నీ భార్య నిన్ను ముద్దిడుకొనకున్న యెడల మూతి ముడుచుకొందువు. నీవు నీ కుమారుని ప్రేమింతువు. అట్టి పుత్రుడు నీ యెడల తటస్థముగా నున్న యెడల నీవు గ్రుడ్లాడదీసుకొందువు. నీవొకన్ని కష్టకాలమున రక్షింతువు. అతడు నీయెడ కృతజ్ఞుడుగా నుండకపోయిన యెడల అతనిని తిట్టుదువు. చేసిన కర్మమునకు ప్రతిఫలమపేక్షించుట చేతనే దుఃఖము కలుగుచున్నది. సృష్టిలోని జీవులెల్లరు నీ సోదరులు. వారిని త్రికరణ శుద్ధిగా ప్రేమింపుము. వారి వలన తిరిగి ఫలమును కోరకుము.

పుష్పములు వికసించి పరిమళమును వాయువునందంతట వెదజల్లి రాలిపోయినట్లు ఫలాపేక్ష శూన్యుడవై కర్మల నాచరింపుము.

– పానుగంటి లక్ష్మీనరసింహారావు

# అధ్యాయము - 7

# బహు దేవతారాధన

## 19. సగుణారాధన

- శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకటనరసయ్య

(బహుగ్రంథకర్తలు, శ్రీరామ భక్తాగ్రేసరులు స్వర్గీయ శ్రీకుందుర్తి వేంకట నరసయ్యగారితో ఇష్టాగోష్ఠి)

ప్రశ్న : మనదేశంలో శైవము, వైష్ణవము, శాక్తేయము అనే పేర్లతో వేరు వేరు ఆరాధనా విధానాలున్నాయి. దేవుడు ఒక్కడే అయినపుడు ఇన్ని తేడాలు ఎందుకు వచ్చాయి?

జవాబు : మంచి ప్రశ్న అడిగారు. నిదానంగా చెపుతాను వినండి.

ప్ర : హిందూమతంలో ఏకేశ్వరోపాసనలేదనీ, పలువురు దేవుళ్లను ఉపాసించడం హిందూమతంలో మినహా మరేమతంలోను లేదని, అసలీ బహుదేవతారాధనే తప్పు అనీ పలువురు విమర్శిస్తుంటారు. అందుచేత మీ నుండి దీనికి తగు సమాధానం రాగలదని ఆశిస్తున్నాను.

జ : మనమతంలో నిర్గుణుడూ నిరాకారుడూ అయిన పరమాత్మను ఆరాధిస్తాం. మంత్ర పుష్పంలో వర్ణింపబడిన దివ్యశక్తి ఆయనే. వేదములు వర్ణించేది ఆయననే.

ప్ర : మరి ఇక సగుణోపాసన ఎందుకు? ఆ పరమాత్మనే ఉపాసిస్తే బాగుండును గదా?

జ : రూపరహితుని ఆరాధించడం ఆచరణలో కుదిరేది కాదు. కళ్లు మూసుకొని ధ్యానం చేయాలంటే ఏదో ఒక రూపం మనసులోకి రావాలి. క్రైస్తవులకు శిలువ, మహమ్మదీయు లకు చంద్రవంక, పార్శీలకు అగ్ని, ఇలా ఏవో కొన్ని సంకేతాలున్నాయి. ఏ సంకేతము లేకుండ ధ్యానించే వీలులేదు. మేము ఏ రూపాన్ని పూజించము అనే వాళ్లుగూడ ఏదో ఒక సంకేతాన్ని మనసులో పెట్టుకోక తప్పదు.

ప్ర : ఐతే మనవాళ్లు ఏఏ సంకేతాలను స్వీకరించారు?

జ : మన ఆరాధనా విధానానికి మూలం పంచభూతాలు. మన ఆయుర్వేద

శాస్త్రానికి, మన ఆలోచనా విధానానికి మౌలికమైన ప్రాతిపదిక ఈ సృష్టి పంచ భూతముల వలన ఏర్పడిందనేది. దీన్ని అర్థం చేసుకోక పోతే మనమతం అర్థం కాదు.

ప్ర : **భూతములు అంటే దయ్యములో భూతప్రేతములో అనే మాట తరచు వింటూవుంటాము.**

జ : కాదండీ, పొరబాటు పడకండి. భూతములు అంటే ఇంగ్లీషులో (elements) అంటారు. ఐదు ప్రాథమికమయిన అంశములతో ఈ సృష్టి ఏర్పడింది. అవి ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి. ఈ ఐదింటిని పంచభూతములంటారు. మన శరీరంలో ఈ ఐదూ వున్నాయి. సృష్టి ఏర్పడిన విధము ఇది : ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము, జలము నుండి పృథ్వి ఏర్పడ్డాయి. ఇందులో ఒకదానికంటే మరొకటి ఘనత్వము కలిగివుంటుంది.

ప్ర : **వీటికీ ఆ పరమాత్మకూ సంబంధమేమిటి?**

జ : ఆకారములేని భగవంతుడు ప్రకృతి అనే రూపము దాల్చి మనకు కనిపిస్తున్నాడు. ''ప్రకృతింస్వాం అధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా'' - నాయొక్క మాయ చేత ప్రకృతి నాశ్రయించి రూపం దాలుస్తానని భగవద్గీతలో చెప్పియున్నాడు. పంచభూతములే ప్రకృతిలోని మూలద్రవ్యములు. ఇవి కాక మనస్సు, బుద్ధి, అహంకారము (అహంకారమంటే ego కాదు. అహంకారమంటే individual I)అనే మూడున్నాయి. ఎనిమిదింటితో గూడిన ఆలోచనలే మన హిందూమతానికి అనగా సనాతన ధర్మానికి మూల స్తంభములు. మానవుడు ఈ అష్ట ప్రకృతులను కలిగియున్నాడు.

ప్ర : **దేవుళ్లు ఎలా ఏర్పడ్డారు?**

జ : అదే చెప్పబోతున్నాను. పరమాత్మ పంచభూతముల ద్వారా ఈ సృష్టిని జరిపించాడు. పరమాత్మకు రూపంలేదు. పంచభూతములనే దుస్తులను ధరించి మనకు సాక్షాత్కరిస్తున్నాడు. ఒక్కొక్క ఆకారంలో ఒక్కొక్క పేరుతో పిలువబడ్డాడు.

ప్ర : **ఏఏ పేర్లు ఎలా వచ్చాయో విశదీకరిస్తారా?**

జ : ''ఆకాశస్యాధిపో విష్ణుః
ఆగ్నేశ్చైవ మహేశ్వరి
వాయూ సూర్యః క్షితిరేశః
జీవనస్య గణాధిపః''

అని చెప్పబడినది. ఆకాశం విష్ణువు; అగ్నియే శక్తి; వాయువు సూర్యుడు; పృథ్వి ఈశ్వరుడు; జలము గణాధిపతి - ఇలా ఐదు పేర్లతో ఉపాసింపబడుచున్నారు.

ప్ర : మరి కాస్త వివరిస్తారా?

జ : ఆకాశము అనగా space సర్వవ్యాపకమైనది. నీలవర్ణముగలది. విష్ణువు గూడ వ్యాపించువాడు. నీలవర్ణుడు. ఆకాశ లక్షణం శబ్దం. అట్లే విష్ణువుగూడ సంకీర్తనల ద్వారా శబ్దం ద్వారా ఉపాసింపబడుతాడు.

అట్లే అగ్ని ఎరుపు రంగు గలది. అగ్ని అంశతో 'శక్తి' ఏర్పడినది. శక్తిని ఉపాసించువారు కుంకుమ, ఎర్రని పూలు, ఎర్రని వస్త్రములతో పూజిస్తారు. ఎర్రని పండ్లు, పులిహోర నైవేద్యం పెడతారు.

వాయువు అంశగల దేవత సూర్యుడు. ఇతడు బంగారు వర్ణము గలవాడు. హిరణ్యగర్భుడని పేరున్నది. సూర్యునిలో వాయువులున్నట్లు అందరెరిగినదే.

పృథ్వి అంశగల దేవుడు శివుడు. ఇతడు ధవళ వర్ణముగలవాడు. ఇతనిని పృథ్వి నుండి వచ్చిన జలముతో అభిషేకము చేస్తారు. పూలతో, దళములతో పూజిస్తారు.

జలము యొక్క అంశతో గణపతి ఏర్పడ్డాడు. ఇతడు జలతత్వం గలవాడు. అందుకే పూజ అనంతరం గణపతిని నీటిలో నిమజ్జనం చేస్తారు.

ఒక్కొక్క కల్పంలో ఒక్కొక్క దేవత పై విధంగా ఏర్పడ్డారు.

ప్ర : మరి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లెవరు?

జ : మనుష్యుని ప్రకృతులలో పంచభూతములుగాక మనస్సు, బుద్ధి, అహంకారము (Individual I)అనునవి వున్నాయి. మనస్సు బ్రహ్మకు, బుద్ధి విష్ణువునకు, అహంకారము రుద్రునికి ప్రతీకలుగా వున్నాయి. అవియే సృష్టి, స్థితి, లయము (విలీనము)లను జరుపుతూ వుంటాయి.

ప్ర : మీరు చెప్పిన ఐదుగురు దేవతలను భారతదేశములోని వివిధ ప్రాంతములలో ఆరాధిస్తున్నారు. కాని ఈ ఐదింటి యొక్క సమైక్య రూపాన్ని ఆరాధించే ప్రక్రియ ఏదైనా వున్నదా?

జ : ఉన్నది. పంచభూతముల సమైక్య రూపముగా 'గాయత్రి'ని ఉపాసిస్తారు. పంచముఖీ గాయత్రీ ధ్యాన శ్లోకంలో ఈ సంగతి తెలుస్తుంది.

''ముక్తావిద్రుమ హేమనీల ధవళచ్ఛాయైర్ముఖై స్త్రీక్షణైః'' అనే శ్లోకంలో ఈ విషయం గ్రహించవచ్చు.

ప్ర : మనది సనాతన ధర్మంగదా; క్రైస్తవమతం, మహమ్మదీయ మతం ఏర్పడక పూర్వం సనాతనమతమే ప్రపంచంలో వున్నదిగదా, అలాంటప్పుడు ఈ ఐదుగురు దేవతలలో ఎవరినైనా ఇతర దేశాలలో ఉపాసించే పద్ధతి వున్నదా?

జ : ఉన్నది. ముఖ్యంగా ఇస్లాం రాకముందు ఈజిప్టు దేశంలో సూర్యోపాసన వున్నది.

ప్ర : అవునండి. మీరు చెప్పినది నిజమే. చరిత్రలో ఈ విషయం చెప్పబడి నది. ప్రాచీన కాలంలో ఈజిప్టు దేశీయులు 'రా' అను పేరుతో సూర్యుణ్ణి ఆరాధించారు. తమ రాజు సూర్య వంశపు వాడని భావించారు. క్రీ.పూ. 1375-1358 లలో పరిపాలించిన 'అఖ్‌నాటన్' అనురాజు సూర్యుని మినహా ఇతర దేవతలను పూజించరాదని శాసించాడు. అంతేగాక 'ఆత్మ' నశించదనే విశ్వాసం వారికుండేది.

జ : అలాగే, అరేబియా దేశంలో మహమ్మద్ ప్రవక్తకు పూర్వం శివపూజ జరిగేది. మక్కాలో 'మక్కేశ్వరలింగం' అనే శివలింగం ఉండేది. మక్కాలోని కాబా శివలింగమే. శివుని తలమీది చంద్రుడు మహమ్మదీయులకు పవిత్ర చిహ్నమయి నది. అరేబియాలో ఇంటింటికీ ఒక దేవత వూరికొక దేవత ఏర్పడడం మీద వ్యతిరేకత ఏర్పడి ఏకేశ్వరోపాసన కొరకు మహమ్మదీయ మతం వచ్చింది.

ప్ర : వినాయక, విష్ణు పూజ లెక్కడైనా వున్నాయా?

జ : ఉత్తర అమరికాలోని మెక్సికో దేశంలో వినాయక విగ్రహాలు లభించాయి. అక్కడ గణపతిపూజ జరిగేది.

ప్ర : మీరు చెప్పిన ఈ విషయం దివాన్ చమన్‌లాల్ అను చరిత్రకారుడు Hindu America అనే గ్రంథంలో వ్రాశాడు. అంతేగాక వివేకానంద రాక్ మెమోరియల్ కమిటీ ప్రచురించిన "India's contribution to world thought" అనే గ్రంథములో ఇతర దేశాలలో గణపతి పూజ ఎక్కడెక్కడ వుండేదో వివరించారు. ముఖ్యంగా ఆఫ్ఘనిస్తాన్, నేపాల్, టిబెట్, భూటాన్, మంగోలియా, సింహళం, బర్మా, థాయిలాండ్, కంబోడియా, చైనా దేశాలలో ఉండేదని ఆయాచోట్ల లభించిన వినాయక విగ్రహాలను ఫోటోలతో సహా ప్రచురించారు.

జ : శివ, విష్ణు శక్తి పూజలు ఎక్కడైనా ఉన్నట్లు వ్రాశారా?

ప్ర : థాయిలాండ్‌లో శైవమతము విరివిగా ఉన్నట్లు వ్రాశారు. బర్మా దేశంలోని మిన్‌పాగన్ అనేచోట విష్ణుదేవాలయం వున్నది. దాని ఫోటో కూడా ప్రచురించారు. శైవం ఉన్నచోట్ల అమ్మవారి పూజలు కూడా ఉన్నాయి.

జ : సంతోషం, ప్రపంచంలో ఒకప్పుడు మన ఉపాసనా మార్గాలు అనేక దేశాలలో ఆచరణలలో ఉన్నాయని మీరు చెప్పిన గ్రంథం ద్వారా తెలుస్తుంది.

ముఖ్యంగా విష్ణు, సూర్య, శక్తి, వినాయక, శివ పూజలు పంచభూతములకు సంకేతంగా ఏర్పడ్డాయనే మూల విషయాన్ని మీరు వివరించి చెప్పారు. ధన్యవాదాలు.

-(ఫిబ్రవరి *1989*)

బానిసకు బాధలెక్కువ, స్వతంత్రుడికి బాధ్యత లెక్కువ.
- జిల్లెళ్ళమూడి అమ్మ

# ౨౦. బహు దేవతారాధనలోని ఆంతర్యం

- శ్రీ వడ్లమూడి వెంకటేశ్వరరావు, ఎం.ఎస్.సి.

(ఇదివరలో గుంటూరు హిందూ కళాశాలలో గణితశాస్త్రాధిపతి, తంత్ర విజ్ఞానపరిషత్ కార్యదర్శి, శ్రీ వడ్లమూడి వెంకటేశ్వరరావుగారితో ఇష్టాగోష్ఠి)

ప్ర : మనం హిందువులం. మనం విగ్రహారాధకులం, అనేకమంది దేవుళ్ళను పూజిస్తున్నాం. ఒక దేవుడుగాదు. శివుడు, విష్ణువు, వెంకటేశ్వరుడు, పైగా వీరందరికీ భార్యలు. ఆంజనేయస్వామి ఉన్నాడంటే ఒక ముఖము, మూడు ముఖములు, పంచముఖములు. వీళ్ళుగాక నవగ్రహాలను పూజిస్తాం. సర్పాలను పూజిస్తాం. అంతటితో ఆగక అగ్ని, వాయువు, వరుణుడు, ఇంద్రుడు వగైరా దేవతలను ఎందరినో పూజిస్తాం. ఈ విగ్రహాములకు ఒక అంతూ పొంతూ లేకుండావున్నది. ఎవరిని ఎందుకు పూజించాలో తెలియకుండా వున్నది. అన్నిటి కంటే ముందు గణపతి పూజ. మరి ఇలా బహుదేవతారాధన ఎందుకు వచ్చిందీ అని?

జ : అడగండి. ఇంకా ఏమైనా గూడ అడగండి.

ప్ర : ఇది 20వ శతాబ్దం. దేనినీ ప్రజలు గ్రుడ్డిగా ఒప్పుకోరు. ప్రశ్నిస్తారు. వాటికితగిన సమాధానాలను మీలాంటివారు చెప్పాలి. ఈదేవుళ్ళు, దేవతలనేగాక శ్రీరామకృష్ణ పరమహంస, షిర్డీసాయిబాబా, రాఘవేంద్రస్వామి లాంటి గురువులను గూడా దేవుళ్ళుగానే భావించి దేవాలయాలు కట్టి ఆరాధిస్తున్నాం. దీనికి కారణమేమిటి? ''భక్తుల క్లేశములు తొలగుచున్నాయి. అందుచేత వాళ్ళు బహుదేవతలను ఆరాధిస్తున్నారు'' అనేది తిరుగులేని జవాబు. ఈ జవాబుతో నేను తృప్తి పడను. మీరు ఆధునిక విజ్ఞానము, ప్రాచీన శాస్త్ర పాండిత్యము గలిగిన మేధావులు గనుక మీరు చెపితే తెలుసుకోదలచాను.

జ : ఇంతేనా, ఇంకా ఏమైనా వున్నవా?

ప్ర : ప్రస్తుతానికి ఇంతేననుకోండి. అటు క్రైస్తవ మహమ్మదీయమతాలలో నిర్గుణోపాసన వున్నది. భగవంతుని ఒక నిరాకారమైన శక్తిగా భావించి ఉపాసిస్తారు. మనకంటే వాళ్ళ మార్గమే ఉత్తమమైనదేమో?

జ : మీ ప్రశ్నలు అనేకమంది హిందువుల మనస్సులనుగూడ కలవరపరుస్తు న్నాయి. అందుచేత నాకు తెలిసినంతలో జవాబులు చెప్పి మీ సందేహ నివృత్తి చేస్తాను.

ప్ర : తప్పక చెప్పండి.

జ : క్రైస్తవ, మహమ్మదీయ మతాలలో నిర్గుణోపాసన వున్నమాటనిజమే. కాని వాళ్లు గూడ కళ్ళుమూసుకొని దేవుని ధ్యానించినపుడు శిలువను చంద్రకళను సంకేతములుగా పెట్టుకుంటారు. ఒక విధంగా అవే వాళ్ళు స్మరించే దైవప్రతీకలు. కనుక అదిగూడా మూర్తి పూజ అవుతుంది.

ప్ర : అవుననుకోండి.

జ : ఇకపోతే హిందూ మతంలో విగ్రహారాధన రూపంలో సగుణారాధన వున్నది. కాని దీనితోబాటు నిర్గుణ నిరాకారుని ఆరాధన కూడా వున్నది. రెండిం టికీ హిందూమతంలో స్థానమున్నది.

ప్ర : ఎలా వున్నది?

జ : సన్యాసులు,సర్వసంగ పరిత్యాగులు నిరాకారుడైన పరమాత్మను ధ్యానిస్తారు. వాళ్లు విగ్రహాలను పూజించరు. ఓంకారమనెడి ప్రణవనాదోపాసనలో లీనమవుతారు. రోజుకు కొన్ని వేలసార్లు ప్రణవాన్ని జపించవలసి వుంటుంది. కేవలం ఓంకారాన్ని మాత్రమే వాళ్ళు ధ్యానిస్తారు.

అగ్ని గాని,పూజా ద్రవ్యాలుగాని విగ్రహాలుగాని అవసరం లేదు. ఇది నిర్గుణ పరబ్రహ్మను ఉపాసించడం.

ప్ర : మరి ఇదే పద్ధతిలో అందరూ చేయవచ్చునుగదా. మనం గూడ ఏకేశ్వరోపాసకులం కావచ్చును గదా?

జ : ఆగండి చెపుతాను. భగవద్గీతలో చెప్పినట్లు భక్తులు నాలుగు రకాలుగా వున్నారు. వారు ఆర్తి, ఆర్థార్తి, జిజ్ఞాసువు, జ్ఞాని అని. సన్యాసి జ్ఞాని క్రిందకు వస్తాడు. మనం మిగతా మూడు రకాలలోకి వస్తాము. మనం గనక కేవలం ఓంకా రాన్ని జపిస్తే సంసార బంధముల నుండి దూరమై వైరాగ్యం పొందుతాము. అందు చేత అట్లుచేయక ఓంకారాన్ని మరొక మంత్రంతోనో నామంతోనో జత చేసి చదు వుతాము.

ప్ర : సన్యాసులు కానటువంటి సామాన్య ప్రజలు ఎలా ఆరాధించాలి?

జ : ఐహిక కోరిక లేనివాడు సన్యాసి. అందుచేత అతడు నిరాకారమును

ఆరాధించగలడు. మనకు ఐహికవాంఛలున్నాయి, క్లేశములున్నాయి. అందుకే మనం ఆర్తి, ఆర్థార్తి, జిజ్ఞాసువు, అనే పేర్ల క్రిందికి వస్తాము. మన యొక్క కోరికలకు తగినటువంటి దేవతలనారాధిస్తాము.

**ప్ర : పోనీ మనం గూడా ఒక శివుణ్ణో, విష్ణువునో ఆరాధించవచ్చుగా? ఇందరు దేవుళ్ళూ, ఇన్ని పేర్లు ఎందుకు?**

జ : చాలామంచి ప్రశ్న అడిగారు. ఇందుకొక ఉదాహరణ చెపుతాను. భగవంతుడనగా కాంతి అనుకుందాం. సూర్యకాంతి, చంద్రకాంతి, విద్యుత్‌కాంతి, బ్యాటరీకాంతి, ఇలా వేరు వేరు ప్రయోజనాలు కలిగించే అనేక కాంతులున్నాయి. అలాగే భగవంతుడనగా జ్ఞానము అనుకుందాం. నిరక్షరాస్యులకు విద్య అనగా అక్షర జ్ఞానం మాత్రమే. కాని విద్య అనెడి పెద్ద ఆవరణలోకి ప్రవేశించినవాడికి లోపల ఆర్థిక శాస్త్రం, భాషాశాస్త్రం, భౌతికశాస్త్రం, గణితశాస్త్రం, రసాయనిక శాస్త్రం వగైరా అసంఖ్యాకమైన శాస్త్రాలున్నాయి. అలాంటిదే బహుదేవతల ఉనికి గూడాను. మనం ఏ లక్ష్యంకోసం ఆరాధిస్తామో దాన్నిబట్టి దేవతలను భావించడం జరిగింది.

**ప్ర : ఇంతమంది ఎలా ఏర్పడ్డారు? ఒక్క విష్ణుమూర్తే నృసింహస్వామిగాను, శివుడే దక్షిణామూర్తిగాను, ఇలా బహునామములు ఎలా వచ్చాయి?**

జ : నిర్గుణుడైన పరమాత్మ సృష్టికొరకు సత్వ, రజో, తమో గుణములుగా విడిపడ్డాడు. ఆయా గుణములకు ప్రతీకలుగా బ్రహ్మ, విష్ణు, శివరూపములు భావించబడ్డాయి. ఆ తరువాత కొంత రజోగుణం కొంత తమోగుణం కలయిక, కొంత సత్వగుణం కొంత రజోగుణం కలయిక, ఇలా వేరు వేరు పాళ్ళలో ఆయా గుణముల కలయిక వలన మరికొందరు దేవతలావిర్భవించారు. ఉదాహరణకు రజస్సులో సత్వం వలన నారాయణుడు రాగా, రజస్సులో తమస్సు వలన నారసింహం ఆవిర్భవించింది. ఇలాగే తమస్సులో సత్వం వలన పరమశివుడు, తమస్సులోరజస్సు వలన దక్షిణామూర్తి ఆవిర్భవించారు.

**ప్ర : ఇలా వివిధ గుణముల తేజోరాశుల వలన ఆయా దేవుళ్ళు ఏర్పడితే మానవుడు ఏమి చేయాలంటారు?**

జ : ఫలానా సిద్ధి కొరకు ఫలానా దేవతను ఉపాసించాలి. ఆరోగ్యము కొరకు సూర్యుని, జ్ఞానము కొరకు దక్షిణామూర్తిని, క్రియాశక్తి కొరకు గణపతిని, సంపద కొరకు లక్ష్మిని - ఇలా ఉపాసించాలి.

ప్ర : వీరంతా వేరు వేరా?

జ : అందరూ మూలములో ఒకటే - ఒకే ప్రభుత్వంలో విద్యాధికారి, రక్షణశాఖాధికారి, న్యాయాధికారి వున్నట్లు.

**ప్ర : మరి శ్రీ రామకృష్ణ పరమహంస, షిర్డీసాయిబాబా, రాఘవేంద్రస్వామి, రమణమహర్షిలాంటి వారు మానవులు గదా! వాళ్ళను దేవుళ్ళుగా పరిగణించి పూజిస్తారేమిటి?**

జ : వాళ్ళు సిద్ధపురుషులు. ప్రజల ఆధ్యాత్మిక వికాసం కొరకు అవతరించిన భగవదంశ గల పూర్ణ పురుషులు. 'నా' అనేది లేనివారు. వాళ్ళు గురువులు. అందుచేతనే గురువారం నాడు వారిని ఆరాధిస్తాం. వారు సమాధి చెందినా వారి ఆత్మలు భక్తులకు మార్గం చూపుతాయి. వారు దేవునికి మానవునికి నడుమ వారధి వంటివారు. ఒకవిధంగా చెప్పాలంటే భగవంతుడు, గురువు, నీలో వున్న ఆత్మ - ఈ మూడు ఒకే దాని రూపాలు. అందుచేత గురువులను గూడ పూజిస్తాము.

**ప్ర : మంచిదే, మరి వాయువు, అగ్ని, వరుణుడు మొదలైన వాటిని గూడ దేవతలుగా భావించి ఆరాధిస్తామెందు వలన? ఇది ఎలా సమర్థనీయము?**

జ : వాటిలో 'శక్తి' ఉన్నది గదా. శక్తిరూపములైన వాటిని దైవములుగా ఆరాధిస్తున్నాం. ఏదైతే మానవ శక్తికి అతీతమో అదంతా దైవత్వమే. దేవుడు అనేటువంటి నాలుగు భుజములుగల పురుషుడు ఎక్కడో వున్నాడనుకోవడం తప్పు. ప్రకృతి శక్తులలో గల చైతన్య పదార్థాన్ని మనం ఆరాధిస్తున్నాం.

**ప్ర : అలా ఆరాధిస్తే ఇదంతా వెట్టి అని ఇతరులు విమర్శించరా?**

జ : తెలియనివాళ్ళు విమర్శిస్తారు. తెలిసినవాళ్ళు విమర్శించరు. ఎందుకంటే ఫలితాన్ని బట్టి ఒక ప్రక్రియ యొక్క సత్యము ఋజువవుతుంది. ఎక్కడో ఉపన్యసిస్తున్న వ్యక్తి ఇక్కడ కనపడడం వెట్టి లాంటిదే. కాని టెలివిజన్‌లో ఆ ఉపన్యాసకుని చూచినపుడు అందరి సత్యం ఒప్పుకోక తప్పదు. అలాగే ఆయా దేవతా మూర్తులను ఉపాసించి ఫలితములను సాధించిన వారుండడం వలన ఆయా దేవతలను ఒప్పుకోవలసి వస్తుంది.

**ప్ర : ఏదీ ఒక ఉదాహరణ చెప్పండి?**

జ : విజయనగరంలో ఒకమారు వర్షాలులేక జనులకు త్రాగే నీరు లేక బాధపడుతుంటే తన తల్లి ఆనతి మీద శ్రీ ఆదిభట్ట నారాయణదాసుగారు ఒక రోజు ఉపవాసముండి వరుణ జపం చేసి మరునాడు మార్కండేయ హరికథ చెపితే కుండపోతగా వర్షం కురిసిందని వారు స్వీయచరిత్రలో పేర్కొన్నారు.

''విగ్రహారాధన వలన రామకృష్ణ పరమహంస లాంటి మహావ్యక్తి తయారైతే, నేను ఒకటికాదు వంద విగ్రహాలనైనా పూజిస్తాను'' అని స్వామి వివేకానందుడన్నాడు.

ప్ర : దేవతలకు భార్యల నేర్పరిచారేమిటండీ?

జ : పురుష ప్రకృతుల సంయోగమే ఈ సృష్టి. విష్ణువు జడము. ఆయనలోని చైతన్య శక్తియే వైష్ణవి. స్త్రీ పురుష భావనకు అతీతమైనది పరమాత్మ.

ప్ర : నాకు ఏమి అర్థమయిందంటే, మీరు చెప్పినదానినిబట్టి. ఈ సృష్టి యావత్తు చైతన్య శక్తితో నిండియున్నది. మనిషి మనస్సు గూడా ఒక చైతన్య కేంద్రము. ఈ కేంద్రమును మిగతా శక్తి కేంద్రములతో ధ్యానమనెడి తీగె ద్వారా కలపి వేయడం ఎలాగో మతం బోధిస్తుంది. మిగతా శక్తికేంద్రాలు అనేక దేవతా మూర్తులు, పంచభూతాలు మొదలైనవి. శరీర భ్రాంతి తగ్గించుకొని మానసిక ఏకాగ్రత ద్వారా తన క్లేశములను తొలగించుకొని మానవుడు ఆత్మజ్ఞానము పొందుతాడు. అయితే మరొక సందేహం. ఈ ఉపాసనా ప్రక్రియల మీద ఆధారపడి మానవుడు క్రియాశీలత కోల్పోయి ప్రపంచ వ్యవహారములలో వైఫల్యం చెందుతాడేమో?

జ : దైవ ప్రార్థన చేయడం తనలోని చైతన్యశక్తిని ఇనుమడింప చేసుకోడానికేగాని తాను నిష్క్రియుడైపోయి అంతా దేవుడే చేసి పెడతాడని అనుకోవడానికి కాదు. చేయునది తాను, చేయించేవాడు భగవంతుడనే భావన కలగాలి.

ధన్యవాదాలు వెంకటేశ్వరరావుగారూ!

*(1987 ఏప్రిల్)*

## విజయము

విజయం పొందడానికి ఒకే ఒక రహస్య మేమిటంటే - వివిధ విషయాలను నీయొక్క దృక్కోణం నుండి మాత్రమేగాక ఎదుటివారి దృష్టి కోణం నుండి గూడ పరిశీలించే సామర్థ్యాన్ని పెంపొందించుకోవాలి. అందులోనే విజయ రహస్యం ఇమిడి ఉన్నది.

— హెన్రీ ఫోర్డు

# అధ్యాయము - 8

# వేదములు -పురాణములు

## 21. వేదములలో ఏమున్నది?

- శ్రీ ఎస్.వి. ఎస్. సోమయాజి, బి.కామ్, ఎఫ్.సి.ఎ.

(గుంటూరు హిందూ కళాశాల పాలక వర్గ కార్యదర్శి, శ్రీ విద్యా ఉపాసకులునగు శ్రీ ఎస్.వి.ఎస్. సోమయాజిగారితో ఇష్టాగోష్ఠి)

ప్ర : వేదమంటే ఏమిటి?

జ : వేదమనేది బ్రహ్మతత్త్వము యొక్క అపారరాశి. మంత్రద్రష్టలయిన మహర్షుల ద్వారా ఆవిష్కరింపబడిన సత్యవాక్య సమూహమది. సకల లోకములకు క్షేమమును, సమాజమునకు చక్కని జ్ఞానమును, విజ్ఞానమును, శాంతిని అందించు ఉత్తమ గ్రంథ సముదాయము. ఇష్ట ప్రాప్తికీ, అనిష్ట పరిహారమునకును తగు లౌకిక అలౌకిక ఉపాయములను తెలియచేయు విజ్ఞాన సంపద.

ప్ర : మంత్ర ద్రష్టలనగా ఎవరు?

జ : మంత్రద్రష్టలనగా తమ తపోధ్యానములో అలౌకిక శబ్దాలను విని, మననము చేసి, దేవతా సాక్షాత్కారము పొంది, దివ్య సందేశములను గ్రహించి, మానవ కళ్యాణము కొరకై ఆయా మంత్రములను పొందుపరచినవారు. అందువలన ప్రతి వేద మంత్రమునకును ఒక ఋషి వుంటాడు.

ప్ర : వేదములను అర్థము చేసుకొనుట ఎట్లు?

జ : వేదమంత్రములను స్వరయుక్తముగా ఉచ్చరిస్తేనేగాని తగు శక్తి ఉత్పన్నము కాదు. ఇదియే ఉదాత్త, అనుదాత్త, స్వరితములు లేక పైకి, క్రిందకి, మధ్యమ స్వరములతో పలుకుట. వేదములనధ్యయనం చేసేవారికి వేదోచ్చారణ తెలియడం అవసరము. తరువాత వేదార్థమును గ్రహించుటకు ఆరు వేదాంగములను అభ్యసించాలి. అవి శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిష్యము.

ప్ర : వేదాంగముల ప్రాధాన్యమేమిటి?

జ : వేదమంత్రములను పఠించుపద్ధతులను తెలుపునది 'శిక్ష'.

యజ్ఞయాగాదులను చేయు పద్ధతులను తెలుపునవి 'కల్పములు'. వేదమంత్ర శబ్దములలో పద స్వరూపమును గ్రహించి అర్థ నిశ్చయమును పొందుటకు ఉప యోగించునది 'వ్యాకరణము'. వాక్యములను ఒక రీతిలో ఉచ్చరించుటకు ఉపక రించి అధ్యయనమును నడిపించేది ఛందస్సు.

వాక్యములకు తప్పుడు అర్థము రాకుండా పదముల నిర్వచనము చేసేది 'నిరుక్తము'. యజ్ఞములను చేయు సమయములను, దేవతల యొక్క స్థానము లను తెలుపునది జ్యోతిష్యము. ఈ ఆరింటిని బాగుగా అధ్యయనం చేస్తే తప్ప వేదమంత్రముల అర్థము గ్రాహ్యము కాదు.

ప్ర : వేదార్థములను గ్రహించిన మహనీయులెవరెవరు?

జ : ఈ షడంగముల ఆధారముతో వేదార్థమును ప్రతిపాదించిన భాష్యకా రులు 25 మంది వున్నారు. వారిలో సాయణుడు, మాధవుడు, యాస్కుడు, ఉవటుడు, ఉద్గీషుడు, స్కందస్వామి అనువారు ప్రసిద్ధులు.

ప్ర : భారతమును పంచమ వేదమంటారు ఎందుచేత?

జ : వేదములో చెప్పబడిన ధర్మమును, తత్త్వమును,సంస్కృతిని జీవనా డిగా పెట్టుకొని వాటిని ఉపాఖ్యానములలో అన్వయించి సామాన్యులకు అందు బాటులో నుండునట్లు చెప్పడా నికి రామాయణము, భారతము, పురాణములు ఏర్పడినవి. ఉదాహరణకు ''మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్య దేవోభవ'' అను వేదమంత్రమునకు గరుత్మంతుని మాతృభక్తి, శ్రీరాముని పితృభక్తి, శ్రీకృష్ణుని గురుభక్తి ఉదాహరణలు. సత్యమేవ జయతే అను ఉపని షద్వాక్యము నకు హరిశ్చంద్రోపాఖ్యానము తార్కాణము.

ప్ర : వేద విజ్ఞానము పొందుటకు అర్హతలు విధింపబడినవా?

జ : వేదార్థమును గ్రహించుటకు బుద్ధిసూక్ష్మత కావలయును. మంద బుద్ధులకు అల్పబుద్ధులకు అర్థమగుట దుర్లభము. రజోగుణతమోగుణము అధిక ముగా గలవారు సమాజ శ్రేయస్సునకుగాక సంకుచిత ధోరణిలో ఈ విద్యను దుర్వి నియోగ పరుచు ప్రమాదమున్నది. అందువలన అర్హతాధికారమును నిర్ణయించు వాడు గురువు మాత్రమే.

ప్ర : వేదములు ఎన్ని?

జ : వేదమంతా ఒకే రాశి. సౌలభ్యము కొరకు వ్యాస మహర్షి వేదమును

ఋక్కులు, యజస్సులు, సామలు అనుమంత్రములుగా వర్గీకరించినాడు. వేదములకు పరిశిష్టములగు బ్రాహ్మణములు, అరణ్యకములు గూడా వేదభాగములే.

**ప్ర : వేదములలో ఎన్ని శాఖలున్నవి? ఇప్పుడెన్ని లభించుచున్నవి ?**

జ : ఒక్కొక్క వేద శాఖకు కొన్ని ఉపశాఖలున్నవి. చాల శాఖలు ఆదరణ లేక కాలగర్భములో కలిసిపోయినవి. ప్రస్తుత పరిస్థితి ఇలా వున్నది.

| | వేదం | ప్రధాన శాఖలు | అదృశ్యమైనవి | ప్రస్తుతం మిగిలినవి |
|---|---|---|---|---|
| 1. | ఋగ్వేదము | 21 | 19 | 2 |
| 2. | కృష్ణ యజుర్వేదము | 86 | 82 | 4 |
| 3. | శుక్ల యజుర్వేదము | 17 | 15 | 2 |
| 4. | సామవేదము | 1000 | 997 | 3 |
| 5. | అధర్వవేదము | 9 | 7 | 2 |

జ్ఞాన భాండాగారమైన వేదము నిరాదరణకు గురియై అదృశ్యమవుతూ వుంటే ఉపేక్షిస్తున్న మనలను భావితరం క్షమించదు. ఇపుడు మిగిలియున్న వాటినైనా రక్షించుకొనే బాధ్యత మనపైనున్నది.

**ప్ర : ఋగ్వేదంలోనున్న విషయమేమిటి?**

జ : ఋగ్వేదంలో ఎక్కువగా దేవతాస్తుతి వున్నది. ఆ స్తుతులలోనే ఏ దేవత ఏ శక్తి సామర్థ్యాలతో ఒప్పుచున్నదో తెలియజేయబడినది.

ఋగ్వేద సాహిత్యం హిందూ ధర్మానికి, వేదాంతానికి, ధర్మశాస్త్రానికి, కళలకు భౌతిక శాస్త్రాలకు, సామాజిక సంస్థలకు మూలాధారమైన ఒక నీతి బుగ్గ లాంటిది. ఒకే ఒక సత్పదార్థం అనేక రూపాలలో వర్ణింపబడినట్లు, మరియు ఏ ఏ రూపాలలో భగవంతుని తెలుసుకుంటున్నామో ఆ పేర్లే ఆయనకు పెట్టబడ్డాయని ఋగ్వేదం గట్టిగా విశ్వసిస్తుంది. ఋగ్వేదంలోని ముఖ్య సిద్ధాంతాలు సనాతన ధర్మాన్ని నిలబెట్టిన ఇతిహాస పురాణాల్లో ఆగమాల్లో, ఇతర మతాల్లో, ధర్మ వేదాంత గ్రంథాలలో తగిన విధంగా భద్రపరచబడ్డాయి.

**ప్ర : ఋగ్వేదంలో సంఘం గురించీ, సామాన్య మానవుని గురించి ఏమైనా చెప్పినారా?**

జ : ఋగ్వేదం ఆరవ మండలంలో ఇలా వున్నది :

''సంఘాన్ని ప్రేమించు, గౌరవించు. సత్కార్యాలను చేయడానికి కావలసిన శక్తి సామర్థ్యాలు నీకు కలగాలి.

తనకున్నదాన్ని పంచి ఇచ్చేవారి ఐశ్వర్యం ఎప్పుడూ తరగదు. అలా చెయ్యని వానికి మిత్రుడనేవాడుండడు.

అన్నం కోరి వచ్చిన పేదవాడి ఆకలి తీర్చి తాను భుజించే వ్యక్తికి ఎప్పుడూ ఏ కొరతా వుండదు''.

సమాజానికి మేలు జరగాలని ఒక ప్రార్థన ఇలా వున్నది : ''ఓ ఈశ్వరా! మాకు మా కర్తవ్యమును తెలియజేయి. మితిలేని ఐశ్వర్యమును, ఆరోగ్యమును, మధురమైన వాక్కును ప్రసాదించు.

ప్రతిరోజూ మాకు మంచిరోజుగా చేయి. మా అందరి హృదయాలు ఒకటి కావాలి. మా అందరి ఆలోచనలు ఒక త్రాటిపై నడవాలి. మేమందరము ఒక్కటై మంచి స్నేహితులము కావాలి''.

**ప్ర : యజుర్వేదములో యజ్ఞముల గురించి ఏమి చెప్పబడినది?**

**జ :** లోక క్షేమం కొరకు ఏర్పడినదే యజ్ఞ భావన. యజ్ఞ స్వరూపమును, యజ్ఞోపకరణ ములను యజుర్వేదం విపులంగా తెలియజేసింది.

యజ్ఞాలలో కొన్ని ఒకటి మొదలు పన్నెండు రోజులు, కొన్ని ఒకటి నుండి 12 సంవత్సరాలు చేయగలిగేవి చెప్పబడినవి. యజుర్వేదము ప్రతిపాదించిన మార్గము కర్మ మార్గము. ఇందులో గృహకర్మలు, వ్రతాలు,నోములు, నిష్ఠలు చెప్పబడినవి. మన చుట్టూ వున్న అగ్ని, జలము, వాయువు, వీటి స్వభావములు చక్కగా వివరించబడ్డాయి.

జలము మనకు ఎనిమిది రకాల ఫలములనిస్తుంది. శుద్ధ జలము వలన తేజస్సు, అలలతో ప్రవహించే జలము వలన బలము, వీర్యము, జలాశయాల మధ్యలో ఉండే జలము వలన పుష్టి, సంతానోత్పాదక శక్తి కలుగుతాయని ఈ వేదం చెపుతుంది. ఈనాటి శాస్త్రజ్ఞులు నీటిలో వున్న సంతానోత్పాదక శక్తిని ఇంకా కనుగొనలేదు.

**ప్ర : వేదంలో రాజ్య పాలన గురించి ఏమైనా వుందా?**

**జ :** రాష్ట్రానికి సర్వాధికారి రాజు. ఈ రాజును ప్రజలు ఎన్నుకొనవలెను. ఒక శుభముహూర్తాన విద్వాంసుల చేత సేకరింపబడిన జలాలతో అతన్ని అభిషేకించేవారు. రాజుకు సహాయకులుగా వుండడం కోసం 27మంది అధికారు లుండేవారు. వీరు ''రాజార్యసభ'', ''విద్యార్యసభ'' ''ధర్మార్యసభ'' అనే మూడు సభల ద్వారా నియమించబడేవారు. ఈ అధికారులు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులనే మూడు వర్గాలకు ప్రతినిధులుగా వుండేవారు.

ముఖ్యమంత్రి, న్యాయమంత్రి, అర్థమంత్రి, విద్యామంత్రి, పురోహితుడు, ఉద్యోగ, వ్యాపారమంత్రి, సేనామంత్రి, అను మంత్రులను రాజు నియమిస్తాడు. సైన్యము భూసేన, జలసేన అని రెండు రకములుగ చెప్పబడినది.

ప్ర : వేదములో ఆధునిక విజ్ఞానాల ప్రసక్తి ఏమైనా ఉన్నదా?

జ : ఖగోళ విజ్ఞానం, సూర్యరశ్మి విజ్ఞానం, విద్యుత్తు, వర్షము, వర్షనివారణ, గాలి, గృహనిర్మాణ, ప్రవాహ (irrigation) అంతర్జల, భూమి, ఔషధీ, నౌకానిర్మాణ విజ్ఞానములు బాగా వివరించబడినవి. ఆయుర్వేదము, వైద్య శాస్త్రము, గణితము, విమాన శాస్త్రము, ఇవన్నియు వేదములందుగలవు.

ప్ర : సామవేదం సంగీత ప్రధానమైనదంటారు. దీని వైశిష్ట్యమేమి?

జ : సామవేదానికి ఉపవేదము గాంధర్వవేదము. నృత్యగీత వాయిద్యాలను, సప్తస్వరాలను, మూడు గ్రామలను, 21 మూర్ఛలను, 49 తానాలను ప్రతిపాదిస్తున్న ఈ వేదం సంగీత శాస్త్రానికి మూలం. సామగానం వలన దేవతలు సంతసించి కోరికలను వెంటనే తీరుస్తారు. ఋక్కులే రాగ బద్ధంగా గానంచేయబడితే సామలని వ్యవహరింప బడుతాయి. ఋగ్వేదానికీ సామవేదానికి పతిపత్నీ సంబంధం వున్నది.

ప్ర : అధర్వవేద విశేషాలు చెప్పండి?

జ : ఆధునిక శాస్త్రములు అధర్వవేదమందు చాలావరకు వివరించ బడినవి. ఆధర్వవేదంలో 244 సూక్తాలు రాజ్యానికి, రాజధర్మానికి సంబంధించి నవి. సమాజ స్వరూప స్వభావాల గురించి 75 సూక్తాలు, ఆధ్యాత్మిక విషయాల గురించి 86 సూక్తాలు, శారీరక చికిత్స గురించి 144 సూక్తాలు వున్నవి. ఇందులో వున్న పృధ్వీసూక్తం భూతత్త్వ విజ్ఞానాన్ని తెలియజేస్తుంది. అధర్వవేదంలో వ్యాధులను పోగొట్టే సూక్తాలు, కుటుంబానికి సంతానానికి ఆలమందలకు పంటభూములకు అభివృద్ధి కలిగించే మంత్రాలు, చేసిన పాపాల నుంచి దోషా లనుంచి విముక్తి కలిగించే ప్రాయశ్చిత్తకర్మలు వున్నాయి. కుటుంబాల మధ్య సఖ్య తను, గ్రామ సభలలో ఐకమత్యాన్ని పెంపొందించే మంత్రములున్నాయి.

ప్రేమకు, వివాహానికి సంబంధించిన మంత్రాలు, శత్రువులను వశపరచు కొనే మంత్రాలు, భూతప్రేత పిశాచాలను దూరంచేసే మంత్రాలు, రాజులకు యుద్ధమునందుపయోగపడే మంత్ర ఖండికలు ఇలా ఎన్నో ఉన్నాయి. భౌతిక దృష్టిలో పరిశోధించేవారికి అధర్వవేదము ఒక గనిలాంటిది. అందులో ఎన్నో రహ స్యాలు, సామాజిక కళ్యాణానికి అనుసరించవలసిన పద్ధతులు కుప్పలు తెప్పలుగా

వున్నాయి. రాజనీతి తంత్రాలు, అర్ధతంత్రాలు, కృషి వాణిజ్యాలు గురించిన అర్థవేదం అధర్వవేదంలోనిదే.

ప్ర : వేదములగురించి పరిశోధించిన పాశ్చాత్య పండితులెవరు?

జ : Prof. Max Muller, Prof. Roth, Gold stuker, Grassmann, H.H. Wilson, Dr. Roer, W.E. Writney, Bloom field వగైరా పాశ్చాత్య విద్వాంసులు వేద విజ్ఞానమును లోకానికి వెల్లడించడానికై తమ జీవితములో అధిక భాగాన్ని వ్యయపరచారు.

Ralph T.H. Griffith ఋగ్వేదమును ఆంగ్లములోనికి, Dr. Rosen లాటిన్ భాషలోనికి, Long Lols ఫ్రెంచి భాషలోనికి అనువదించారు.

ప్ర : మరొక ప్రశ్న. వేద మంత్ర ద్రష్టలలో స్త్రీలు గూడా వున్నారా?

జ : ఉన్నారు. ఉశవ, గౌరవీతి, చైలకి, మేధ, జయ, ప్రాదురాక్షి, రమ్యాక్షి, లోపాముద్ర, లోగాక్షి, వసుశ్రుత, వారుణి, సునీతి, అసురి, హైమ, విద్యార్థి మున్నగు వారున్నారు.

ధన్యవాదాలు సోమయాజిగారూ! వేదముల గురించి చాలా విలువైన సంగతులు చెప్పారు.

## అహింస

జీవహింస లేక జీవించు నవ్వాని
కాలయముడు గూడ కనికరించు

– తిరుక్కురల్



ప్రేమ, సేవ అనునవి మనుష్యునికి రెండు రెక్కలు. పక్షులు రెక్కలతో ఎగురునట్లు మనము వీటితో ఎగురుతూ గమ్యస్థానము చేరాలి.

– శ్రీ సత్యసాయిబాబా

# ౨౨. ఉపనిషత్తుల గురించి

- ''సౌమిత్రి''

వేదముల యొక్క సారము ఉపనిషత్తులుగా పిలువబడుచున్నవి. ఇందలి విషయము వేదాంతముగా చెప్పబడినది.

ఇవి 108 వరకు ఉన్నవి. వాటిలో పది ఉపనిషత్తులు ప్రత్యేకత సంతరించు కున్నవి. ఆదిశంకరాచార్యులవారు, శ్రీరామానుజాచార్యులవారు వీటిపై భాష్య ములు వ్రాసినారు. వీటిపేర్లు సులభముగా జ్ఞాపకముండుటకై ఒక శ్లోకము వాడుకలో నున్నది.

ఈశ కేన కథ ప్రశ్న

ముండ మాండూక్య తిత్తరి

ఐతరేయం చ ఛాందోగ్యం

బృహదారణ్యకం దశః

వీటిలో ఐతరేయోపనిషత్తు ఋగ్వేదము యొక్క భాగము. ఈశావాస్య, బృహదారణ్య కోపనిషత్తులు శుక్లయజుర్వేద భాగములు. కథ, తైత్తిరీయ ఉపనిష త్తులు కృష్ణయజుర్వేదము యొక్క భాగములు. కేన, ఛాందోగ్య ఉపనిషత్తులు సామవేదము యొక్కయు, ప్రశ్న, ముండక, మాండూక్య ఉపనిషత్తులు అధర్వవే దము యొక్కయు భాగములు.

ప్రపంచము, పరబ్రహ్మము - వీటి గురించిన తత్త్వ విచారమే ఉపనిషత్తుల ముఖ్య విషయము.

పిప్పలాద ఋషిని ఐదుగురు శిష్యులడిగిన ప్రశ్నలివి : 1. ప్రజలందరెక్కడ నుండి పుట్టుచున్నారు? 2. ప్రజలకాధారమగు దేవతలెవరు? 3. ఎవరెవరీ శరీర మును ప్రకాశింపచేయుచున్నారు? 4. ప్రాణము శరీరమందు ఎట్లు ప్రకాశించు చున్నది? ఎట్లు బయటికి పోవుచున్నది? 5. ప్రాణమునకు, బ్రహ్మమునకుగల సం బంధమేమి? 6. ఓంకారము యొక్క ప్రాముఖ్యమేమి? 7. షోడశకళలుగల పురు షుడెవరు?

ఈ ప్రశ్నలకు సమాధానము ప్రశ్నోపనిషత్తులోగలవు. కఠోపనిషత్తులో నచికేతో పాఖ్యానమున్నది. అందు నచికేతుడు యమలోకమునకు పోయి

''చచ్చిపోయిన పిదప మనుష్యుని స్థితి ఏమి?'' అని యముని ప్రశ్నించెను. అపుడు యముడతనికి ఆత్మస్వరూపమును బోధించెను.

కొన్ని ఉపనిషద్వాక్యములు :

ఉపనిషత్తులలో చెప్పబడిన కొన్ని అమూల్యమగు ప్రవచనములిట్లున్నవి :

1. ఓ పరమేశ్వరా! నన్ను అసత్యమునుండి సత్యమునకును, అంధకారము నుండి వెలుతురులోనికి, మరణమునుండి శాశ్వత ఆనందమయ జీవనమునకు గొనిపొమ్ము. (బృహదారణ్యకోపనిషత్తు)

2. ఈ జీవయాత్ర చేయుటలో శరీరము అను రథము మీద జీవాత్మ అను రథికుడు ఎక్కి, ఇంద్రియములనెడి గుఱ్ఱములను రథమునకు కట్టి, తన మనస్సు అనెడి పగ్గములతో వాటిని లాగుచు, తన బుద్ధి అనెడి సారథితో రథమును తోలుచున్నాడు. అని తెలుసుకొనవలెను (కఠ ఉపనిషత్తు).

3. ఈ మారిపోవుచుండెడి సర్వజగత్తు దాని నియామకుడును ప్రభువును అయిన ఈశ్వరునిచేత వ్యాపించబడి యున్నది. జగత్తు యొక్క ప్రతి చిన్న భాగము గూడా ఆయనచే వ్యాపించబడియున్నది. (ఈశావాస్య ఉపనిషత్తు)

4. పరమాత్మను శరీరములేని వానిగను, అనిత్యములగు అన్ని శరీరములందును ఉన్నవానిగను, అతి గొప్ప వానిగను, సర్వవ్యాపిగను తెలిసికొన్న జ్ఞాని దుఃఖమును పొందడు. (కఠోపనిషత్తు)

5. పరమాత్మ కన్నులు, చెవులు, కాళ్లు, చేతులు లేనిది. శాశ్వతమైనది. అన్నిచోట్లనున్నది. సర్వత్ర వ్యాపించియున్నది. (ముండక ఉపనిషత్తు)

6. ఏది కన్నులకు కనబడదో, దేనివలన కన్నులు చూచుచున్నవో అదియే పరబ్రహ్మము అని తెలుసుకొనుము. (కేనోపనిషత్తు).

7. ఆ పరమాత్మ స్వరూపము సత్యము, జ్ఞానము, అనంతము అయియున్నది. (తైత్తిరీయ ఉపనిషత్తు)

8. సత్యమే జయించును, అనృతము వర్ధిల్లదు (ముండకోపనిషత్తు)

జర్మన్ తత్త్వవేత్తయగు స్కోఫెన్‌హోర్ ఇట్లు వ్రాసెను : ""In this world there is no study so beneficial and so elevating as that of the Upanishads. It has been the solace of my life, it will be the solace of my death".

ప్రేమ అన్నది ఇతరులను తనవైపుకు ఆకర్షించే అయస్కాంతం.
- షిర్డీ సాయిబాబా

# ౨౩. పురాణాలలో ఏమున్నది?

- శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య, ఎం.ఏ.

(గుంటూరులో డా. కొలచల కృష్ణమూర్తి సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేసిన శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్యగారితో ఇష్టాగోష్ఠి)

**ప్రశ్న : గత కొంతకాలంగా మీరు సంస్కృతము నుండి పురాణాలను సరళమైన తెలుగు వచనంలో వెలువరుస్తున్నారు గదా. ఇంతవరకు మీరు ఏఏ పురాణాలను తెనిగించారు?**

**జ :** ఇప్పటివరకు విష్ణుపురాణం, వరాహ పురాణం తెనుగించాను. స్కాందపురాణం అచ్చుకాబోతున్నది.

**ప్ర : పురాణములు 18 వున్నాయి గదా. వీటినన్నిటినీ వ్యాసులవారే రచించారా?**

**జ :** పురాణములను ఒక వరుసలో చెప్పవలెనంటే ఇలా వున్నాయి. 1. బ్రహ్మ 2. పద్మ 3. విష్ణు 4. వాయు 5. భాగవత 6. నారద 7. మార్కండేయ 8. అగ్ని 9. భవిష్య 10. బ్రహ్మవైవర్త 11. లింగ 12. వరాహ 13. స్కంద 14. వామన 15. కూర్మ 16. మత్స్య 17. గరుడ 18. బ్రహ్మాండ.

వీటిని వ్యాసులవారే రచించారని సాంప్రదాయకంగా చెపుతున్నారు. అయితే వీటిలోని పదప్రయోగములలోని తారతమ్యాలను బట్టి వేరు వేరు వ్యక్తులు వ్రాసి వుంటారని చారిత్రకుల భావన.

**ప్ర : ఈ ఆధునిక కాలంలో ఇంత ప్రాచీనమైన గ్రంథాలను తెలుగు వచనంలోకి తీసుకురావలెననే కోరిక మీకెందుకు కలిగింది?**

**జ :** వీటిని నేను వ్రాయబూనడానికి కారణాలు చెప్పబోయేముందు అసలు సంస్కృతంలో వీటిని వ్యాసులవారు ఎందుకు వ్రాశారో చెపుతాను.

వేదములు సకల జ్ఞానమునకు మూలము. అయితే వాటిని అధ్యయనం చేయాలంటే కొన్ని నియమ నిబంధనలున్నాయి. వాటిని పఠించేవారు బ్రహ్మచర్యం ఆచరించాలి; అగ్ని హోమము చేయాలి; మంచంమీద నిద్రించరాదు; బ్రహ్మము హూర్తంలో నిద్రలేచి స్నాన సంధ్యలనాచరించాలి. ఇలాంటి కఠిన నియమము లుం డుటచేత వేదాధ్యయనం అందరికీ సాధ్యంకాదు. ఐతే వేదాలలో జ్ఞానం అందరికీ అందవలె. అందుకై పురాణ రచన జరిగింది.

**ప్ర : వేదముల భాషకు, పురాణముల భాషకు తేడావున్నదా?**

జ : వేద భాష పురాతన సంస్కృతము. దానికి అర్థం ఈనాడు అందరూ చెప్పలేరు. పురాణముల భాష లౌకిక సంస్కృతం, అది ప్రజలకు అర్థమయ్యే స్థాయిలో వున్నది. ఉదాహరణకు ఈనాడు సిసలైన సైన్సు విజ్ఞానం శాస్త్రవేత్తలకు తప్ప అర్థంకాదు. సామాన్యుల కొరకు సైన్సును Popularise చేయడం లక్ష్యంగా పుస్తకాలు వస్తున్నాయి. అలాంటిదే పురాణముల రచన.

ప్ర : పురాణములలో ఏమి ఉంటాయి?

జ : ముఖ్యంగా ఐదు సంగతులుంటాయి. 1. సృష్టి ఎలా ఏర్పడినది. 2. ప్రళయము గురించి 3. బ్రహ్మ సృష్టించిన ఋషి రాజవంశములు 4. తదనంతరమే ర్పడిన రాజవంశములు 5. వివిధ మన్వంతరాలలో జరిగిన చరిత్రలు. ఇవిగాక భూమిమీద గల సర్వ విషయాలు అందు చెప్పబడ్డాయి.

ప్ర : మీరు మన్వంతరాలు అన్నారే, ఎన్ని మన్వంతరాలు ఉన్నాయి? ఇప్పుడు ఏ మన్వంతరం?

జ : ఇపుడు వైవస్వత మన్వంతరంలో వున్నాము. దీని అధిపతి వైవస్వత మనువు. ఇప్పటికి ఆరు మన్వంతరాలు గడిచి ఏడవ మన్వంతరంలో ఉన్నాము. 14 మన్వంతరాలు గడిస్తే ఒక కల్పం అవుతుంది. మనం శ్వేత వరాహకల్పంలో వున్నాము.

ప్ర : పురాణాలలో నేటి కాలానికి గూడా పనికి వచ్చే సంగతులున్నాయా?

జ : అదే చెప్పబోతున్నాను. మార్కండేయ పురాణంలో పిండోత్పత్తి గురించి చెప్పబడింది. గర్భంలోవున్న పిండం ఏ ఏ నెలల్లో ఎట్టి పరిణామాలు చెందు తుందో, ఎపుడు అవయవాలు ఏర్పడుతవో చెప్పబడినది. అందలి వర్ణన నేటి ఆధునిక వైద్యశాస్త్రంలో చెప్పబడేదానితో సరిపోవుచున్నదని ఒక పాశ్చాత్య శాస్త్రవేత్త ధృవీకరించాడు.

ప్ర : ఇంకా ఏ ఏ సంగతులు పురాణములలో వున్నాయి?

జ : ఇప్పటికి సైన్సు ద్వారా మానవుడు సాధించని రెండు సంగతులు మార్కండేయ పురాణంలో ఉన్నాయి. ఒకటి అదృశ్యకరణి. ఈ శక్తిని పొందిన ట్లయితే ఒక మానవుడు ఇతరుల కంటికి కనపడకుండా అదృశ్యంగా వ్యవహరించ గలడు. ఐతే ఇతరులు అతనికి కనిపిస్తుంటారు. రెండవది ఖేచరగమనము. అనగా పక్షివలె ఆకాశంలో ఎగురుతూపోతాడు. ఈ రెండు శక్తులను కొందరు మానవులు ఇదివరలో కలిగి వున్నట్లు అందు చెప్పబడినది.

ప్ర :ఇంకా ఏ ఏ విషయాలున్నాయి?

జ : గరుడ పురాణంలో ఆయుర్వేద విజ్ఞానము, ఔషధుల గుణములు చర్చించబడినవి. మత్స్యపురాణంలో వాస్తుశాస్త్రము విపులీకరించబడినది. అగ్ని పురాణంలో మృతసంజీవనీ విద్య గురించి చెప్పబడినది. అగ్ని పురాణంలోనే వ్యాకరణశాస్త్రము, అలంకార శాస్త్రముల గురించిన చర్చ వున్నది. వృక్షాయుర్వేదము అనగా చెట్లకు వచ్చే వ్యాధుల గురించి అగ్ని పురాణములో వున్నది.

వామన పురాణంలో సదాచారములు చెప్పబడినవి. మత్స్య పురాణంలో కలియుగములో పరిపాలించే రాజుల గురించిన భవిష్యత్తు చెప్పబడినది. శాతవాహన రాజుల గురించి, మగధనేలిన రాజుల గురించి అందు చెప్పబడినది. గరుడ పురాణంలో గుఱ్ఱములు, ఏనుగుల గురించిన శాస్త్రములను పేర్కొన్నారు.

**ప్ర : పురాణములలో శాస్త్రముల గురించి ఎందుకు చర్చించారు? శాస్త్రములను విడిగా వ్రాయవచ్చును గదా?**

జ : పురాణములు ఒక మహర్షి చెపుతుంటే ఒక జిజ్ఞాసువు వింటున్న కథలవలె వ్రాయబడినవి. మధ్యలో అనేక ప్రబోధాత్మకమైన సంగతులు, శాస్త్రవిషయములు చెప్పబడినవి. విష్ణు పురాణాన్ని పరాశరుడు చెప్పగా మైత్రేయుడు వింటాడు. వామన పురాణమును పులస్త్యుడు చెప్పగా నారదుడు వింటాడు.

**ప్ర : వీటిలో మనకు కనిపించే సందేశం ఎలాంటిది?**

జ : మానవులు తమ విధ్యుక్త విధులు నిర్వర్తించాలని పురాణాలలో చెపుతారు. హక్కుల కొరకు ప్రజలు తాపత్రయపడి విధులను నిర్వర్తించని ఈ రోజుల్లో మనం మన ధర్మములు గుర్తు చేసుకోవడం అవసరం గదా!

**ప్ర : అలాంటి సందేశాత్మక ప్రబోధం ఒకటి చెప్పండి?**

జ : వామన పురాణంలో ఒకచోట ఇలా చెప్పారు : నీవు గనుక ఏదైనా చెరువులో స్నానం చేస్తూ వుంటే దానిలో నుండి ఐదు మట్టి ముద్దలు తీసి ఒడ్డున పడవేయమంటాడు. ఆ చెరువు పూడిపోకుండా నిరంతరం లోతుగా వుండడానికై ఐదుసార్లు మట్టిని తీసి ఒడ్డున పడవేసి తర్వాత స్నానం చేయమంటాడు. ఇది ఒక పౌరనీతిగా గ్రహించవచ్చు.

**ప్ర : బాగున్నది. ఏదైనా ఒక నీతి కథ చెపుతారా?**

జ : వరాహపురాణంలో ఒక కథ ఉన్నది. అందు ఇరువురు ఋషులున్నారు. అందొకరు శాకాహారి మరొకరు మాంసాహారి. మాంసాహారి యొక్క కుమార్తెను శాకాహారి యొక్క కొడుకు వివాహం చేసుకున్నాడు. అమ్మాయి అత్తవారింటికి పోయింది. ఆచారాలు అలవాట్లు వేరు వేరుగదా. అందుచేత అత్త కోడలిని సాధిస్తూ వున్నది. కోడలి అలవాట్లను ఎద్దేవ చేస్తున్నది. ఈ సంగతి కోడలు పోయి తండ్రితో

చెప్పింది. తండ్రి బావగారింటికి భోజనానికి వచ్చాడు. శాకాహారి యొక్క ఇంట్లో భోజనం వడ్డించారు. అపుడు మాంసాహారియైన ఋషి విస్తట్లో అన్నం వంక చూపిస్తూ ''మీరు ఇంత జీవహింస చేస్తున్నారేమిటి? ఎన్ని వందల వరిమొక్కలను నరికితే ఈ అన్నం వచ్చింది? మేము చూడండి. ఒక్క జంతువును ఎవరో వేట గాడు చంపితే దాని మాంసంతో కుటుంబం యావత్తూ తినగలుగుతాము. మీరుచేసే హింసలో మాది ఎన్నో వంతు?'' అని నాలుగు మాటలూ వడ్డించాడు. అంతటితో అత్తాకోడళ్ల నడుమ వైమనస్యం తొలగిపోయి సర్దుకుపోవడమారంభిం చారు. అంతస్తులు అలవాట్లు కారణంగా ఈ రోజుల్లో గూడ కోడళ్లను రాచిరంపాన పెట్టే పరిస్థితులకు సమాధానం పైకథలో గోచరిస్తుంది.

ప్ర : మీరు చెప్పిన కథను బట్టి పురాణకాలంలో ఋషులలో మాంసాహారులు గూడ వున్నారనీ వర్ణాంతర వివాహాలను ఆనాడు ఆమోదించారనీ గూడ తెలుస్తున్నది. ఐతే ఈ పురాణాలు వ్రాయబడిన కాలం ఏది?

జ : ద్వాపర యుగం అంతమై కలియుగారంభంలో వీటిని వ్రాశారు. అనగా 1985 నాటికి 5936 సంవత్సరాల క్రిందట వ్రాశారు. క్రీస్తుపూర్వం 3101 సంవత్సరాల క్రిందట అనుకోవచ్చు.

ధన్యవాదాలు అనంతరామయ్యగారూ! పురాణాలను చక్కగా పరిచయం చేశారు.

## ఋషులు

ప్రశ్న : ఋషులు గొప్పవారా? శాస్త్రవేత్తలు గొప్పవారా?

జవాబు : ఎవరు గొప్పో తేల్చుకోడానికి ముందు ఋషి అంటే ఎవరో అవగాహన చేసుకోవాలి.

ఋషి అంటేగడ్డాలు, మీసాలు పెంచుకొని తపస్సు చేసుకుంటూ వ్యక్తిగత మోక్షాన్ని కాంక్షించే స్వార్థ జీవి అనే అభిప్రాయం అందరిలో కాకపోయినా చాలామందిలో ఉంది.

మన వాఙ్మయంలో ముని, ఋషి అని రెండు పదాలున్నాయి. మునులు ఇహలోక వాంఛల్ని వీడి, తపస్సు చేసుకొనేవారు. ఋషులు అలా కాదు.సమాజ హితాన్ని కోరి సత్యాన్వేషణ చేసే శాస్త్రవేత్తలు వారు. భరద్వాజుడు, అగ్నివేశుడు, కణాదుడు అటువంటి ఋషులు. భరద్వాజుడు కాంపిల్య నగరంలో విజ్ఞాన విశ్వవిద్యాలయాన్ని నడిపి, భౌతికవైద్య విజ్ఞానాన్ని బోధించినట్లు ఆధారాలున్నాయి.

అగ్నివేశుడు ఆయుర్వేద ఋషి. కణాదుడు ప్రపంచంలోనే మొదటి అణుశాస్త్ర వేత్త. భౌతిక ఆధ్యాత్మిక విద్యలు రెండూ చెట్టపట్టాలేసుకొని తిరిగాయి, పెరిగాయి. నేటి శాస్త్రవేత్తలు కూడా ఋషులవంటివారే. హోమీభాభా, సి.వి.రామన్, ప్రఫుల్లచంద్రరే, శ్రీనివాస్ రామానుజం, ఇలా ఎందరో మహానుభావులు. – ''ఉషశ్రీ''

# అధ్యాయము - 9

# రామాయణ విశేషాలు

## 24. ఆధునికులు శ్రీమద్రామాయణాన్ని చదువవలసిన ఆవశ్యకత

- శ్రీశ్రీశ్రీ మధుసూదన సరస్వతీ స్వామి

*(కరీంనగర్‌లో వుంటున్న శ్రీశ్రీశ్రీ మధుసూదన సరస్వతీ స్వామి గారితో ఇష్టాగోష్ఠి)*

ప్రశ్న : రామాయణం అతిపురాతన గ్రంథం. సంస్కృతంలో అదే ఆదికావ్యం. ఇపుడు 20వ శతాబ్దంలో వున్నాం. మానవుడు చంద్రమండలం మీద అడుగుపెట్టాడు. రేడియోలు, టెలివిజన్లు, విమానాలు, కార్లు, ఫోన్లు వీటితో ఆధునిక మానవుడు సరిక్రొత్త జీవితం గడుపుతున్నాడు. ఈకాలంలో గూడ యువతీయువకులు రామాయణాన్ని చదువవలసిన ఆవశ్యకత ఏమిటి? ఆధునికులు హాయిగా స్కూటర్లమీద షికారు చేస్తారు. వీడియో కాసెట్లు తెచ్చుకొని చూచి ఆనందిస్తారు. రామాయణంతో వారికి పనిఏమి?

జవాబు : మంచి ప్రశ్న అడిగారు. జరిగిన సంఘటన ఒకటి చెపుతాను.

ప్ర : తప్పక చెప్పండి.

జ : ఉత్తర భారతంలో ఒక రైల్వే స్టేషనులో రైలెక్కడానికి ఇరువురు నవదంపతులు వచ్చారు. రైలు ఇంకా రాలేదు. ప్లాటుఫారంమీద వాళ్ళ పచార్లు చేస్తున్నారు. ఎదురుగా స్తంబానికి ఆనుకొని కూర్చొని ఒక ముసలాయన ఏదో గ్రంథం పారాయణ చేస్తున్నాడు. నవయువకుడాయనతో మీరేమి పుస్తకం చదువుతున్నారని అడిగాడు. ఆయన తులసీ రామాయణం చదువుతున్నానన్నాడు.

అపుడా యువకుడు ''మీరింతవరకు ఎన్నిసార్లు దాన్ని చదివి వుంటారు?'' అని అడిగాడు. ''నూరుసార్లకు పైగా చదివాను'' అన్నాడా వృద్ధుడు.

ఆ యువకుడు హేళనగా ''వేరే పనిలేకపోతే సరి. చదివిందే చదువుతూ ఉండకపోతే లోకంలో ఎన్ని మంచి పుస్తకాలు లేవూ? మీకు బోర్‌కొట్టడం లేదూ? ఇంతకంటే చాదస్తం ఏముంటుంది?'' అన్నాడు. ఆ వృద్ధుడు అతని వంక చూసి

చిరునవ్వునవ్వి మరల గ్రంథపఠనంలో మునిగిపోయాడు.

ప్ర : తరువాత ఏమయింది?

జ : అదే చెపుతాను... ఇంతలోకి రైలు వచ్చింది. జనం కిటకిటలాడు తున్నారు. రైల్లోకి ప్రవేశించడం కష్టంగా వున్నది. ఆ వృద్ధుడు ఏదోవిధంగా సందు చేసుకొని లోపలికి వెళ్లి కూర్చున్నాడు. ఆ యువకుడు గూడా అదే పెట్టెలో ఎక్కాడు. రైలు కదిలింది. అపుడు తేరిపార జూచుకున్నాడా యువకుడు. తన భార్య ఎక్కనేలేదు. ప్లాటుఫారం మీద దిగబడి పోయింది. ఆదుర్దాతో అతడు గొలుసు లాగాడు. రైలు ఆగింది. అపుడు దిగివెళ్లి భార్యతో సహా రైలు ఎక్కాడు.

వృద్ధుడు ఆ యువకునితో ''రామాయణం గనుక నీవు చదివియుంటే ఈ తప్పు చేసేవాడివి కావు. రామాయణంలో సీతారామలక్ష్మణులను గంగానది దాటించడానికై గుహుడు పడవ తీసుకొచ్చాడు. రాముడు ముందు సీతనెక్కించి తరువాత తాను పడవ ఎక్కాడు. భర్త అయినవాడు ముందు భార్య క్షేమం విచారించి తరువాత తన అవసరాలు చూచుకోవాలి. ఇది మన సాంప్రదాయం. రామాయణం చదివితే ఇది నీకు తెలిసేది'' అన్నాడు.

ప్ర : చాలా చక్కని కథ చెప్పారు. ఇది జరిగిన సంగతి కావడం మరింత విశేషం. మరి మధ్యవయస్కులు, ఉద్యోగులు వుంటారు. భార్యాభర్తలు ఇరువురు ఉద్యోగాలు చేస్తూ నాలుగు చేతులా డబ్బు సంపాదిస్తూ హాయిగా సుఖంగా వున్నామనుకుంటారు. అలాంటి వాళ్లకు రామాయణంతో పనియేమిటి?

జ : చాలామంచి ప్రశ్న అడిగారు. దీనికి గూడ ఒక జరిగిన సంగతే చెపుతాను.

ప్ర : తప్పక చెప్పండి వింటాను.

జ : గుజరాత్‌లో శ్రీ మురారి బాపూ హర్యానీ అనే మహాత్ముడున్నాడు. స్వామి చిన్మయానంద భగవద్గీతోపన్యాసాలిచ్చినట్లుగా వీరు దేశ విదేశాలలో రామాయణోపన్యాసా లిస్తుంటారు. వీరి ఉపన్యాసాలకు లక్షల సంఖ్యలో ప్రజలు వస్తూంటారు. ప్రేక్షకులకు సరిగా కనిపించి వినిపించడం కోసం ఇంటర్ సర్క్యూట్ టి.వి.లను ఏర్పాటు చేస్తారు. వీరి కార్యక్రమం పెట్టుకోవాలంటే నాలుగు సంవత్స రాల తరువాత తేదీ లభ్యమవుతుంది. అంతవరకు కార్యక్రమాలు నిర్ణయమై వుంటాయి.

ప్ర : భారత దేశం గర్వించ దగిన గొప్ప వ్యక్తి అనిపిస్తున్నది.

జ : ఆయన ఒకమారు కెనడా దేశంలో మాంట్రీల్ నగరంలో రామాయణో

పన్యాసాలిస్తున్నాడు. అచ్చట నివసిస్తున్న భారతీయులు అత్యధిక సంఖ్యలోవచ్చి వింటున్నారు. వారిలో ఇరువురు భార్యా భర్తలున్నారు. వారిరువురూ ఉద్యోగాలు చేసుకొని జీవిస్తున్నారు. అయితే వారికొక కొడుకు గలిగిన తరువాత మనస్పర్థలు వచ్చి 23 ఏళ్ళ క్రిందట విడాకులు తీసుకున్నారు. అప్పటి నుండి వేరు వేరుగా జీవిస్తున్నారు. కొడుకు తల్లి దగ్గరే వుంటున్నాడు. ఇరువురూ రోజూ రామాయణోపన్యాసాల కోసం వచ్చి వేరు వేరుగా కూర్చొని వింటున్నారు.

ఆఖరు రోజున శ్రీరామ పట్టాభిషేకం. ఆనాడు దంపతులైనవారు వచ్చి సీతారాములకు హారతిచ్చి దేవుని ఆశీస్సులు పొందవలసినదిగా శ్రీ మురారి బాపూగారు సభలో ప్రకటించారు. ఈ సదవకాశం కోల్పోవడం ఆ భర్తకు ఇష్టం లేదు. వెంటనే మహిళల విభాగంలో కూర్చొని వున్న తన ఇదివరకటి భార్య వద్దకు వెళ్ళి మరునాడు హారతివ్వడానికి తన వెంట ఉండమన్నాడు.

''మొదట మీరు ఇంటికి రండి. తరువాత హారతి ఇద్దాం'' అన్నదామె. అతడు మారు మాట్లాడకుండా ఆమె ఇంటికి పోయాడు. కుమారుడితో, భార్యతో కలిసి భోజనం చేశాడు. విడిపోయిన దంపతులిద్దరూ కలిశారు. మరునాడు శ్రీ సీతారాములకు హారతి ఇచ్చారు.

**ప్ర : విడాకులిచ్చి దూరమైపోయిన దంపతులను గూడ కలిపింది రామకథ...చాలా గొప్ప విషయం....మరి మాబోటి పత్రికా రచయితలు రామాయణాన్ని ఎందుకు చదవాలో గూడ చెపుతారా?**

**జ :** పత్రికా విలేకరులు జరిగిన సంఘటనను వక్రీకరించి వ్రాస్తూ వుంటారు. ఒకరిమీద వ్యతిరేకత కలిగేటట్లు విషయాన్ని మలచగలరు. లేదా ఒకరి మీద అభిమానం కలిగేటట్లు వ్రాయగలరు. రెండు రకాలుగా సమాచారం చెప్పడానికి రామాయణంలో ఉదాహరణలున్నాయి.

**ప్ర : మా లాంటి పత్రికా రచయితలు రామాయణంలో గూడ తారసిల్లారా?**

**జ :** (నవ్వి) పత్రికా విలేకరులెవరూ రామాయణంలో లేరు. పత్రికలు గూడా లేవు. కాని పత్రికా విలేకరుల పనిని ఇద్దరి పాత్రలు రామాయణంలో చేయడం చూస్తారు.

**ప్ర : అయితే తప్పక చెప్పండి మరింత శ్రద్ధగా వింటాను?**

**జ :** దశరథుడు రామునికి పట్టాభిషేకం చేయాలని నిర్ణయించాడు. ఈ సంగతి మంథర కైకతో చెప్పి ''25 రోజుల క్రిందటే దశరథుడు ఈ నిర్ణయం చేశాడు. అయినా నీకు చెప్పలేదా?'' అని అంటుంది. అలా ప్రశ్నించడం వలన ఇందులో ఏదో కుత్సితం వున్నదని కైకకు అనుమానం కలిగేటట్లు చేసింది. ఇలా విషయాన్ని చెడు అర్థం వచ్చేటట్లు చెప్పడానికి మంథర చక్కని ఉదాహరణ.

ప్ర : మంచి అర్థం వచ్చేటట్లు పలికినదెవరు?

జ : సదభిప్రాయం కలిగేటట్లు చెప్పిన వ్యక్తి హనుమంతుడు. లంకకు వెళ్ళి సీతమ్మను చూచి రాముని వద్దకు వచ్చి శోకిస్తున్న సీతాదేవిని గురించి చేసిన వర్ణన అద్భుతమైనది. ''నిన్ను వదిలిపెట్టి గూడ సీతమ్మ ప్రాణాలు ఎందుకు పోలేదంటే విరహం అనే అగ్ని నిట్టూర్పులనే గాలి చేత ప్రజ్వలించబడుతూ వుంటే కన్నీళ్ళు అనే ప్రవాహం దాన్ని ఆర్పుతూ వున్నది'' అంటాడు హనుమంతుడు.

ఆయన ఇంకా ఇలా అంటాడు : ''సీతమ్మ సదా నీ నామమే స్మరిస్తూ వున్నది....దుఃఖం వలన ఆమె ప్రాణం నోట్లో నుండి వెళ్ళిపోదామని చూస్తే మీ యొక్క నామం పోకుండా అడ్డుపడుతూ వున్నది'' అన్నాడు మారుతి! ఉత్తముడైన పత్రికా విలేకరి వాయుసుతునివలె సమాచారం అందివ్వాలి.

ప్ర : మరి మనది ప్రజాస్వామ్య రాజ్యం గదా. మన రాజకీయ వేత్తలు,పరిపాలకులు రామాయణాన్ని ఎందుకు చదవాలో చెపుతారా?

జ : రాజకీయ నాయకులు సరియైన వారి నుండి సలహాలు పొందాలి. సలహా చెప్పేవారు భయంచేతగాని లోభంచేతగాని లొంగిపోకూడదు. రావణునికి సలహా ఇచ్చే మంత్రులు అతన్ని చూసి భయపడి అతనికి నచ్చే విధంగా మాట్లాడారు. విభీషణుడొక్కడే భయపడకుండా, లోభానికి లోనుగాకుండా సలహా చెప్పాడు. ''మంత్రి, వైద్యుడు, గురువు - వీరు ముగ్గురూ అబద్ధం చెప్పినా, సరియైనది కానిదాన్ని సరియైనదని చెప్పినా మనిషి ఋజు మార్గం నుండి దూరమవుతాడు'' అని అంటున్నాడు వాల్మీకి!

అద్భుతమైన సత్యం చెప్పాడు వాల్మీకి మహర్షి. పదవుల్లో వున్నవారికి కోపం వస్తుందనీ, వారికీ నచ్చదనీ గూఢచారి వర్గాలవారు సత్యాలను దాచినా, అసత్యాలను తెలిపినా దేశం నష్టపడుతుందని దీనివలన స్పష్టమవుతుంది.

చాలా కృతజ్ఞతలు స్వామీజీ!

*(1989 నవంబరు)*

## జీవన సూత్రములు

దేవుఁడన మాతృదేశము

దేవతలన ( బ్రజల, యజ్ఞ దీక్షయనంగా

సేవా వ్రత నిష్ఠయ, ఇవి

జీవన సూత్రములుగా ( బ్రసిద్ధింగనుమా !

– తుమ్మల సీతారామమూర్తి

# ౨౫. రామాయణ సందేశము

- శ్రీ చలమచర్ల వేంకట శేషాచార్యులు, ఎం.ఎ.

(సికింద్రాబాదులో శ్రీ వేంకటేశ్వర వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాలలో అధ్యాపకులుగానున్న శ్రీ చలమచర్ల వేంకట శేషాచార్యులుగారితో ఇష్టాగోష్ఠి)

ప్రశ్న : రామాయణం కొన్ని వేల సంవత్సరాల క్రిందటి కావ్యం గదా. దాని శాశ్వతత్వానికి హేతువేమిటి? ఇన్ని శతాబ్దాలుగా అది గ్రామ గ్రామాన, వాడవాడలలో ఎందుకు గానం చేయబడుతూ వున్నది?

జవాబు : అందులో అన్ని కాలాలకు పనికి వచ్చే సందేశం వున్నది. అదే దాని శాశ్వతత్వానికి కారణం.

ప్ర : ఏమిటా సందేశం?

జ : రాముని గుణములే రాముని సందేశం.

ప్ర : ఆయనకు గల విశిష్ట గుణములేమిటి?

జ : ఆయన గుణములను బాలకాండలో వాల్మీకి వర్ణించాడు. అందులో కొన్ని గుర్తు చేసుకుందాము.

1. 'ప్రశాంతాత్మా' - అంటే ఎట్టి సమయంలోనూ కల్లోల పడక ప్రశాంతమైన మనస్సు గలవాడు.

2. 'పూర్వభాషీ' -అంటే ఎవరినైనా తానే ముందుగా పలకరించేవాడు.

3. 'నచ అనృత కథా' - అసత్యమగు కథలల్లి చెప్పడు.

4. 'నచలవశానుశః' - సమయానుకూలంగా మాట్లాడేవాడు కాడు. అనగా ఏ ఎండకాగొడుగు పట్టేవాడు కాడు.

ప్ర : ఆయన గుణములే గొప్పవా? లేక ఆయన రాజ్యపాలన గూడా గొప్పదా?

జ : ఆయన అడవిలో ఉండగా భరతుడు వచ్చినపుడు రాజ్యపాలన గురించి కొన్ని ప్రశ్నలడిగాడు. అవి ఈనాటికీ అనుసరింపదగియున్నవి.

1. భరతుడా! నీ యొక్క అమాత్యులు ఉపధాతీతులుగా వున్నారా? అని అడిగాడు. అంటే, వారు కానుకలకు లోబడనివారుగా వున్నరా? అని అర్థం. ఎంత చక్కని ప్రశ్న ఇది?

2. సైన్యమునకు, ఉద్యోగులకు వేతనము సమయానికి అందజేయబడు చున్నదా? అట్లుగాక ఆలస్యమైనచో వారు విశ్వాసపాత్రులుగా వుండరు. చెడిపోతారు. దానివలన కలిగే అనర్థం అపారం అని పలికాడు రాముడు. ఇంతకంటే పరిపాలకునికి చేయదగిన హెచ్చరిక ఏముంటుంది?

**ప్ర : బాగున్నది...శేషాచార్యులుగారూ! మీరు కళాశాల విద్యార్థుల నుద్దేశించి ఉపన్యసించేటప్పుడు వాళ్ళకు ఉత్తమ సందేశంగా రామాయణం నుంచి ఏ అంశం వినిపిస్తారు?**

**జ :** చాలా అంశములున్నాయి. అందులో ఒకటి ఇది : పట్టాభిషేకము కొరకు రథమెక్కి, తండ్రి వద్దకు పోవుచున్నపుడుగాని, నార వస్త్రములు ధరించి పాదచారియై అడవులకు ప్రయాణమైనపుడుగాని, శ్రీరాముని ముఖం ఒకే రీతిలో వున్నది అని వాల్మీకి వర్ణించాడు. సుఖంలోనూ కష్టములోనూ గూడా ఆ మహనీయుడు ఒకే విధముగా నున్నాడు. ఇది విద్యార్థులకు చెప్పదగిన చక్కని అంశం.

**ప్ర : రామాయణంలో సుందరకాండకు గొప్పస్థానమిచ్చారు. దానిని ప్రత్యేకించి పారాయణ చేస్తారు. ఎందుకు?**

**జ :** సుందర అనగా పోయిన వస్తువు దొరకుట. కనిపించకుండా పోయిన సీతాదేవియొక్క ఆచూకి సుందరకాండలో తెలుస్తుంది. నష్టపోయిన వస్తువులు తిరిగిపొందడం కొరకు, మనశ్శాంతి కొరకూ అనేక క్లేశములు తొలగడం కొరకు, సుందరాకాండ పారాయణ చేస్తారు. ముఖ్యంగా శని గ్రహ దోషనివారణకు విష్ణు సహస్రనామంగాని, శని జపముగాని, సుందరాకాండ పారాయణగాని చేస్తారు.

సుందరాకాండలో రామకథను సంక్షిప్తంగా హనుమంతుడు సీతకు చెపుతాడు. అలా చెప్పటం ద్వారా తాను విరోధి వర్గంలోని వాడను కానని ఆంజనేయుడు సీతాదేవికి విశ్వాసం కలిగిస్తాడు.

**ప్ర : హనుమంతుడు గొప్ప కార్యసాధకుడని చెపుతారు. ఎందువలన?**

**జ :** ఇందుకు హనుమంతుని చరిత్ర యావత్తూ చెప్పుకోవచ్చు. అయితే అందులో ఒక ఘట్టం మాత్రమే మనవి చేస్తాను. ఎవరికైనా ఒక పని చేయునపుడు మూడు రకాల విఘ్నములు ఎదురవుతాయి. వాటిని ఆంజనేయుడు ఎలా ఎదుర్కొన్నాడో చూడండి. సముద్రము దాటునపుడు ఆయన మూడు రకాల అడ్డంకులను ఎదుర్కొన్నాడు.

1. అనుకూల్య విఘ్నములు : ఇవి పైకి చూడడానికి సహాయకారులుగా వుంటాయి. కాని పనిని నష్టపరుస్తాయి. మనం ఏదో పని మీదపోతూ వుంటే ఎవరో మిత్రులు భోజనం చేసి వెళ్ళమని బలవంతం చేసి పని నష్టపరుస్తారు. అలాగే సముద్రములో మైనాకుడు హనుమంతునికి అడ్డు తగిలి తాను రామ కార్యానికి సహాయపడదలచాననీ, తనయొద్ద విశ్రాంతి తీసుకొని పోవలసినదని కోరాడు. హనుమంతుడు తన లక్ష్యం చేరే వరకు విశ్రమించనని ప్రతిజ్ఞ చేశానని చెప్పి నేరుగా వెళ్ళిపోయాడు.

2. మిత్రులే పరీక్షించడం కొరకు విఘ్నాలు కలిగిస్తారు. దేవతలు 'సురసి' అను రాక్షసిని నియమించారు. ఆమె అతన్ని మ్రింగడాన్ని ఆకాశమంత నోరు తెరుస్తుంది. అపుడు హనుమంతుడు సూక్ష్మరూపంలో నోటిలో దూరి తప్పించుకు పోతాడు. దేవతలు ఆనందించి ఆశీర్వదిస్తారు. ఇది రెండవరకమైన విఘ్నము.

3. శత్రువులు ఏర్పరచే విఘ్నములు మూడవ రకం. లంకను కాపలా కాచేటువంటి సింహికి అను రాక్షసి ఆకాశంలో పోయే ప్రాణిని దాని నీడను బట్టి క్రిందికి లాగి వేస్తుంది. అలా ఆకర్షించబడగా హనుమంతుడు రాక్షసిని సంహరిస్తాడు. ఇలా మూడు రకాలవిఘ్నములు పనులకు ఎదురవుతుంటాయని ఈ కథలో తెలుస్తున్నది.

**ప్ర : బాగుంది...మరొక ప్రశ్న?. వాల్మీకి రామాయణాన్ని తెలుగు లిపిలో తాత్పర్య సహితంగా మీరు ప్రచురిస్తున్నారు. ఇలాగే రామాయణ కథలో జీవితాన్ని మిళితం చేసుకొని దివ్యానందం పొందినవారు ఆంధ్రదేశంలో ఎవరైనా వున్నారా?**

**జ :** మంచి ప్రశ్న అడిగారు. ఇది వరలో త్యాగయ్య, రామదాసు, వాసుదాసు గారలున్నారు. అయితే ఇటీవల నేనొక మహనీయుని కలిశాను. ఆయన నల్గొండ జిల్లాలో కోదాడకు 2 మైళ్ళ దూరంలో వున్న తమ్మర అనే గ్రామంలో శ్రీ తమ్మర నరహరిగోపాలాచార్యులుగారున్నారు. వయస్సు 80 దాటి వుంటాయి. వారు ఇప్పటికి 100 సార్లు వాల్మీకి రామాయణం యావత్తు పారాయణం చేశారు. అంతేగాక ఆరుసార్లు వాల్మీకి రామాయణాన్ని చూచి వ్రాశారు. అందులో అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందుతారు. ఆయనను నేను కలుసుకొని ''ఎవరైనా ఉదారపురుషుని నాకు సూచిస్తారా?'' అని అడిగాను. ''రామచంద్రుని కంటె పరమ ఉదారపురుషుడెవరున్నారు?'' అని ఆయన జవాబిచ్చారు. ఇహలోకంలో మన బాధలు నివృత్తి చేయడానికి గూడ రాముడే దిక్కు అని ఆయన ప్రగాఢ విశ్వాసం.

***(1985 జులై)***

# అధ్యాయము - 10

# మహాభారతంలో ప్రత్యేకతలు

## 26. మహాభారత విశేషాలు

- శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తి, ఎం.ఏ

(రాష్ట్రంలో పలు ప్రభుత్వ కళాశాలల్లో ప్రిన్సిపాల్‌గా పని చేసి ఉద్యోగ విరమణ చేసి గుంటూరులో వుండెడి స్వర్గీయ శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తి గారితో ఇష్టాగోష్ఠి)

ప్రశ్న : వేద వ్యాస మహర్షి గురించీ మహాభారతం గురించీ కొన్ని విషయాలు తెలుసుకోదలచాను. సంస్కృత భారతం ఆధారంగా మీరు చెప్పబోవు సంగతులు ఆధికారికంగా వుంటాయనుకుంటాను.

జ : అలాగే చెపుతాను అడగండి.

ప్ర : ఆషాఢ పౌర్ణమి వ్యాస జయంతి గదా. మొదట ఆ మహనీయుని గురించి చెప్పండి. ఆయన ప్రధాన శిష్యులెవరెవరు? వారు ఏమి చేశారు?

జ : భారతజాతికి గురువు వ్యాసమహర్షి. ఆయన పాండవులకు, కౌరవులకు గూడా పితామహుడవుతాడు. ఆయన నాలుగు వేదాలను వర్గీకరించాడు. మహాభారతాన్ని, 16 పురాణాలను మనకందించాడు. ఆయన ప్రధాన శిష్యులు ఐదుగురున్నారు.

1. పైలమహర్షి : ఈయన ఋగ్వేదాన్ని అధ్యయనం చేసి ప్రచారం చేశాడు.

2. వైశంపాయన మహర్షి : ఈయన యజుర్వేదాన్ని అధ్యయనం చేసి ప్రచారం చేశాడు.

3. జైమిని మహర్షి : ఈయన సామవేదాన్ని అధ్యయనం చేసి ప్రచారం చేశాడు.

4. సుమంతు మహర్షి : ఈయన అధర్వవేదాన్ని అధ్యయనం చేసి ప్రచారంచేశాడు.

5. రోమహర్షణుడు : ఈయనకే సూత మహర్షి అని పేరు. ఈయన పురాణములను అధ్యయనం చేసి ప్రచారం చేశాడు. రోమహర్షణుని కుమారుడైన ఉగ్రశ్రవాసుడు భారతాన్ని అధ్యయనం చేసి ప్రచారం చేశాడు.

6. ఇకపోతే, వేదవ్యాసుని కుమారుడు శుక మహర్షి. ఆయన పరీక్షిత్తుకు భాగవతం చెప్పాడు.

7. వైశంపాయనుడు : జనమేజయునికి భారతం చెప్పాడు.

**ప్ర : వేదవ్యాసుడు మహాభారతం ద్వారా మానవాళికి అందించదలచిన ప్రధానమైన సందేశమేమిటి?**

**జ :** ''రెండు చేతులు పైకెత్తి నేను నొక్కి వక్కాణించునదేమనగా, ధర్మము వలననే అర్థము, కామము ఒనగూడును. కనుక ధర్మము నాచరించండి'' అని ఆ పరమగురువు లోకానికి ఉపదేశించాడు. అదే ఆయన ఇచ్చిన మౌలికమైన సందేశం. ఆయన మోక్షం గురించి అక్కడ చెప్పలేదు. గౌతమబుద్ధుడు ఎలాగైతే దేవుని గురించి మాట్లాడకుండా సత్ప్రవర్తన గురించి నొక్కి వక్కాణించాడో అలాగే వ్యాసమహర్షి ధర్మము నాచరించుమని, అదియే అర్థకామములను (మోక్షమును గూడ) సమకూరుస్తుందని చెప్పాడు.

**ప్ర : మంచిది. మరి ధర్మమంటే ఏమిటి?**

**జ :** ధర్మమంటే ఏమిటో వ్యాసుల వారు ఈ చిన్న పద్యంలో చెప్పారు:

ఒరులేయవి యొనరించిన

నరవర అప్రియము తన మనంబునకగు తా

నొరులకు నవి సేయకునికి

పరాయణము పరమధర్మ పథములకెల్లన్

ఇతరులు నీయెడ ఎలా ప్రవర్తిస్తే అది నీకు అయిష్టము కలిగిస్తుందో, నీవు ఇతరుల యెడ అలా ప్రవర్తించవద్దు. ఇదియే ధర్మములలో కెల్ల మేలైనది అని చెప్పాడు. ధర్మానికిచ్చే అనేక నిర్వచనాలలో ఇది తలమానికము వంటిది.

ప్ర : ఒక సందేహం అడుగుతున్నాను. భారత కథ గురించి ఒక సినిమా డైలాగు విన్నాను. అందులో మయసభలో దుర్యోధనుడు నీరు లేని చోట నీరనుకొని, గోడవున్న చోట లేదనుకొని నడచి తలకు బొప్పి కడితే పాంచాలి నవ్విందనీ, ఆమె నవ్వడం వలన పరాభవం చెంది ప్రతీకారేచ్ఛతో పాండవుల సర్వనాశనానికీ, పాంచాలిని పరాభవించడానికీ నిర్ణయించుకున్నాడనీ ఆ డైలాగులో పేర్కొన్నారు. యావత్తు విరోధానికీ పాంచాలి నవ్వడమే మూలమని అర్థం వచ్చింది అది వింటుంటే. మీరేమంటారు?

జ : భారత కథలో దుర్యోధనుడు బుద్ధిమంతుడనీ, పాండవులే చెడ్డవారనీ కొందరు చేస్తున్న వ్యాఖ్యానంలో భాగంగా ఇలాంటి డైలాగులు సినిమాల్లో చొప్పించారు. ఇది సత్యం కాదు.

మయసభ నిర్మాణానికి చాలా ఏళ్ళ క్రిందటనే, బాల్యంలోనే దుర్యోధనుడు భీముడికి విషం పెట్టి చంపాలని చూశాడు. అసలు దుర్యోధనుని స్వభావంలోనే ఈర్ష్య, అసూయలు గూడుకట్టుకొని వున్నాయి. కుంతీదేవికి బిడ్డ కలిగాడనీ, తనకు కలగలేదని అసూయతో గర్భవతియగు గాంధారి పొట్టమీద కొట్టుకొంటే దుర్యోధనాదులు జన్మించారు. ఆ అసూయ దుర్యోధనుడిలో వచ్చింది.

ధర్మరాజాదులను ధృతరాష్ట్రుడు వారణావతం అనే నగరానికి పంపించాడు. అప్పటికి ధర్మరాజు యువరాజుగా వున్నాడు గనుక రాజ్యంలో మరొక నగరానికి వెళ్ళి అచట పరిపాలనను చక్కదిద్దే బాధ్యత అతనికి వున్నది. వాళ్ళు అచటికి వెళితే వుండడానికి లక్క ఇంటిని దుర్యోధనాదులు నిర్మింపజేశారు. అందులో పాండవులు నిద్రిస్తుండగా తగుల పెట్టడానికి ఒకడిని నియమించారు.

వాడు తగలబెట్టడానికి ఒకరోజు ముందు పాండవులు ఆ ఇంటిని తామే తగలబెట్టి సొరంగం కుండా తల్లితో సహా పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నారు. అయితే వీరిని చూడడానికి వచ్చిన ఒక ఆడమనిషి, ఐదుగురు పురుషులు ఆ ఇంట్లో మిగిలిపోయి మరణించారు. దుర్యోధనాదులకు ఒక మహిళ, ఐదుగురు పురుషులు మంటల్లో మరణించారని సమాచారమందింది. ఆ చచ్చినవాళ్ళు పాండవులు, కుంతీదేవియేననుకొని ధృతరాష్ట్రుడు వీళ్ళకు అంత్యక్రియలు చేయించాడు. భారీగా ధనం ఖర్చుపెట్టాడు. లోలోపల పరమానందం చెందాడు. అందుచేత దుర్యోధనాదులు పాండవులను అంతం చేయడానికి మయసభ కంటె ఎంతో పూర్వం నుండి పన్నాగాలు పన్నారు.

ప్ర : అసలు దుర్యోధనునికి జరిగిన అవమానాన్ని చూచి ద్రౌపది నవ్వలేదా? ఆ సంగతి కూడా చెప్పండి.

జ : అపుడు ధర్మరాజు రాజసూయ యాగం చేస్తున్నాడు. ద్రౌపది యాగశాలలో వుండి యజ్ఞ కార్యంలో పాల్గొంటున్నది. ఇతర చోట్లకు ఆమె వెళ్ళే వీలు లేదు. దుర్యోధనుని అవస్థను చూచి నవ్వింది పరిచారికలు అని సంస్కృత భారతంలో వుంది.నవ్విన వారిలో ద్రౌపది లేదు. అందుచేత ఈ నవ్వడం అనేది కౌరవ పాండవుల నడుమ వైరానికి మూలకారణమనే వాదన సరైయనది కాదు.

ప్ర : మరొక ప్రశ్న. పాండవులు అర్థరాజ్యం కోరారుగదా. ఇలా కోరడం ఏమి సమంజసం? రాజ్యాన్ని ఆస్తివలె పంచుకోవడం తప్పుగదా? రాజ్యం సర్వసత్తాధికారం కలిగి వుంటుంది. దాన్ని విభజించగూడదు. రాజ్యాన్ని ధర్మరాజో దుర్యోధనుడో ఎవరో ఒకరే పాలించాలి. అంతేగాని రాజ్యం పంచి ఇవ్వమనడ మేమిటి? విభజిస్తే రాజ్యం బలహీనమైపోదూ?

జ : మంచి ప్రశ్న అడిగారు. అసలు ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు. అంగవైకల్యం గలవాడు రాజ్యాన్ని పాలించడానికి అనర్హుడు. ''అంగహీనం దేవతాని కామయంతే'' అని చెప్పబడింది. అంగవైకల్యం గల జంతువు దేవతకు బలి ఇవ్వ డానికి పనికి రాదు. అలాగే ధృతరాష్ట్రుడు ఈ కారణం వల్లనే రాజుగా ఉండతగడు. కనుకనే ధృతరాష్ట్రుడు ధర్మరాజుకు యువరాజ పట్టాభిషేకం చేశాడు.

అయితే పాండవులను ఎలాగైనా తుదముట్టించి తాము అధికారంలోకి రావాలని దుర్యోధనాదులు ప్రయత్నాలు చేశారు. వారణావతం నగరానికి పంపి అక్కడ లక్క ఇంట్లో పెట్టి తగులపెట్టించారు. పాండవులు తప్పించుకొని పారిపోయారు.

ఆ సంగతి తెలియక పాండవులు మరణించారనుకొని ధృతరాష్ట్రుడు అంత్యక్రియలు చేసి, తన కొడుకగు దుర్యోధనుని యువరాజుగా పట్టాభిషిక్తుని చేశాడు.

ద్రౌపది స్వయంవరం వలన పాండవులు జీవించి వున్నారని తెలిసింది. వారిని ధృతరాష్ట్రుడు హస్తినాపురానికి ఆహ్వానించాడు. ఇపుడు సమస్య ఏర్పడింది. ఇద్దరు యువరాజులు తయారైనారు. దుర్యోధనుడు క్రొత్తగా యువరాజైనవాడు. అంతకుముందే యువరాజ్య పట్టాభిషేకం పొందినవాడు ధర్మరాజు. ఇద్దరిలో ఎవరు పాలించాలి? అందుచేత ఒక విధమైన 'సర్దుకుపోయే' రీతిలో ధర్మరాజు

అర్ధరాజ్యానికి సమ్మతించాడు. ఇలా నడిచింది కథ. అంతేగాని రాజ్యం అవిభాజ్యంగా వుండాలనేది ఎవరూ కాదనలేని విషయం.

ప్ర : ఆఖరు ప్రశ్న ఒకటి అడుగుతాను. అమెరికాలో **1945**లో రాబర్ట్ ఓఫెన్ హీమర్ అనే విజ్ఞాన శాస్త్రవేత్త మొదటిసారిగా అణుబాంబును తయారు చేశాడు. అతడు మెక్సికో ఎడారిలో దానిని పరీక్షించాడు. అతడు దానిని గురించి విశ్వవిద్యాల యంలో ఉపన్యసిస్తూంటే, అణుబాంబు ప్రేలితే ఎలా వున్నదని ఎవరో ప్రశ్నించారు. అందుకాతడు ''భగవద్గీతలో విశ్వరూపాన్ని వర్ణిస్తూ వెయ్యిమంది సూర్యులు ఒకేమారు ప్రకాశిస్తే ఎలా వుంటుందో అలా వుంది. అణుబాంబు ప్రేలితే ఆవిధంగా వున్నది'' అని జవాబు చెప్పాడు.

మరొక చోట ఆయనను ''ఇలాంటి ఆయుధాన్ని భూమి మీద ఏ దేశంలోనైనా ఎప్పుడైనా ప్రయోగించినట్లు దాఖలాలున్నాయా?'' అని ప్రశ్నించారు. అందుకు శాస్త్రవేత్త ''ప్రపంచ సాహిత్యంలో ఒక్క మహాభారతంలో మాత్రమే ఇలాంటి ఆయుధాన్ని ప్రయోగించిన సందర్భం వున్నది'' అని చెప్పాడు. భారతం లోని ఆ సందర్భం ఏది?

జ : పాండవులు అరణ్యావాసం చేసిన కాలంలో అర్జునుడు ఆరు సంవత్సరాల పాటు అన్నదమ్ముల వెంట ఉండలేదు. పాశుపతాస్త్రం కొరకు ఒక ఏడాదిపాటు శివుని గురించి తపస్సు చేశాడు. శివుడు పాశుపతాస్త్రం అనుగ్రహించాడు.

పిదప అర్జునుడు స్వర్గానికి వెళ్ళి ఇంద్రుని వద్ద ఐదేళ్ళు వున్నాడు. ఇంద్రుడు కాలకేయులు, నివాతకవచులు అనే రాక్షసులతో యుద్ధం చేయడానికి అర్జునుని సహాయం కోరాడు. ఆ రాక్షసులు ద్వీపాలలో, సముద్రగర్భాలలో ఎవరికీ అంద కుండా నగరాలు నిర్మించుకొని వుంటున్నారు. అర్జునుడు పాశుపతాస్త్రాన్ని వారి మీద ప్రయోగించి అభేద్యమైన వారి నివాసాలను, ఆ రాక్షసులను నాశనం చేశాడు. పాశుపతాస్త్రం వలన జరిగే విధ్వంసం అణుబాంబు వలన జరిగే విధ్వంసం ఎట్టిదో అట్టిది. అయితే అర్జునుడు భారత యుద్ధంలో మాత్రం పాశుపతాస్త్రాన్ని ప్రయోగించలేదు.

ధన్యవాదాలు గోపాలకృష్ణమూర్తిగారూ. చాలా విలువైన విషయాలు చెప్పారు.

> అసత్యము చెప్పువాడు అందరి విశ్వాసాన్ని పోగొట్టుకుంటాడు. అందువల్ల అసత్యమాడుట మంచిదికాదు.
> —వర్ధమాన మహావీరుడు

# 27. విదుర నీతి

- మహాభారతం నుండి

(సంజయుడు పాండవ శిబిరం నుండి తిరిగి వచ్చిన పిదప ధృతరాష్ట్రుడు వాని నుండి పాండవుల అభిమతం గ్రహించి వికల చిత్తుడైనాడు. ఆనాటి రాత్రి అతనికి నిద్రపట్టదు. అందుచేత విదురుని పిలిపించి తన మనోవ్యాకులత పోవుటకై శాంతి వచనములను పలుకమంటాడు. అపుడు విదురుడు చెప్పిన నీతులు అత్యంత వివేకవంతమైనవి. భారతంలో మిగుల ప్రసిద్ధి చెందిన ''విదురనీతి'' నుండి కొన్ని నిత్య సత్యములను ఇచట పేర్కొనుచున్నాము - సం.)



బలవంతులతో విరోధము దుర్బలులకు ఉచితము కాదు. అటువంటి వారికి రాత్రివేళ నిద్దుర పట్టదు. ఇతరుల సంపదలను హరించినవానికి, కాముకునికి, చోరునికి నిద్రరాదు.



విషయాలను స్వల్పకాలంలో గ్రహిస్తూ, అప్రస్తుత ప్రసంగాలు చేయకుండా, దుర్లభ వస్తువులను కోరకుండా, పోయిన వాటి కోసం శోకించకుండా, విపత్తులలో ధైర్యం పోగొట్టుకొనకుండా, ఆరంభించిన కార్యాలను మధ్యలో ఆపకుండా, సోమరియై కూర్చోకుండా, మనస్సును వశపరచుకొని చరించువారు పండితులు.



వేష పటాటోపం లేకుండా, ఆత్మ ప్రశంస చేసుకోకుండా, క్రోధం కలిగినా కటువుగా భాషించకుండా ఉండే మానవుడు సర్వజనాదరణీయుడు.



జీవితం అశాశ్వతమైనది. అందుచేత పశ్చాత్తాపమవసరం లేకుండా పనులు పూర్తి చేసుకోవాలి.



ఇంద్రియలోలుని ఆ ఇంద్రియములే ఆరగిస్తాయి.



తుమ్మెద పువ్వులకు ప్రమాదం కలుగకుండా మకరందాన్ని గ్రోలునట్లు ప్రభువు ప్రజలకు హాని కలుగకుండా ధనం గ్రహించాలి. తోటమాలి చెట్టుకు

ప్రమాదం రాకుండా పువ్వులు కోయునట్లు ప్రభువు ప్రజల నుండి పన్నులు స్వీకరించాలి.



ఫలపుష్పాలు లేని చెట్టును పక్షులు విడిచి పెట్టినట్లే మృతదేహాన్ని దారా పుత్రాదులందరూ విడిచి పెడుతున్నారు. అగ్ని దగ్ధుడైన పురుషుని వెంట మంచి చెడ్డల కర్మ ఫలమే వస్తుంది.



కృతఘ్నుల మాంసం జంతువులు గూడ ముట్టవు.



మృత్యువు ప్రాణాన్నీ, కోపం లక్ష్మినీ, అసూయ ధర్మాన్నీ, కామం లజ్జను, ముసలితనం సౌందర్యాన్నీ, నీచ జనసేవ సత్స్వభావాన్ని, అభిమానం సర్వస్వాన్నీ నశింపచేస్తాయి.



సూక్ష్మరంధ్రాలు గల వలలో పడ్డ రెండు పెద్ద చేపలు దానిని కొరికి వేసేటట్లు, కామ క్రోధాలనే మీనాలు వివేకాన్ని నశింపజేస్తాయి.



ఐశ్వర్యం కలిగించే మదం కంటే సురాపాన మదం అధికమైనది కాదు. ఐశ్వర్యమత్తుడు సంపదలు నశిస్తేనే గాని ఆ మత్తును వదలలేడు.



మనకు ప్రియం చెప్పేవారు అనేకులు అయాచితంగా లభిస్తారు. కాని హితవు చెప్పే వక్త దొరకడు. ఆ వక్తకు శ్రోతలు లభించరు.



అధర్మంతో సాధించిన ధనం పుణ్యకార్యాలకు వెచ్చించినా అది ఫలించదు.



వేదాలు పురుషుని ఆయుః పరిమాణము 100 సంవత్సరాలుగా నిర్ణయించాయి. అయినా మానవుడు అకాలంలో ఎందుకు మరణిస్తాడు?

అధిక ప్రసంగాలు, క్రోధము, అపారమైన అభిమానము, త్యాగ శూన్యత్వము, ఉదరపోషణ చింత, మిత్రద్రోహము అనే ఆరు కారణములు మానవుని ఆయుః పరిమాణాన్ని తెగనరుకుతుంటాయి.



దుష్టులను దండించగలవాడే రాజు; చాటుమాటుగా పాపాలు చేసిన వారిని శిక్షించే వాడే యముడు.



గొడ్డలి దెబ్బతిన్న వృక్షం చిగురించవచ్చు. కాని కటువచనములతో దెబ్బతిన్న హృదయం కోలుకోదు. శరీరంలో నాటిన తీవ్రమైన బాణాలను పెరికి పారవెయ్యవచ్చు. కానీ పరుష భాషణలు మాత్రం గుండెనుండి పైకి తియ్యలేము. అందుచేతనే విద్వాంసులు కటువుగా భాషించరు.

## ఆంగ్లంలో మహాభారత నాటకం

భారత రామాయణ మహాకావ్యాలు, భగవద్గీత, కాళిదాసు నాటకములు ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించడమేగాక వారిలో శ్రద్ధాసక్తులను ఇనుమడింప చేస్తున్నవి.

గ్రీసు దేశపు నాటక సమాజం ఒకటి 1985లో మనదేశానికి వచ్చి, ఉజ్జయినిలో ప్రతి ఏటా జరిగే కాళిదాస జయంతి సందర్భంగా ''శాకుంతలం'' ప్రదర్శించి మెప్పు పొందింది.

అంతకంటే ముఖ్యమైనది పీటర్ బ్రూస్ నేతృత్వంలో వివిధ దేశాలలో ప్రదర్శింపబడిన మహాభారత యుద్ధం నాటకం. జిన్ క్లాడ్ కారియర్ ఆంగ్లంలో ఈ నాటకం తయారు చేశాడు. ఇది తొమ్మిది గంటల నాటకం. తొమ్మిదేండ్ల కృషి ఫలితం. 1986 ఏప్రిల్ నుండి రెండేండ్లకు పైగా గ్లాస్కో (స్కాట్లాండ్) నగరంలో దీనిని ప్రదర్శించారు.

1988 మే నెలాఖరున దీని రంగస్థలి టోక్యోకు మారింది. అక్కడ భారత మహోత్సవ ప్రేక్షకులను ఇది అలరించింది. అంతటితో ప్రపంచ వ్యాప్తంగా ఈ నాటక ప్రదర్శన కార్యక్రమం ముగిసింది. లోగడ జ్యూరిచ్, లాస్ ఏంజల్స్, న్యూయార్కు, పారిస్ నగరాలలో ప్రదర్శించారు.

ఈ నాటకంలో పాత్రధారులు వివిధ దేశాలకు చెందినవారు. అర్జునుడు ఇటలీ నటుడు కాగా, ధర్మరాజు జర్మనీ దేశస్థుడు. ద్రోణుడు జపాన్‌కు, పాండురాజు ఇండోనేషియాకు, కర్ణుడు ట్రినిడాడ్‌కు చెందినవారు. నటీ నట వర్గంలో ఏకైక భారతీయ ప్రతినిధి మల్లికాసారబాయ్.

– ''సమర్థసద్గురు'' నుండి

# అధ్యాయము - 11

# భాగవతంలో అంతరార్థాలు

## 28. భాగవత ప్రాశస్త్యము

- డా. ప్రసాదరాయ కులపతి ఎం.ఏ. పి.హెచ్.డి

(డా. ప్రసాదరాయ కులపతిగారు భాగవతము మీద పరిశోధన చేసి డ్యాక్టరేట్ పట్టము పొందినవారు. ప్రసిద్ధ కవి, గుంటూరు హిందూ కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. వీరితో జరిపిన ఇష్టాగోష్ఠి)

ప్రశ్న: నేటి పరిస్థితులలో హిందూ సమాజానికి భాగవతం నుండి లభించే సందేశము, స్ఫూర్తి ఏమిటి?

జ : ఎన్నో వేల సంవత్సరాల నుండి ఈ దేశ ప్రజలు భాగవతం వలన స్ఫూర్తిని పొందుతూనే ఉన్నారు. భగవంతుని ఏ మార్గంలో ఆరాధించినా సరే అనుగ్రహిస్తాడనే పరమసత్యం ఆ మహాగ్రంథం మనకు అందిస్తున్నది.

కామోత్కంఠత చేత గోపికలు, భయము వల్ల కంసుడు, వైరులై శిశుపాలాదులు, సంబంధులై యదువృష్ణి భోజాదులు, ప్రేమతో పాండవులు, భక్తితో నారదాదులు తరించారు. ఉద్దామధ్యాన గరిష్టత ప్రధానంగాని, ఏ భావమనేది కాదని మనకు భాగవతం చెపుతున్నది. దేవుణ్ణి ఇలానే కొలవాలి. మరే మార్గమూ లేదు. అనే మూర్ఖమార్గాన్ని మనం అంగీకరించము. భక్తిలో కూడా ప్రజాస్వామ్యాన్ని భావ ప్రకటనా స్వేచ్ఛను ప్రకటిస్తుంది భాగవతం. అన్ని రూపాలు, అన్ని నామాలు భగవంతునివే అనే వైదిక తత్త్వాన్ని భాగవతం మనకు అడుగడుగునా బోధిస్తుంది.

అలా చెపుతూ అధర్మాన్ని ఎదుర్కోవడంలో శ్రీకృష్ణుని జీవితాన్ని ఆదర్శంగా ఎత్తి చూపుతుంది. శిశుపాల జరాసంధ నరకాదులను నాశనం చేయడంలో ఆయన అనుసరించిన మార్గాలను గుర్తు పెట్టుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. అకర్మణ్యులై పిరికి వారిలాగా చేతులు ముడుచుకొని కూచోటాన్ని భాగవతం హర్షించదు. సాధువులను రక్షించడానికి, దుర్మార్గులను శిక్షించడానికి ధర్మస్థాపనకు అవతరించిన కృష్ణుని వలె ప్రతి హిందువు ఉత్తేజితుడు కావలెనని వ్యాసమహర్షి ఆకాంక్ష.

ప్ర : రాసక్రీడల గురించిన విమర్శలకు మీరేమంటారు?

జ : ఎనిమిదేళ్ళ వయసులో కృష్ణుడు గోపికలతో చేసిన క్రీడలను ఎవరైనా శారీరకమైనవిగా భావిస్తే అంతకంటే అర్థరహితమైనది మరొకటి ఉండదు. పరమేశ్వరుని అత్యంత సన్నిహితునిగా చేసే భావాలలో పితృభావన, మాతృభావన, పుత్రభావన, ప్రభు భావన, దాస భావన, సోదరభావన మొదలైన అన్నింటిలోకి ప్రేయసీ భావన గొప్పది. ఒక ప్రేయసి తన ప్రియునితో ఐక్యమైనట్లుగా తండ్రితో బిడ్డ, ప్రభువుతో సేవకుడు ఒకటి కాలేరు. ఒక్క మధురభక్తి అన్న భావన తప్ప మిగతా అన్నీ పరిమితమైనవే. జన్మాంతర మహాతపస్వులైన గోపికలు తరించడానికే మధుర భక్తి మార్గంలో కృష్ణ విరహాన్ని పొంది కృష్ణ సంయోగాన్ని అనుభవించారు. అది దైహికమైన శృంగారం కాదు. మానుష భావనకు అతీతమైన దివ్యశృంగారమది.

ప్ర : గజేంద్రమోక్షాన్ని మీరెట్లా భావిస్తారు?

జ : సందేహగ్రస్తుడైన జీవుడు భక్తి మార్గంలో పయనించి ఉత్తీర్ణుడయ్యే ఘట్టమది. అహంకారంతో కన్నుమిన్నుగానక తిరిగిన ప్రతివాడూ తన తలకు మించిన ఆపదలు చుట్టుముట్టినపుడు భగవంతుణ్ణి గుర్తు తెచ్చుకుంటాడు. కాని ఇతగాడు పిలవగానే పలకడానికి వీడేమీ భక్తుడా? తాపసుడా? యోగీంద్రుడా? ఎప్పుడైతే ఆయన ఆదుకోలేదో వెంటనే దేవుని ఉనికి గురించే సంశయాన్వితుడై

కలడందురు దీనులయెడ
కలడందురు పరమయోగి గణముల పాలన్
కలడందురన్ని యెడలను
కలడు కలండనెడి వాడు కలడో లేడో!

అని బాధపడతాడు. ఆర్తుడై, దీనుడై, శరణాగతుడై, సర్వార్పకుడైన గజేంద్రుడు.

లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చె తనువున్ డస్సెన శ్రమం బయ్యె డిన్
నీవే తప్ప నితఃపరం బెరుగ మన్నింపన్దగున్ దీనునిన్
రావే ఈశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా!

అని ఎప్పుడైతే ప్రపన్నుడవుతాడో అపుడు పరమేశ్వరుడు తప్పక వచ్చి కాపాడుతాడు.

ప్ర : ఏఏ ఘట్టాలు పారాయణ చేస్తే ఏఏ క్లేశాలు తొలగుతవి?

జ : ఒక్కొక్క ఘట్టం అయిన తర్వాత ఫలశ్రుతి అక్కడే చాలావరకు చెప్పబడినది. గజేంద్రమోక్ష ఘట్టం పారాయణం చేస్తే ఎటువంటి ఆపదయినా తొలగిపోతుంది. హాలాహల భక్షణ ఘట్టం పారాయణం చేస్తే వ్యాళానలాదులచే వచ్చే

భయాలు పోతవి. పెండ్లికాని పిల్లలు రుక్మిణీ కళ్యాణం చదివితే త్వరగా పెండ్లి అవుతుందని పూర్వుల నమ్మకం. ప్రేమ ఫలించాలంటే గోపికా కృష్ణుల వివాహ ఘట్టాలు చదవాలి. ఏకాదశీ వ్రత మహత్త్యమును అంబరీషోపాఖ్యానం తెలియ జేస్తుంది. ఇలా ప్రతి ఘట్టంలోనూ ఏదో ఒక విశేషం ఉండడమే భాగవత విశేషం.

**ప్ర : ఇంతటి మహత్తర ఫలితాలు కలగడానికి పోతనగారి తపశ్శక్తి లేక మంత్రశక్తి కారణమంటారా?**

జ : నిస్సందేహంగా. అసలు కవిత్వమే ఒక తపస్సు. అందులోనూ మహా భక్తుడు పోతన. అందువల్ల ఆయన రచనలో, పదపదమున ఆ మహానుభావుని భక్తి, తపస్సు తమ ప్రభావాన్ని చూపిస్తూనే ఉంటవి. అయితే ఈ ప్రశ్నకు మీరు తెలుగు భాగవతాన్ని మనస్సులో పెట్టుకొని అడిగినట్లున్నారు గనుక పోతన్న గారిని గురించి ప్రస్తావించాను. దీనికంతకూ మూలమైన వ్యాసుని మహత్త్వమే ప్రధాన కారణమన్న సంగతి గమనించాలి.

ఆ ద్వైపాయన కృష్ణుడు, ఆ చతుర్వదనుడైన బ్రహ్మ, ద్విభాహుడైన హరి, ఆ ఫాలలోచనుడైన శంభుడు, నారాయణాంశసంభూతుడైన ఆ ఋషిస్వామి తపశ్శక్తి, రచనా ప్రభావము భాగవత ఘట్టాలకు ఆ ప్రశస్తి తెచ్చినవి. ఆయన అనుగ్రహం వల్లనే పోతనకు ఆ శక్తి కొంత అబ్బింది. తెలుగు భాగవతానికీ పారాయణ గౌరవం లభించింది.

**ప్ర : తెలుగులో భాగవతం పుట్టడం ఏదో వ్రాయాలనిపించి వ్రాసిన యాదృచ్ఛిక సంఘటనా లేక బలవత్తరమైన కారణం ఉందా?**

జ : భాగవతం తెలుగుసాహిత్య సముద్రానికి మహోదయం. ఏ దేశంలోనైనా ఏ కాలంలోనైనా మహాసంఘటనలెప్పుడూ యాదృచ్ఛికాలూ కాకతాళీయాలు కావు. అవి భగవదవతరణంలాంటివి. ధర్మగ్లాని కలిగినపుడు సారస్వతం ద్వారా ఒక మహోపదేశం జాతి అందుకోవలసి వున్నప్పుడు మాత్రమే భాగవతం లాంటి భవ్యరచనల సృష్టి జరుగుతుంది.

మహమ్మదీయ దండయాత్రల కల్లోలంతో, జైన, బౌద్ధ, లోకాయత విజృంభణంతో, వీరశైవుల స్వేచ్ఛా విహారాలతో అట్టుడికి పోయిన తెలుగు జాతికి శరచ్చంద్ర చంద్రికా శీతలమై, శాంత గంభీరమై, సాత్విక మధురభక్తి ప్రేరకమైన భాగవతం ఉదయించడం ఆనాటి అవసరం. పరమేశ్వర సంకల్పము. దానికి పోతన అర్హత గలవాడు గనుక ఆయన ఉపకరణంగా ఎన్నుకోబడినాడు.

**ధన్యవాదాలు కులపతిగారూ! భాగవత ప్రత్యేకతలను చక్కగా వివరించారు.**

*(ఫిబ్రవరి 1984)*

# 29. శ్రీకృష్ణతత్వంలో అంతరార్థం

-డా. కరుణశ్రీ

(గుంటూరు వాస్తవ్యులు, తన మధుర కవితాసుధలతో ఆంధ్ర పాఠక లోకాన్ని అలరింపజేసి మైమరపింపచేసిన డా. కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారితో ఇష్టాగోష్ఠి)

ప్రశ్న : మీరు తిరుమల తిరుపతి దేవస్థానం వారు వెలువరించిన భాగవత సంపుటాలకు సంపాదకత్వం వహించారు. అందుచేత శ్రీకృష్ణ తత్త్వమేమిటో మీరు చెపితే తెలుసుకోదలచాను. శ్రీకృష్ణుడు గోపికాలోలుడా? దుష్టసంహార కుడా? పాండవ పక్షపాతా? యోగీశ్వరేశ్వరుడా? ప్రేమమూర్తా? వేదాంత వేద్యుడా? అర్జున రథసారధా? ఏమిటి కృష్ణ తత్త్వంలోని రహస్యం? ఎందుకడుగు తున్నా నంటే కవుల ఉత్ప్రేక్షలతో, ఊహలతో శ్రీకృష్ణుడంటే అర్థంకాని పరిస్థితి ఏర్పడింది. మీరు కాస్త అర్థమయ్యేటట్లు చెపుతారని అడుగుతున్నాను.

జవాబు : మంచి ప్రశ్న అడిగారు...కృష్ణ శబ్దానికి ఆకర్షించునది అని అర్థం. అన్ని ప్రాణులను, మనుష్యులను, జంతువులను, జీవులను ఏ శక్తి అయితే ఆకర్షించుచున్నదో అదియే కృష్ణుడు.

ప్ర : మనమంతా ఇనుప శకలములము, ఆయన అయస్కాంతమూనా?

జ : అవును. సరిగా ఇదే ఉపమానాన్ని భాగవతంలో పోతనగారు ప్రయోగించారు. ప్రహ్లాదుడు తాను శ్రీహరిచేత ఎట్లు ఆకర్షితుడగుచున్నాడో తన గురువుతో ఇలా చెప్పాడు :

''ఇనుము అయస్కాంత సన్నిధి ఎట్లు భ్రాంత
మగు, హృషీకేశు సన్నిధి నా విధమున
కదలుచున్నది దైవయోగమున చేసి
బ్రాహ్మణోత్తమ చిత్తంబు భ్రాంతమగుచు''

అంటాడు. ఇనుము అయస్కాంత సన్నిధి చేరునట్లు తన చిత్తము శ్రీహరి వశమగుచున్నదని ప్రహ్లాదుడంటాడు.

ప్ర : కరుణశ్రీగారూ! నేనొక చిలిపి ప్రశ్న అడుగుతాను.

శ్రీకృష్ణుడు స్త్రీలనే ఆకర్షిస్తాడా లేక పురుషులను కూడా ఆకర్షిస్తాడా? ఎందుకంటే ఆయనను గోపికాలోలుడని వర్ణించారు. ఆ మాటకు కొందరు దుర్బుద్ధితో స్త్రీలోలుడని అర్థం చెప్పి చాల చౌకబారుగా మాట్లాడుతూ వుంటారు.

జ : మానవులందరిలో స్త్రీపురుష భావన గూడుకట్టుకొనియున్నది. దేవుని పేరు చివర ''డు'' చేరుస్తాము గనుక శ్రీకృష్ణుడు గూడ ఒక పురుషుడని భావించి మన ఆలోచనలన్నీ ఆయనకు అంటగడుతుంటాము. ఆయన ఒక ఆకర్షణ శక్తి అని ముందే చెప్పాను. 'శక్తి' పురుషుడూ కాదు, స్త్రీ గూడా కాదు.

ప్ర : మరి ఆయనను ఎలా అర్థం చేసుకోవాలి?

జ : బృందావనంలో రూపగోపస్వామి అనే శ్రీకృష్ణ భక్తుడుండేవాడు. ఆయనను సందర్శించడానికై రాజపుత్ర స్థానము నుండి మీరాబాయి వచ్చింది. ఆయన లోపల కూర్చుని వున్నాడు. ఆయన స్త్రీలను చూడడని అనుయాయులు ఆమెతో చెప్పారు! అందుకు మీరాబాయి ''ఓహో! ఇచట పురుషులు గూడా వున్నారా? నాకు తెలియదే. శ్రీ కృష్ణుడొక్కడే పురుషుడు, మిగతా అందరూ స్త్రీలేననుకుంటున్నాను'' అన్నది. అందుచేత స్త్రీ పురుష భావన గలవారికి ఆయనొక్కడే పురుషుడు లోకంలో అందరూ స్త్రీలు. ఆయనను ఒక ఆకర్షణ కేంద్రంగా భావించేవారికి ఆయనొక అయస్కాంతము, మనమంతా ఇనుపరజనులము.

ప్ర : మీరు చెప్పిన మాట సహేతుకముగా వున్నది. కాని కవులు ఆయనకు ఎనిమిది మంది భార్యలున్నారనీ, వీరేగాక **16** వేలమంది గోపికలతో క్రీడలు సలిపినాడనీ అంటారేమిటి?

జ : నామ రూపములు లేని ఒక శక్తిని వర్ణించునపుడు ఏవో కొన్ని కథలు, ఉపాసనా మార్గములు కవిత్వ ధోరణిలో చెప్పుట జరిగినది. అయితే ఆ కథలలో గూడా అంతరార్థం వున్నది. మానవుడు ఎనిమిది ప్రకృతులను కలిగి వుంటాడు.

ఆకాశము, అగ్ని, వాయువు, జలము, పృథ్వి, మనస్సు, చిత్తము, అహంకారము - ఈ ఎనిమిదింటిలో రమించువాడే ఆత్మ. ఈ ఎనిమిదే అష్టభార్యలు, ఆత్మయే కృష్ణుడు. మనుష్యునిలో వేలకొలది నాడులున్నవి. అవియే పదునారు వేల గోపికలు.

ప్ర : మరి గోపికావస్త్రాపహరణం కథ యేమిటి?

జ : మానవునికి నేను శరీరమునేగాని ఆత్మనుగాను అనే భ్రాంతి వుంటుంది. దేహాభిమానమును తొలగించుటకే ఆ కథ ఏర్పడినది. అంతేగాని గోపికలను మోహించడం .దాని లక్ష్యం కాదు. ఒక్క గోపికలే కాదు, శ్రీకృష్ణుని వేణుగానం వినడానికి వృద్ధులు, తల్లులు, బాల బాలికలు, గోవులు, పక్షులు, జంతువులు, చెట్లు కూడా ఆయన కొరకు ఎదురు చూచాయనీ, పాలు పితికే యాదవులు, చల్ల చేసే గొల్లభామలు, పాలు త్రాగే పసిపాపలు చేయుచున్న పనులను ఆపి శ్రీకృష్ణునివైపు లాగి వేయబడినట్లు భాగవతంలో వున్నది. కనుక ఈ విశ్వాన్ని నడిపిస్తున్న శక్తి కేంద్రం యొక్క పేరు శ్రీకృష్ణుడు!

*ధన్యవాదాలు కరుణశ్రీగారూ! సందేహాలకు చక్కని సమాధానాలిచ్చారు!*

## మనుష్యులు

మానవ దేహ మొక వృక్షము. ఆ చెట్టు భూమినుండియు, మానవ సంఘము నుండియూ పోషక పదార్థములను తీసుకొనును. అందుకు మారుగా వారందరికి అది ఇవ్వగలిగినదేమి? ప్రేమఫలము. ఆ ఫలముత్పన్నము కానిచో ఆచెట్టు గొడ్డుచెట్టే.

- సత్యసాయిబాబా



'నన్ను తాకకు' అనేది మానసికమైన జబ్బు. జ్ఞాపకముంచుకో, వ్యాప్తియే జీవనము.సంకుచితమంతా మరణము. ప్రేమ ద్వారా అందరినీ నీలో ఇముడ్చుకో.

- స్వామి వివేకానంద

# ౩౦. శ్రీకృష్ణుడు చోరుడా?

- శ్రీ కొత్త రామకోటయ్య

(గుంటూరు జిల్లా చినకాకాని వాస్తవ్యులు, సి.వి.వి. యోగ మార్గగాములు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శిష్యులు 'తాతగారు' అని పిలువబడే స్వర్గీయ కొత్త రామకోటయ్యగారు మాటల మధ్య చెప్పిన సంగతులివి - సంపాదకుడు)

కళాశాలలో సైన్సు లెక్చరరుగా పనిచేస్తున్న ఒక మహిళ నా వద్దకు వచ్చి ''కృష్ణుడు పరమదొంగ. ఇరుగు పొరుగు ఇళ్ళల్లో నుంచి వెన్నముద్దలు దొంగి లించాడు. అతన్ని గురించి విద్యార్థులకు ఏమీ తెలియకపోవడమే మంచిది'' అని అన్నది.

నేనామెతో ''దొంగతనం చేయడం మనందరికీ తెలియదూ? సాక్షాత్తూ దేవుడు అవతారమెత్తి మనకు దొంగతనం నేర్పాలా?...ఏమిటమ్మా నీవు చెప్పేది? భారతదేశంలో జన్మించి భాగవతాన్ని అర్థం చేసుకోలేకపోతివి'' అన్నాను.

**నలుగురు గురువులు :**

లోకంలో నాలుగు రకాల గురువులున్నారు. మొదటి రకం అథమ స్థాయికి చెందినవారు. ఆవు తాను గడ్డి తింటూ దూడకు గడ్డి తినడం నేర్పుతుంది. అలాగే ఈ రకం గురువులు గూడ తాము అజ్ఞానంలో వుండి శిష్యులకు అజ్ఞానం పంచి పెడుతూ వుంటారు. ఈ రోజుల్లో టీచర్లలో కొందరు ఈ రకంగానే వున్నారు. దేవుడు లేడని భావించి శిష్యులకు అట్టి దుర్బోధలే చేస్తుంటారు. వీరు అథములు.

రెండవ రకం వారు సద్గురువులు. వారు ఎలాంటి వారంటే తాను గడ్డి మేసి, దానిని పాలుగా మార్చి దానిని దూడకు ఇచ్చే గోవులాంటివారు. ఈ రకం గురువులు తాము కష్టాలను భరిస్తూ శిష్యులకు జ్ఞానమనే క్షీరాన్ని ప్రసాదిస్తారు. శిష్యుల బుద్ధికి పనికి వచ్చు పాలవంటి మంచి జ్ఞానమును అందించే వీరు రెండవ రకమునకు చెందిన గురువులు.

మూడవ రకంవారు పరమ గురువులు. షిర్డీ సాయిబాబా, రామకృష్ణ పరమహంస, ఎక్కిరాల కృష్ణమాచార్య, సి.వి.వి.లాంటివారు ఈ తరగతికి చెందినవారు. వీరు శిష్యుల అజ్ఞానాన్ని 'దొంగిలించి' వారికి సద్గతి చూపుతారు. ఒక విధంగా వీరు 'చోరులే'. అయితే దేన్ని దొంగిలిస్తారు? శిష్యుల యొక్క ఆపదలను దొంగిలిస్తారు. చోరుడు అనగా అవతలవాడికి తెలియకుండా తీసుకొను

వాడు అని అర్థం. అలాగే ఈ పరమ గురువులు ఎక్కడో వందలమైళ్ళ దూరంలో వుండి,లేదా తమ శరీరాలను చాలించిన పిదప గూడా శిష్యుల బాధలను వారికి తెలియకుండా దొంగిలిస్తారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వంటి యోగిపుంగవులు శరీరం చాలించి 40 ఏళ్ళు అయినా ఇప్పటికీ తమ శిష్యులను వెన్నంటి కాపాడు తూనే వున్నారు. వాళ్ళకు మార్గదర్శనం చేస్తూనే వున్నారు. వీరు పాలలో 'తోడు' వేయుదురు. అనగా శిష్యుని అంతరంగమున ప్రవేశించి తోడుగా వుంటారు. శిష్యుని చాంచల్యమును అస్థిరమగు భావములను పాలు పొంగించినట్లు పొంగించి తొలగించెదరు.

శిష్యుని మనస్సు స్థిరమైనపుడు పాలలో తోడు వేయగా ఏర్పడు పైమీగడ ఈశ్వరుడనీ, క్రింది పెరుగు సృష్టి అనేటువంటి జ్ఞానం వీరి వలన శిష్యులకు కలుగుతుంది.

నాలుగవ వారు జగద్గురువులు. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు అలాంటివారు. వీరు ఆ పెరుగును చిలికి 'వెన్న' తీస్తారు. దేవుడు, జీవుడు వేరు కారనీ, ఇరువురిలో వున్న చైతన్యశక్తి ఒకటేనని తెలియజేసేది నవనీతం అని చెప్పబడే వెన్న. అద్వైతా మృతమే వెన్న. దానిని శిష్యులకు పంచి పెట్టేవాడే జగద్గురువు. వెన్న అనగా పరి పూర్ణ జ్ఞానము. అట్టి పూర్ణజ్ఞానమును జీవులందరికి పంచి పెట్టును గనుక శ్రీకృష్ణుని వెన్నల దొంగ అని అంటారు.

**ముగ్గురు దొంగలు :**

వాస్తవానికి ముగ్గురు దొంగలున్నారు. మొదటి దొంగ తల్లి. ఆమె బిడ్డ క్షేమం కోసం అనేక ప్రమాదాలకు అతడు గురికాకుండా వుండడం కొరకు ప్రమా దాలనే దొంగిలిస్తుంది. కత్తి పీటలు, నిప్పులు, బావులు మున్నగువాటి నుండి పిల్లలను దూరం చేస్తుంది.

రెండవ దొంగ గురువు. అతడు శిష్యుల అజ్ఞానాన్ని దొంగిలిస్తాడు.

మూడవ దొంగ శ్రీకృష్ణుడు. అతడు దేహమే నేనను భ్రాంతిని దొంగిలిస్తాడు. శ్రీకృష్ణుడు చేసే దొంగతనం ఐహికమైన దొంగతనం కాదు. అది ఆత్మజ్ఞానాన్ని కలిగించే దొంగతనం.

జరిగిన సంగతి : ఒక జరిగిన సంగతి మనవి చేస్తాను.

ఒక నాస్తిక శిఖామణి వున్నాడు. అతడొక హైస్కూలు హెడ్మాష్టరుగారి కొడుకు. అతడు తీవ్రమైన కడుపునొప్పితో బాధపడుతున్నాడు. ఎన్ని మందులు వాడినా తగ్గడం లేదు. అతని తండ్రి నా వద్దకు వచ్చాడు. తన కొడుకు యొక్క వ్యాధిని వివరించాడు. ''ఆ రోగిని నా వద్దకు తీసుకురండి'' అన్నాను.

''మా వాడు పరమ నాస్తికుడు. వాడు మీ వద్దకు రాడండి'' అన్నాడు.

''అయితే మందిస్తాను తీసుకుపోయి వాడికి వెయ్యండి'' అన్నాను.

''మీరిచ్చారని తెలిస్తే వేసుకోడండి'' అన్నాడు తండ్రి.

''అయితే మీరే వేసుకోండి'' అంటూ విభూతి, పంచదార మంత్రించి ఇచ్చాను.

''నేను వేసుకుంటే మా వాడికి తగ్గుతుందా?'' అన్నాడు. ''మీలో వున్న చైతన్యమే మీ వాడిలో గూడా వున్నది. వేసుకోండి. తగ్గుతుంది'' అంటూ ఇచ్చాను. ఆయన ఆ మంత్రించిన విభూతి, పంచదారా నా ఎదుటనే నోట్లో వేసుకున్నాడు.

ఇంటికి వెళ్ళి పడుకొని నిద్రపోయాడు. మరునాడు కొడుకు తండ్రితో ''నా కడుపునొప్పి తగ్గిపోయింది. కాని నిన్న నీవు ఏమి చేశావు?'' అని అడిగాడు.

తండ్రి జరిగినదంతా చెప్పాడు. కొడుకు నమ్మలేదు. ''మీ ఇద్దరూ పెద్ద దొంగలు'' అన్నాడు. ఆ సంగతి మరునాడు తండ్రి నా వద్దకు వచ్చి చెప్పాడు.

''నిజమే. మనం దొంగలమే. అతని రోగాన్ని దొంగిలించాం'' అన్నాను.

పరమ గురువులు, జగద్గురువగు శ్రీకృష్ణుడు ఈ రకమైన దొంగలు.

శ్రీరాముని స్మరిస్తూ మనం ఈ శ్లోకాన్ని చదువుతాం.

''ఆపదామపహర్తారం
దాతారం సర్వ సంపదాం
లోకాభిరామం శ్రీరామం
భుయో భుయో నమామ్యహం''

దీని అర్థమేమిటి? శ్రీరామచంద్రుడు భక్తుల ఆపదలను దొంగిలించువాడు. భక్తులకు కావలసిన వాటిని అనుగ్రహించువాడు అని పై శ్లోకం మనకు బోధిస్తున్నది. ***(1990 సెప్టెంబరు)***

## ఉపదేశవాణి

నీవు ఇతరులకు ఏమి ఇస్తావు అన్న దానిపై నీ ఆనందం ఆధారపడి వుంటుంది. నీవు పుచ్చుకొనే దాని మీద కాదు.

ఇంద్రియాలు అధీనంలో లేని వానికి బైట ప్రపంచం మీద ఏ అధికారమూ రాదు. అతడు ప్రపంచానికి బానిస అవుతాడు.

వేదాంతం అంటే జీవించే కళ. ఇంట్లోను, పొలములోను, ఫ్యాక్టరీ లోను, ఎక్కడైనా అన్ని సందర్భాలలోను అన్ని సమయాలలోను దాన్ని అభ్యాసం చేయవచ్చు.

– స్వామి చిన్మయానంద

# అధ్యాయము - 12

# గీతామకరందం

## 31. జీవిత సమస్యలకు భగవద్గీత ఇచ్చే పరిష్కారాలు

- డా. ఎస్.బి. రఘునాథాచార్య, ఎం.ఏ, పిహెచ్.డి.

(తిరుపతి కేంద్రీయ సంస్కృత విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్‌గా నున్న డా. ఎస్.బి. రఘునాథాచార్యగారితో ఇష్టాగోష్టి)

ప్ర : భగవద్గీత వేదాంతులకూ, ముముక్షువుల కొరకూ ఏర్పడిందా లేక సామాన్య ప్రజల జీవిత సమస్యలకు పరిష్కారం ఇచ్చేటందుకు ఏర్పడిందా?

జ : అది నారాయణుడు నరునికి చేసిన బోధన. మనమందరమూ నరులమే గదా. కనుక అది అర్జుననికేగాక మన అందరికీ వర్తించే ప్రబోధము.

ప్ర : జీవితంలో మానవుడు రకరకాల గడ్డు సమస్యల నెదుర్కొంటాడు. ఉదాహరణకు ఒకడికి మనస్సులో నిరుత్సాహం ఆవరించింది. ధైర్యం సన్నగిల్లింది. తన వలన ఏపనీ కాదనే నిరాశ ఏర్పడింది. దీనికి పరిష్కారం ఏమిటి?

జ : భగవద్గీత 2వ అధ్యాయం 3వ శ్లోకం చదవండి. మీకు మార్గం దొరుకుతుంది. ''నిరుత్సాహ పడవద్దు. పేడి తనమును పొందకుము. ధైర్యం తెచ్చుకో. క్షుద్రమైన హృదయ దౌర్బల్యమును విసర్జింపుము. లెమ్ము. నీ కర్తవ్యాన్ని నిర్వర్తించడానికి నడుం కట్టుము'' అని భగవానుడు మనలను ఆదేశించుచున్నాడు.

ప్ర : ఈనాడు సమాజంలో ఎక్కువ తక్కువలు మితిమీరిపోయాయి. సంపదనుబట్టి, జన్మనుబట్టి, చదువునుబట్టి ఒకరు అధికం మరొకరు హీనం అనుకొంటున్నారు. మనుషులు తోటి మనుషులను బానిసలుగా, హీనులుగా పరిగణిస్తూ ఒకరితో ఒకరు కలహించుకుం టున్నారు. దీనికి పరిష్కారమేమిటి?

జ : భగవద్గీత 5వ అధ్యాయం 18వ శ్లోకం చూడండి. ''విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణుని, గోవును, ఏనుగును, కుక్కను, కుక్కమాంసం తినే వానిని గూడ సమదృష్టితో చూచే వివేకం గలవాడే ఉత్తముడు'' అని చెప్పబడింది. కనుక మనుష్యులను అందరినీ సమభావంతో చూడడమేగాక జంతు జాలాన్నీ, యావత్తు సృష్టినీ సమదృష్టితో చూచుకొని అన్నిటిలో అంతర్యామిగానున్న పరమాత్మను దర్శించవలసినదిగా భగవద్గీత బోధిస్తున్నది.

ప్ర : కొందరంటారు గదా. రోజు కూలి చేసుకొని పట్టెడన్నం తినేవాళ్ళకు దేవుడెందుకు? బాగా డబ్బు గలవాళ్ళకు దేవుడు కావాలి గాని, తమ పొట్టకే అన్నం లేనివాళ్లు దేవుడికేమి పెడతారు? వాళ్లు దేవుని ఎలా పూజిస్తారు?

జ : దీనికి సమాధానం 9వ అధ్యాయం 27వ శ్లోకం చూడండి. నిజమే. పొట్టగూడా గడవని వాళ్లు దేవుడికి పంచభక్ష్య పరమాన్నాలు పెట్టలేరు. అలా పెట్ట మని దేవుడు నిన్ను కోరడం లేదు. ''నీవేపని చేసినా, ఏమి తిన్నా, ఏది ఇతరుల కిచ్చినా ఏ రకమైన తపస్సు చేసినా, దానినే తన కర్పించమన్నాడు'' అంతేగాని ఏదో ప్రత్యేకంగా చేసి ఆయనకు సమర్పించనవసరం లేదు. నీవు చేసే ప్రతి పనిలోనూ భగవదర్పణ భావం వుండాలి.

ప్ర : దేవుడున్నాడా? ఉంటే చూపెట్టగలవా? అంటాడొక మిత్రుడు. దీనికి సమాధానమేమిటి?

జ : దీనికి సమాధానం 10వ అధ్యాయం 41వ శ్లోకంలో వున్నది. దేవుడు తప్పకుండా ఉన్నాడు. ఆయనను గుర్తించడానికి అడుగడుగునా ప్రమాణాలు న్నాయి. చూడండి. దేవుడే ఇలా స్వయంగా చెపుతున్నాడు : లోకంలో కొన్ని పదార్థా లలో అతిశయించిన తేజస్సు కనపడుతుంది. కొన్ని వస్తువులు చాలా అందంగా, శోభగా వుంటాయి. ఒక చక్కని నర్తకి మంచి నృత్యం చేస్తున్నది. ఎర్రగులాబీ అందంగా ఘుమఘుమలాడుతుంది. పండితుడు జ్ఞానానికి పుట్టిల్లుగా ఉన్నాడు. శిల్పి చక్కని శిల్పాన్ని చెక్కగలుగుతున్నాడు. వస్తువుల్లో, వ్యక్తుల్లో కనబడే ఆ అతి శయం, ఆ శోభ, ఆ శక్తి, ఆ సామర్థ్యం ఇవన్నీ భగవంతుని అంశ వలన ఏర్పడినవే. ఆ భగవచ్ఛక్తి ద్వారా లోకంలో అన్నిచోట్ల భగవంతుని చూడవచ్చు - పాలల్లో మీగడలా, నువ్వుల్లో నూనెలా భగవంతుడు ప్రపంచంలో వున్నాడు. చూచే హృద యంతో సాధనతో వెలికితీస్తే కనబడుతాడు.

ప్ర : నా మిత్రుడంటాడు. అన్నిటికీ దేవుడు దేవుడంటావు. ఏం చేస్తున్నాడాయన? మానవుడు చంద్రమండలానికి వెళ్ళాడు. ఇతర గ్రహాల వరకు పోతున్నాడు. ఎన్నో పనులు సాధించాడు. మనం ఇన్ని ఘనకార్యాలు సాధిస్తుంటే ఎందుకు అన్నింటికీ దేవుణ్ణి పొగుడుతావు? అంటాడు. మీరేమంటారు?

జ : దీనికి సమాధానం 15వ అధ్యాయం 12,13,14,15 శ్లోకాలలో చూడండి. మీ మిత్రుడు చాలా పొరబాటు పడుతున్నాడు. దేవుడు ఏమీ చెయ్యకపోతే సృష్టే లేదు. రాత్రింబవళ్లు లేవు. లోకంలో స్వయంగా ప్రకాశించే శక్తి ఒక్క భగవంతు నికే వున్నది. మిగతా వస్తువులన్నీ ఆయన వెలుగు వల్ల నామ రూపాలు పొందు తున్నాయి.

సూర్యుడు లోకాన్ని ప్రకాశింపజేస్తున్నాడు. చంద్రుడు లోకాన్ని ఆహ్లాదపరు

స్తున్నాడు. అగ్ని వేడినిస్తున్నాడు. ఎక్కడిది వారికీ వెలుగు? భగవంతుని ప్రకాశమే వారి ముగ్గురిలో చూస్తున్నాం. ఆయన వెలుగునివ్వకపోతే వారు గూడా స్వయంగా ప్రకాశించలేరు.

భూమిలో భగవంతుడు ప్రవేశించి తన శక్తితో సకల జీవులను మోస్తున్నాడు. కాకపోతే ఇంతమంది జీవులు దీనిపై ఎలా బ్రతుకుతున్నారు? చంద్రుడుగా దేవుడుండి తన కిరణ ప్రసారం ద్వారా ఓషధులను, వృక్షాలను, సస్యాలను బాగా పెంచుతున్నాడు. అంతవరకెందుకు? దేవుడు మన శరీరాల్లో జఠరాగ్ని రూపంలో వుండి మనం తినే ఆహారాన్ని జీర్ణింపజేస్తున్నాడు. కాబట్టి మనం తినే ఆహారాన్ని ఆకలి రూపంలో వున్న పరమేశ్వరార్పణంగా తినాలి.

దేవుడు అంతరాత్మగా అన్ని జీవుల హృదయ గుహల్లో వున్నాడు. ఆయన వలననే జీవులకు స్మరణ, జ్ఞానం, మరచిపోవడం కలుగుతున్నది. మానవుడు సాధించే ప్రగతికి వెనుక దేవుని అండదండలున్నాయని, ఆయన ఆజ్ఞ లేకపోతే చీమైనా కదలదని గ్రహించాలి.

**ధన్యవాదాలు రఘునాథాచార్యగారూ! చాలామంచి విషయాలు చెప్పారు.**

*(మే 1992)*

## భార్య మరణించినపుడు కన్నీరు రాలేదేమి

లోకమాన్య బాలగంగాధర తిలక్ పూనాలో వుంటూ, కేసరి, మరాఠా అను రెండు వారపత్రికలను నడిపేవాడు. దేశభక్తి ప్రపూరితమగు రచనలు చేసేనాడు.

ఆ పత్రికలలో ఆయన విప్లవకారులను సమర్థిస్తూ వ్యాసాలు వ్రాసినందులకు దేశద్రోహ నేరం మోపి బ్రిటిష్ ప్రభుత్వం ఆయనకు ఆరు సంవత్సరాల కారాగార శిక్ష విధించి 1908లో బర్మాలోని మాండలే జైలుకు పంపింది.

జైలులో ఉండగా వారి భార్య మరణించింది. తంతి ద్వారా ఈ విషయము ఆయనకు తెలుపబడింది. జైలు అధికారి ఆ తంతిని తీసుకొని వచ్చి ఆయనకిచ్చాడు. ఆయన టెలిగ్రాం చదువుకొని మరల దానిని బల్ల మీద వుంచాడు. ఆయనకు ఏమియు శోకముగాని దుఃఖముగాని కలుగలేదు.

''మీ ధర్మపత్ని చనిపోయినది. అయినను మీ కంటివెంట ఒక్క బిందువు కూడా రాలేదేమి?'' అని జైలు అధికారి ఆయనను ప్రశ్నించాడు.

అందుకు తిలక్ చెప్పిన జవాబు : "I have no tears to shed at this occasion, because I have shed them all for my country" (ఈ సమయములో నా నేత్రముల నుండి ఒక్క కన్నీటి చుక్క గూడ రాల్చలేను. కారణమేమనగా, ఉన్న కన్నీటినంతటిని నా మాతృభూమి కొరకు ఇది వరకే కార్చినాను) తిలక్ మహాశయుని దేశభక్తి అట్టిది.

# 32. శ్రీకృష్ణుని సందేశామృతం

- శ్రీ కొల్లిపర పాండురంగారావు

(చీరాల మున్సిపల్ హైస్కూల్‌లో ఉపాధ్యాయులుగా పనిచేసిన 'విద్యావాచస్పతి' శ్రీ కొల్లిపర పాండురంగారావుగారు రాష్ట్రంలో భగవద్గీతను నాటక రూపంలో *170* చోట్ల ప్రదర్శనలిచ్చారు. అందు శ్రీకృష్ణ పాత్రను ధరించి భగవద్గీత సారాన్ని జనులకు మధురంగా వినిపించారు. వారితో జరిపిన ఇష్టాగోష్ఠి)

ప్రశ్న : శ్రీకృష్ణుడు ప్రపంచానికి అందజేసిన ముఖ్య సందేశమేమిటి?

జవాబు : శ్రీకృష్ణుడు భగవద్గీత ద్వారాను, తన జీవితము ద్వారాను అనేక రకములైన బోధనలను మానవాళికిచ్చాడు. అయితే వాటి అన్నిటిలోకీ ముఖ్యమైనది, పునాదిరాయి వంటిది, అతి ప్రధానమైనది ఏమిటంటే 'స్వధర్మపాలన'. ఎవరి కర్తవ్యం వారు నిర్వర్తించాలన్నాడు. కర్మయోగమే ఉత్తమోత్తమైన యోగం.

ప్ర : 'కర్మ' అంటే యజ్ఞయాగాది కర్మలు చేయడమా?

జ : కాదు. ఆ అర్థం ఇక్కడ వర్తించదు. 'కర్మ' అంటే పని. ఒక మానవుడుగా ప్రతి వ్యక్తీ చేయవలసిన పనులను, బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించాలి.

అసలు భగవద్గీత ఎందుకు బోధించవలసి వచ్చింది? మోహంతో కర్తవ్య విముఖుడైన అర్జునుణ్ణి కర్తవ్యోన్ముఖుణ్ణి చేయడం కొరకే కృష్ణుడు గీతాబోధ చేశాడు. ఆ ఉపదేశంలో ఉపాంగాలుగా మాత్రమే భక్తి, జ్ఞాన, సాంఖ్యయోగాలను ఉపదేశించాడు.

ప్ర : కర్మచేసే విధానం గురించి ఏమి చెప్పాడు శ్రీకృష్ణుడు?

జ : కర్మలు చేయడం గురించి మూడు ముఖ్యమైన సూత్రములను కృష్ణుడు మనకు చెప్పాడు.

ఒకటి : పనులను కౌశల్యంతో, నైపుణ్యంతో చేయాలి.

రెండు : ఫలితం మీద దృష్టి పెట్టుకోకుండా నిస్సంగత్వం (Detachment)తో పనులు నిర్వర్తించాలి.

మూడు : దైవార్పణ బుద్ధితో పనులు చేయాలి.

అపుడు ఆ కర్మ సఫలమైనా విఫలమైనా ఆచరించేవాడికి ఏమీ అంటదు. ప్రశాంతమైన మనస్సుతో వుండగలుగుతాడు.

**ప్ర : అలా కర్మ ఆచరించే వాడికి ఏమీ అంటదని అన్నారు గదా. ఒక ఉదాహరణ చెప్పండి?**

జ : ఉదాహరణ చెపితే బాగా అర్థమవుతుంది. ఒక వ్యక్తి బాగా పెట్టుబడి పెట్టి వ్యాపారం ఆరంభించాడు. అతడు రామయ్య అనే గుమాస్తాను పెట్టుకున్నాడు. అతనికి నెల జీతం మాత్రం ఇస్తాడు. ఈ గుమాస్తా ఎంతో శ్రద్ధగా, నైపుణ్యంతో పనిచేస్తాడు. అందులో లాభం రావచ్చు లేదా నష్టం రావచ్చు. నాటి వలన అతడు ఉబ్బిపోడు లేదా కృంగిపోడు. తన వేతనం మాత్రమే తాను పొందుతాడు. ఆ రామయ్య వలె కౌశల్యంతో పనిచేస్తూ ఫలితం మీద కోరిక లేకుండా ప్రతి వ్యక్తి కర్మలను ఆచరించాలి. ఈ ప్రపంచమనే వ్యాపార సంస్థలో మనమంతా నియమిం చబడ్డాము. జీవించడానికి అవసరమైనంత ఫలము మాత్రమే మనం స్వీకరిస్తూ కర్తవ్య నిర్వహణ చేయాలి. అందువల్ల సుఖదుఃఖములు మనలనంటవు.

**ప్ర : మరి, కర్మ మార్గానికి, తోడుగా భక్తి, జ్ఞానములు గూడా చెప్పబడినవి గదా. వాటి ప్రాముఖ్యములేదా?**

జ : కర్మ, భక్తి, జ్ఞాన మార్గములు మూడూ వేరు వేరు కాదు. ఇవి పరస్పర విరుద్ధములు కావు. ఇందు ఒకటి వుంటే మిగతాని రెండూ అక్కరలేదని భావించగూడదు. ఇవి మూడూ పరస్పరం కలిసి వున్నాయి (Inter linked).

జ్ఞానము లేని కర్మ, కర్మలేని జ్ఞానము, భక్తిలేని కర్మ, కర్మలేని భక్తి, భక్తి లేని జ్ఞానము ఉండడానికి అవకాశం లేదు.

**ప్ర : ఈ విషయాన్నే మరికొంత వివరించండి?**

జ : కర్మను గురించిన జ్ఞానము లేకుండా ఆ పని చేయలేము. జ్ఞానం వుండి ఆ పని చేయకపోతే ప్రయోజనం లేదు. పని నిర్వర్తించడంలో దాని యందు శ్రద్ధ లేకపోయినా, ఆ పనియందు ప్రేమ లేకపోయినా ఆ పని చేయలేము. శ్రద్ధ, ప్రేమల కల యిక భక్తి అని చెప్పబడుతుంది.

**ప్ర : సరే, బాగా చెప్పారు. అసలు భక్తి అంటే ఏమిటి? చాలామంది దేవుడి మీద భారం వేసి, అంతా దేవుడే చేస్తాడని చెపుతూ, ఏ పనీ చేయకుండా ఉంటారు. అలాంటి సోమరితనమే భక్తి అవుతుందా? భక్తికి మీరు చెప్పే అర్థం ఏమిటి?**

జ : ప్రేమ, శ్రద్ధల కలయికే భక్తి అని చెప్పాను. జ్ఞానము, కర్మలు లేకుండా భక్తి వలన

ఫలితంలేదు. అసలు ఒక దేశం మీదగాని, తల్లిమీద గాని ప్రేమ ఉండాలి. ఆ ప్రేమ తీవ్రంగా వున్నప్పుడు దేశం కొరకుగాని, తల్లికొరకుగాని కష్టాలు ఎదుర్కొంటాడు. అలా కష్టాలు ఎదుర్కొని త్యాగం చేయడానికి ఏ భావమయితే పురికొల్పుతుందో అదే దేశభక్తి. మాతృభక్తి. కనుక భక్తికి మూలము ప్రేమ, త్యాగము అని చెప్పవచ్చును.

ప్ర : దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుం అని అంటారు. ఇలా శ్రీకృష్ణునికి జగద్గురువు అనే ఉన్నతస్థానం ఎందుకు లభించింది?

జ : సమస్త జగత్తుకు ఆధారమైన, జగదుద్ధారణకు అవసరమైన మూల విద్య అగు బ్రహ్మ విద్యను శ్రీకృష్ణుడు ఉపదేశించాడు గనుక జగద్గురుత్వము ఆయనకు సిద్ధించినది.

ప్ర : దీనినే ఇంకాస్త వివరించండి?

జ : శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పిన మూల సిద్ధాంతములను ఆధారం చేసుకొని ప్రపంచంలో వివిధ మత ప్రవక్తలు వివిధ మతాలను వెలయించినారు. ఆత్మ దహింపబడదు, నాశనము కాదు, ఖండింపబడదు అని గీత చెపుతున్నది. శీతోష్ణములను, సుఖదుఃఖములను, మానావమానములను సమముగా స్వీకరించువాడే నాకు ఇష్టుడు అని కృష్ణుడు చెప్పాడు. ఇలాంటి మౌలిక సత్యాలను కృష్ణుడు చెప్పగా వాటిని అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతమతాచార్యులు, బౌద్ధ, జైన, సిక్కు, వగైరా మత ప్రవక్తలు స్వీకరించారు. కనుక శ్రీకృష్ణునకు జగద్గురు నామము సార్థకమైనది.

ప్ర : శ్రీకృష్ణుని పరిపూర్ణ అవతారమని అంటారు ఎందువలన?

జ : శ్రీకృష్ణుడు విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. యశోద శ్రీకృష్ణుడు మన్ను తిన్నాడని నోరు తెరువమంటే నోరు తెరువగా పదునాలుగు భువనములు కనిపించాయి. అర్జునునికి కృష్ణుడు విశ్వరూప సందర్శనం కలిగించాడు. అంటే విశ్వమంతయు కృష్ణునిలో వున్నది; కృష్ణుడే ఈ కనిపించే విశ్వం అనే భావన వారికి కలిగించాడు.

ప్ర : 'విశ్వరూపం' అనే పదానికి అర్థం చెపుతారా?

జ : సమస్త విశ్వమునందును, విశ్వములోని ప్రతి అణువునందును, దైవాన్ని దర్శించగల దృష్టియే విశ్వరూప సందర్శనం. పరమాణువులో ఏ చైతన్య శక్తి వలన ప్రోటానులు, న్యూట్రానులు నిరంతరం తిరుగుతూ వున్నవో, అదే చైతన్యశక్తితో యావత్తు విశ్వమూ నిండి యున్నదనే గమనికయే విశ్వరూప సందర్శనం.

*ధన్యవాదాలు పాండురంగారావు గారూ! చాలా మంచి విషయాలు చెప్పారు.*

## భగవద్గీత

మనుష్యులకు మిక్కిలి భయావహమగు మృత్యువును తృణప్రాయముగా చూచునట్లు ఉపదేశించగల మహాగ్రంథం భగవద్గీత.

*– డా. అనుమాలశెట్టి రాఘవరావు*

# 33. భక్తితత్వం

- శ్రీ పరకాల చంద్రశేఖరరావు

(విశాఖపట్టణం వాస్తవ్యులు, శ్రీ సాయికృష్ణ సేవాసమితి నిర్వాహకులునగు స్వర్గీయ శ్రీ పి.చంద్రశేఖరరావు గారితో ఇష్టాగోష్ఠి)

ప్రశ్న : భక్తితత్త్వం అంటే ఏమిటి?

జ : 'దేవుడు నా వాడు' అని అనుకోవడమే భక్తితత్త్వం.

ప్ర : కంటికి కనిపించని భగవంతుడు 'నావాడు' అని అనుకోవడం ఎలా సాధ్యం?

జ : అదే చెపుతాను. భార్యాబిడ్డలు నా వాళ్ళు. వాళ్ళ కొరకు ఎంత కష్టమైనా పడుతాను. కొడుకు చదువుకీ, కూతురు పెళ్ళికీ ఎన్ని ఇబ్బందులైనా పడి వాటిని చేస్తాను. నా వాళ్ళకోసం ఎంతటి శ్రమ అయినా పడతాను.

ప్ర : అవును. నిజమే.

జ : కాని ఈ భార్యాబిడ్డలు నాతో తాత్కాలికంగా మాత్రమే వుంటారు. అందరమూ కలిసి ఈ లోకానికి రాలేదు. అందరమూ కలిసి ఒకేసారి పోవడంలేదు. ఈ తాత్కాలిక బంధుత్వం కొరకే నా వాళ్ళనే భావంతో నానాశ్రమ పడుతున్నాను.

ప్ర : అవును.

జ : కాని ఈ జన్మలోను, క్రిందటి జన్మలోను, మరు జన్మలోను గూడ నాతో ఉండేది 'ప్రాణశక్తి'. దానికే ఆత్మ అనీ, దేవుడనీ పేరు. ఆ దేవుడు శాశ్వతంగా నా వెంట వుంటాడు. ఆ దైవాన్ని నావాడు అని భావించడమే భక్తి. ఎప్పుడైతే ఒక శాశ్వత వస్తువును ప్రేమించుతామో అది మనకు అనంతమైన ధైర్యాన్ని ఇస్తుది. దానికొరకు ప్రార్థన, నైవేద్యము, అర్చన ఇత్యాదులు చేస్తే ఆ దైవం మనకు అండగా ఉంటుంది. దానికొరకు చేసే శ్రమయే మనకు మిగిలేది. 'నావాడు' అనుకున్నప్పుడు ఒక విధమైన ప్రేమ, అతని కొరకు త్యాగము చేస్తాము. దీనికే భక్తి అని పేరు.

**ప్ర : మానవుడు అహంకారం తగ్గించుకొంటేనేగాని నిజమైన భక్తి ఏర్పడదంటారు. మరి అహంకారం ఎలా పోతుంది?**

జ : అక్కడ ఒక శవం ఉన్నది. ఇక్కడొక మనుష్యుడున్నాడు. ఇద్దరికీ తేడా ఏమిటి? ఇతనికి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఆడుతున్నాయి. శవానికి అవి ఆగిపోయాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు మనం నడిపితే నడవవు. ఆపితే ఆగవు.

ప్రాణశక్తి వలన అవి నడుస్తున్నాయి. కనుక మనమే జీవితము నడిపిస్తున్నామని అనుకోకూడదు. ప్రాణశక్తి లేకుండా శరీరం పనిచేయదు.

ప్ర : మన కృషి ఏమీ లేదా?

జ : దేవుని వలన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు నడుస్తున్నాయి. వాటి వలన మనస్సు పనిచేస్తున్నది. మనస్సు ఆజ్ఞాపిస్తే ఇంద్రియాలు పనిచేస్తున్నాయి. ఇంద్రియాల అవసరం కొరకు అన్నం తింటున్నాము. అన్నం కొరకు ఉద్యోగం చేస్తున్నాము. అంతేగాని ఉద్యోగం వలన పైవన్నీ జరగడం లేదు. మన పనుల వలననే పైవన్నీ జరుగుతున్నాయనుకోవడం అహంకారం. అహంకారాన్ని తగ్గించుకుంటే దైవచింతన ఏర్పడుతుంది. దైవమే చేయిస్తున్నది.

ప్ర : మనస్సుకు ఏకాగ్రత ఎలా లభిస్తుంది?

జ : బలవంతంగా మనస్సు నుండి ఆలోచనలను దూరంచేసే వీలు లేదు. అది క్షేమకరం కాదు. మనస్సుకు ఒక ఉన్నత లక్ష్యం ఏర్పరచుకోవడమే ఏకాగ్రతకు మార్గం. ఉదాహరణకు ఉదయం 10 గంటలకు మీరు ఆఫీసుకు వెళ్ళాలి. 9 గంటలకు భోజనం పూర్తి చేయాలి. అందుకై మీరు కూరలు తేవడానికి పోతారు. 7 గంటల వరకు ఎవరితోనైనా మాట్లాడుతారు. కాని వెంటనే మాటలు కట్టిపెట్టి కూరలు తెచ్చి ఇంట్లో ఇస్తారు. మధ్యలో వచ్చే ఇతర పనులను ఆపివేస్తారు. అలాగే మనస్సును దైవం మీద లగ్నం చేసే ఆదర్శం ఒకటి పెట్టుకుంటే మనస్సు ఎక్కడ తిరిగినా చివరకు అక్కడికే వస్తుంది. అంతేగాదు, చేసేపనులన్నీ ఆ పరమాత్మ ప్రీతికొరకు అనుకోవాలి. జీవించడమే వాడి కొరకు.

ప్ర : భగవంతుని ఎలా భావన చేయాలి?

జ : భగవంతుడు ఎక్కడో దూరంగాలేడు. భగవద్గీతలో చెప్పినట్లు అతడు ప్రతి జీవి యొక్క హృదయంలో తిష్ఠవేసుకొని వున్నాడు. మనస్సును అంతర్ముఖం చేయడమే భగవంతుని భావన చేసే మార్గం. చేసేది, చేయించేది వాడే. వాడు తప్ప ఏదీ లేదు.

**ధన్యవాదాలు చంద్రశేఖరరావు గారూ! చాలా క్లిష్టమైన అంశాన్ని అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్లు వర్ణించి చెప్పారు.**

*(ఆగష్టు 1992)*

## సంస్కృతి

నీకు ఆకలవుతుంది. అన్నం తింటావు. అది ప్రకృతి. నీకు ఆకలవుతుంది. మరొక డిని చావగొట్టి వాడి అన్నం నీవు తింటావు. అది వికృతి. నీకు ఆకలవుతుంది. నీ అన్నంలో కొంత మరొకడికి పెడుతూ నీవు తింటావు. అది సంస్కృతి. - వినోబాభావే

# అధ్యాయము - 13

# యోగము - యోగులు

## 34. యోగం ద్వారా మృత్యుంజయత్వం

-శ్రీ శ్రీ శ్రీ విశ్వయోగి విశ్వంజీ

(గుంటూరు విశ్వమందిరంలో నున్న శ్రీ విశ్వయోగి విశ్వంజీ మహరాజ్ గారితో ఇష్టాగోష్ఠి)

ప్రశ్న : నమస్కారం! ఇటీవల శ్రీ పరమహంస యోగానంద మహరాజ్ రచించిన 'ఒక యోగి ఆత్మకథ' చదివాను. అందులో అత్యంత ఆశ్చర్యకరమైన విషయాలున్నాయి. వాటిని గురించి మిమ్ము అడిగి తెలుసుకోదలచాను.

జవాబు : శుభం! తప్పక అడగండి.

ప్ర : యోగము అంటే ఏమిటి? యోగి అనగా ఎవరు?

జ : యోగమనగా కలయిక. వ్యక్తిగత మనస్సును విశ్వమనస్సు (Cosmic Mind)తో అనుసంధానం చేసుకొనడమే యోగము. విశ్వమనస్సులో సమస్త జ్ఞానము నిండివున్నది. యోగము ద్వారా అట్టి జ్ఞానము వ్యక్తి యొక్క మనస్సులోకి ప్రవహిస్తుంది. అట్టి అనుసం ధానము ద్వారా నిరంతరము శక్తిని, జ్ఞానమును పొందుతూ వాటిని సమాజ క్షేమానికి వినియోగించువాడు యోగి.

ప్ర : యోగి నీటి మీద కూర్చొనగలడా? గాలిలో పైకి పోగలడా?

జ : యోగికి వాయుస్తంభన చేయడం వలన దూదిపింజ వలె శరీరం తేలిక అవుతుంది. ఒక 100 కిలోల ఇనుపముక్కను నీటిలో వేస్తే మునుగుతుంది. దానినే దొప్పవలె తయారు చేసి నీటిలో వదిలితే తేలుతుంది. అలాగే యోగి వాయువును కుంభించడం ద్వారా, ప్రాణశక్తిని షట్చక్రములలో ఒక దానిలో నిలపడం ద్వారా, శరీ రమును తేలిక చేసుకుంటాడు. అపుడతడు నీటిలోగాని, గాలిలోగాని తేలిపో గలడు.

ప్ర : యోగి అయిన వాడు ఆహారం భుజించకుండా కేవలం వాయు భక్షణ చేసి ఉండగలడా?

జ : మనుష్యుడు ఆహారం తీసుకుంటే ఏమవుతుందో ఆలోచించండి. తీసుకున్న ఆహారం రక్తంగా మారుతుంది. ఆ రక్తం ప్రాణ వాయువుతో కలిసి శరీరంలోని ప్రతి జీవకణం లోకీ పోతుంది. అక్కడ అది 'శక్తి' గా మారుతుంది. ఆ 'శక్తి'తో మానవుడు పనులు చేసు కొనగలుగుతున్నాడు.

మరి వృక్షములు గూడ 'శక్తి'ని పొందుతున్నాయి. ఎలా పొందుతున్నాయి? అవి మనవలె ఆహారం తినడం లేదు. అవి సూర్యరశ్మిని, నీటిని, బొగ్గుపులుసు వాయువును గ్రహించి కిరణజన్యసంయోగ క్రియ ద్వారా 'శక్తి'ని తయారు చేసుకుం టున్నాయి. కాయల రూపంలో వున్న వాటిని తినడం ద్వారా మనం ఈ శక్తిని పొందుతున్నాము. అలా సూర్యరశ్మి నుండి వృక్షములు శక్తిని పొందుతున్నాయి.

అలాగే యోగి అయినవాడు సూర్యరశ్మి నుండి, వాయువు నుండి నేరుగా శక్తిని పొందగలడు. విశ్వవ్యాప్తంగా తేజోరూపంలో వున్న 'శక్తి'ని నేరుగా పొంది జీవించగలడు. ఆహారాన్ని రక్తంగా మార్చి తుదకు శక్తిగా మార్చి గ్రహించే బదులు directగా చుట్టూ వున్న వాతావరణం నుండి 'శక్తి'ని పొందే ప్రక్రియను యోగి అను సరిస్తాడు. అతడు వాయువును గూడ భక్షించనవసరం లేదు. నేరుగా 'శక్తి'నే గ్రహిస్తాడు. దాన్ని మనస్సుతో తీసుకుంటాడు.

ప్ర : యోగులు మందులతో అవసరం లేకుండా ఇతరుల వ్యాధులను నయం చెయ్యగలరా?

జ : వ్యాధి అంటే ఏమిటి? శరీరంలో రోగనిరోధక శక్తి (Resistance power) క్షీణించడం వలన ఏర్పడే అవ్యవస్థ పరిస్థితి. యోగి తన చేతితో రోగిని తాకడం వలనగాని, మానసిక ప్రకంపనాలు (Mental Vibrations) పంపడం వలన గాని, ఏదైనా విభూతి గాని, ప్రసాదంగాని ఇవ్వడం ద్వారా రోగిలో రోగ నిరోధక శక్తిని ప్రకోపింపచేస్తాడు. జబ్బు నయ మవుతుంది.

ప్ర : యోగి మరొకరి వ్యాధిని తాను భరించి రోగిని కాపాడగలడా?

జ : కాపాడగలడు. షిర్డీ సాయిబాబా తన భక్తురాలి బిడ్డ నిప్పులలో పడితే తాను ఆ బాధ భరించి బిడ్డను కాపాడాడు. గుంటూరులో ముగ్గురు వ్యక్తుల జబ్బు లను ఈ శరీరం భరించి వారిని ప్రాణాపాయ స్థితి నుండి కాపాడడం జరిగింది.

**ప్ర : అవును వారిపేర్లు గూడా నాకు చెప్పారు. అయితే ఒక సందేహం. యోగి చనిపోయిన వానిని బ్రతికించగలడా? అలా ఒక సంఘటనను 'ఒక యోగి ఆత్మకథ'లో వ్రాశారు.**

జ : మీరు గురుచరిత్ర చదవండి. అందులో దత్తాత్రేయుల వారి అవతారములలో ఒకరైన స్వామి నరసింహసరస్వతి చనిపోయిన వారి శవం మీద తీర్థం చల్లితే అతడు లేచి కూర్చున్నాడు. సత్యసాయిబాబాగారు అమెరికాలో ఉన్న ఎల్.సి.కోవాస్ అనే భక్తుడు మరణించి శవాల గదిలో ఉంచబడితే అతన్ని బ్రతికించారు. కుప్పం వాస్తవ్యుడు రాధాకృష్ణయ్యను మృత్యు ముఖం నుండి కాపాడారు. అయితే ఇలా అందరికీ జరగవు. ఏవో కొన్ని ప్రత్యేక సందర్భాలలో, ప్రత్యేక కారణాల వలన కొన్ని నియమ నిబంధనలకు లోబడి ఇవి జరుగుతుంటాయి.

**ప్ర : ఒక యోగి ఒకే సమయంలో రెండు మూడు శరీరాలతో వేరు వేరు చోట్ల కనిపించడం సంభవమా?**

జ : సంభవమే. ఈ శరీరం అలా కనిపించిందని కొందరు భక్తుల అనుభవం. యోగికి శరీరం అనేది తాత్కాలికమైన మోటారు కారు లాంటిది. అతని సంకల్పం వలన అతని ఆత్మ ఒకేసారి వేరు వేరు శరీరాలను ధరిస్తుంది. శ్రీకృష్ణుడు 16,000 మంది గోపికలకు 16,000 మంది కృష్ణులుగా దర్శనమిచ్చాడు. అందుకే ఆయనను యోగీశ్వరేశ్వరుడని అంటారు. అతడు వారందరికీ మానసికమైన ఆనందాన్ని కలిగించాడు. ఆ ఆనందం శారీరకమైనది కాదు.

**ప్ర : యోగి ఎవరినైనా కాశీలోనో, తిరుపతిలోనో జరిగే దేవుని ఉత్సవాన్ని చూపించడానికి తీసుకుపోయి చూపించి, ఆ వెంటనే తెచ్చి ఇక్కడ వుంచగలడా? కారులోనో, రైలులోనో వెళ్ళకుండా అట్టి అనుభవం శరీరానికి కలిగించగలడా?**

జ : అలాంటి సందర్భాలు యోగుల జీవితాలలో కొన్ని వున్నాయి. గురుచరిత్రలో స్వామి నరసింహసరస్వతి తన శిష్యుణ్ణి శ్రీశైలం తీసుకెళ్ళి ఉత్సవం చూపించి తీసుకువచ్చాడు. సాయం దేవునికి పుణ్యక్షేత్రాలు చూపించుకొచ్చాడు. మనుచరిత్రలో ప్రవరుడు హిమవత్పర్వతాలకు కాలికి పసరు పూసుకొని వెళ్ళాడు. మరల తిరిగి వచ్చేటపుడు పసరు లేనందున కేవలం గాయత్రీ మంత్రశక్తితో ఎగిరివచ్చాడు. గాయత్రీ మంత్రం మనిషిని యోగిగా మారుస్తుంది.

**ప్ర : యోగ సాధన అంటే ఏమిటి? తాను శరీరాన్ని కాను, తాను ఆత్మను అనే జ్ఞానం పొందడం కొరకు చేసే సాధన యోగమా?**

జ : యోగమనేది కేవలం పుస్తక పాండిత్యం వలన వచ్చేది కాదు. మొదట శరీరాన్ని, మనస్సును యమ నియమాల ద్వారా పటిష్టం చేసుకొని పవిత్రం చేసుకోవాలి. యోగిగా రూపొందడానికి తద్వారా తగిన అర్హతను సంపాదించుకోవాలి. ఆతరువాత గురువు యొక్క అనుగ్రహంతో మంత్రోపదేశం పొంది దీక్షతో సాధన చేయాలి. 'ఈ శరీరం, మనస్సు నావే. కాని ఇవి నేను కాదు' అనే పరమ సత్యాన్ని అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలి.

యోగి శరీరంలో తాను వున్నా, తాను శరీరం నుండి వేరుగా ఉంటాడు. అంతే గాని శరీరం నేను కాదు అని అనుకోవడం మాత్రమే సాధన కాదు. అది సాధనలోని ఒక భాగం మాత్రమే. అది సాధనలో చివరిమెట్టు. అది కేవలం అనుకోవడం వలన కలుగదు. వాటంతటవి అనుభూతికి రావాలి.

దీనంతటికీ గురువనుగ్రహం కావాలి. ఏ సాధన అయినా సరే మనిషిని శక్తివంతుని చేయాలి. బలహీనుని చేయరాదు. పతంజలి చెప్పిన అష్టాంగయోగంలో మొదట మనస్సును పటిష్టం చేసే పద్ధతులున్నాయి. చివరకు ధ్యానం, సమాధి పొందాలి.

ప్ర : యోగము ద్వారా మనుష్యుడు మరణాన్ని జయిస్తాడా?

జ : అవును. మృత్యుంజయత్వమే యోగము యొక్క లక్ష్యం. దీని ద్వారా చిరంజీవులైన వారు మనకున్నారు. దత్తాత్రేయుడు, హయగ్రీవుడు, ఆంజనేయుడు, గరుత్మంతుడు, అయ్యప్ప, అరవిందుడు, పరమహంసయోగానంద, రమణమహర్షి, రాఘవేంద్రస్వామి, వీరబ్రహ్మయోగి, అవధూత పిచ్చమ్మ, కంచి పరమాచార్య మున్నగువారు అట్టివారు.

మంచు గుహలలో పలువురు తేజోమయమగు జ్ఞాన తరంగాల రూపంలో ఇప్పటికీ వున్నారు. ఆదిశంకరాచార్యుని గురువగు గౌడపాదులు అట్టివారు. హిమాలయాలలో గౌడ పాదుని గుహ ఇప్పటికీ ఉన్నది. గౌడపాదుల ఆనతి ననుసరించే శంకరులు విష్ణు సహస్రనామానికి వ్యాఖ్య రచించారు. కలియుగంలో సంఘ బలమే బలము. నామ స్మరణమే మోక్షానికి మార్గము. భగవంతుని సహస్ర నామావళియే విష్ణు సహస్రనామము. దానిని స్మరించడం మోక్షానికి మార్గం.

ప్ర : మోక్షమంటే ఏమిటి?

జ : మోక్షమంటే చనిపోవడం కాదు. మోహక్షయమే మోక్షము. ఏ వస్తువు మీదా మోహము లేని మన స్థితి. నాకు ఇది కావాలి అనే కోరిక లేని స్థితియే

మోక్షము. అహంకార మమకారముల రాహిత్యం వలన ఇది ఒనగూడుతుంది. 'నేను' అనేది ఒక్కటే సత్యము అనే గ్రహింపు ఏర్పడాలి. అయితే సమాజానికి దూరం కాకూడదు. సమాజంలో జీవిస్తూనే కర్మయోగిగా తన పనులు తాను చేసు కుంటూ పోవాలి. ఫలితం మీద దృష్టి పెట్టుకోగూడదు. తామరాకు మీద నీటిబొట్టు వలె ప్రపంచంలో వ్యవహరించాలి. అది మోక్షస్థితి.

ప్ర : అట్టి మహాయోగులు ఒక భారతదేశంలోనే అధిక సంఖ్యలో అన్ని కాలాలలో వున్నారు. ఎందువలన?

జ : ఈ ప్రపంచానికి భారతదేశం హృదయస్థానంలో ఉన్నది. అందుచేత ఈ గడ్డమీద హృదయ వికాసం చెందిననారు ఎక్కువగా జన్మించారు. యోగులకిది పురిటిగడ్డ.

*ధన్యవాదాలు విశ్వంజీ మహరాజ్! మీరు అమూల్యమైన విషయాలు చెప్పారు!*

## ధర్మము

ధర్మము అద్దము వంటిది. అది మన కర్తవ్యము మనకు ప్రబోధించును. తండ్రి కెదురు తిరిగిన వాడు తన కొడుకుచే అవమానింప బడును. మిత్రులను మోసగించిన వాడు మిత్రులను కోల్పోయి తన్ను తాను మోసగించు కొనును.

– ఎక్కిరాల కృష్ణమాచార్య

## మానవుడు

మానవుడు 'శివం'గాని శవం కాదు (శివం = శివుడు). మానవునికి మూడు నేత్రములున్నవి. అవి సూర్య, చంద్ర, అగ్ని నుండి వచ్చినవి. అగ్ని నేత్రము అంతర్నేత్రము. అవి యోగశక్తిచే మాత్రమే తెరువబడును. త్రినేత్రుడైన శివుడు భూత, భవిష్యత్, వర్తమానముల మూడింటిని చూడగలడు.

నీవు పదేండ్ల క్రిందట ఒక పిల్లవానిని చూచియున్నచో వాని అప్పటి రూపమునే నీ మనసులో మరల చూడగలవు. ఇప్పుడెట్లున్నాడో, ఇక పదేండ్లకెట్లుండునో నీవు చూడ జాలవు. దానిని యోగాభ్యాసము చేత సంపాదించుకొనవచ్చును. అపుడు నీవు దేశ, కాలముల కధికారి వగుదువు.

– శ్రీ సత్యసాయిబాబా

# 35. అవధూత పిచ్చమ్మ

- శ్రీ ఎం.ఆర్. నాగేశ్వరరావు, గుడివాడ

''దేవుణ్ణి ఎవడు చూపిస్తాడురా? అసలు యెవడు చూపించగలడు? దేవుణ్ణి చూడాలనే కాంక్ష లోపల నుండి యేరల్లే పొంగి పొర్లి రావాలిరా.

వీడికి యెవడు చూపించాడురా? వీడు రాత్రి పగలు తెలియకుండా శ్మశానాల్లో చెట్టు తొర్రలో రక్కసి కంపల్లో కూర్చుని దేవుడి కోసం ఏడ్చాడు. ఆకలయితే దోసిళ్ళతో బూడిద నోట్లో పోసుకొని కాలవలో నీళ్ళు తాగి ఆకలి తీర్చుకొని దేవుడికోసం రావి ఆకులా అల్లాడిపోయాడు. అప్పుడు కాని దర్శనం కాలేదు వీడికి'' అంటూ స్త్రీ రూపంలో ఉన్న దివ్యమంగళ రూపం దేవుణ్ణి దర్శించే మార్గం చూపమని అడిగే పండిత ప్రకాండులకు దేవుని పట్టుకునే రహస్యం ఉపదేశించేది. ఆమెయే అవధూత పిచ్చమ్మ.

ఆమె తనను గూర్చి చెప్పేటప్పుడు 'వీడు' అనీ 'రాముడ'నీ చెపుతుంది. అమ్మకు అక్షర జ్ఞానం లేదు. కాని సాహిత్య సామ్రాట్టులు అక్షయానందానికి ఆమె పాదాల ముందు శిరసు వంచారు. అమ్మ మాల కులంలో జన్మించింది. అయినా అగ్ర కులజులు సయితం ఆమె పాద పద్మాలను అర్చించారు. గుడివాడ తాలూకా కురుమద్దాలి గ్రామవాసులు వడ్డె ముత్తాయి, వీరమ్మలకు పిచ్చమ్మ 1870లో జన్మించింది.

చిన్నతనం నుంచీ పిచ్చమ్మకు అకస్మాత్తుగా బొమ్మ మాదిరి నీలుక్కుపోవడం, ఎవరో గొంతు పట్టేస్తున్నట్లు మూగపోవడం జరిగేది. తల్లిదండ్రులు గాలి చేష్టలని భూతవైద్యం చేయించినా ఆమెలో మార్పు కనబడలేదు. ''అమ్మా! నాలోనే ఎక్కడో నాదాలు, శంఖ వేణువు వూదినట్లు వినబడుతున్నాయనీ, వినపడగానే నన్ను నేను మరచిపోతాననీ'' అనేది. పిచ్చమ్మకు తనలోనే తనంత వయస్సుగల బంగారు బొమ్మలాంటి అమ్మాయి కనిపిస్తుండేది. అంతలోనే మాయమవుతున్నట్లుండేది. ఎవరీ అందాల బాల? అని తల్లి నడుగుతుండేది.

పిచ్చమ్మని గుడివాడ తాలూకా తుమ్మలపల్లి గ్రామ మాలపల్లిలో నీలంవారి అబ్బాయి కిచ్చి పెళ్ళి చేశారు. ''మూర్ఛలదాన్ని మోసం చేసి కట్టారు'' అని అంతా పరిహాసం చేశారు.

పిచ్చమ్మకు కూతురు కలిగింది. భాగ్యమ్మ అని పేరుపెట్టారు. పిచ్చమ్మ భర్త

పరలోక గతుడైనాడు. పునర్వివాహానికి ఆమె సుతరామూ ఒప్పుకోలేదు. భాగ్యమను పిచ్చమ్మ అల్లారు ముద్దుగా పెంచింది. తాను భూస్వాముల పొలాల్లో పని పాటలు చేసేది. నాలుక కోసినా అబద్ధ మెరుగదు. కండపుష్టి, ధర్మపుష్టిగల పిచ్చమ్మ ఇద్దరు చేసే పని ఒక్కతే చేసేది. పిచ్చమ్మ ముఠామేస్త్రి. తాను ధర్మంగా నడవడమేగాదు, తన ముఠాలో అందరూ అట్లా నడవవలసిందే!

పిచ్చమ్మ వూళ్ళో వున్న అన్న కొడుక్కి భాగ్యాన్నిచ్చి పెళ్ళి చేసింది. కాని మూణ్ణాళ్ళ ముచ్చటగా అతడు కాస్తా రాలిపోయాడు. పిచ్చమ్మ కూతురుని దగ్గర పెట్టుకొని ఎలాగో కాలం ఈడుస్తోంది.

కూతురుకు మారు మనువు చేయడానికి ఆమె పూర్తిగా వ్యతిరేకం. కాని పిచ్చమ్మ అక్క కపిలేశ్వరపురం నుండి వచ్చి భాగ్యానికి మరల పెళ్ళి చేసి తీరాలని పట్టుబట్టి కపిలేశ్వరపురం తీసుకెళ్ళి మూడుముళ్ళు వేయించింది.

పిచ్చమ్మ అల్లుణ్ణి చాలా ప్రేమగా చూసేది. వచ్చినప్పుడల్లా రాచమర్యాదలు చేసి రూకలిచ్చి పంపించేది. కాని అదేమి దురదృష్టమోగాని అతడు మాత్రం భాగ్యమ్మ మీద కస్సుబుస్సు లాడుతూ కత్తులు నూరేవాడు.

అత్తవారింట్లో పెట్టే బాధలు పడలేక భాగ్యం నూతిలో పడి చనిపోయింది! పిచ్చమ్మ కాసంగతి తెలిసి కపిలేశ్వరపురంలో ఆ నూతి వద్దకు పోయి వల వల ఏడుస్తూ కురుమద్దాలి వచ్చేసింది. అంతటితో పిచ్చమ్మ జీవితం పూర్తిగా మారిపోయింది. రాత్రి పగలు 'భాగ్యం! భాగ్యం!' అంటూ ఒకటే శోకం. సూర్యచంద్రులే ఆమెను చూడలేకపోతున్నారు.

ఒక గోసాయి ఆ వూరు వచ్చాడు. ''నిరుడు ఇదే రోజుల్లో ఈ వూరు వచ్చాను. ఆ గుడిసెలో నుండి ఏడుపు వినిపించింది. ఇప్పుడూ వినిపిస్తోంది. ఏమిటి కారణం?'' అని గ్రామ స్థులనడిగాడు. వారు పిచ్చమ్మ గాథ చెప్పారు. ఆ గోసాయి పిచ్చమ్మ గుడిసెలోకి వెళ్ళి అరగంట వుండి తన దారిన తాను పోయాడు.

పిచ్చమ్మలో మార్పు వచ్చింది. అయితే ఇదివరలో చనిపోయిన భాగ్యం కొరకు ఏడ్చింది. ఇపుడు సర్వాంతర్యామి అయిన భగవంతుని కోసం ఏడుస్తోంది.

పిచ్చమ్మ ఇల్లు వదిలి వేసింది. సకల జీవులకు లయ స్థానమైన రుద్రభూమి ఆమె నివాసం. మృత్యు రహస్యాన్ని శోకంతో శోధిస్తున్నది. ఆమెకు మతం లేదు. తంత్రం లేదు. ఆత్మ విచారణ అంతకు ముందే లేదు. ఒట్టి ఏడ్పు!! ఏడ్పే!!

ఆమె ఎవరో తెచ్చిపెట్టే ఆహారంతో కాలం గడిపేది. ఒక్కొక్కసారి ఆకో అలమో, కాలవలో వండ్రో, శ్మశానంలో బూడిదో కడుపులో వేసుకొనేది.

అమ్మ ఏమి చెబితే అది జరిగేది. 1925లో అమ్మకు ఆశ్రమం కట్టారు. రోజు విడిచి రోజు అమ్మ సమాధిలోకి వెళ్ళేది. అమ్మ ధనం ముట్టుకొనేది కాదు. అమ్మ ఐశ్వర్యాన్ని 'రోత' అని పిలిచేది. పొరబాటున ధనాన్ని, వెండి బంగారాలను

ముట్టుకొంటేనే ఒళ్ళంతా కాల్చి నట్టుండేది. మామూలుగా అమ్మ నగ్నంగాను, అర్థ నగ్నంగాను వుండేది. కామ సంకల్పం కలవాళ్ళు వస్తున్నారనగానే ''వాడి కంట్లో దోషం ఉందిగాని నాకు దుప్పటి కప్పండిరా'' అనేది.

ఒకసారి సనాతన విప్రులొకరు అమ్మ దగ్గరకు వచ్చి అమ్మ మాలది అనే దృష్టితో దూరంగా వుండి మాట్లాడుతున్నారు. అమ్మ వేదాంత మూలతత్వాన్ని ఇలా అతనికి వివరిం చింది: ''వడికిన పోగులు మెళ్ళో వేసుకొని గొప్ప కులం వాడినని భ్రమపడుతున్నావు. వడకని పోగులు నీలో ఉన్నాయి. వెతికి చూసుకో దొరుకుతాయి''.

అమ్మ ఆధ్యాత్మిక మార్గం అంత సులభం కాదని చెపుతూ ఈ క్రింది ఉపమానాలు ఇస్తుండేది :

''గోంగూర, తోటకూర అనుకున్నార్రా? చేటలో వడ్లు పోసి వెలపెట్టి కొనడానికి? వేదాంతం ఆనప గుగ్గిళ్ళు కావు. ఇనుప గుగ్గిళ్ళు.

ఆత్మ యుద్ధం చేయాలి. నా-నీ-లు లేకుండా పోవాలి. అపుడు కనబడతాడు దేవుడు. ఎద్దల్లే తిని మొద్దల్లే పడుకుంటే దేవుడు కనపడడు''.

పాములు అమ్మ మీద ప్రాకడం అనేక మంది భక్తులు చూశారు. అనుకో కుండా అమ్మ భారతదేశ యాత్ర చేసింది. వల్లభనేని అన్నపూర్ణమ్మ, పిన్నమనేని నాగయ్య అమ్మ వెంట వెళ్ళారు. ''యాత్రలని వెళ్ళాంగాని క్షేత్రాల్లో దేవుడి కంటే నాలోని దేవుడే కమ్మగా వున్నాడు'' అన్నది అమ్మ.

అమ్మ స్థూలదేహానికి ఏమాత్రమూ ప్రాముఖ్యమిచ్చేది కాదు. ''ఇందులో గాలిపోతే ఏ మున్నదిరా?'' అనేది. చివరి రోజుల్లో కర్ర పట్టుకు నడుస్తూ ''ఈ కట్టెకు ఈ కట్టె సాయం'' అనేది.

పండితుల నుండి పామరుల వరకు ఆమెకు ఎందరో భక్తులున్నారు. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు, శ్రీ వేలూరి శివరామశాస్త్రి, శ్రీ గుడిపాటి వెంకటాచలం, శ్రీ త్రిపురనేని గోపీచంద్ మున్నగువారు భక్తితో దర్శించి తమ రచనలలో ఆమెను ప్రస్తుతించారు. ఆమె 1951 నవంబర్ 15న శరీరం చాలించారు.

## అమ్మ

| | |
|---|---|
| తన బిడ్డడు పాలు త్రాగ | కన్న తల్లి మనసు కన్న |
| తల్లి కడుపు నిండిపోవు | వెన్నపూస కఠినమురా! |
| తన తనయుడు నిదురబోవ | అమ్మ ప్రేమతో బోల్చగ |
| తల్లికి శ్రమ లెండిపోవు | అమృతమ్మె చేదగురా! |
| ఊకొట్టుచు బిడ్డనవ్వ | తల్లి ఎదుట త్యాగమ్మే |
| ఉల్లమెల్ల నుల్లసిల్లు | తల వంచక తప్పదురా! |

– శ్రీ కొల్లిపర పాండురంగారావు, చీరాల

# అవధూతల అద్భుత లీలలు

మన దేశం పుణ్యభూమి. ఇచట ఎందరో యోగులు, యతీశ్వరులు, అవధూతలు వున్నారు.

హరిద్వారంలో గంగా తీరంలో పలువురు మహనీయులను చూచాను. వారిలో ఒక యతీశ్వరుడు కొబ్బరి పీచుతో చేసిన సన్నని పట్టాను గోచీగా పెట్టు కొని ధ్యానం చేసుకుంటూ వున్నాడు.

నేను ఆయనకు నమస్కరించి నిలబడ్డాను. ఆయన కళ్ళు తెరిచి అగ్నిహోత్రంలో వుండే బూడిదను నా దోసిట్లో వేశాడు. అది నా చేతిలో పడగానే అరటి పండుగా మారింది! తిను అన్నాడు. మహాప్రసాదంగా భావించి పుచ్చుకున్నాను. పిదప విభూతి చేతిలో వేశాడు. అది గులాబి పువ్వుగా మారింది. దానిని కళ్ళకద్దుకొని ఇవతలికి వచ్చాను.

ప్రయాగలో గంగానదీ తీరంలో 'అంతర్థానస్వామి' అని ఒకరున్నారు. ఆయనకు తలవంచి నమస్కరించాను. తల ఎత్తి చూస్తే అక్కడ లేడు. ఒక ఫర్లాంగు దూరంలో కనిపించాడు. అందుకే ఆయనను 'అంతర్థానస్వామి' అంటారు. చక్కని కాంతి గల శరీరం. ఆయనకు ఎనిమిది భాషలు వచ్చు.

మీ పేరు ఏమిటి అని అడిగితే అన్ని పేర్లు నావేనన్నారు. మీ తల్లిదండ్రు లెవరంటే భగవంతుడు, మాతాజీ అని జవాబు చెప్పారు. మీ నివాసం ఏదంటే సర్వత్రా ఉంటానన్నారు.

వారిని ఏ నామస్మరణ ఉత్తమమైనది అని అడిగాను. ఏ నామం కావలిస్తే ఆ నామం చేసుకోండి.దేవుణ్ణి ఏ పేరుతో పిలిచినా మంచిదే నన్నారు.

ఇంకా ఇంకా గుచ్చి గుచ్చి అడుగగా నా చెవిలో త్రయోదశాక్షరి ''శ్రీరామ జయరామ జయ జయరామ'' అనే మంత్రం చాలా గొప్పదన్నారు. దీనిని ప్రతిదినం 73సార్లు పలికితే మహా పాపములు గూడ హరిస్తాయి. అని చెప్పాడు.

– శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రి, తెనాలి

# అధ్యాయము - 14

# సందేహనివృత్తి

## 36. సందేశ తరంగిణి

- స్వామి వివేకానంద

(స్వామి వివేకానందుని ప్రవచనములలో కొన్నిటిని ఎంపికచేసి ప్రశ్నోత్తర మాలికగా రూపొందించాము. - సంపాదకుడు)

ప్రశ్న : మీరు భారత ప్రజలకిచ్చే నూతన సందేశమేమిటి?

**జవాబు :** నానాటికీ నాకు విస్పష్టంగా గోచరిస్తున్న విషయమేమిటంటే - సమస్తము ధైర్య సాహసాలపై ఆధారపడి యున్నది. ఇదే నా నూతన సందేశం. వలయునది పురుషకారము. పురుషకార విహీనునకు పరమేశ్వరానుగ్రహము లభించుట కల్ల. శారీరకంగా మనము దుర్బలులము. మన కష్టాల్లో మూడవ వంతుకు దైహికమైన దౌర్బల్యమే కారణము. ముందు మన యువకులంతా ధృఢ శరీరులు కావాలి. తరువాతనే మతం గురించి ఆలోచించాలి.

**ప్ర : మన జాతి పతనానికి మూల కారణమేమిటి?**

**జ :** ఒక్క విషయమాలోచించండి. కేవలం 4కోట్ల మంది ఆంగ్లేయులు ఇక్కడ 30 కోట్ల మంది భారతీయులను ఎలా పాదాక్రాంతం చేసుకోగలిగారు? ఇందలి రహస్యమేమిటి? దీని మౌలికమైన కారణమేమిటి?

ఆ నాలుగు కోట్ల మందీ తమతమ ఇచ్ఛాశక్తులను ఏకం చేయడం వలన ఉజ్జ్వలమైన శక్తి కేంద్రంగా రూపొందారు. మన 30 కోట్లమందీ ఎవరికి వారుగా వ్యవహరిస్తూ తమ శక్తులను విడివిడిగా నిలుపుకున్నారు. అందుచేత పతనమైనాం. ఇపుడు మన జాతిని పునరుద్ధరించాలంటే ప్రజలను సంఘటితం చేయాలి. వారి శక్తులను ఏకీకృతం చేయాలి. వారిని ఒక్క మనస్సుతో ఆలోచింపచేయాలి. గుర్తుంచుకోండి. భారతదేశ భవిష్యత్తు కేవలం దీనిమీదనే ఆధారపడి యున్నది. ఇచ్ఛాశక్తులను సమన్వయ పరచడం, కలపడం, ఏకశక్తిగా రూపొందించడం, ఇదే దేశ భవిష్యత్తుకు రాజమార్గం.

**ప్ర : భారత భూమి యొక్క ప్రత్యేకత ఏమిటి?**

**జ :** ఈ భూమండలంలో పుణ్యభూమి అనిపించుకోగల దేశం,

కర్మానుభవానికై ప్రపంచంలో ఎక్కడెక్కడినుంచో జీవులు వచ్చి అవతరించే దేశం, మోక్షమార్గంలో జీవయాత్ర గడిపే ప్రతి జీవీ చిట్టచివర మజిలీగా చేసుకోవలసిన దేశం, సౌజన్యంలో ఔదార్యంలో పవిత్రతలో ప్రశాంతతలో అన్నిటికీ మించి ఆత్మావలోకనలోనూ ఆధ్యాత్మికతలోనూ మానవజాతి పరాకాష్టనందుకున్న దేశం ఏదైనా వుంటే అది భారతదేశమే!

ప్ర : పాశ్చాత్య దేశాల నుండి మనం ఏమి నేర్చుకోవాలి?

జ : ఐరోపా అమెరికాలలోని జనులలో ఆత్మవిశ్వాసమనే మహత్తర శక్తి స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది.

ఆంగ్లేయ బాలుణ్ణి ఎవరిని కదిలించినా 'నేను ఇంగ్లీషువాణ్ణి. నేను ఏమైనా చెయ్యగలను' అని ధైర్యంగా చెపుతాడు. అమెరికన్ బాలుడూ అలాగే అంటాడు. మన దేశంలో పిల్లలు అలా చెప్పగలరా? వాళ్ళు చెప్పలేరు సరిగదా ఆ పిల్లల తల్లిదండ్రులు గూడ చెప్పలేరు. మనం ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయాం.

అందుచేత మన యందు మనం విశ్వాసాన్ని పెంపొందించుకొనే ఆదర్శం మనకిప్పుడెంతో సహాయం చేస్తుంది. ఆత్మవిశ్వాసం అత్యుత్తమమైన ఆదర్శమని అందరికీ బోధించి దాన్నే ప్రజల చేత అభ్యసింప చేసినట్లయితే మనకున్న అనర్థాలూ కష్టాలూ ముప్పాతిక మూడు వంతులు అదృశ్యమై పోతాయి.

ప్ర : ఈ ఆత్మ విశ్వాసం ఆవశ్యకతను గురించి మరికొంత చెపుతారా?

జ : మనదేశానికి ఒకానొక ఆంగ్లేయుడు మామూలు గుమాస్తాగా వచ్చాడు. డబ్బు చాలక, ఇతర కారణాల చేత ఒకటి రెండుసార్లు ఆత్మహత్య చేసుకోవడానికి ఉద్యుక్తుడైనాడు. వైఫల్యం పొందడంతో అతనిలో అతనికి విశ్వాసం కలిగింది. మనం గొప్ప వాళ్ళమయ్యేటందుకు జన్మించామని గట్టిగా నమ్మాడు. ఆ మనిషే సామ్రాజ్య నిర్మాత అయిన రాబర్ట్‌క్లైవ్.

అందుచేత నిన్ను నువ్వు నమ్ముకో. నీకు భౌతిక ఐశ్వర్యం కావాలా? దానికై కృషి చెయ్యి. అది నీకు లభిస్తుంది. ధీమంతుడవు కాదలిస్తే ఆ మార్గంలో కృషి చెయ్యి. త్వరలోనే ఇక్కడే ఈ జన్మలోనే బంధ విముక్తుడవవుతావు.

ప్ర : మనదేశ ప్రజలలో వున్న ముఖ్యమైన లోపమేమిటి?

జ : ఇపుడు భారతదేశంలో ముగ్గురు మనుషులు ఐదు నిముషాల సేపు కలిసి పనిచేయలేరు. ప్రతివాడూ పదవి కొరకు పెంపర్లాడుతాడు. అట్టి స్థితిలో సంస్థ త్వరలో నశిస్తుంది.

ఇక్కడ ప్రతివాడికీ నాయకత్వం కావాలి. ఎవ్వడూ ఆజ్ఞలను శిరసావహించడు. మహాకార్యాలను సాధించాలంటే నాయకుని ఆదేశాలను తు.చ తప్పకుండా పాటించాలి. నా భవిష్యత్ జీవితమంతటినీ మఠంలోని కాలువలు కడగమని నా

గురుదేవుడు ఆజ్ఞాపిస్తే మారు మాటాడకుండా శిరసావహిస్తాను. ఈ విధేయతా గుణాన్ని అలవరచుకోండి.

ప్ర : జాతి ఉన్నత దశను ఎలా అందుకుంటుంది?

జ : అన్ని రాజకీయ సామాజిక వ్యవస్థలు స్థిరముగా నిలబడుటకు మనుష్యుల శీలమే ప్రాతిపదికగా వుంటుంది. పార్లమెంటు సభ్యులు చేసే చట్టాల వలన ఏ జాతీ ఉన్నత దశనందుకోలేదు. ఆ దేశ ప్రజలు గొప్ప వారయితేనే ఆ జాతి గొప్ప స్థాయి నందుకుంటుంది. ప్రపంచంలో వున్న యావత్తు సంపదకంటే గూడా మనుష్యులు ఎక్కువ విలువైనవారు. ఒకవేళ మనకు కావలసిన అవసరాలనన్నిటినీ ప్రభుత్వం సమకూర్చిందనుకోండి. వాటిని సద్వినియోగ పరచగల శీలవంతులైన వ్యక్తులేరీ? కనుక అట్టి మనుష్యులను మొదట తయారుచేయండి.

ప్ర :బాల బాలికలకు ఎలాంటి విద్య జరపాలి?

జ : కేవలం కొంత సమాచారాన్ని బుర్రల్లో కుక్కితే అక్కడది గందరగోళం చేస్తూ జీర్ణం కాకుండా వుండిపోయేదికాదు విద్య అంటే. మనిషిని సంస్కరించి, శీలవంతుణ్ణి చేసి, జీవితాన్ని చైతన్యవంతం చేసే భావ పరంపరయే సరియైన విద్య. నాలుగైదు ఉత్తమ భావాలను వంటబట్టించుకొని జీవితాన్ని మలుచుకున్నవాడు యావత్తు గ్రంథాలయాన్ని వల్లె వేసిన వాడి కంటె ఉత్తమ విద్యావంతుడనడంలో సందేహంలేదు.

## తల్లిప్రేమ

భార్యాభర్తలిద్దరూ ఉద్యోగాలు చేసుకుంటున్నారు. ప్రొద్దునే పోయి రాత్రికి తిరిగి వస్తారు. వారికి బిడ్డయొక్క యోగక్షేమాలను విచారించే తీరిక లేదు. అందుచేత కొడుకును అక్షరాల క్లాసు నుంచే హాస్టలులో చేర్పించి చదివిస్తు న్నారు. నెలనెలా ఖర్చులకు డబ్బు పంపిస్తారు. ఇలా ఒక ఆరునెలలు హాస్టలులో వున్నాడు పిల్లవాడు.

పుట్టినరోజు పండుగకు ఇంటికి తీసుకొచ్చారు. ఆనాడు తండ్రి పిల్లవాడి కోసం కొత్త చొక్కా, లాగు కుట్టించారు.కాళ్ళకు బూట్లూ మేజోళ్ళూ తెచ్చారు. ఒక డబ్బానిండా రకరకాల బిస్కెట్లు,స్వీట్లు తెచ్చారు.

''ఇవ్వన్నీ నీ పుట్టిన రోజు కానుకలు''అని చేతికిచ్చారు తల్లిదండ్రులు.

''నాకు ఇవేవీ వద్దు''అని వాటిని దూరంగా త్రోసేసి ''నాకు నువ్వే కావాలి''అని వెళ్లి అమ్మ ఒళ్ళో కూచున్నాడు పిల్లవాడు!

పిల్లలకు ప్రధానంగా కావలసింది తల్లి ప్రేమ. ఆ ప్రేమ కరువైతే వాళ్ళకు అన్నం సయించదు. నిద్రపట్టదు. మనస్సు భయాందోళనలతో నిండిపోతుంది.

– శ్రీమతి జి.సత్యవాణి, భాగ్యనగర్

# 37. ఉపదేశామృతం

\- శ్రీరామకృష్ణ పరమహంస

(శ్రీరామకృష్ణ పరమహంస ప్రవచనములలో కొన్నిటిని ప్రశ్నోత్తరాలుగా పేర్కొంటున్నాము)

ప్రశ్న : దేవుడు అంతటా వ్యాపించి యుండగా వేరే దేవాలయముల అవసరమేమి?

**జవాబు :** ఆవు శరీరంలో రక్తం ద్వారా పాలు దాని శరీరమంతటా వ్యాపించి యున్నవి. కాని దాని చెవులు గాని కొమ్ములుగాని పితకడం వలన పాలురావు. అదేవిధంగా భగవంతుడు సర్వత్రా వ్యాపించి ఉన్నప్పటికీ నీవు భగవంతుని అన్నిచోట్ల చూడలేవు. ప్రాచీనకాలం నుండి భక్తుల ఆధ్యాత్మిక సాధనల వలన, వారి జీవితాల వలన పావనమైన దేవాలయాలలో భగవత్‌శక్తి ఎక్కువగా ప్రస్ఫుటమవుతుంది.

**ప్ర : భగవంతుని సాక్షాత్కారము పొందుటకు ఉపాయమేమి?**

**జ :** భగవంతుని కోసము నీవు తపించగలవా? విలపించగలవా?

భార్యకోసమో బిడ్డలకోసమో ధనముకోసమో లోకులు కడవలకొలది కన్నీటిని కార్చెదరు. కాని భగవంతుని కోసము విలపించువారెవ్వరు?

బిడ్డడు ఆటలలో మునిగి యున్నంతవరకు తల్లి వంటను ఇతర గృహకృత్యములను చేసుకొనుచుండును. కాని బిడ్డడు ఆట వస్తువులతో సంతుష్టి నందక వానిని ఆవలకు త్రోసి తల్లికోసము విలపించునేని, తల్లి ఇక జాగుచేయదు. వంట యింటిలో నుండజాలదు. బహుశా పొయ్యిమీద నుండి వంటకుండను జారవిడచి ''మా నాయన మా తండ్రి'' అనుచు ఆత్రముతో బిడ్డ వద్దకు పోయి వానినెత్తుకొనును. జగజ్జనని యిట్టిదే.

**ప్ర : మానవుడెట్లుండ వలెను?**

**జ :** జీవితము సఫలము కావలెనన్న మానవునకు నిజమైన పౌరుషముండ వలెను. కాని పాలలో నానవేసిన మరమరాలవలె మెత్తనై ఎందున బొందని పౌరుషహీను లనేకులుందురు. దీక్ష వహించి ఏ కార్యము నైనను కొనసాగించుటకు సంకల్పశక్తి శూన్యము. మనోబలము అంతకంటే పూజ్యము. ఇట్టివారి జీవితములు ఎందులకు కొరగానివి.

**ప్ర : మానవునికి పరమాత్మ గురించిన చింత ఏల అవసరము?**

**జ :** దిక్సూచిలోని ముల్లు ఎల్లప్పుడు ఉత్తర దిశను చూపుచుండును.

అందువలన ఓడ దారి తప్పకుండ పోగల్గుచున్నది. అట్లే మానవుని హృదయము భగవంతుని వైపు త్రిప్ప బడియున్నంతవరకు అతడు సంసార సాగరమున దారి తప్పకుండ వర్తించగలడు.

ప్ర : గంగాజలము ప్రత్యేకత ఏమి?

జ : గంగాజలమును సామాన్యమైన నీరని భావించరాదు. బృందావన ధూళిని సామాన్యమైన ధూళియని తలపరాదు. పూరీ జగన్నాథ దేవుని మహా ప్రసాదమును అన్న ముగా నెంచతగదు. ఇవి అన్నియు సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపములు.

**ప్ర : విభీషణుడు తన రాజగు రావణుని మాటలను ఎందుకు తిరస్కరించినాడు? అది ద్రోహము కాదా?**

జ : భరతుడు , ప్రహ్లాదుడు, శుకదేవుడు, విభీషణుడు, పరశురాముడు, బలి, బృందావన గోపికలు - వీరందరు తమ పెద్దలు భగవద్విషయమున తమకు అడ్డుతగులుటచే వారియెడ అవిధేయులై వర్తించినారు.

**ప్ర : ఉత్తముడైన మానవుడెట్లుండును?**

జ : ధనమునకు ఎవడు దాసుడుకాడో ధనమెవ్వనికి దాస్యము చేయునో వాడే నిజమైన మానవుడు. ధనమును సరిగా వినియోగించుట ఎరుగని వానిని మానవుడన తగదు.

తేలికయైన పదార్థమును, పనికిమాలిన పొల్లును విడిచి ఘనమై ఉపయోగ పడు పదార్థములను చేట తనలో నిలుపుకొనును. ఉత్తములైన వారి స్వభావమి ట్లుండును.

**ప్ర : ఆచరణ యొక్క ప్రాముఖ్యమేమి?**

జ : 'స,రి,గ,మ,ప,ద,ని' అని ఊరక నోటితో అనుట తేలికయే. కాని వానిని ఒక వాద్యము మీద పలికించుట కష్టము. అటులనే మత ధర్మములను గురించి మాట లాడుట సులభమే కాని ఆచరించుట దుర్లభము.

**ప్ర : సాధకునికి, లౌకికునికి గల తారతమ్యమెట్టిది?**

జ : మూడు బొమ్మలున్నవి - ఒకటి ఉప్పుతో చేసినది. రెండవది గుడ్డతో చేసినది. మూడవది రాతితో చేసినది. ఈ బొమ్మలను నీటిలో ముంచినచో మొదటిది కరిగిపోయి రూప నాశనమొందును. రెండవది చాలా నీటిని పీల్చుకొనును గాని ఆకృతి పోగొట్టుకొనదు. మూడవది ఎట్టిమార్పు చెందదు. ఆత్మను పరమా త్మతో లయించి ఐక్యమొందిన జీవుడే మొదటి బొమ్మ. బ్రహ్మజ్ఞానానంద మయుడగు భక్తుడే యిందలి రెండవ బొమ్మ. తన హృదయమున తత్వజ్ఞానమునకు అణుమాత్రమైన అవకాశమీయని శుద్ధ లౌకికుడు మూడవబొమ్మ.

**(పైన పేర్కొనబడిన జవాబులు శ్రీ రామకృష్ణ బోధామృతము నుండి గ్రహింపబడినవి)**

# 38. రమణవాణి

–భగవాన్ రమణమహర్షి

(శ్రీ అత్యం సూర్యంగారు రచించిన ''వినీలాకాశంలో వింతకాంతి'' అనే గ్రంథంలో భక్తులు అడిగిన అనేక ప్రశ్నలకు భగవాన్ రమణమహర్షి తెలిపిన సమాధానములు పేర్కొనబడినవి. వాటిలో కొన్నిటిని పాఠకుల కందజేస్తున్నాము)

ప్రశ్న : ఆత్మానుభూతి పొందడానికి ప్రప్రథమంగా చెయ్యవలసినదేమిటి?

జవాబు : ఇంద్రియ నిగ్రహం.

ప్ర : స్త్రీ వాంఛ పోయేదెట్లా?

జ : నువ్వొక పురుష దేహాని వనుకొంటే ఆమె ఒక స్త్రీ దేహంగా కనబడుతుంది. కాని నువ్వు దేహానివికావు. ఆత్మవు. ఆత్మలో స్త్రీ పురుషబేధం లేదు. ఇక స్త్రీ వాంఛ ఎక్కడుంటుంది?

ప్ర : పరమేశ్వరుడికి ప్రియమైనదేది?

జ : నీ విధి నీవు సక్రమంగా నిర్వర్తించడం.

ప్ర : మనోచలనం ఆపడానికేదైనా సులభోపాసన ఉందా?

జ : ఉంది. నీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలను గమనిస్తూ వుండు.

ప్ర : ధ్యానం చేసేటప్పుడు భ్రూమధ్యం వద్ద దృష్టి నిలపాలా?

జ : హృదయం మీద నిలపడం మంచిది. హృదయం ఎదురు రొమ్ముకు కుడివైపున వుంది. ఇది ఆధ్యాత్మిక హృదయం. ఎడమవైపున ఉన్నది భౌతిక హృదయం.

ప్ర : భగంతుడు సాకారుడా?

జ : నీకు దేహం వుంటే భగవంతుడికీ వుంది. లేదనుకుంటే భగవంతుడికీ లేదు.

ప్ర : భగవంతుడు నాకు ఎంత దూరంలో ఉన్నాడు?

జ : నీకు నీవు ఎంత దూరంలో ఉన్నావో, భగవంతుడు నీకు అంతే దూరంలో ఉన్నాడు.

ప్ర : భగవంతుడు వేరూ ఆత్మ వేరూనా?

జ : వేరుకాదు, ఒక్కటే.

ప్ర : భగవంతుడు ఈ ప్రపంచంలో దుఃఖాన్ని ఎందుకు వుండనిచ్చాడు? తన శక్తితో దుఃఖాన్ని పారద్రోలి అందరికీ ఆత్మ దర్శనాన్ని అనుగ్రహించగూడదా?

జ : దుఃఖం ఆత్మ దర్శనానికి మార్గం.

**ప్ర : ఆత్మోప లబ్ధికి త్యాగం అవసరమా?**

జ : అన్నిటికంటే ముందు త్యాగిని త్యాగం చేయాలి. అనగా త్యాగం చేస్తున్నాననే 'మిధ్యానేను'ను పోగొట్టుకోవాలి.

**ప్ర : దుఃఖంలో వున్నాను. శాంతి లభించేదెట్లా?**

జ : నిద్రలో లేని దుఃఖం మెలకువలో ఉంటుంది. కారణం? నిద్రలో 'నేను' అనే తలంపు లేదు. అంతా సుఖమే. మెలకువ రాగానే ఈ 'నేను' తలంపు పుడుతుంది. దీన్ని ఆధారం చేసుకొని దుఃఖం, ప్రపంచం, సర్వం బయలుదేరుతున్నాయి. అందుకే ఈ 'నేను' యొక్క పుట్టుక స్థానాన్ని వెదకమంటున్నాను. ఈ 'నేను' (అనగా మిధ్యానేను) పోతే అంతా సుఖమే. అంతా శాంతే.

**ప్ర : 'నేను' మిధ్య అయినపుడు ఇక ఈ 'మిధ్యానేను'ను నాశనం చేసేదెవరు?**

జ : నిజమైన ఒకే ఒక నేను ఆత్మ. ఆ 'నేను' ఈ 'మిధ్యానేను'ను మింగేసి తానుగా మిగిలిపోతుంది.

**ప్ర : ఆనందం యొక్క స్వభావమేమిటి?**

జ : ఆనందం బాహ్యంగా, అనగా, సిరి సంపదలలో వున్నదనుకుంటే ఆ సిరిసంపదల వృద్ధితోబాటు ఆనందం పెరగాలి. వాటి వ్యయంతో పాటు తరగాలి. అవి పూర్తిగా క్షీణించిపోతే ఆనందం గూడ పూర్తిగా క్షీణించిపోవాలి. కాని మానవుని యొక్క అనుభవం ఏమిటి?

గాఢనిద్రలో వున్నపుడు తనకు సిరిసంపద ధ్యాస, చివరకి దేహ ధ్యాస గూడ లేదు. అందుకనే ప్రతివాడూ గాఢంగా నిద్రపోవాలని చూస్తాడు, ఆ గాఢనిద్రలోని హాయిని అనుభవించడానికి. అందుచేత, పర్యవసానమేమిటంటే ఆనందం బాహ్యంగా లేదు. నీలోనే ఉంది. అదే ఆత్మ. సచ్చిదానంద సాగరం.

**ప్ర : ఆధ్యాత్మికాభివృద్ధికి, సర్వసంగ పరిత్యాగమవసరమా?**

జ : అహంకారాన్ని త్యజించడమే అసలైన సిసలైన త్యాగం.

**ప్ర : అహానికి, అహంకారానికీ తేడా ఏమిటి?**

జ : 'నేను' అనేది అహం (ఆత్మ). 'నేను ఫలానా' అనేది అహంకారం (మిధ్యానేను).

# 39. ఆలోచనామృతం

-పరమాచార్య శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి

(శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారు వెల్లడించిన కొన్ని అభిప్రాయాలను 'జగద్గురు బోధలు' నుండి గ్రహించి ప్రశ్నోత్తరముల రూపములో ఇచట పొందుపరుస్తున్నాము - సంపాదకుడు)

ప్రశ్న : పరమాత్మ ఒక్కడే అయినచో ఇన్ని మతములు, ఇందరు దేవుళ్ళు ఎందుకేర్పడినారు?

జవాబు : లోకుల అభిరుచులు ఏకరీతిగా నుండవు. అందుచేతనే తినెడు తిండియందును కట్టెడు బట్టయందును ఇంత వైవిధ్యమున్నది. అందరికిని రుచి ఒక్కటే అయినచో ఒకే విధమగు తిండి, ఒకే విధమగు బట్ట, ఒకే ఆకారము, ఒకే దేవుని నియమించు కొనవచ్చును. అదిలేని కారణముననే వివిధ ఆహార పదార్థ ములు,వివిధ దుస్తులు, వివిధ ఆభరణములు, వివిధ ఆరాధనా రీతులు ఏర్పడినవి.

ప్ర : ఒకరు పూజించు దేవుడు అధికుడనీ, మిగతా దేవుళ్ళు హీనులనీ అభిప్రాయం ఎందుకేర్పడును? అట్టి భావన సరియైనదా?

జ : ఒక వంతెన క్రింద నిలబడి చూచినచో మనమున్న విభాగము (వంతెన ఆర్చి - The arch of the bridge) తక్కిన వాటి కంటే పెద్దదిగా కనబడును. కాని అన్నియు ఒకే నిడివి కలిగి యుండును. అట్లే భక్తునికి తాను కొలచు దైవమునందు భక్తి శ్రద్ధలు అధికమగుటచే తాను కొలచు దైవము అధికుడన్న భావముదయించును. కాని నిజమునకు అన్ని దైవములును మూలపరతత్త్వము యొక్క సమాన ఛాయలే.

ప్ర : మానవునికి భగవంతుని అవసరమేమిటి?

జ : మన మనస్సును చలింపచేయు విషయములు ప్రపంచమున ఎన్నో వున్నవి. మనస్సును స్థిరముగా నుంచుకొనుటకు ఒక ఆలంబన, ఒక పట్టు కావలెను. ఆ ఆలంబనా వస్తువు పరిణామ రహితమై అచంచలమై యుండవలెను. ప్రపంచమున అన్ని వస్తువులు పరి ణామము చెందునవి. చంచలములు అయియున్నవి. అట్టివిగాక మనకొక స్థాణువగు వస్తువు దొరకవలెను. శాశ్వతమును, చైతన్యవంతమగు వస్తువు ఒక్క ఈశ్వరుడే.

ప్ర : శివలింగమును అర్చించుటలో గల అంతరార్థమేమిటి?

జ : గ్రహించవలసిన వస్తువును స్థూలముగ అర్థము చేసుకొనుటకు మనమొక

చిహ్నమును ఉపయోగింతుము. ఆద్యంతములు లేని పరమేశ్వరుని ఏ ప్రతీక యందు చూడలగము? అది చదరముగనో, దీర్ఘచతురస్రముగనో ఉండగూడదు. దానికి ఆద్యంత ములుండును. కాని వర్తులమునకు స్ఫుటమగు ఆద్యంతములు లేవు. అందుచేతనే ఈశ్వర చిహ్నమగు లింగము గుండ్రముగా నుండుట.

ప్ర : దేశ ఆర్థికాభివృద్ధికై ప్రభుత్వ మెన్నియో పథకముల నమలు జరుపుతు న్నది. ఐనను దేశములో దారిద్ర్యము మాత్రము పెరుగుచున్నది. ఎందువలన?

జ : వాంఛలను వృద్ధి చేసుకొనుట, అవసరములను పెంచుకొనుటయే ఇందుకు కారణము. రెండు పర్యాయములు కాఫీ త్రాగువారు ఇపుడు నాలుగు పర్యాయములు త్రాగుచున్నారు. రెండు వస్త్రములతో కాలము గడుపువారు ఇపుడు ఇరువది వస్త్రములను సేకరించుచున్నారు.

ప్ర : మరి ఏమి చేయవలెను?

జ : మనకు కావలసిన వస్తువుల సంఖ్యను ఊరక పెంచుకొనుచూ పోయినచో దేశమున దారిద్ర్యమే. మనుష్యులకు మాన ప్రాణ రక్షణార్థము ఏవి అవసరములో అవి ఎల్లరకు అందుబాటులో ఉండవలెను. దానికి దిట్టమగు చట్టములవసరము. అట్టి స్థితి రావలయునన్న శ్రీమంతుడు గూడ పరమ దరిద్రుడెటుల తన జీవన మును గడుపుటకు ప్రయత్నించునో అటులనే గడుపుకొనుటకు ప్రయత్నించవలెను. దానినే అపరిగ్రహమందురు.

ప్ర : అపరిగ్రహమనగా నేమి?

జ : అపరిగ్రహమనగా గ్రహించకుండుట. మనదేహ ధారణకు అవసరమైన వస్తువుల కంటే అధికముగా గ్రహించిన అది దొంగతనముతో సమానము. మనకు కావలసిన దానికంటే అధికముగా గ్రహించకుండుటయే అపరిగ్రహము.

ప్ర : అపరిగ్రహము యొక్క ప్రత్యేకత ఏమిటి?

జ : అపరిగ్రహము లేని దోషముండునంతవరకు ఈశ్వరానుగ్రహము కలుగదు. జన్మసాఫల్యము కోరువారు అవసరములకు మించి ఒక్కింత అయినను పరిగ్రహింప కూడదు. కలిగిన వారు లేని వారికి సాయము చేయుటయే పుణ్యము. అదియే వారికి మోక్షమునిచ్చును.

**పని**

కర్మలను చేయనివారు దొంగలు- మానవుడు తన కర్మల ద్వారానే మాట్లాడవలయును.

– ఋగ్వేదము

# అధ్యాయము - 15

# హిందూ మతమును ప్రేమించిన పాశ్చాత్యులు

## 40. సర్ జాన్ ఉడ్‌రాఫ్

- స్వర్గీయ వాసిరెడ్డి పార్థసారధి

(1915 - 1922లో కలకత్తా, హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా పనిచేసిన సర్ జాన్ ఉడ్‌రాఫ్ హిందూమతమును అత్యమితముగా ప్రేమించిన వాడు. శాక్తేయ మును గురించి, మంత్ర శాస్త్రమును గురించి సుదీర్ఘమైన పరిశోధనలు చేసినవాడు. సంస్కృతములో పాండిత్యము సంపాదించి హిందూ శాస్త్రములను పఠించి, తంత్ర శాస్త్రము గురించి ఉపనిషత్తుల గురించి, కుండలినీశక్తి గురించి, 27 గ్రంథములను ఆంగ్లంలో రచించాడు. వీరి జీవిత విశేషములను సాకల్యముగా పరిశీలించి వాసిరెడ్డి పార్థసారధిగారు ఆంధ్రపత్రిక (1961 - 62) ప్లవ ఉగాది సంచికలో ''మంత్ర శాస్త్రోద్ధారకుడు ఉడ్‌రాఫ్'' అను పరిశోధనా వ్యాసము రచించారు. అందుండి కొన్ని వాక్యములను ఇచట పొందుపరచుచున్నాము. వాసిరెడ్డి పార్థసారధిగారు తెనాలి తాలూకా తుమ్మపూడి వాస్తవ్యులు. జాతీయోధ్యమంలో పాల్గొని రాయవెల్లూరు జైలులో శిక్షననుభవించారు. వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారి వంశీయులు. యోగసాధన చేసినవారు. - సంపాదకుడు)

''హిందూ మతమునకు దేశీయులలోగాని, విదేశీయులలోగాని వివేకానంద స్వామి తరువాత సర్‌జాన్ ఉడ్రాఫ్ గారు చేసినంత సేవ ఇంకొకరు చేయలేదు'' అని 'ప్రబుద్ధ భారతి' పత్రిక వ్రాసినది.

''మనం మన శాస్త్రముల ప్రాముఖ్యమును మరచి విదేశీయులుగా మారుచుండగా, ఒక పాశ్చాత్యుడు మన నాగరికతను, శాస్త్రములను మనకు జ్ఞాపకమునకు తెచ్చినాడు'' అని సర్. సి. పి. రామస్వామి అయ్యర్ వ్రాసినాడు.

''సర్ జాన్ భారతదేశమును ప్రేమించినట్లు ప్రేమించిన ఇతరులను మేము

చూడలేదు. భారత సేవయే భగవాన్ సేవ అన్న వారి మాటలలో ఎంతో గొప్పదన మున్నది'' అని 'ఉత్సవ' పత్రిక వ్రాసినది.

1865 డిసెంబర్ 15న జాన్ ఉడ్రాఫ్ ఇంగ్లండులో జన్మించాడు. ఇతని తండ్రి జేమ్సు టిన్‌డాల్ ఉడ్‌రాఫ్ న్యాయశాస్త్ర పండితులు. జాన్ కేంబ్రిడ్జిలో న్యాయశాస్త్ర పట్టము పొంది 1890లో ఇండియాకు వచ్చారు. కలకత్తా హైకోర్టులో అడ్వకేటుగా చేరారు.

1904లో హైకోర్టు న్యాయమూర్తిగాను, 1915లో ప్రధాన న్యాయమూర్తిగాను నియమితులైనారు. 1915లో బ్రిటిష్ ప్రభుత్వం వీరికి సర్ బిరుదునిచ్చింది. తీరిక దొరికిన ప్రతి నిముషం సంస్కృత భాష చదువుకొనుటకు వ్యయపరచారు. 1922 వరకు భారతదేశంలో వుండి తంత్రశాస్త్ర అంబుధిని మధించి అందు అమృతమును సంపాదించారు.

మంత్రశక్తి యెడల ఏర్పడిన విశ్వాసం

ఆంగ్లేయులు హేతువాద ప్రియులు. ఉడ్రాఫ్ గారి వంశం హేతువాదమునకు ఆటపట్టయిన న్యాయశాస్త్రములో పండినది. ఇటువంటి వీరు మూఢనమ్మకాలని కొట్టివేయబడిన మంత్రశాస్త్రంలో మనస్సును పెట్టుటకు బలమైన కారణములు న్నాయి.

మందులకు నయంకాని జబ్బు మంత్రములకు నయమగుట వారు చూచారు. ఇది వారిలో బ్రహ్మాండమైన మార్పు తెచ్చింది. ఇంతవరకు వారు మంత్రమంటే ప్రార్థన వంటిది అనే అభిప్రాయంతో ఉన్నారు. ఇపుడు వారు మంత్రమంటే ఒక శక్తి అని నమ్మారు.

ఇట్టి నమ్మకం కలుగుటకు వారు తన ''సర్పెంట్ పవర్'' అనే గ్రంథంలో కొన్ని అనుభవాలను వ్రాశారు. అవి ఇలా ఉన్నవి :

''ఒక మేజరు దగ్గర ఒక సాధువు నిలబడి వున్నాడు. సాధువు కాలి వద్ద ఒక తేలు ఉండడం మేజరు చూచాడు. కదలకు, నీ కాలి వద్ద తేలు వున్నదని చెప్పాడు. సాధువు వంగి తేలును చూచి తన వేలును తేలువంక చూపాడు. తేలు గజ గజ వణికి పోయింది. ఇది చూచి మేజరు ఆశ్చర్యపోయాడు. ఇంకొక అనుభవం-

కుశండికా హోమంలో ఒకరు నిప్పులేకుండానే మంత్రం జపిస్తూ పుల్లలకు నిప్పుపుట్టించారు. ఇలాంటి సంఘటనలు వారిలో మంత్రముల యెడ నమ్మకం కలిగించినవి.

ఇండియా నాగరికమైన దేశమా?

ప్రథమ ప్రపంచ సంగ్రామం జరుగుతున్న కాలంలో విలియం ఆర్చర్ అను ఆంగ్ల సాహితీవేత్త "India and the future" అనే గ్రంథంలో భారతీయులు అజ్ఞానులు, అనాగరికులు, ఆటవికులు అంటూ నిందిస్తూ వ్రాశాడు.

అందుకు సమాధానముగా జాన్ ఉడ్రాఫ్ "Is India Civilised?" ఇండియా నాగరికమైన దేశమా? అను గ్రంథం వ్రాసి ప్రచురించారు. ఆ గ్రంథంలో ఉడ్రాఫ్ ఇలా వ్రాశారు : ''హిందూ మతము క్రీస్తు మతములకు చాలా పోలికలున్నవి. అటువంటప్పుడు హిందూ మతాన్ని విమర్శించుటకు కారణం నాకు కనిపించదు. పాశ్చాత్యులు హిందూ మతాన్ని సరిగా అర్థం చేసుకోలేదనే నా బాధ. హిందూ మతంలో హేతువాదం లేదంటారు. ఇది పొరబాటు. హేతువాదమును హిందూమతం చేపట్టినంతగా ఏ మతం చేపట్టలేదు.

హిందువుల మతం సత్యము మీద ఆధారపడి వుంది. వారికి సత్యమే దేవుడు, సత్యమే జయించేది. వారికి పరోపకారమే ధర్మం. బైబిలు నీ పొరుగువారిని ప్రేమించమని చెపుతుంది. కాని ఎందుకు ప్రేమించాలో చెప్పదు. హేతువును చెప్పింది హిందూ మతమే. ఇందుకు హేతువు ''తత్వమసి'' అని చెప్పింది. అదే నీవు అని అర్థం. దీని భావం యిది: సమస్త ప్రపంచం ఈశ్వరుని స్వరూపము. నీ రూపముగా అన్నిట నీవున్నావు. అన్నిట ఈశ్వరుడున్నాడు. ఇతరులను ప్రేమించడమంటే ఈశ్వరుని ప్రేమించుట; నిన్ను నీవు ప్రేమించుట అని హిందూమతం హేతువును చెప్పింది.

ప్రపంచమును దేవుడు సృష్టించాడని బైబిలు చెపుతుంది. దేనినుండి దేవుడు ఈ ప్రపంచాన్ని నిర్మించాడో హేతువు చెప్పదు. కనీసం దేవుడు తననుండైనా ఈ విశ్వమును సృష్టించాడని చెప్పదు. ఈ హేతువును షడ్దర్శనములు చెపుతున్నవి.

స్వేచ్ఛాలోచన హిందూమతంలో వున్నట్లు ఎందులోనూ లేదు. అక్కడ నాస్తిక మతములు కూడా వెలసినవి. అప్పుచేసి పప్పుకూడు తిని సుఖించు అని చెప్పే చార్వాక మతం వంటిది కూడా పుట్టినది.''

**మంత్రశాస్త్రము :**

పాశ్చాత్యులు మంత్రశాస్త్రమును అపార్థం చేసుకున్నంతగా ఏ శాస్త్రాన్నీ అపార్థం చేసుకోలేదు. మంత్రశాస్త్రము ఒక మహత్తరమైన శాస్త్రీయమైన శాస్త్రం. దీనిలో ఎంతో శక్తి జ్ఞానములున్నవని తెలిపిన పాశ్చాత్యుడు సర్‌జాన్ ఉడ్రాఫ్. మంత్రం

ప్రార్థన కాదు. అదొక శబ్దశక్తి. భౌతిక శక్తి వంటిదే. అదొక సూక్ష్మశక్తి. భారతీయులు ఈ శక్తిని తెలుసుకున్నారు. శబ్దం ఉత్పత్తి గురించి భారతీయులు ఎంతో పరిశోధనలు చేశారు. ఇందులో ఎంతో సత్యమున్నది. మంత్రశాస్త్రంలోవున్న సత్యమును ప్రపంచమునకు తెలుపుటకు అనేక గ్రంథాలు రచించారు సర్‌జాన్ ఉడ్రాఫ్.

వారు 27 గ్రంథములను రచించారు. అందులో కొన్ని యివి :

1. Serpant Power - కుండలినీ శక్తి - షట్చక్ర నిరూపణము.
2. Greatness of Siva - శివమహిమ్నస్తోత్రము - ఆంగ్లతర్జుమా
3. Garland of Letters - వర్ణమాల, మంత్ర శాస్త్రము
4. The world of Power - శక్తిరూపంలో ప్రపంచము
5. Hymns to Kali - కాళీ స్తోత్రములు
6. Tantra of great Liberation - మహానిర్వాణ తంత్ర శాస్త్రము

1922 ఏప్రిల్ 22న ఆయన భారతదేశం వదలిపెట్టి వెళ్ళిపోతూ అన్న మాటలివి: ''ఈ దేశంలో నేను ఎంతో తెలుసుకున్నాను. అనుభవించాను. నేను చూస్తున్న ఈ పవిత్ర భూమిని చూడడం ఇది ఆఖరు చూపై వుండవచ్చు. మంత్రించబడ్డ ఇంద్రజాలం వలె వున్నదీ పవిత్రభూమి. బరువైన హృదయంతో ఈ స్థలము వద్ద సెలవు తీసుకుంటున్నాను'' భారతభూమిని అంతగా ప్రేమించిన ధన్యజీవి వారు.

1936 జనవరి 18న ఇంగ్లండులో సర్‌జాన్ ఉడ్రాఫ్ పరమపదించారు. అపుడు ''హిందూ'' పత్రిక ఇలా వ్రాసినది. ''సర్ ఉడ్రాఫ్ తన భార్యతో కలిసి తాంత్రిక సాహిత్యంలో వున్న మహత్తర సత్యములను ప్రచారం చేయుట, ఆ శాస్త్రం మీద వున్న అజ్ఞాన మేఘములను తొలగించుట తన జీవిత కార్యంగా చేసుకున్నాడు. భారతదేశమును తన ఔన్నత్య స్థాయికి మేలుకొల్పిన వారిలో గౌరవ ప్రతిష్టలు గల స్థానాన్ని సర్ జాన్ ఆక్రమించాడు.''

**జీవనసూత్రం**

భూమి మీద ప్రతిదీ ఇసుకా పంచదారా కలిసిపోయినట్లుగా మిశ్రితమై వున్నదే. పంచదార మాత్రమే తీసుకొని ఇసుకను ముట్టకుండా అవల వేసే తెలివైన చీమ మాదిరిగా వుండు.

— యోగీ బాబాజీ

# జనకళ్యాణ్ ఉద్యమం

శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతీ స్వామివారు 1990 నుండి ''జనకళ్యాణ్'' ఉద్యమాన్ని ప్రారంభించారు.

ఇది హిందూ కళ్యాణ్ కాదు, ఇది జన కళ్యాణ్. అన్ని మతములకు చెందిన ప్రజల కళ్యాణమును సాధించడం దీని లక్ష్యం.

లక్షణములు : 1. అతి సామాన్య వ్యక్తికి అర్థమయ్యేటట్లు సనాతన ధర్మంలోని మూల సూత్రాలను వివరించాలి. మన ధర్మ ప్రచారం సమాజంలోని అట్టడుగు వ్యక్తికి గూడ చేరాలి. 2. ప్రజల నడుమ అనురాగం, ఆదరణ, సహోదర భావం క్షీణించాయి. వీటిని నెలకొల్పాలి. రామ లక్ష్మణులు వేర్వేరు తల్లుల బిడ్డలైనను సహోదరులవలె జీవించారు. వారిని ఆదర్శంగా తీసుకొని మనం కలిసి మెలసి జీవించాలి. 3. కేవలం ధర్మాన్ని ప్రవచిస్తే సరిపోదు. దేశంలో కోటానుకోట్ల మంది చేతికి పనిలేక, ఉపాధి అవకాశాలు లేక, ఏరోజు ఆహారం ఆరోజు సమ కూర్చుకోలేక బాధలు పడుతున్నారు. వారికి ధర్మం గురించి బోధించేముందు, ఆర్థిక సమస్యకు పరిష్కారం చూపాలి. అందుకై స్వయంఉపాధి మార్గాలలో శిక్షణ యివ్వాలి. 4. వీటితోబాటు దేశభక్తి ప్రజలలో కలిగించాలి. దేశంకోసం త్యాగం చేసిన మహనీయులను గుర్తుచేసుకోవాలి.

అందుచేత దేశభక్తి, దైవభక్తి ఒకదానితో నొకటి చెలిమి చేయాలి. ప్రజలకు ఆర్థిక సంక్షేమం ఒన గూడాలి. ప్రజలు సహోదరుల వలె జీవించాలి. ధర్మ ప్రబోధం అతి సామాన్యులకు గూడ చేరాలి. ఇవే జన కళ్యాణ్ లక్ష్యాలు.

కనీసం వారమునకు రెండు పర్యాయములు మురికి వాడలను సందర్శించి వారి యోగ క్షేమాలను విచారించాలి. ఇలా సమాజంలో అట్టడుగు వ్యక్తులతో సంపర్కం కలిగియుండాలని స్వామివారు చెప్పారు. కులాలకు మతాలకు అతీతంగా ప్రజలను సమైక్యపరచడానికి ఈ నియమం పెట్టారు.

– శ్రీ కంభంపాటి నాగేశ్వరరావు

# 41. పాల్ బ్రంటన్

-''సౌమిత్రి''

పాల్ బ్రంటన్ 1898లో లండన్‌లో జన్మించాడు. ఇంగ్లండులోను అమెరికా లోను విద్యాభ్యాసం చేశాడు. తత్త్వశాస్త్రంలో డాక్టరేట్ పుచ్చుకున్నాడు. ఆయన బహుగ్రంథకర్త.

అసలైన భారతదేశం మదరాసు, కలకత్తా, బొంబాయిలలో లేదనీ, అది యోగి పుంగవుల కుటీరాలలో, వారి సాన్నిధ్యంలో వున్నదనీ అతని విశ్వాసం. అందుచేత అట్టి మహర్షులను సందర్శించాలని, వారి నుండి ఆధ్యాత్మిక జ్ఞానం పొందాలనే ఆకాంక్షతో 1930లో భారతదేశానికి వచ్చాడు. ఒక ఏడాది పాటు దేశమంతటా తిరిగి పలువురు మహనీయులను దర్శించి తుదకు 1934లో తన అనుభవాలన్నిటినీ క్రోడీకరించి ''గుప్త భారతంలో అన్వేషణ'' (A Search in Secret India) అనే గ్రంథం రచించాడు.

ఆ గ్రంథానికి అపుడు బ్రిటిష్ సైన్యాధికారిగానున్న సర్ యంగ్ హజ్బండ్ తొలి పలుకు వ్రాస్తూ ''ఈ చక్కని గ్రంథాన్ని ''గుప్త భారతంలో అన్వేషణ'' అని గాక ''పవిత్ర భారతంలో అన్వేషణ'' అని అంటే సముచితంగా వుంటుంది అని వ్రాశాడు.

ఈ గ్రంథం పందొమ్మిది ముద్రణలు పొందింది. అనేకమంది పాశ్చాత్యులు ఈ గ్రంథాన్ని చదివి భారతదేశం ఎడల గౌరవ భావం కలిగించుకున్నారు. దీనిని చదివిన ఫ్రెంచి, జర్మన్ దేశీయులు భగవాన్ రమణ మహర్షిని సందర్శించడానికి వచ్చారు. ఈ గ్రంథం ద్వారానే రమణ మహర్షి ఐరోపాలో ప్రచారం పొందారు.

పాల్ బ్రంటన్ బొంబాయి, కలకత్తా, మదరాస్‌లన్నీ సందర్శించాడు. పూనాలో మెహర్‌బాబాను, కలకత్తాలో శ్రీరామ కృష్ణమఠమఠీను, కాశీలో గొప్ప జ్యోతిష్యుని, మరి కొందరు యోగులను కలుసుకున్నాడు. ఐనను ఆయనకు సంతృప్తి కలుగలేదు. ''నేను వట్టి చేతులతో భారతదేశం నుండి తిరిగి పోవాలా? పాతకాలపు ఋషులు ఈదేశంలో నామరూ పాలు లేకుండా మాయమైనారా?'' అని నిరుత్సాహం కూడ ఒకప్పుడు ఆయనకు కలిగింది.

ఆయన మద్రాసులో వుండగా వెంకటరమణి అనే రచయితను కలుసుకు న్నాడు. అతడు మద్రాసు యూనివర్సిటీలో సెనెట్‌మెంబరు. ప్రతిభావంతుడైన రచయిత. పాల్ బ్రంటన్ అతనికి తను భారతదేశం పర్యటించడంలోగల లక్ష్యాన్ని వివరించి చెప్పాడు.

''మా గురువులు శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారు దక్షిణ భారతానికి ఆధ్యాత్మికాచార్యులు. వారు తపస్సంపన్నులు. వారిని దర్శించండి'' అని వెంకట రమణి సలహా యిచ్చాడు.

ఇరువురూ కలిసి ఆనాడు చెంగల్పట్టు వెళ్ళి స్వామి వారిని సందర్శించారు. స్వామి వారితో పాల్‌బ్రంటన్ సంభాషణ ఇలా జరిగింది :

బ్రంటన్: ప్రపంచంలో దేశాలు మారణాయుధాల కొరకు ప్రతి సంవత్సరం కోట్ల కొలది ధనం ఖర్చు పెడుతున్నాయి. నిరాయుధీకరణ గురించి చర్చలు సాగిస్తున్నారు. వాటివలన ప్రయోజనం వుంటుందా?

స్వామి : యుద్ధ నౌకలు భగ్నం చేసినా, మారణాయుధాలు తుప్పుపట్టినా, ప్రజలు ఆయుధాలు లేవు కదా అని ఊరుకోరు. కట్టెల సాయంతోనైనా యుద్ధం చేస్తారు. మారవలసినది మనస్తత్వం. ఆయుధ పరికరాలు కాదు.

బ్రంటన్ : మా పాశ్చాత్య దేశాలలో మనుషులను చూస్తే వాళ్ల హృదయసీమలలో భగవంతుడు గాదు, క్రూర పిశాచం ఉన్నట్లు అనిపిస్తుంది.

స్వామి : మనం మనుష్యులను దూషించి ప్రయోజనం లేదు. వాళ్లకు మనం ఒక ఉన్నతమైన లక్ష్యాన్ని గుర్తుకు తేవాలి. ఆర్థిక సంపద ఒక్కటే చాలదు. దానికి తోడుగా ఆధ్యాత్మిక సంపదా వుండాలి. ఈ రెంటి సమన్వయం సాధిస్తేనే గాని లోకానికి ముక్తిలేదు.

బ్రంటన్ : అంటే మీరు లోక వ్యవహారంలో గూడా ఆధ్యాత్మిక సూక్తులను ప్రవేశపెట్టాలని అంటారా?

స్వామి : ఔను. అది ఆచరణీయమే. లోక వ్యవహారంలో ధర్మనిష్ఠ ఏర్పడితే అది బహుజనహితంగా వుంటుంది. భారతదేశంలో రాజకీయాలలో గూడ మహాత్ముల సలహాలను తీసుకొనే ఆచారం ఉన్నది. ప్రపంచంలో అన్ని దేశాలవారు ఈ ఆచారాన్ని పాటించగలిగితే శాంతి, సౌఖ్యమూ ఒనగూడుతవి.

బ్రంటన్ : నేను మిమ్మల్ని నా ఆధ్యాత్మిక గురువుగా భావించదగుదునా?

స్వామి : నేను మఠాధిపతిని. నాకు విరామం వుండదు. అలాంటప్పుడు నేను ప్రత్యేకంగా శిష్యులను ఎలా స్వీకరించగలను? మీకు తన కాలాన్ని ఇవ్వగల మహాత్ముణ్ణే మీరు వెదకాలి.

బ్రంటన్ : మీరు అలాంటి ఒక సిద్ధపురుషుని వద్దకు నన్ను పంపలేరా?

స్వామి : నాకు తెలిసిన మహాత్ములు ఇద్దరున్నారు. ఒకరు కాశీలో వున్నారు. వారిని దర్శించడం కష్టం. ఇంతవరకు ఏ పాశ్చాత్యుడూ వారిని దర్శించలేదు. వారి వద్దకు మిమ్మల్ని పంపితే వారు మిమ్మల్ని అంగీకరించకపోవచ్చును.

బ్రంటన్ : మరి రెండవ వారో?

స్వామి : ఆయన దక్షిణ దేశంలో ఉన్నారు. వారి వద్దకు మీరు వెళ్లవచ్చును. ఆయనను మహర్షి అంటారు. వారు అరుణాచలంలో ఉన్నారు. మీరు ఈ దేశం వదిలి పోవడానికి ముందు వారిని దర్శించండి. మీ అభీష్టం నెరవేరుతుంది.

ఆనాటి రాత్రి పాల్‌బ్రంటన్ మదరాసులో తన గదిలో విశ్రమించి రాత్రి 3 గంటలపుడు మేలుకొన్నాడు. తన పడక గదిలో ఒక వెలుతురు కనిపించింది. వెంటనే

లేచి కూర్చున్నాడు. అతనికి ఆ వెలుతురులో శ్రీ కంచి స్వామివారి మూర్తి గోచరించింది. ''వీరు ఎలా వచ్చారు. మనము వారిని చెంగల్పట్టులో వదలి వచ్చాము గదా'' అనుకొని మరల కళ్లు నులుపుకొని చూచుసరికి స్వామివారి రూపం యధా ప్రకారం కనిపించింది. నీవు కోరునది సిద్ధిస్తుంది అని స్వామి చెప్పక చెప్పినట్లు అతనికి తోచింది.

పాల్‌బ్రంటన్ అరుణాచలం వెళ్లి భగవాన్ రమణ మహర్షిని సందర్శించాడు. కాళ్లు కడుక్కొని వెళ్ళి హాలులో కూర్చొనివున్న మహర్షికి వందనమాచరించి కూర్చున్నాడు.

బ్రంటన్ మనస్సులో ఎన్నో ప్రశ్నలున్నాయి. వాటిని నోటితో అడుగుదామను కుంటున్నాడు. వాటిని అడగకుండానే మహర్షి నుండి సమాధానాలు తన మనస్సులోకి చేరుతున్నాయి.

''నాకు ఆత్మజ్ఞానము ఎలా లభిస్తుంది?''

''ఆత్మజ్ఞానము కావలసినది ఎవరికి?''

''నాకు!''

''నేను, నేను అంటున్నావే, ఆ నేను అనగా ఎవరు?''

''ఈ శరీరమే నేను''

''అది నీ శరీరము. అంతేగాని నీవే శరీరము గాదు''

''మరి నేను దాన్ని ఎలా గ్రహించాలి?''

''నేను అనే భావన ఎక్కడ పుడుతుందో చూడు. అదే ఆత్మజ్ఞానం'' అన్నాడు మహర్షి.

పాల్ బ్రంటన్ అరుణాచలంలో కొన్ని నెలలపాటు ఉండిపోయాడు. The Message of Arunchala అనే గ్రంథం కూడా వ్రాశాడు. 1930 - 50లలో ''ఎవ్వరైనా పాశ్చాత్యుడు భారతదేశం వస్తే ఇద్దరినే దర్శించాలి. ఒకరు మహాత్మాగాంధీ, రెండవ వారు రమణ మహర్షి'' అని అనుకునేవారు.

## మీరు శక్తిమంతులయ్యే మార్గం

మీ హృదయాలను ప్రపంచమంత విస్తృతం చేసుకోండి. అపుడు మహాశక్తి మీ వెనుక ఉంటుంది. ఇతరుల కోసం చేసే అతిస్వల్ప కార్యం గూడా మీలోని శక్తిని మేల్కొల్పుతుంది. ఇతరులకోసం ఏ కొద్దిపాటి మంచిపని చేసినా మీలో సింహానికున్నంత శక్తి - మీరు భరించలేనంత శక్తి - ఉద్భవిస్తుంది. మీరు ఆశ్చర్యచకితులవుతారు.

– స్వామి వివేకానంద

# 42. అనిబిసెంట్ వనితామణి

- శ్రీ మన్నవ గిరిధరరావు

వనితామణి అనిబిసెంట్ (1847 - 1933) ఐరిష్ మహిళ. ఇంగ్లండులో పెరిగి పెద్దదై సంస్కరణోద్యమాలలో ప్రముఖ పాత్ర వహించింది. మొదట్లో ఆమె నాస్తికురాలు. సామ్యవాది, కార్మిక శ్రేయస్సు కొరకు ఆందోళనల్లో పాత్ర వహించినది. చార్లెస్ బ్రాడ్‌లాతోను, జార్జి బెర్నార్డ్‌షాతోను కలిసి పనిచేసింది. భావప్రకటనా స్వేచ్ఛ కొరకు పోరాడింది.

అలాంటి వ్యక్తి మాడమ్ బ్లావట్స్కీ రచించిన 'సీక్రెట్ డాక్ట్రిన్' అనే గ్రంథం చదివి ఆస్తికురాలుగా మారింది. ఆ గ్రంథంలో హిందూ వేదాంత గ్రంథాల గురించిన ప్రస్తావనలను చదివి భారతీయ సంస్కృతి పట్ల ఆకర్షితురాలైనది.

తన 46వ ఏట ఆమె భారతదేశానికి వచ్చి ఇచట సామాజిక రాజకీయ కార్యకలాపాలలో ముమ్మరంగా పాల్గొన్నది. భగవద్గీతను ఆంగ్లంలోనికి అనువదించింది. కాశీలో సెంట్రల్ హిందూ కాలేజిని స్థాపించింది. అదే తరువాత కాలంలో బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంగా రూపుదిద్దుకుంది.

ఆమె 'భారతీయుల కంటే ఎక్కువ భారతీయతగల మహిళ' (More Indian than Indians)గా పేరొందినది. బ్రిటిష్ సామ్రాజ్యంలో అంతర్భాగంగా ఇండియాకు అధినివేశ ప్రతిపత్తి కావాలని కోరుతూ 1915లో లోకమాన్య తిలక్‌తో కలిసి హోంరూల్ ఉద్యమం నడిపి కారాగారవాస శిక్ష ననుభవించింది. దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షురాలుగా పనిచేసింది.

ఒక ఉపన్యాసంలో ఆమె హిందువులనుద్దేశించి ఇలా హెచ్చరిక చేసినది : ''ఇది వాస్తవం! హిందూమతం లేకుండా ఈ దేశానికి భవిష్యత్తులేదు. ఈ దేశం యొక్క వేళ్లు హిందూ మతం అనే నేలలో పాదుకొని వున్నాయి. హిందూమతం నిర్లక్ష్యం చేయబడితే వేళ్లు తెగిన చెట్టుకుపట్టే గతే ఈ దేశానికి గూడా పడుతుంది.

భారతదేశంలో చాలా మతాలకు, చాలా తెగలకు చెందిన జనులున్నారు. కాని ఏ యితర మతమూ జాతి జీవనముతో ఇంతగాముడి పెట్టుకొని ఉండలేదు. ఒక్కొక్క మతమే ఇక్కడికి వస్తూపోతూ ఉన్నది. అయినా భారతదేశం సజీవంగానే ఉన్నది. కాని హిందూమతమే గనుక అంతరిస్తే ఈదేశం ఏమవుతుంది? రాళ్ళూ, రప్పలూ, కొండలూ, అడవులూ మిగులుతాయి. దేశం ఒక భౌగోళిక రూపంగా

మిగిలిపోతుంది. ఈదేశంలోని చరిత్ర, శిల్పము, సారసత్వము, కళాఖండాలు అన్నిటి మీద హిందూమతం యొక్క చెరిగిపోని ముద్రలున్నాయి.

జొరాష్ట్రియన్ మతము వచ్చింది. పార్శీలకు యిక్కడ ఆశ్రయం లభించింది. రేపు జొరాష్ట్రియన్ మతం అంతరించినా భారతదేశం బ్రతికే ఉంటుంది. బౌద్ధమతం ఇక్కడే జన్మించింది. ఇక్కడే అంతరించింది. అయినా భారతదేశం బ్రతికే ఉన్నది.

ఇస్లాం సైనిక శక్తితో ప్రవేశించింది. ముస్లిములు ఈ దేశంలో ఒకరుగా అయినారు. ఒకవేళ ఇస్లాం యిచటి నుండి వెళ్లిపోయినా భారతదేశం బతికే ఉంటుంది. క్రైస్తవులు ఈ దేశాన్ని పాలిస్తూ ప్రభావితం చేస్తున్నారు. అయినా క్రైస్తవం ఇచటినుండి నిష్క్రమించినా భారతదేశం బతికే ఉంటుంది. ఈ మతాలు రాకముందు కూడా ఈ దేశం జీవించే ఉన్నది. అవి వెళ్లిపోయినా ఈ దేశం బతికే ఉంటుంది.

కాని, ఈ దేశానికి జీవగఱ్ఱ అయిన హిందూ మతమే గనుక నశిస్తే అది భారతదేశా నికి అంత్యకాలమే సుమా! అప్పుడు ఈ జాతికి ప్రేతకళపడుతుంది. పురాతత్వ పరిశోధన లకు పనికి వస్తుందేమోగాని, ప్రేమించదగినదేదీ ఇక్కడ మిగులదు. హిందువులందరికీ ఇదే నా హెచ్చరిక!''

## అందరి తల్లి భారతదేశం!

ప్రపంచ ప్రఖ్యాత చరిత్రకారుడు విల్ డ్యూరెంట్ ఇలా వ్రాశాడు : "India was mother land of our race, and Sanskrit the mother of Europe's languages. She was the mother of our philosophy, mother through the Arabs, much of our mathematics, mother through Budha of the ideals embodied in Christianity, mother through the Village communities of self-government and democracy.

Mother India, in many ways, is the mother of us all"

ఐదు విధాలుగా భారతదేశం మిగతా ప్రపంచానికి తల్లి అని విల్ డ్యూరెంట్ చెప్పాడు.

1. సంస్కృతము ఐరోపా భాషలకు మూలం.

2. ఐరోపా తత్త్వ శాస్త్రానికి తల్లి భారతవర్షమే.

3. పాశ్చాత్యులు అరబ్బుల ద్వారా భారతదేశపు గణిత శాస్త్ర విశేషాలను గ్రహించారు.

4. క్రైస్తవ మత సూత్రాలకు మూలం గౌతమ బుద్ధుని బోధనలు.

5. స్థానిక స్వయం పరిపాలనకు, ప్రజాస్వామ్య పద్ధతులకు భారతదేశపు గ్రామ పరిపాలనా పద్ధతియే మూలము.

# 43. ఇటలీ దేశీయుని అభిప్రాయాలు

- శ్రీ మన్నవ గిరిధరరావు

ఇటలీ దేశీయుడు మిస్టర్ ఆల్బర్ట్ డి ఫోర్మాయ్ 1992 జూలైలో గుంటూరు వచ్చాడు. ఆయన కొన్ని సంవత్సరాలుగా పాండిచేరిలో ఉంటున్నాడు. ఇటలీలో మిలాన్ నగర వాస్తవ్యుడు. గ్రాడ్యుయేటు. ఇంగ్లీషు, ఫ్రెంచి భాషల నుండి పుస్తకాలను అనువదించే వాడు. ఆయనతో జరిగిన సంభాషణ ఇలా నడిచింది :

''మీరు భారతదేశానికి రావడానికి ఇక్కడ గల ఆకర్షణ ఏమిటి?''

''భారతదేశం జ్ఞానభూమి. ప్రాపంచికమైన విజ్ఞానం ఐరోపాలో లభిస్తుంది. కాని మనిషికి ఆత్మజ్ఞానం లభించే చోటు భారతదేశం ఒక్కటే. నేను ఎవడను? అనే ప్రశ్నకు సమాధానం ఇక్కడే లభిస్తుంది. మరెక్కడా దొరకదు''.

''భారతదేశంలోని సిద్ధ పురుషులలో ఎవరంటే మీకు ఎక్కువ ఇష్టం?''

''షిర్డీసాయి బాబా అంటే నాకు చాలా ఇష్టం. వారు మానవరూపంలో వచ్చిన భగవంతుడు. అలాగే కేరళలోని క్వీన్‌లాండులో జన్మించి అవధూతగా ప్రసిద్ధి చెందిన 'సద్గురు నిత్యానంద భగవాన్' గూడా గొప్ప యోగి పుంగవుడు. ఆయన 1961లో బొంబాయి సమీపంలోని గణేశ్‌పురిలో సమాధి చెందారు. వీరిరువురూ నాకు మిక్కిలి పూజనీయులు''.

''ఐరోపాలో వున్న మేధావులకు భారతదేశానికి చెందిన ఏఏ మహాత్ములు, జ్ఞానులు ఎక్కువగా గుర్తుకు వస్తారు?''

''ఐరోపా వారికి మనస్సులో మెదిలే ప్రముఖ హిందూ యోగిపుంగవులెవరంటే - వివేకానందుడు, రామకృష్ణ పరమహంస, యోగానంద పరమహంస, ముక్తానంద ఆనందమాయి, సత్యసాయిబాబా''.

''ఏసుక్రీస్తు కాక ఇంకా ఎవరైనా యోగీశ్వరులు ఐరోపాలో జన్మించారా? ఏసుక్రీస్తు గూడ ఐరోపాలో జన్మించలేదనుకోండి''.

''యావత్తు సృష్టి యొక్క ఏకత్వాన్ని దర్శించిన వాడు, అనుభవంలోకి తెచ్చుకున్న వాడు యోగి అవుతాడు. అట్టివారు భారతదేశంలో మాత్రమే ఇప్పుడూ

వున్నారు, పూర్వమూ వున్నారు. ఇంతమంది ఆత్మజ్ఞానులు మరే దేశంలోనూ లేరు. ఈ ఆత్మచింతన అనేది భారతీయుల రక్తంలో కలిసి ఉంది.''

''మిస్టర్ ఫోర్మొయ్ ! మీరు పలికిన ఈ వాక్యం వింటుంటే నా దేశం మీద నాకు గల ప్రేమ ద్విగుణీకృతమవుతున్నది. ఇక్కడ జన్మించినందుకు నేను గర్విస్తున్నాను''.

''నేను అతిశయోక్తి పలకడం లేదు. భారతదేశం జ్ఞానభూమి. అందుకే ఇచటికి వచ్చాను. పాండిచేరిలోని అరవిందాశ్రమంలో నాలుగు సంవత్సరాల నుండి వుంటున్నాను. ఆత్మజ్ఞానం అనేది పుస్తకం చదివితే అలవడేది కాదు. ఆత్మ సాక్షాత్కారం పొందినవారి సాన్నిధ్యంలో గడిపితే మాత్రమే అది సాధ్యమవుతుంది.''

''హిందూ మతం నుండి గాని, క్రైస్తవమతం నుండి గాని, మరొక మతం నుండి గాని, మహనీయుల ఉపదేశాల నుండి మీరు తెలుసుకున్న గొప్ప సత్యమేమిటి? ఏ సూక్తిని మీరు సదా గుర్తు చేసుకుంటారు? ఏది మీ జీవితానికి మార్గదర్శకంగా ఉంది?''

''భగవద్గీతలో శ్రీకృష్ణుడు సాక్షాత్తూ దేవుడే అయి వుండి కూడా తాను గూడ కర్మను ఆచరిస్తానన్నాడు. ఫలితం ఎడల దృష్టి పెట్టకుండా కర్మ చేయాలన్నాడు. అహంకార మమకారాలను విసర్జించి కర్మ చేయమన్నాడు. దేనినీ వదిలి పెట్టవద్దు - (Attachment) సంగత్వం మాత్రమే కూడదు అన్నాడు. ఈ సందేశం నాకు అత్యంత ఇష్టమైనది. దీనినే తరుచు గుర్తు చేసుకుంటాను''.

## మన సంస్కృతిలోని విశిష్టత

బాలికయే అయినప్పటికీ ప్రతి స్త్రీని ''అమ్మా'' అని సంబోధించుట మన ఆచారం. మన భాషలన్నిటిలోను ఇదే పద్ధతి. అంటే ఒక వ్యక్తికి అతని భార్య మినహా ప్రతి స్త్రీ మాతృమూర్తియే. వయోవ్యవస్థలతో సంబంధం లేదు. మన సంస్కృతిలోని విశిష్ట లక్షణమిది.

– డాక్టర్ కేశవ బలీరామ్ హెడ్గేవార్

# అధ్యాయము - 16

# హిందువుల ఔన్నత్యం

## 44. వివిధ రంగములలో హిందువుల ఆధిక్యత

-స్వర్గీయ హర విలాస్ శారదా

(అజ్మీర్ నగరమునకు చెందిన ప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ హర విలాస శారదాగారు 1906లో (Hindu Superiority) అను గ్రంథమును రచించారు. దానిని 1930లో దాసు దామోదరరావు గారు ''హిందువుల ఆధిక్యము'' అను పేరుతో ఆంధ్రీకరించారు. ప్రపంచములో అన్ని జాతులలోకి హిందూ జాతి అన్ని రంగ ములలోను ఎట్లు అగ్రస్థాన మలంకరించినదో పాశ్చాత్య పండితుల అభిప్రాయాలను ఉల్లేఖిస్తూ వివరించినారు. ఆ గ్రంథము నుండి అక్కడక్కడ కొలది వాక్యములనిచట పేర్కొనుచున్నాము-సంపాదకుడు)

ప్రాచీన కాలము నాటి హిందువుల గొప్పదనము గురించి మరల మరల చెప్పుకొనుట వలన అంతగా ప్రయోజనముండదని కొందరనవచ్చును.

కాని శామ్యూల్ స్మైల్స్‌గారిట్లు వ్రాసిరి: ''ప్రకాశమానమైన జాతికి చెందిన వారమ నియు, మన పూర్వుల గొప్పతనమునకు మనము వారసులమనియు, వారు గడించిన కీర్తిని నిలుపవలసిన వారమనియు భావించుట వలన వ్యక్తులకు వలెనే జాతులకు గూడా గట్టి యూతము, చేవయు ఏర్పడును. వెనుతిరిగి చూడగనే గతకాల దృశ్యము ఘనమైనదిగా కానబడుట జాతీయాభ్యుదయమునకు అత్యంత ఆవశ్యకము. పూర్వుల ఘనకార్యము లను, ఔదార్యత్యాగములను పరాక్రమకృత్య ములను జ్ఞప్తియందుంచుకొనుట మూలమున వర్తమాన జీవితము ఊపునందుకొని ఋజుగతిని పొంది క్రమముగా అగ్రగామియగును''

కాబట్టి హిందువులు తమ జాతి యొక్క చరిత్రను, తమ పూర్వుల సుబోధలను పఠించి జీర్ణము చేసుకొనుట ముఖ్య కర్తవ్యమగుచున్నది.

**హిందువుల వాఙ్మయము :**

మాక్సుముల్లర్ పండితుడిట్లనుచున్నాడు: "మానవుని బుద్ధి ఏ గతిని వికసించి నదో పఠింపగోరువారు, మనసు గురించి అనగా మన అంతస్సుల గురించి పఠింపగోరువారు ముందు భారతదేశమును జూచి యింకొక దేశమును చూడవలెను.

ఆమూలాగ్రము చదువదలచుకొని ఏ శాస్త్రమునుగాని, ఏ విద్యనుగాని తీసుకొని నను సరే - భాషగాని, మతముగాని, పురాణముగాని, తత్త్వముగాని, ధర్మ శాస్త్రముగాని, ఆదికాలపు శాస్త్రములుగాని - ఏవి ఎత్తుకున్నప్పటికిని, ఇష్ట మున్నను లేకపోయినను భారత వర్షమునకు పోవక తప్పదు.

మానవ జాతి చరిత్రకు సంబంధించిన అమూల్యమైన, ఉద్బోధకమైన సాధన సామాగ్రి భారతభూమిలో మాత్రమే నిక్షిప్తమై యున్నది."

కల్నల్ టాడ్ ఇట్లనుచున్నాడు : "ఎవరి తత్త్వ సిద్ధాంతములు గ్రీసు దేశపు తత్త్వ సిద్ధాంతములకు మేలు బంతులయ్యెనో, ఎవ్వరి గ్రంథములకు ప్లేటో, తెల్సు, పైతాగరస్‌లు శుశ్రూష చేసినారో, అట్టి హిందూ ఋషులకు పోలినవారు మనకెక్కడ కన్పింపగలరు? ఎవరి గ్రహగతి జ్ఞానము ఇప్పటికిని ఐరోపా ఖండములో ఆశ్చర్యము కలిగించుచున్నదో, అట్టి జ్యోతిష్కులెచట కన్పించగలరు? ఎవ్వరి కట్టడములు, చెక్కడపు పనులు మన మన్నన లనందుకొన్నవో, అట్టి శిల్పులిపుడెక్కడున్నారు? రాగస్వరభేదములు కల్పించి ఆనందము నుండి దుఃఖము లోనికి, ఏడుపులోనుండి చిరునగవులోనికి మనస్సును ఉయ్యేల లూగించునట్టి గానకళాకోవిదులిపుడెక్కడైనా నున్నారా?"

**స్వర్గతుల్యము :**

అబ్దుల్లావసఫ్ అను చరిత్రకారుడు క్రీ.శ. 14వ శతాబ్దిలో తాను రచించిన "తజ్జియత్ - ఉల్ - అమ్‌సార్" (Tazjiyat-ul-Amsar) అను చరిత్ర గ్రంథములో భారత వర్షము గురించి యిట్లు వ్రాసెను :

"భారతభూమి సుఖముగా నివసించుటకు యోగ్యమైన దేశము. అది దేశములన్నిటిలోను కడుంగడు ఆనంద ప్రదము. అచ్చటి ధూళి గాలికంటెను స్వచ్ఛము. అచటి గాలి కేవలము పవిత్రతయే. అచ్చటి భూములు స్వర్గారామము లవలె సంతోషకరములు.

స్వర్గము భారతదేశములో నున్నదని ఎవరైనా నొక్కి పలికిన యెడల ఆశ్చర్య పడకుము. స్వర్గలోకము భారతవర్షముతో సరిపోల్చుటకైనా పనికిరాదు".

''భారత వర్షము భూలోకము యొక్క సంక్షిప్త రూపము'' అని చేంబర్స్ ఎన్‌సైక్లోపీడియాలో పేర్కొనబడినది.

ఇతర భూముల ప్రధాన లక్షణము లన్నియును భారతభూమిలో నున్నవి. దిగ్భ్రమ కలిగించు ప్రకృతి దృశ్యములు, మిక్కిలి సారవంతమైన నేలలు, దట్టమైన అడవులు, ఉన్నతమైన పర్వతములు, దీర్ఘములైన నదులు, చెట్టు చెమ్మలేని ఎడారులు, నీరు చుక్కలేని యిసుక భూములు, అత్యుష్ణమయిన గ్రీష్మము, అతి శీతలమైన శిశిరము, అన్నియు ఇక్కడున్నవి. మానవ స్వభావ శాస్త్రమును గాని, బాహ్య ప్రకృతి శాస్త్రమునుగాని పఠింపగోరు వారికి భారత వర్షము ఇప్పటికిని మిక్కిలి ఉపయోగకరములైన అంశములతో నిండి మనోహరముగనుండును.

''హిమాలయములను దర్శించి ఎంతటి నిశ్చలత్వము గలవాడైనను, ఆవేశపూరితుడు గాకుండ వర్ణించజాలడు. హిమాలయములను ఒక్కసారి చూచినవాడు వానిని మరువజాలడు. వానిని పోలిన వానిని మరి చూడజాలడు'' అని ఎలిఫిన్‌స్టన్ వ్రాసెను.

**ప్రాచీనత్వము :**

హిందువుల నాగరికత యొక్క ప్రాచీనత్వము అద్భుతము. దాని పటుత్వము ఆశ్చర్యకరము. మానవ కోటిలో అనేక జాతులుదయించి రూపుమాసినవి. కాని హిందూ సభ్యత మాత్రము వాటి అన్నింటి యొక్క ఉదయాస్తమయములను, వాటి స్థితిలయము లను అవలోకించుచు నేటి వరకు నిలచియున్నది.

కౌంట్ జార్చన్ స్జర్నాగారు ప్రపంచ జాతుల ప్రాచీనత్వము గురించి విపులముగ చర్చించి తుదకు ''నాగరికత యొక్క ప్రాచీనత్వములోగాని, మత సిద్ధాంతముల ప్రాచీన త్వములోగాని హిందువులతో సరితూగుటకు ఏ యితర జాతి వారికిని అర్హత లేదు'' అని అభిప్రాయపడినాడు.

హిందూ నాగరికత యొక్క ప్రాచీనత ప్రతిదినము దైవపూజ చేయునప్పు చెప్పబడు సంకల్పమును బట్టి గ్రహించవచ్చును. ''ఆద్యబ్రహ్మణః ద్వితీయ పరార్ధే, శ్వేతవరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే ప్రథమపాదే'' అని చెప్పుదురు.

ఇప్పుడు మనము వైవస్వత మన్వంతరములో నున్నాము. ఇంతకు పూర్వము ఆరు మన్వంతరములు గడచినవి. అవి - స్వాయంభువు, స్వారోచిష, ఔత్తమి, తామస, రైవత, చాక్షుస అనునవి. ఇపుడు ఏడవదగు వైవస్వత మన్వంతరము జరుగుచున్నది. ఇంకను 7 మన్వంతరములు గడువవలసి యున్నది. 14 మన్వంతరములు ఒక బ్రహ్మదినముగా పరిగణించబడును.

ఒక్కొక్క మన్వంతరములో 71 చతుర్యుగములుండును. కృతయుగము (1,728,000సం), త్రేతాయుగము (1,296,000సం) ద్వాపర యుగము (864,000సం) కలియుగము (432,000సం). ఈ నాలుగు యుగములు కలిసి ఒక చతుర్యుగమగును.

ఇప్పటి కలియుగము మహాభారత యుద్ధానంతరము ఆరంభమైనది. ఇందు ఇప్పటికి (క్రీ.శ. 1996 నాటికి) 5097 సంవత్సరములు గడచినవి.

హిందూ నాగరికత ప్రాచీనతకు ఈ అంశములు తార్కాణములుగానున్నవి.

**వర్ణ వ్యవస్థ :**

వర్ణాశ్రమ ధర్మమనగా ఈ కాలపు కులవ్యవస్థకాదు. పూర్వ స్థితికిని ఇప్పటికిని ఎంతో తారతమ్యమున్నది. ప్రాచీన కాలమున కేవలము జన్మచే నొకడు బ్రాహ్మణుడగుటయు, శూద్రుడగుటయు లేదు. వారి వారి గుణముల బట్టి బ్రాహ్మణులుగను శూద్రులుగను పరిగణింపబడిరి.

శంకర దిగ్విజయములోనిట్లున్నది : ''జన్మనా జాయతే శూద్రః సంస్కారాదద్విజ ఉచ్యతే వేద పాఠీ భవేద్విప్రః బ్రహ్మజానాతి బ్రాహ్మణః''

జన్మమును బట్టి అందరు శూద్రులే. కర్మల వలన విప్రులగుచున్నారు. బ్రహ్మ జ్ఞానము వలన బ్రాహ్మణులగుచున్నారు.

ఉదాహరణకు ఐతరేయ బ్రాహ్మణములో కవష ఐలుషుడను శూద్రుని గురించి యిట్లు చెప్పబడినది : అతడు హీనస్త్రీకి పుట్టిన వాడైనను పాండిత్య సంపదను బట్టి మిగుల గౌరవింపబడు చుండెడివాడు. అతనిని ఋషులలో చేర్చిరి. అతని జీవితములో గొప్ప విశేషమేమనగా అతడు శూద్రుడైనను ఋగ్వేదములో కొన్ని ఋక్కులకు ఋషియై విరాజిల్లెను. (ఋగ్వేద - (10.30.34)).

వాల్మీకి, విశ్వామిత్రుడు, వ్యాసుడు జన్మముచే శూద్రులుగాక మరెవ్వరు?

**హిందువుల శీలము :**

ప్రాచీన హిందువుల వంటి ఉత్తమ శీలము గల జాతి నాటికి నేటికి మరియొకటి కలదా? వారి ఔదార్యము, న్యాయబుద్ధి, సత్యసంధత, ధైర్యము, సభ్యత, పౌరుషము ఇత్యాది సుగుణములు లోక ప్రసిద్ధములు.

''హిందువుల తలుపులకు తాళములు వేసుకొనుట, ఒడంబడికలకు పత్రములు వ్రాసుకొనుటయు అగత్యము లేకుండెడిది. వారంతటి నిజాయితీ గల మనుష్యులు'' అని స్ట్రాబో వ్రాసెను.

13వ శతాబ్దము నాటి ఇటలీ యాత్రికుడు మార్కొపోలో యిట్లు వ్రాసెను: ''ఈ బ్రాహ్మణులు లోకములో కెల్ల ఉత్తమ వణిజులు, సత్యవంతులునని ఎరుగవలయును. ఏమిచ్చినను అబద్ధమాడువారు కారు.''

యుధిష్ఠిరుడు సోదరులను, భార్యయును వెంటరానిదే స్వర్గమునకు పో నిరాకరించిన వృత్తాంతము వలన హిందువుల ఉన్నత శీలము, ఘనమైన స్వార్థ త్యాగము, ఆప్తులయెడ అనురాగము వెల్లడియగుచున్నవి.

సర్ మోనియర్ విలియమ్స్ ఇట్లనెను : ''హిందూ దేశీయులు బుద్ధి పూర్వకముగా జీవహింస గావింపరు. తమకు తమ ప్రాణమెంతో తిర్యగ్జంతువులకు వాని ప్రాణ మంతియేనని నమ్మి వారు సర్వభూతముల యెడ దయకలిగి ప్రవర్తింతురు.''

బ్రిటిష్ పార్లమెంటు యొక్క ఉభయసభలచే నియమించబడిన ఒక విచారణ సంఘము నెదుట సాక్ష్యమిచ్చుచు మొదటి గవర్నర్ జనరల్ వారెన్ హేస్టింగ్సు ఇట్లు పలికెను: ''హిందువులు సాధుస్వభావులు, పరోపకార చింతనగలవారు. అపకారము చేసిన వారి యెడ ప్రతీకారము చేయబూనుట యందు కంటే ఉపకారము చేసిన వారియెడ కృతజ్ఞులై యుండుటయందు ఎక్కువ శ్రద్ధ గలవారు. కోప తాపములను నిగ్రహించుకొనుటలో ఎవరికిని తీసిపోరు. వారు విశ్వాసముగలవారు, ప్రేమాస్పదులు''.

''ఆధ్యాత్మిక జ్ఞానము హిందువుల సొమ్ము. వారు తీక్షణ బుద్ధిగలవారు. అగాధ విషయములను సహితము అవగాహన చేసుకొను శక్తి వారికి కలదు'' అని బుర్నాఫ్‌గారు అన్నారు.

**రక్షాబంధన్ ఆచారము :**

హిందువుల సహజ ఔదార్యం వలన ఒక విచిత్రమైన ఆచారముద్భవించింది. జాతి, కుల, వయోభేదము లేకుండ ఎల్లరు దీనిని పాటించుచున్నారు.

ఇది ''రాఖీ''యను రక్షాబంధనము. దీనిద్వారా హిందూస్త్రీలు కొందరు పురుషులకు రాఖీలు పంపి ( కట్టి) తన సోదరులుగా పరిగ్రహించెదరు. ఆ పురుషులు నిరపేక్షాపరులై మనస్ఫూర్తిగా ఆ స్త్రీలకు అండదండలుగా నుండి వారి రక్షణకు బాధ్యత వహించెదరు.

**'భాషలకు భాష' – సంస్కృతము :**

మాక్సుముల్లర్ పండితుడు సంస్కృతమునకు 'భాషలకు భాష' (Language

of Languages) అని నామకరణం చేసి 'ఖగోళ శాస్త్రమునకు గణిత శాస్త్రమెట్టిదో, భాషా శాస్త్రమునకు సంస్కృత మట్టిదనుటలో అసత్యము లేశమును లేదు' అని చెప్పినాడు.

''సంస్కృత భాషా నిర్మాణ మత్యద్భుతమనియు, గ్రీకు భాష కంటే ఎక్కువ లోపరహితము, పరిపూర్ణమనియు, లాటిన్ భాష కంటె బాహుళ్యమైనదనియు, రెండింటి కంటే స్వచ్ఛమైనదనియు'' ఐరోపియన్ సంస్కృత సారస్వత విమర్శకు లలో అగ్రగణ్యుడగు సర్ విలియం జోన్స్ అభిప్రాయపడెను.

ఒక జర్మన్ విమర్శకుడిట్లనుచున్నాడు : ''సంస్కృతమునకు గ్రీకు, లాటిన్, జర్మన్ భాషలతో మాతృసంబంధము తప్ప వేరు సంబంధము లేదు. ఈ హేతువుచేతనే మాక్సుముల్లర్ సంస్కృతము ఆర్యుల ప్రాచీన భాషయనెను''.

యోగము :

యోగము తెలియనివాడు మానవ ప్రకృతి యొక్క నిజమైన లోతుపాతులు కనుగొనజాలడు. హృదయము లోపల గుప్తమైయుండు రహస్యములను యోగజ్ఞా నము గలవాడెరుగగలడు. ఆత్మయన నెట్టిదో ఈశ్వరుడన నెట్టివాడో యోగ సహా యములేక తెలియజాలము.

అట్టి యోగ శాస్త్రము హిందువులలో మాత్రమే యున్నది. ఇతర ప్రాచీన ఆధునిక జాతులలో ఎచటను దీని జాడలైన కానరావు. ఉత్తమోత్తమమైన ఆధ్యాత్మిక వికాసము వలనను, ఉత్తమోత్తమమైన బుద్ధి వికాసము వలనను ఈ శాస్త్రము సాధించబడినది. ప్రాచీన కాలమునాటి హిందువులు ఇతర జాతుల కంటె శేముషి యందు అధికులనుటకు యోగశాస్త్రము మరియొక ప్రమాణము.

వైద్యశాస్త్రము :

లోకములోని వైద్యశాస్త్రములన్నింటిలో ప్రాచీనతమము ఆయుర్వేదము. హిందువుల ఔషధ చికిత్స వలనే శస్త్ర చికిత్సయు సుప్రసిద్ధమని ఎలిఫిన్స్టన్ వ్రాసెను.

ఐరోపా వారి వైద్యశాస్త్రమునకు హిందువుల వైద్యశాస్త్రమే పునాది. మదరాసులో కల్నల్ కింగ్ పేర వ్యాధి నిరోధక ఔషధ చికిత్సాలయమును ప్రారంభించుచు అప్పటి మదరాసు గవర్నరు లార్డ్ ఆంప్తిల్ (Lord Ampthill) ఇట్లు పలికెను : ''ఐరోపా ఖండము అజ్ఞానావస్థలో మునిగియున్న కాలములో, యూరోపి యనులు అనాగరికులుగా నున్న కాలంలో, హిందువులు రోగములు రాకుండుట కును, రోగములను కుదుర్చుటకును చేయు ఔషధ చికిత్స యొక్క ముఖ్య

మూలసిద్ధాంతాలను ఎరిగి యుండినట్లు కల్నల్ కింగ్‌గారు చెప్పియున్నారు. అట్టి మంచి విషయమును వెల్లడించినందులకు హిందూజను లెల్లరు వారియెడ కృతజ్ఞులై యుండవలెను. వైద్య శాస్త్రమునకు భరతఖండము జన్మభూమి యని అందరకు తెలియునని నాకు నమ్మకము లేదు. ఈ శాస్త్రం మీ దేశమున ఉద్భవించి నది. ఇక్కడనుండి అరబ్బులు గ్రహించిరి. క్రీ.శ. 17వ శతాబ్ది అంతమువరకు ఐరోపా వైద్యులీ శాస్త్రమును అరబ్బీ వైద్య గ్రంథముల నుండి నేర్చుకొనుచుండిరి. వందలాది ఏండ్ల క్రితము అరబ్బులు ధన్వంతరి, చరక, సుశ్రుతాది గొప్పగొప్ప భారతీయ భిషగ్వరుల గ్రంథములనుండి నేర్చుకొనుచుండిరి.''

మాగ్డొనెల్ పండితుడిట్లు వ్రాసెను : ''క్రీ.శ. 700 సం. పిదప అరబ్బులలో హిందూ వైద్యశాస్త్రము కలిగించిన పరివర్తనము అనల్పము. బాగ్దాదు ఖలీఫా అనేక వైద్య గ్రంథములను భాషాంతరీకరింప చేయుటయే దీనికి ఆరంభము''.

*గణిత శాస్త్రము :*

హిందువులు ఖగోళ శాస్త్రములో చేసిన అసాధారణమైన కృషి వారి గణిత శాస్త్ర ప్రావీణ్యతను ఋజువు చేయుచున్నది.

మాగ్డొనల్ పండితుడిట్లనుచున్నాడు : ''విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానములో సహితము ఐరోపాఖండము భరత వర్షమునకు విశేషముగ ఋణపడియున్నది. లోకమందంతట వాడబడుచున్న అంకెలు భారతీయులు కనిపెట్టినవి. ఆ అంకెలపై ఆధారపడిన దశాంశ పద్ధతి గణిత శాస్త్రాభివృద్ధికి మాత్రమేగాక నాగరికాభివృద్ధికి ఎంతో విశేషముగ తోడ్పడినది. క్రీ.శ. ఎనిమిది తొమ్మిది శతాబ్దములలో భారతీయులు అరబ్బులకు అంక, బీజ గణితము లను నేర్పిరి. వారిద్వారా పాశ్చాత్యులందరకూ వీరే గురువులైరి. కావున బీజగణితమును మనము అరబ్బీ పేరుతో వ్యవహరించుచున్నప్పటికీ అవి భారతవర్ష ప్రసాదమని తెలుసుకొనవలెను.''

హిందువులు అంకగణితములో అసమానమైన కృషి చేసిరనుటకొక్కమాట చెప్పవలసియున్నది. ఈ దేశస్థులు సంఖ్యాపరికర్మమును ఎంత దీర్ఘములైన వానివైనను చేయుదురు. సంఖ్యావళి స్థానములకు హిందువులు పెట్టినంత దూరము మరెవరును పేర్లు పెట్టలేదు. కాబట్టి వారు అతిదూర స్థానముల వరకు గణింపగల్గెడివారు.

''బీజ, క్షేత్ర గణితములను (Algebra and Geometry) కనిపెట్టి తొలుత వాటిని ఖగోళ శాస్త్రమునకు అన్వయించినవారు హిందువులు'' అని మోనియర్ విలయమ్స్ అనుచున్నాడు.

ఖగోళశాస్త్రము :

విద్యలన్నిటిలో ఖగోళ శాస్త్రాభ్యాసము అత్యంత ఉత్కృష్టమైనదని ఒక ఐరోపా విమర్శకుడనినాడు. అవును సత్యమే. ఈ విశాల విశ్వమును గురించిన విద్యకంటే, ఈ అపారమైన ఖగోళములో దివ్యముగ ప్రకాశించుచున్నట్టి ఆ కాంతిగోళ ముల గమనములను, చర్యలను తెలుసుకొనుటకంటే ఉత్కృష్టమైన విద్య మరియేమి కలదు?

హిందువుల ఖగోళశాస్త్రము (ఇప్పటికి నిలచియున్నది స్వల్పమే అయినను) ఐరోపా పండితుల మన్ననల నందినది. ''క్రీ.పూ. 2780సం. నాడే భరతఖండములో ఖగోళ శాస్త్రమభ్యసింపబడు చుండె''నని ప్రొ.ఎ.వెబర్ తన History of Indian Literature అను గ్రంథములో వ్రాసెను.

**సంగీతము :**

ఆనీ సి. విల్సన్ అను రచయిత్రి ఇట్లు వ్రాసినది : ''భారతీయులను గాయకజాతి అని పిలువవచ్చును. వారి జీవన మందు గానములీనమై యున్నది. వారి ప్రతి చర్యకును సంగీతముతో సంబంధమున్నది. దినములో గంట గంటకును, సంవత్సరములో ఋతువు ఋతువునకును అనువగునట్లు విడివిడిగా ప్రత్యేక రాగములు కలవు''.

చిరకాలము నుండి హిందువులకు గానముపై ప్రీతి మెండు. వేదములలో సహితము (సామవేదము) గానశాస్త్రము గురించి చెప్పబడినది. కాని దురదృష్టవ శమున శాస్త్రకళల సమ్మేళనమనదగు గాంధర్వ వేదము నష్టమై పోయినది. హిందూగాన శాస్త్ర మూల సిద్ధాంతముల గొప్పతనము తెలియుటకై మనకు మిగిలిన ఆధారములా గాంధర్వ వేదము నుండి సంస్కృత గ్రంథములలో అక్కడక్కడ ఉదహరింపబడిన భాగములు మాత్రమే!

సర్ ఎమర్సన్ టెన్నల్ అనునతడు Music of Ancients అను గ్రంథము 21వ పుటలో ఇట్లు వ్రాసెను : ''అక్బరు పాదుషా తాన్సేనును రాత్రి రాగమగు శ్రీరాగ మును మిట్టమధ్యాహ్నము వేళ పాడుమని ఆజ్ఞాపించెను. అతడు దానిని కొంతసేపు ఆలపించు సరికి పాటవినిపించినంత దూరము రాజమందిరము చుట్టును చీకట్లు క్రమ్మెనని కొన్ని లిఖిత ఆధారముల బట్టి తెలియుచున్నది''.

**ఇతర శాస్త్రములు :**

ప్రాచీన హిందువులు యంత్ర శాస్త్రములో అద్భుత పరిజ్ఞానమును

సాధించిరని మహాభారతమును బట్టి తెలియుచున్నది. మయుడు పాండవులకు నిర్మించిన చిత్ర ప్రదర్శనలో సూక్ష్మదర్శినులు, దుర్భిణులు మొదలైనవి అమర్చబడి నవని వర్ణింపబడినది.

పూర్వకాలమున భారతఖండములో గొప్ప గొప్ప దుర్భిణులుండెడివనుట వాస్తవము. కురుక్షేత్రములో జరుగుచున్న మహాయుద్ధమును అవలోకించుటకై వ్యాసుల వారు సంజయుని కొరకు దుర్భిణినిచ్చిరి.

వృక్ష శాస్త్రమును గురించి విల్సన్ పండితుడిట్లు వ్రాసెను: ''ఔషధుల బాహ్యాంతర గుణములను హిందువులు శ్రద్ధతో పరిశీలింపగలిగిన వారు. వారు ఔషధ వర్గమునకు పట్టికలు వ్రాసి ఒక్కొక్క దాని ఉపయోగములను అతి సూక్ష్మముగ వివరించిరి. ఆయా ఔషధుల విశేష గుణములు తెల్పుచూ నాటికి పేర్లు పెట్టిరి''.

విమాన విద్య (అనగా వాయు పథగమనము) శత పథ బ్రాహ్మణము 11,14వ సర్గలలో ప్రస్తావించబడిన వాయు విద్య అను సమగ్రతర శాస్త్రములో నొకభాగమని కొందరి అభిప్రాయము.

**ఇనుము, ఉక్కు పరిశ్రమలు :**

డా. పి.సి. రే గారు ఇట్లు వ్రాసిరి : ''ఉక్కును కాల్చి చల్లార్చి, పదును చేయు టలో భారతీయులు మిగుల నిపుణులని పేరొందిరి. డమాస్కన్ కత్తులు మిక్కిలి శ్లాఘింపబడు చుండెడివి. పేరు డమాస్కసుకు వచ్చినది గాని వానిని సిద్ధపరచు రహస్యమును పారశీకులు భారతఖండము నుండి గ్రహించిరి. వారి ద్వారా అరబ్బులు నేర్చుకొనిరి. ఢిల్లీలో కుతుబ్ మినార్ వద్ద గల ఇనుప స్తంభము 1500 ఏళ్లనాటిది. 10 టన్నుల బరువుగల ఢిల్లీ ఇనుప స్తంభమును, జగన్నాథములోని పెద్ద ఇనుప దూలములును, సోమనాథములోని చిత్రపు పనిగల ఇనుప ద్వారములును, మార్వా రులోని 24 అడుగుల పొడవుగల ఫిరంగియును హిందువులు లోహ పరిశ్రమలో ప్రసిద్ధి కెక్కిరనుటకు తార్కాణములు.''

## గ్రహణాలు

ప్రశ్న : సూర్యచంద్రులను పాము మింగితే గ్రహణం వస్తుందా? ఎంత మూర్ఖులు హిందువులు?

జ : పాము మ్రింగడమే అయితే ఏ మాసంలో ఏ తిథినాడు మ్రింగుతుందో శతాబ్దాలుగా పంచాంగం వ్రాసే బ్రాహ్మడికి ఎలా తెలుస్తుందో? పంచాంగ కర్తకి ఇంగ్లీషు అక్షరాలుగూడరావే!

సూర్య, చంద్ర, భూభ్రమణ కక్ష్యలకు రాహుకేతువులని సంకేతం.

ఈ మూడు తిరిగే క్రమంలో ఒకదాని కొకటి ఎప్పుడు అడ్డమొస్తుందో చెప్పేది గణితం. ఆ గణితం తెలిసిన పంచాంగ కర్త గ్రహణ సమయాన్ని చెపుతుంటే, 'పాములు మింగుతాయనే మూర్ఖులు హిందువులు' అనే వాని మూర్ఖత్వం ఎలాంటిది? – ''ఉషశ్రీ''

# 45. దేశదేశాలలో విస్తరించిన భారతీయ సంస్కృతి

-శ్రీ మన్నవ గిరిధరరావు

భారతీయ సంస్కృతి ప్రపంచంలో అనేక దేశాలలో వ్యాపించింది. భారతీయులు వాణిజ్యము కొరకు, ధర్మ ప్రచారము కొరకు, వలస రాజ్యముల స్థాపన కొరకు, బౌద్ధమత వ్యాప్తి కొరకు అనేక దేశాలకు వెళ్లి తమ సంస్కృతిని ప్రవేశపెట్టినారు. ఇప్పటికిని ఆయా దేశాల ప్రజలు భారతదేశమును పవిత్ర భూమిగా పరిగణిస్తుంటారు. వివిధ దేశాలలో కానవచ్చెడి -

1. హిందూ దేవాలయములు, దేవతా విగ్రహములు.
2. బౌద్ధమత వ్యాప్తి
3. హిందూ ఆచారములు, నాగరికత
4. సంస్కృత భాషా పదముల వినియోగము
5. హిందూ ధర్మ శాస్త్రములకు, భారత రామాయణములకు గల ఆదరణ.

వీటిని ఆధారము చేసుకొని ఆయా దేశములలో భారతీయ సంస్కృతి వర్ధిల్లినదని తెలుసుకొనగలుగుచున్నాము.

**1. చైనా :**

క్రీస్తుశకం 67లో బౌద్ధమత వ్యాప్తి కొరకు కశ్యప మాతంగ, ధర్మరక్ష అనువారు చైనా వెళ్లారు. అపుడు మింగ్‌టీ అను చక్రవర్తి చైనాను ఏలుతున్నాడు. కశ్యప మాతంగుడు చైనాలో స్థిరపడిపోయాడు. లోయంగ్ పట్టణంలో ఉండిపోయాడు. ఆ తరువాత కాలంలో బుద్ధ భద్ర, కుమార జీవ, పారమార్థ, జినగుప్త, బోధిధర్మ అనువారు చైనా వెళ్లారు. వీరిలో చాలామంది కాశ్మీరు, బెంగాలునకు చెందినవారు.

ఇలావెళ్లి అచట ఉండిపోయి జీవితాంతం బౌద్ధమత ప్రచారం చేసిన బౌద్ధ భిక్షువులు 6వ శతాబ్దం నాటికి 3,000 మందికి పైగా వున్నారు. ఈ భారతీయ పండితులు చైనా భాషను అధ్యయనం చేశారు. తాము గొనిపోయిన సంస్కృత గ్రంథాలను చీనా భాషలోకి అనువాదం చేశారు.

క్రీ.శ. 401లో చైనా వెళ్లిన కుమార విజయుడు గొప్ప మేధావి. అతడు చీనా

భాషలో రచించిన 47 గ్రంథాలు ఇప్పటికీ అచట లభ్యమవుతాయి. మహాయాన బౌద్ధప్రవక్తయగు ఆచార్య నాగార్జునుని జీవితచరిత్రను అతడు చీనాభాషలో వ్రాశాడు.

6వ శతాబ్ద మధ్యభాగంలో చైనా వెళ్లిన జినగుప్తుడు 37 సంస్కృత గ్రంథాలను చైనా భాషలోకి అనువదించాడు. అతని విజ్ఞానానికి ముగ్ధుడై టాంగ్ వంశానికి చెందిన చక్రవర్తి సయితం ఇతని శిష్యుడైనాడు.

**2. మియన్మార్ (బర్మా) :**

బర్మా దేశమును పూర్వము సువర్ణభూమి అని పిలిచెడి వారు. బర్మా వారి న్యాయ శాస్త్రము మనువు, నారదుడు, యాజ్ఞవల్క్యుడు రచించిన ధర్మశాస్త్ర ముల నాధారం చేసుకొని ఏర్పడినది. గౌతమ బుద్ధుని మొదటి శిష్యులగు తాపుస, భల్లూక అనువారు బర్మాకు చెందిన వ్యాపారులు. అశోకుడు సోణ, ఉత్తర అను బౌద్ధమత ప్రచారకులను బర్మాకు పంపాడు.

బర్మాలో చాలా హిందూ రాజ్యములుండెడివి. అరకాన్ రాజ్యమునకు 'వైశాలి' రాజధానిగా నుండెడిది. 'శ్రీధర్మరాజానుజ' వంశమునకు చెందిన రాజులు దీనిని 300 సంవత్సరాలు పరిపాలించారు. వీరి పేర్లు హిందూపేర్లు. వీరి శిల్పము లలో బౌద్ధ, శైవ, వైష్ణవ ప్రతిమలున్నాయి. జయచంద్రవర్మ, హరివిక్రమ, సూర్య విక్రమ, అనిరుద్ధ అను రాజులు బర్మారాజ్యములను పరిపాలించారు.

ఇచట లభించిన శాసనములు సంస్కృతము, పాలి భాషలలో ఉన్నాయి.

**3. సింహళము :**

అశోకుడు తన కుమార్తె సంఘ మిత్రను, కుమారుడు మహేంద్రుని బౌద్ధ మత వ్యాప్తి కొరకు సింహళమునకు పంపినాడు. అచటి రాజగు దేవానాం ప్రియతిష్య బౌద్ధమత మును స్వీకరించి అనూరాధపురములో ఒక బౌద్ధ ఆరామము నిర్మించాడు. సింహళములో హీనాయాన బౌద్ధమతమునకు ప్రాముఖ్యము కలిగినది.

తంజావూరు పరిపాలించిన చోళచక్రవర్తి మొదటి రాజరాజు క్రీ.శ. 900లో సింహళముపై దండెత్తి సింహళరాజ మహేంద్రుని ఓడించి ఉత్తర సింహళమును తన రాజ్యంలో కలుపుకున్నాడు. అనురాధపురంలో శివాలయం కట్టించాడు. సింహళం లోని దేవాలయాలలో హిందూ, బౌద్ధ శిల్పకళ కానవస్తుంది.

**4. జావా :**

ఇండోనేషియాలో ప్రధాన ద్వీపమగు జావాకు యవద్వీపమని పేరు. చైనా యాత్రికుడు ఫాహియాన్ క్రీ.శ. 418లో జావా దర్శించి, అచటి ప్రజలు హిందూమతస్థు లని వ్రాశాడు. జావా రాజుల పేర్ల చివర హిందూ క్షత్రియులకు వలె 'వర్మ' అను పదమున్నది. అచట లభించిన శాసనములు సంస్కృతములో

దేవనాగరి లిపిలోనున్నవి. క్రీస్తుశకము 2వ శతాబ్దము నుండి 15వ శతాబ్దము వరకు జావాలో హిందూ సంస్కృతి విలసిల్లినది. ఒకప్పుడు కళింగ నుండి 20వేల హిందూ కుటుంబములు జావా వెళ్లి స్థిరపడినాయట.

బాయాన్ (Bayon) నగరంలో శివాలయమున్నది. ప్రాంబనం వద్ద గల ఎనిమిది దేవాలయములలో శివ, గణేశ, దుర్గ, విష్ణు, బ్రహ్మ, యముడు విగ్రహములున్నవి. కాశ్మీరు నుండి వెళ్లిన గుణవర్మ క్రీ.శ. 424లో బౌద్ధమతమును ప్రవేశపెట్టినాడు. పిదప అతడు చైనా వచ్చి అచట స్థిరపడ్డాడు. ఇండోనేషియా రాజధాని యగు జాకార్తాకు 35మైళ్ల దూరములో గల బోరోబుదూర్ Borobudurలో క్రీ.శ. 750లో గొప్ప బౌద్ధస్థూపము నిర్మింపబడినది. ఇది ఒక కొండమీద నిర్మించబడి ప్రపంచమంతటి నుండి పర్యాటకుల నాకర్షించుచున్నది.

జావాను పాలించిన రాజులలో కొందరి పేర్లు : పూర్ణవర్మ, సన్నాహ, సంజయ, ధర్మోదయ, మహాశంభు.

**5. సుమత్రా :**

దీనికి సువర్ణ ద్వీపమని పేరుండెడిది. హిందువులు క్రీ.శ. రెండవ శతాబ్దములో ఇచట వలస రాజ్యం స్థాపించారు. పిదప బౌద్ధమతం వ్యాపించినది. జయసేనుడను బౌద్ధ రాజుకాలంలో ఇచట శైలేంద్ర రాజ్యము ప్రసిద్ధి గాంచినది. నలంద నుండి ధర్మపాలుడను బౌద్ధ పండితుడు సుమత్రాకు వెళ్లాడు. బలపుత్ర దేవుడను రాజు నలందలో కళాశాల నిర్మించాడు.

**6. బలి ద్వీపము :**

బలిద్వీపము ఈనాటికి గూడా హిందూ సంఘమునే కలిగియున్నది. ఇస్లాం మతము ఇచట ప్రవేశింపలేకపోయింది. ఇచటి ప్రజలు విష్ణు, శివ, కృష్ణ, గణపతులను పూజిస్తారు. చాతుర్వర్ణ పద్ధతి యిచట కొనసాగుచున్నది. ఉగ్రసేనుడను రాజు క్రీ.శ. 915లో పరిపాలించాడు. ఇచటి రాజులు 'కౌండిన్య' వంశమునకు చెందినవారు.

**7. బోర్నియో :**

దీనికి వరుణ ద్వీపమని పేరుండెడిది. క్రీ.శ. 4వ శతాబ్దం నాటికి ఇచట హిందూ సంస్కృతి వ్యాపించినది. తూర్పు బోర్నియాలో సంస్కృతంలో వ్రాయబడిన శిలా శాసనములు లభించాయి. మూలవర్మ అనురాజు యజ్ఞము చేసి 20,000 ఆవులను విప్రులకు దానము చేసినాడు. కోంబెంగ్ (Kombeng) అను నగర ములో బౌద్ధ, హిందూ దేవతల ప్రతిమలు దేవాలయాలలో పూజింపబడుచున్నాయి.

**8. కంబోడియా :**

దీనికి 'కాంభోజ' అని పేరు. క్రీ.శ. మొదటి శతాబ్దం నాటికే ఇది హిందూ వలసరాజ్యంగా రూపొందినది. కంబోడియా రాజులు సంస్కృత భాషను పోషిం

చారు. శైవము, వైష్ణవము ఇచట వ్యాపించాయి. పురాణములు, రామాయణ మహాభారతములు ప్రాచుర్యం పొందాయి. ఇచట భావవర్మ, మహేంద్ర వర్మ, యశోవర్మ మున్నగు రాజులు పాలించారు.

క్రీ.శ. 1112 - 1152 లలో పాలించిన సూర్యవర్మ తన రాజధానిలో ''అన్కోర్‌వాట్'' (Ankor Vat) అని పేరొందిన విష్ణు దేవాలయమును నిర్మించాడు. ఇది కంబోడియాలోకెల్ల సుందరమైన నిర్మాణము. దీనిలో మహాభారతము, రామాయణము, హరివంశముల నుండి సన్నివేశములు చిత్రింపబడినవి. బౌద్ధమతము గూడ కంబోడియాలో వర్ధిల్లినది.

**9. థాయిలాండ్ :**

దీనికి సయాం అనిపేరు. క్రీ.శ. రెండవ శతాబ్దంలో ఇచట హిందూ నాగరికత ప్రవేశించినది. అసంఖ్యాకమైన బుద్ధ, శివ, విష్ణు విగ్రహాములనిచట గాంచగలము. ఇచట మిథిల, విదేహ, కౌశాంబి, గాంధార పేర్లతో పట్టణములున్నవి. ఇప్పటికీ అనేక హిందూ పండుగలను జనులు జరుపుకుంటారు. సయాంభాషలో సంస్కృత, పాలి భాషా పదములు అసంఖ్యాకంగా ఉన్నాయి. హిందూ ధర్మశాస్త్రములు ఆధారంగా ఇచటి న్యాయశాస్త్రం రూపొందినది.

**10. జపాను :**

జపాను రాజగు షోటోకూ (593 - 622) బౌద్ధమతమును రాజ్యమతముగా ప్రకటించాడు. బోధిసేనుడను భారతీయ సన్యాసి (736-761) జపానులో బౌద్ధ మత మును విరివిగా ప్రచారం చేశాడు. జపాన్‌లోని కియాటో నగరములో యముని దేవాలయ మున్నది. యముణ్ణి ఎమ్మాశాన్ అని పిలుస్తారు. దున్నపోతునెక్కిన యముణ్ణి కియాటో నగరంలో చూడవచ్చు. ''నీవు అబద్ధం పలికితే ''యమ్మాశాన్'' నీ నాలుక కోసేస్తాడు'' అని జపాను తల్లులు బిడ్డలకు చెపుతారు.

**11. అమెరికా ఖండము :**

దివాన్ చమన్‌లాల్ ''హిందూ అమెరికా'' అను గ్రంథం రచించాడు. అందు మెక్సికో దేశములో హిందూ నాగరికత వర్ధిల్లినదని వ్రాశాడు. మెక్సికోలో వినాయక విగ్రహములు లభించాయని వ్రాశాడు. మెక్సికో ప్రజలు తమ ప్రాచీన రాజు త్రిలోకనాధుడని చెబుతారు. అతడే సృష్టికర్త అనీ, దేవుడనీ భావిస్తారు.

గ్వాటిమాలా దేశములోని ఒక దేవాలయములో విష్ణుమూర్తి యొక్క కూర్మావతార విగ్రము కానవచ్చింది.

బొలీవియా, పెరూ, మెక్సికో దేశములలో సూర్య దేవాలయములున్నవి. అచటి ప్రజలు ఒకప్పుడు సూర్యుని ఆరాధకులు.

**12. ఆఫ్ఘనిస్తాన్ :**

మౌర్యచంద్రగుప్తుని కాలములో ఆఫ్ఘనిస్థానము భారతదేశంలో అంతర్భాగముగా నుండెడిది. దీనికి గాంధార దేశమని పేరు. ఆఫ్ఘనిస్థానములో గజనీ నగరములో జరిగిన త్రవ్వకములలో విష్ణు విగ్రహములు బయల్పడినవి. గార్దెజ్ నగరములో సూర్యుని యొక్క, గణేశుని యొక్క ప్రతిమలు లభించినవి. అచటి ప్రజలు మాట్లాడు పుస్తూ భాషలో అనేక సంస్కృత పదములున్నవి. బౌద్ధమత మిచ్చట వ్యాపించింది.

**13. పర్షియా :**

పారశీకుల మతమును జొరాష్టర్ అనునతడు ప్రారంభించినాడు. వీరి పవిత్ర గ్రంథము ''జండ్ ఆవెస్టా''. ఇందలి భాష వేద సంస్కృతమును పోలియున్నది. వేదఋషులవలె వీరును అగ్నిని పూజిస్తారు.

**14. ఈజిప్టు :**

పూర్వము ఈజిప్టు దేశములో సూర్యుని ఉపాసించెడివారు. సూర్యుని వారు 'హోరస్' అని పిలిచెడివారు. ఈజిప్టు రాజుల పేర్లు రామ్సేస్ I, రామ్సేస్ II అనియున్నవి. రామ శబ్దమే రామ్సేస్ అయినది. ఈజిప్టు రాజసింహాసనమునకు ఒక ప్రక్కన హనుమంతుని విగ్రహము మరొకప్రక్క గరుత్మంతుని విగ్రహము ఉండెడివట. నైలునదీ తీరమున గల గుహలలో రామాయణ భారత గాథలు, అగ్నియందు హోమము చేయుట, చిత్రించబడెనని తెలియుచున్నది.

## కాటికాపరి డోమ్‌రాజా ఇంట్లో సాధు సంతుల భోజనం

సత్య హరిశ్చంద్రుని కొన్న చండాలుని వంశం వారుగా చెప్పబడుతున్న డోమ్ రాజా సంజీత్ చౌదరి నివాసం కాశీలోని దశాశ్వమేధ ఘాట్. ఇప్పటికీ శవదహనం కొరకు డోమ్‌రాజా నుండి అగ్నిని తీసుకొనే ఆచారం ఉంది. 1994 మార్చి 17వ తేదీ ఉదయం 9 గంటల సమయం. ఆరవ ధర్మ సంసద్‌లో పాల్గొనడానికి కాశీ విచ్చేసిన ధర్మాచార్యులు ఇరుకు ఇరుకు దారులగుండా డోమ్‌రాజా ఇంటివైపు ప్రయాణమైనారు. జన సమూహం హరహరమహాదేవ నినాదాలతో అత్యుత్సాహంగా ధర్మాచార్యులకు స్వాగతాలు పలికారు.

ధర్మాచార్యులందరూ డోమ్‌రాజా ఇంటికి చేరుకున్నారు. డోమ్‌రాజా సంజీత్ చౌదరి, వారి కుటుంబసభ్యులు అందరూ ధర్మాచార్యుల పాదాలంటి మొక్కారు. ''ఇందరు మహానుభావులైన ధర్మాచార్యులు నా కుటీరాన్ని పావనం చేసి భోజనం చేసి మమ్మల్ని ధన్యుల్ని చేస్తారని నేను కలలో గూడా భావించలేదు'' అన్నాడు డోమ్‌రాజా.

ధర్మాచార్యులు విస్తళ్లముందు కూర్చున్నారు. వడ్డన జరిగింది. అందరూ కలిసి మెలసి భోజన మంత్రాన్ని చెప్పి ఆహారం స్వీకరించారు. ఇలా సామాజిక సమరసత సాధనకై ధర్మాచార్యులు ఈ కార్యక్రమంలో పాల్గొనడం ద్వారా ఒక విప్లవాత్మకమైన మార్పుకు అంకురార్పణ చేశారు.

# అధ్యాయము - 17

# ఆత్మ విమర్శ

## 46. హిందువులు ఆలోచించ వలసిన సంగతులు

-డా. శ్రీ ప్రకాశ్

(మదరాసు రాష్ట్ర గవర్నరుగాను, ఆ తరువాత కరాచీలో భారత రాయబారిగాను పనిచేసిన స్వర్గీయ డా. శ్రీ ప్రకాశ్‌గారు *1967*లో వ్రాసిన ఒక ఆంగ్ల వ్యాసానికి తెలుగు అనువాదం పేర్కొనుచున్నాము. - సంపాదకుడు)

పురాతన సంస్కృతి, పరంపర, అమూల్యమైన జీవిత సంధా, విలువైన విశ్వాసాలతో గూడిన హిందూధర్మం వచ్చే శతాబ్ద కాలంలో ఈగడ్డ మీదనుండి మాయమైపోతుందేమో నని నేను భయపడుతున్నాను.

మానవుడు ఈజిప్షియన్, గ్రీకులాంటి గొప్ప నాగరికతలు ప్రపంచంనుండి నిష్క్రమించినప్పుడు కోల్పోయిన దాని కంటే ఎన్నోరెట్లు విలువైన ధర్మాన్ని హిందూ మతం అదృశ్యమైనపుడు పోగొట్టుకుంటాడు. నేనీ విషయాన్ని ఒక హిందువుగా చెప్పడంలేదు. వివిధ మతాలను పోల్చి చదివిన ఒక విద్యార్థిగా, తత్త్వవేత్తగా ఆలోచించి మరీ అంటున్నాను.

ఐదువేల సంవత్సరాలకు పైగా సంక్షోభపరంపర లన్నిటినీ తట్టుకుంటూ నిలబడిన ఈ హిందూ ధర్మం రానున్న శతాబ్దంలో ఎలా మటుమాయమైపోగలదని కొందరు ప్రశ్నింపవచ్చును. విదేశీ పాలనాకాలంలో శారీరకంగా మనం వారికి లొంగినా, మానసిక దాస్యానికి ఎన్నడూ పాల్పడలేదు. ఆంగ్లభాషను, సాంకేతిక శాస్త్రాలను పఠించినప్పటికీ సాంఘిక విషయాలలో పరంపరానుగతంగా వస్తున్న హిందూధార్మిక విధానాన్ని మనం విడిచిపెట్టలేదు.

కాని, స్వరాజ్యం వచ్చినపిదప మనది 'సెక్యులర్' రాజ్యాంగమని ప్రకటించు కున్నాము. సెక్యులరిజం ఆచరణలో హిందూ వ్యతిరేకతగా తయారయింది.

అన్యమతస్థులు ముఖ్యంగా క్రిస్టియనులు, ముస్లిములు వారిండ్లలో మతసం బంధమైన వాతావరణాన్ని నిలుపుకో జూస్తారు. వారి పిల్లలకు మతబోధ చేస్తారు. హిందువులు మాత్రం పూర్తిగా ఇందుకు వ్యతిరేకంగా తయారయ్యారు. సామూహిక ప్రార్థనలు జరుపుకొనుటకు, మతసంబంధమైన వాతావరణాన్ని సృష్టించుకొను

టకు, దురదృష్టవ శాత్తు ఏ హిందూ కుటుంబము శ్రద్ధవహించుటలేదు. మనలో ఆంగ్లభాషాస్థాయి అంత కంతకు దిగజారిపోతున్నా, మన నిత్యజీవితాన్ని, ఆలోచ నలను, ఆంగ్లీకరణ చేసుకొనడంలో ప్రముఖులమగుచున్నాము.

గతంలో చేసిన తప్పులనుండి గుణపాఠాలు గ్రహించడానికి నిరాకరిస్తున్నాం. మన సామాజిక జీవితంలో పాతుకుపోయిన అస్పృశ్యత అనెడి జాడ్యం వల్ల లక్షలాది సోదరులను పోగొట్టుకుంటున్నాము. ఈ జాడ్యం మూలంగా దాదాపు మూడో వంతు హిందూజాతి తన విశ్వాసాన్ని మార్చుకున్నది. మిగతావారు దాన్ని గూర్చి పట్టించుకోరు. ఈవిధంగా తమకు తామే నష్టపరచుకుంటూ హిందువులు ఆపదలో నున్నారు.

ఇతరులలో ఉండే మంచితనాన్ని స్వీకరించడానికి సిద్ధంగాలేము. చెడ్డవాటిని మాత్రం అనుకరించడానికి ఉత్సాహపడుతున్నాము. ముస్లిములు వారి నిత్యజీవి తంలో ఆదర్శవంతమైన సోదర భావాన్ని వెల్లడించుకుంటారు. కలవాడు లేనివాడని తరతమ భేదాలు చూపకుండ సహపంక్తి భోజనాలకు, సామూహిక ప్రార్థనలకు వారెంతో విలువ నిస్తారు. బ్రిటిష్‌వారినుండి గూడ పనికిరానివాటినెన్నింటినో నేర్చు కున్నాం. కాని వారినుండి నియమబద్ధమైన జీవితం, క్రమశిక్షణ, దృష్టిని లక్ష్యంమీద కేంద్రీకరింప చేయడం, నిరంతర క్రియాశీలత లాంటి గుణములను నేర్చుకోలేదు. మనకుమనమే శత్రువులమవుతున్నాం. మన హృదయ కుహరాలలోకే శత్రువులు ప్రవేశించినపుడు వినాశనం ఎంతో దూరం లేనట్లే.

ఈ పరిస్థితిని పట్టుదలతో సరిదిద్దుకోవాలి. హిందువులు సంకుచిత మనస్తత్వం విడనాడి వాస్తవాలను ఒప్పుకోవాలి. అందరికి సమాన గౌరవ ప్రపత్తులనిచ్చి ఆత్మవికాసానికి, సమాన అవకాశాలు కలిగించగల సామాజిక వ్యవస్థా నిర్మాణానికై మనం మన సర్వస్వాన్నీ వెచ్చించాలి. ముస్లిముల నుండి ఆదర్శ సోదరభావాన్నీ, క్రైస్తవులనుండి క్రమశిక్షణాయుత త్యాగశీలాన్ని గ్రహించాలి.

హిందువులు అస్పృశ్యతా నివారణకు దీక్షాకంకణం ధరించి శపథం చేయాలి. కడజాతి వారినిగా పరిగణించి మన సోదరులను మనం దూరంచేసుకోరాదు. ఈ ఆదర్శం, ఈ విశ్వాసం ఏమాత్రం సడలినా మన జాతియొక్క పునాదులే విచ్చిపోతాయి. అశ్రద్ధ చేయబడిన వారందరూ వాళ్ల విశ్వాసాలనే మార్చుకొని పరాయి మతాలను ఆశ్రయించారు. కనుక మనం అస్పృశ్యతావాదులం కాకూడదు.

విద్యావంతులమైనా, సంపన్నులమైనా నిరాడంబరంగా జీవించడం చాలా అవసరం. హిందువుల ఆదర్శం యిదే. తద్వారా అసూయలకు, ద్వేషాలకు తావివ్వక అందరం ఒకటే అనే భావానికి కట్టుబడుతాము. హైందవేతరులనుండైనను సద్గు ణాలను గ్రహించి, వాటిని మన నిత్య జీవితంలో మేళవించినపుడు హిందూ ధర్మం అంతరించే ప్రమాదముండదు. ఆనాడు హిందూధర్మం ప్రపంచానికి వెలుగు నివ్వగలదు.

# 47. దేశము-ధర్మము-ప్రజలు : వీటి నడుమ సమన్వయం ఆవశ్యకత

-శ్రీ మన్నవ గిరిధరరావు

(ప్రసిద్ధ పౌరాణికులు, సికిందరాబాద్ వాస్తవ్యులు శ్రీ కల్లూరు వీరభద్ర శాస్త్రి గారు శ్రీ మన్నవ గిరిధరరావు గారితో జరిపిన ఇష్టాగోష్ఠి)

శ్రీ వీరభద్ర శాస్త్రి : గిరిధరరావుగారూ! మీతో ఇష్టాగోష్ఠిగా సంభాషించి మీనుండి కొన్ని విషయాలు తెలుసుకోవాలని వచ్చాను.

శ్రీ గిరిధరరావు : శాస్త్రిగారూ మీరు ప్రసిద్ధ పౌరాణికులు, భారత భాగవత రామాయణాలను ఎన్నోసార్లు సభలలో గానంచేసి ప్రవచనం చేశారు. వాటి నిగ్గు తేల్చిచెప్పారు. మీరు అడిగేవాటికి నేను ఏమి చెప్పగలను?

వీర : జ్ఞానం అనేది అనంతమైనది. నాకు తెలిసినది మీకు తెలియకపోవచ్చు. మీకు తెలిసినది నా దృష్టికి రాకపోవచ్చు. ఇటీవల ఒక సభలో మీరు చతుర్విధ పురుషార్థాల గురించి సరిక్రొత్త రీతిలో ప్రసంగించారు. మీకు చరిత్రలో, రాజనీతి శాస్త్రంలో లోతుపాతులు తెలుసు. కనుక నా ప్రశ్నలు కొన్నింటికి జవాబులు పలకండి.

గిరి : తెలిసినంతలో చెపుతాను. అడగండి -

వీర : హిందూధర్మం గురించి మీ అభిప్రాయమేమిటి?

గిరి : ఒకమారు కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి వారిని ''సోవియట్ రష్యా గురించి మీ అభిప్రాయం ఏమిటి?'' అని ఎవరో ప్రశ్నించగా, ''రష్యావాళ్ళు మనిషిని గుర్తుపెట్టుకొని దేవుణ్ణి మరచిపోయారు; ఇక్కడ మనం దేవుణ్ణి గుర్తుపెట్టుకొని మనిషిని మరచిపోయాం'' అని జవాబిచ్చినారట.

అందుచేత హిందూ ధర్మం గురించి నా అభిప్రాయ మేమిటంటే - మనిషిని మరచిపోయాం. అదే హిందూ ధర్మం యొక్క దైన్యస్థితికి కారణం.

వీర : మీ అభిప్రాయాన్ని కాస్త వివరించండి?

గిరి : వివరిస్తాను. కొన్ని ఉదాహరణలతో చెపుతాను. చిన్న పిల్లలకు చెప్పినట్లు చెపుతున్నానని మీరు భావించకండి.

లోకంలో ప్రతివస్తువుకూ మూడు లక్షణాలుంటాయి.

అవి 1. గుణము, 2. పరిమాణము, 3. ఉనికి. వీటిలో ఏ ఒక్కటి లేకపోయినా మిగతా రెండూ వ్యర్థమవుతాయి.

తేనె ఉన్నదనుకోండి. దానికి ఒక ప్రత్యేకమైన రుచి ఉంటుంది. పైత్యం తొలగించి పుష్టినిచ్చే ఔషధ గుణం ఉంటుంది. అంతేగాని, 'అది ఏ బెల్లపు పానకమో అయితే అది తేనె అనిపించుకోదు. దాని ధర్మం లేక గుణం అది కలిగివుండాలి.

రెండవది : తేనె ఒక్క చుక్కో రెండు చుక్కలో లభిస్తే ప్రయోజనం లేదు. ఒక లీటరో రెండు లీటర్లో గనుక లభిస్తే దాన్ని దాచుకొని ఆరోగ్యం కొరకు వినియోగించు కోగలం. ఇది దాని పరిమాణం.

మూడవది : తేనెను నిలువచేసుకోడానికి ఒక పాత్ర ఉండాలి. పాత్రలేకుండా గాలిలోనో నేలమీదనో పోసివుంచుకోనే వీలు లేదు. ఇది దాని ఉనికి.

ఇదేవిధంగా పాలుగాని, ధాన్యంగాని, నూనెగాని, మరొకటిగాని పరిమాణము, గుణము, ఉనికి అనే మూడు లక్షణాలను కలిగివుంటాయి. వీటిలో ఏ ఒక్కటీ అప్రధానం కాదు. ఈ మూడింటిలో దాని గుణము లేక ధర్మం అనేది మరింత ప్రధానమైనదిగా కనిపిస్తుంది. కాని మిగతా రెండూ గూడా సమానంగా ముఖ్యమైనవే.

వీర : ఈ ఉదాహరణలను హిందూ ధర్మానికి ఎలా అన్వయించి చెపుతారు?

గిరి : అదే మనవి చేస్తాను. హిందూ భావన అనేది గూడా మూడు లక్షణాలు కలిగివుంటుంది. ఒకటి హిందూ ధర్మం. రెండు ఆ ధర్మాన్ని ఆచరించే హిందూ ప్రజలు. మూడు: ఆ ప్రజలు నివసిస్తున్న హిందూదేశం. ఈ మూడింటిలో ఏ ఒక్కటి లుప్తమైనా మిగతావి రెండూ అనామకమవుతాయి.

వీర : ఈనాడు హిందూ ధర్మం ఏ పరిస్థితిలో ఉన్నది?

గిరి : మ్యూజియంలో భద్రపరచబడిన ప్రాచీన చక్రవర్తుల కిరీటం వలె వున్నది. ఇలాంటి ఉపమానం ఇస్తున్నందుకు మన్నించాలి. పురావస్తు ప్రదర్శనశాలలో భద్రపరచబడిన ఖడ్గాలను, కవచాలను చూచి ఆనందించవలసినదేగాని చేతిలోకి తీసుకొని ఉపయోగించే వీలులేదు.

అలాగే హిందూధర్మం అనేది బీరువాలలో ఉండే పుస్తకాలకు పరిమితమై పోయింది. తమబోటివారు ఆయా గ్రంథాలలోని దివ్యసందేశాలను సభావేదికల మీద నుండి వెల్లడిస్తే ఆ క్షణంలో విని ఆనందించడమేగాని జీవితంలో వాటిని అన్వయింపచేసుకునే దృష్టి ఎవరికీ లేదు. మన జీవితం వేరు, మన ధర్మం వేరు. ఇవి రెండూ ఉత్తర దక్షిణ ధృవాలు.

కాకపోతే, శుభమా అంటూ కాపురానికి వచ్చిన భార్యను భర్త పుట్టింటి నుంచి డబ్బుతెమ్మని రావిరంపాన పెట్టడమేమిటి? కిరసనాయిలు పోసి తగులపెట్టడ

మేమిటి? ఇలాంటి రాక్షసత్వం హిందూ కుటుంబాలలోనే చూస్తున్నాంగదా? మనం బోధిస్తున్న పార్వతీ పరమేశ్వరుల అర్ధనారీశ్వరతత్వం ఏమయింది? రాధాకృష్ణుల ప్రేమతత్వం ఏమయింది?

మనదేశంలో మనుషులు పని చెపితే పారిపోతారు. పని తప్పించుకోడానికి శతవిధాల ప్రయత్నిస్తారు. అన్ని రంగాలలో ఇది కనిపిస్తుంది. భగవద్గీతలో శ్రీకృష్ణుడు చేసిన బోధలు మనకు కాదా? ''నీ కర్తవ్యం నీవు నిర్వర్తించు, నేను సయితం నిరంతరం కర్మ చేస్తూ ఉంటాను'' అని ఆయన చేసిన ప్రవచనం మనకొరకు కాదా?

వీర : ఎందువలన ఇట్టి దుస్థితి ఏర్పడింది? మన ధర్మం యొక్క ప్రభావం ప్రజా జీవితం మీద ఎందుకుండడం లేదు?

గిరి : దేశంలో ధర్మప్రచారం చేస్తున్న ఉపన్యాసకులు, పౌరాణికులు మున్నగు వారంతా ఈ ప్రశ్న వేసుకోవాలి. ధర్మాన్ని ప్రజలతోను వారి జీవితంతోనూ అనుసంధించ కుండా కేవలం కాలక్షేపంకోసం ప్రవచనాలు చేస్తూవున్నందున ఈ దుస్థితి ఏర్పడింది.

నేను ముందే మనవి చేసినట్లు హిందువులకూ, హిందూ ధర్మానికీ విడదీయరాని అనుబంధం వున్నది. అట్టి హిందువులు ఎలా మెలగుతున్నారు? వారిలో నిజాయితీ, కార్యశీలత, సామాజిక దృక్పధము, విశ్వసనీయత, పరస్పర సహకారము పుష్కలంగా వున్నాయా? లేక మోసము, దగా, స్వప్రయోజనము, పశుప్రవృత్తి, అనైక్యత వారిని నడిపిస్తున్నాయా? వీరి జీవితాలను, వీరి నడవడిని ప్రకాశవంతంచేసే రీతిలో హిందూ ధర్మం వున్నదా? లేక ఆచరణకు అసాధ్యమై శబ్దాడంబరాలలో అది నిండి వున్నదా?

సమాజంలోను, ప్రపంచంలోను వస్తున్న మార్పులను అవగాహన చేసుకుంటూ ధర్మప్రబోధం జరుగుతున్నదా? హిందువుడైనవాడు మిగతా హిందువుల కష్టసుఖాలలో పాలుపంచుకుంటున్నాడా? లేక తన చుట్టూ గిరిగీసుకుని అడ్డుగోడలు కట్టుకొని ఏకాంత జీవనం సాగిస్తున్నాడా? హిందూధర్మం ఎంతముఖ్యమో 'హిందువులు' అంతముఖ్యం. ఈ సత్యాన్ని హిందూ ధర్మ బోధకులు గుర్తించడంలేదు.

వీర : మరి ఈ రెండింటితో దేశానికి గల సంబంధమేమిటి?

గిరి : ధర్మ ప్రచారకులందరూ దేశం గురించి మాట్లాడడంగాని ఆలోచించ డంగాని తమపని కాదనుకుంటారు. అది రాజకీయాల క్రిందకు వస్తుందనీ, రాజకీయాలజోలికి తాము పోగూడదని అనుకుంటారు. రాజకీయాల జోలికి పోకుండానే దేశం గురించి ఆలోచించాలి, అర్థం చేసుకోవాలి, ఆవేదన చెందాలి.

ఎందుకంటే మన ధర్మాన్ని అవలంబించిన హిందూ జనులు ఎక్కడ జీవిస్తున్నారు? గాలిలోనో, ఆకాశంలోనో, సముద్రంలోనో బ్రతకడంలేదు. ఈ నేలమీద నివసిస్తున్నారు. ఈ భూమి లేకుండా వారులేరు. చరిత్రకు అందని కాలంనుండీ హిందువులకు చెందిన దేశం ఈ భారతదేశం. దీన్ని గనుక కోల్పోతే ప్రపంచంలో హిందువులూ వుండరు, హిందూ ధర్మమూ ఉండదు.

మన కళ్ళముందు 1947లో సింధు, పశ్చిమ పంజాబు, తూర్పు బెంగాలు రాష్ట్రాలను పోగొట్టుకున్నాం. అచట వేలాది సంవత్సరాలుగా నివసిస్తున్న లక్షలాది హిందూ కుటుంబాలు ఇప్పుడు ఎలా వున్నాయి? తమ మతాన్ని తాము అనుసరించగలుగుతున్నారా? ఎన్ని అవమానాలకు, అత్యాచారాలకు, మత మార్పిడులకు వారు గురి అయినారు? వారి జనాభా ఎంతగా క్షీణించింది, మిగతా దేశంలోవున్న హిందువులు వాళ్లను గురించి ఎందుకు ఆలోచించరు?

ఇపుడు మనదేశంలో అంతర్భాగంగా ఉన్న కాశ్మీర్‌లో హిందువుల పరిస్థితి ఏమిటి? కట్టుగుడ్డలతో 3 లక్షల 50వేల మంది హిందూ సోదరులు అచటినుండి శరణార్థులుగా ఢిల్లీకి, కాన్పూరుకు ఎందుకు రావలసివచ్చింది? తమ దేశంలోనే తమకు రక్షణ లేదా? ''హిందువులు''గా జన్మించడమే వారు చేసిన నేరమా? వాళ్లను గురించి మిగతా హిందువులు ఎందుకు బాధపడరు?

మనం అనుదినం స్మరించే నదులలో ఒకటైన సింధునది ఇపుడు మనదేశంలో లేదు. పాకిస్తానులో వున్నది. ద్వాదశ శక్తిపీఠములలో ఒకటైన హింగుళాక్షేత్రం ఇపుడు పాకిస్తాన్‌లో వున్నది. ఇలా క్రమక్రమంగా హిందువుల భూమి పరుల ఆక్రమణలోకిపోతే అది హిందువుల అస్తిత్వానికే ప్రమాదంకదా? హిందువులే లేనపుడు హిందూ ధర్మం ఎక్కడ వుంటుంది?

వీర : మీ అభిప్రాయం ప్రకారం హిందూధర్మం కాపాడబడి సుస్థిరంగా వర్ధిల్లవలె నంటే జరగవలసినది ఏమిటి?

గిరి : ఇది చాలా పెద్ద ప్రశ్న - ఎన్నో సంగతులు చెప్పవలసి వస్తుంది. ఐనా ముఖ్యమైన అభిప్రాయాలు మీ ముందుంచుతాను.

1. హిందూ ధర్మమనేది కొన్ని ఆదర్శములను ప్రవచించడం వలన మాత్రమే వర్ధిల్లదు. ఆ సిద్ధాంతములను జీవితంలో ఆచరించేటువంటి ''ఉత్తమ నడవడి ఇలా ఉంటుంది'' అని చూపగలిగేటువంటి జనసముదాయం వలన హిందూభావనకు గౌరవ ప్రతిష్ఠలు చేకూరుతాయి.

2. ప్రతి ఒక్క హిందూ సోదరుని వెనుక మిగతా హిందువులు అండగా నిలబడాలి. అట్టి విశ్వాసం ప్రతి హిందువుకీ కలగాలి.

3. హిందూమతమనేది అగ్ర వర్ణాలకు మాత్రమే పరిమితమైనదనే పరిస్థితి

మారాలి. ఇది యావన్మంది హిందువులకు చెందినది అనే వాతావరణం నిర్మాణం కావాలి.

4. ప్రజలు ఈనాడు మోక్షమును కోరరు. మత సిద్ధాంతాల ఔన్నత్యం గురించి చర్చించరు. వారు సమాజంలో మర్యాద, మన్నన కోరుకుంటారు. తమను కష్టములలో ఎవరు ఆదుకుంటారా అని ఆలోచిస్తారు. ఒక హిందువుడు మరొక హిందువునితో ఎలా వ్యవహరిస్తున్నాడు (treatment) అనే దాన్ని బట్టి హిందూ ధర్మం నిలబడుతుంది.

5. దేవాలయంలో దేవునికి అర్చనలు జరుగుతాయి. వీటితోబాటు పేదలకు ఉప కరించే సేవాకార్యక్రమాలను గూడ దేవాలయ యాజమాన్యం చేపట్టవచ్చు. ఉదాహరణకు వైద్యులు తమ సమయంలో కొంతభాగాన్ని వెచ్చించి దేవాలయం పక్షాన ఉచిత వైద్యశాలను నడుపవచ్చు. యాజమాన్యంవారు మందులను సమకూర్చవచ్చు. అపుడు ప్రజలకు దేవాలయం మీద మమకారం పెంపొందుతుంది.

6. ప్రతి హిందువుడూ మనిషిని మనిషిగా చూచి వ్యవహరించడం అలవరచు కోవాలి. జన్మనుబట్టిగాక గుణమునుబట్టి విలువ నివ్వడం జరగాలి.

వీర : ధన్యవాదాలు! ఆలోచనలు రేకెత్తించే సంగతులు చాలా చెప్పారు.

## సూక్తి సుధ

(కొన్ని సంస్కృత శ్లోకముల తాత్పర్యమిచట పొందుపరుస్తున్నాము)

సుఖము కోరువాడు విద్యను వదలుకొనవలసినదే. విద్యనే కోరువాడు సుఖ మును త్యజించవలసినదే. సుఖార్థులకు విద్య ఎక్కడ? విద్యార్థులకు సుఖ మెక్కడ?

చేత గొడుగు నుంచుకొనిన వానిని వానచినుకులేమీ చేయలేవు కదా. అట్లే దేశప్రజల అనురాగమును చూరగొన్న పాలకులను ఎందరు శత్రువు లెత్తి వచ్చినను ఏమియు చేయజాలరు.

ఎంతవారికైనను స్వకీయులైన అల్ప జనులతో కలిసియుండుట శ్రేయస్క రము. బియ్యముపై పొట్టును తొలగించినచో దానికి మొలకెత్తు శక్తి నశించుటలేదా?

కవి పేదయైన నేమి? ధనవంతుడైన నేమి? కవిత్వము రసవంతముగా నున్న చాలును. బిచ్చగాని చంకనున్నదైనను చెఱకుగడ తీపి తరుగదు కదా!

క్రోధమే యమధర్మరాజు; ఆశయే వైతరణీనది; విద్యయే కామధేనువు; సంతోషమే నందనవనము. కనుక క్రోధము ప్రాణమును హరించును, ఆశ దాట రానిది, విద్య కోరికలనొసంగును, సంతోషము సుఖము చేకూర్చును.

# 48. భారతీయుల బలహీనతలు

- ''సౌమిత్రి''

(తమ లోపాలను తెలుసుకొని వాటిని సరిదిద్దుకొనే జాతి అభివృద్ధి చెందుతుంది. మాలో ఏ లోపాలు లేవనుకోవడం పెద్ద పొరబాటు. అందుచేత ఆత్మవిమర్శకుపకరించు ఈ వ్యాసాన్ని పాఠకులకందిస్తున్నాం)

భారత ప్రభుత్వం జర్మనీ నుండి ఉక్కు ఉత్పత్తిలో ప్రత్యేక అనుభవం గల సాంకేతిక నిపుణుని ఒక సంవత్సరం కాంట్రాక్టు మీద పిలిపించింది. అతనికి పెద్ద జీతం ఇవ్వడానికి గూడ ఒప్పందం కుదిరింది.

అతడు ఇండియా వచ్చాడు. అయితే అతడు పని చేయవలసిన ఉక్కు పరిశోధనా కేంద్రానికి పునాది రాయి గూడ వేయడం జరగలేదు. అందుచేత ఎనిమిది నెలల పాటు ప్రభుత్వం అతనిని సోమరిగా ఉంచింది. జీతం మాత్రం ముద్ర శుద్ధిగా చెల్లిస్తూనే వున్నది.

ఈ సంగతి తెలిసి తాతా ఉక్కు కంపెనీవారు పరిశోధనలకై అతని సేవలను వినియోగించదలచి ప్రభుత్వం నుండి అనుమతి కోరారు. అతడు వెళ్ళి వారి వద్ద పని చేయడ మారంభించాడు.

ఆ జర్మన్ నిపుణుడు మాట్లాడుతూ ఇలా అన్నాడు : ''పని ఎడల భారతీయుల నిర్లక్ష్యాన్ని చూచి నేను నిర్ఘాంతపోతున్నాను. నా వద్ద శిక్షణ పొందుతున్న భారతీయ శాస్త్రవేత్తలు గూడా పని పట్ల శ్రద్ధ చూపరు. వారి వృత్తిలో వారికి అభిలాష ఉండదు. ఈ రకమైన మనుషులతో జర్మనీలో ఉక్కు కర్మాగారాలు గనుక పని చేస్తే అవి ఆరునెలల్లో దివాలా తీస్తాయి''.

ఈ సంఘటనను శ్రీ రంజీ సహానీ అనే రచయిత "India without make up" (ఉన్నదున్నట్లు భారతదేశం) అనే గ్రంథంలో ఉదహరించాడు. భారతీయులు ఆత్మ విమర్శ చేసుకోవలసిన రీతిలో ఆ పుస్తకంలో రచయిత వెలువరించిన భావాలు కొన్ని ఇలా ఉన్నాయి :

1. భారతీయుడు మరొక భారతీయునికి వ్యతిరేకంగా పని చేస్తుంటాడు. అలా చేయకపోతే అతనికి జీవితంలో రమ్యత ఉండదు.

2. తోటి భారతీయుడు వృద్ధిలోకి పోతుంటే అతడు ఓర్వలేడు. మనసు పిచ్చి పిచ్చిగా ఉంటుంది. అవతల వాణ్ణి క్రిందకు లాగడం కోసం ఎంత శ్రమైనా పడతాడు.

3. భారతీయుడికి కావలసింది డబ్బు. డబ్బు కోసం ఏమైనా చేస్తాడు. భారత దేశంలో డబ్బు గలవాడే సకల సద్గుణవంతుడుగా పరిగణించబడతాడు. ఎన్నో పాపాలను, లోపాలను డబ్బు కప్పి పెట్టేస్తుంది.

4. స్వభావ రీత్యా భారతీయుడు పెద్ద సమస్యలు వచ్చినపుడు తటస్థంగా గోడ మీద పిల్లి వాటంగా వుంటాడు. ఒకేసారి దేవుణ్ణీ దయ్యాన్నీ గూడ పూజిస్తాడు. ఒడ్డున కూర్చుని కబుర్లు చెపుతాడుగాని ఒక నిర్ణయం తీసుకోడు.

5. భారతీయునికి నయం కాని జబ్బు ఒకటున్నది. అది వాచాలత్వం. అతని అభిప్రాయంలో చేతలు అనవసరం, మాటలు మాత్రం అవసరం. నోట్లో నురుగు చేరే వరకు లొడలొడ వాగి తృప్తిపడుతుంటాడు. ఏమీ చేయకపోవడమే పనులు సాధించే మార్గ మని అతని గట్టి నమ్మకం.

6. ఒక పని మంచిది గనుక చేయాలని అతడు ఎన్నడూ అనుకోడు. 'దీనివల్ల నాకేమి లాభం?' అని ఆలోచిస్తాడు. స్వలాభం ఒక్కటే అతన్ని నడిపించే శక్తి.

7. ప్రతి పనీ అయిష్టంగా చేస్తూ వుంటాడు. అందుచేత నిఫలం చెందుతూ వుంటాడు. కృషి చేయడమనేది అతనికి స్వభావానికి విరుద్ధం. అందుచేత కాలం విలువ అతనికి తెలియదు.

8. భారతీయుడు స్వయముగా ఆలోచించడు. క్రొత్త భావాలకు చోటివ్వడు. అందుచేత ఏ రంగంలోనూ తనది అని చెప్పుకోదగిన పురోభివృద్ధి పొంద లేకుండా వున్నాడు.

9. భారతీయుని మాటల్లో ఎప్పుడూ 'నేను, నేను' అనే శబ్దం వినిపిస్తుం టుంది. 'మనము' అనే మాట అతని నోటి వెంటరాదు. సామాజిక దృక్పథం అతనిలో కనిపించదు.

పై లోపాలు సరిదిద్దుకోవడం మన కర్తవ్యం.

## దేశభక్తి

నాపేరు, అనవసరం నీకు
తల్లీతండ్రీ, అక్కాచెల్లీ, భార్యాబిడ్డ
ఎవరూలేరు; అయినా ఫరవాలేదు
పవిత్రమైన జన్మభూమి, ప్రజలూ ఉన్నారు
అదే నా ఆత్మ - వారే నా ప్రాణం.

– ఒక ఫ్రెంచికవి

# అధ్యాయము - 18

# ప్రత్యేక అంశములు

## 49. పవిత్ర భారత వర్షము

- ''సౌమిత్రి''

స్వామి వివేకానందుడు విదేశముల నుండి తిరిగి వచ్చిన పిదప ఉపన్యసిస్తూ ఇలా అన్నారు: ''భారతదేశపు మృత్తిక గూడ పవిత్రమైనదని గ్రహించినాను. ఇచటి గాలి గూడా పవిత్రతతో నిండియున్నది. ఇపుడు నాకిది మహా పుణ్యభూమిగా గోచరించినది''.

స్వామి రామతీర్థ ఇట్లు భావించినాడు : ''దాదాపు భారత వర్షములోని ప్రతి నగరము, నదులు, పర్వతములు, జంతువులు కూడా దైవత్వముతో మేళవింపబడినవి. మన మాతృభూమిని దేవతాస్వరూపముగా భావన చేయవలసి యున్నది''.

అట్టి పవిత్ర భారత వర్షములోని పుణ్యతీర్థములను, ప్రకృతి దృశ్యములను తిలకించినచో హృదయముప్పొంగ గలదు. అట్టి ప్రదేశములలో మచ్చుకు కొన్నిటిని మాత్రమే ఇచట వర్ణించుట జరుగుచున్నది.

**1. అమర్‌నాథ్ క్షేత్రము :**

ఇది కాశ్మీరములో శ్రీనగర్ నుండి 153 కి.మీ. దూరములో నున్నది. పహల్‌గాం వరకు బస్సులో వెళ్ళి అచటి నుండి 46కి.మీ. కాలినడకన మంచుకొండల నడుమ ప్రయా ణము చేయవలసి వుంటుంది. ఇది ప్రకృతి సిద్ధమైన గుహాలయము. దీని నిర్మాణములో మానవ హస్తమే లేదు. సముద్ర మట్టానికి 13 వేల అడుగుల ఎత్తున ఇది ఏర్పడినది. దీని ఎత్తు 150 అడుగులుంటుంది. గుహ పై కప్పులోని రంధ్రముల గుండా నీటి బొట్లుపడి వెంటనే గడ్డకట్టి మంచుగా ఏర్పడుతుంది. ఇలా ఏర్పడిన మంచు ముద్దయే అమరనాథ హిమలింగము.

ఇచట ఆశ్చర్యమేమనంటే, చంద్రునికళల వలె కృష్ణపక్షంలో క్రమముగా హిమ లింగము క్షీణించి అమావాస్యకు అదృశ్యమై, మరల పాడ్యమి నుండి శుక్లపక్ష చంద్రునివలె పెరుగుతూ పౌర్ణమికి పూర్తి లింగాకారమేర్పడుతుంది. ఇది అనాదిగా జరుగుతున్నది. గుహ దక్షిణాభి ముఖముగా వుండడం వలన సూర్యకిరణాలు సోకవు. కనుక వేసవిలో గూడ లింగము కరగదు. ప్రధాన లింగమునకు ఎడమవైపున గణపతి, పార్వతి, భైరవమూర్తులు మంచు లింగములుగా వున్నారు.

ఈ గుహ శివునికెందువలన నివాసమైనదో తెలుపు గాథయొకటి గలదు. పార్వతీ పరమేశ్వరులు హిమవత్పర్వతములలో వాహ్యాళి తిరుగుచుండగా పార్వతి శివుని ''జీవుల జనన మరణ రహస్యము నెరింగింపు''మని కోరినదట. శివుడా రహస్యము నెరింగించుటకై పార్వతితో కలిసి ఈ ఏకాంత స్థలమునకు వచ్చి చెప్పెనట.

అమరనాథ పార్వతులకు నడుమ ద్రవించెడి జలమును 'అమరజల్ అంటారు. దానిని యాత్రికులు సీసాలలో భద్రపరచి తమ ఇండ్లకు గొనిపోతారు.

**2. బదరీనాథ్ :**

ఇది ఉత్తరప్రదేశ్‌లో హిమవత్పర్వతములలో గల విష్ణు క్షేత్రము. ఋషీకేశ్ నుండి బస్సులో వెళ్ళవచ్చును. దీనికే బదరికాశ్రమం అనీ, బ్రహ్మకపాలం అని గూడా అంటారు. ఇది 23,000 అడుగుల ఎత్తుగల హిమవత్పర్వత శిఖరాల సమీపంలో నున్నది. సముద్ర మట్టానికి 10 వేల అడుగుల ఎత్తున అలకనంద నదీ తీరంలో ఈ పుణ్యక్షేత్రమున్నది. ఇచట అధిదేవతయైన శ్రీ బదరీనారాయణస్వామి, అరవిం ద వల్లీ తాయార్లు పూజలందు కొనుచున్నారు. శ్రీ మహావిష్ణువు పద్మాసనాసీనుడై జ్ఞానముద్రతో నరునకు మంత్రోపదేశం చేస్తున్న భంగిమలో వుంటాడు. ఆలయమునకెదురుగా అలకనందా నది సమీపంలో తప్త కుండమున్నది. అందు సెగల పొగలతో వేడి నీరు 125 డిగ్రీల ఉష్ణోగ్రత కలిగి వుంటుంది. ఒకవైపు నీరు గడ్డకట్టే చలి, మరొక ప్రక్కన మరుగుతున్న నీటికుండము, ఇదే ఆశ్చర్యకరమైన విషయము.

సంవత్సరంలో మే నుండి అక్టోబరు వరకు ఆరు నెలలు మాత్రమే దేవాలయం తెరచియుంచబడుతుంది. శీతాకాలం ఆరు నెలలు మూసివేస్తారు. ఆలయం మూయ బోయేముందు జ్యోతిని వెలిగిస్తారు. ఆ జ్యోతి ఆలయాన్ని మళ్ళీ తెరిచే వరకు ఆరు మాసాలు ఆరకుండా వెలుగుతూ వుంటుంది. ఇది గొప్ప విశేషం.

**3. జ్వాలాముఖి :**

హిమాచల ప్రదేశ్‌లో కాంగ్రాలోయ సమీపంలో గల జ్వాలాముఖి దేవాలయం

52 శక్తిపీఠాలలో ఒకటి. ఇచట సతీదేవి శరీర శకలాల్లో నాలుక తెగిపడిందట. అమ్మవారి పేరు విద్వేశ్వరీదేవి. కొండమీద 50 మెట్లతో దేవికి ఆలయం నిర్మించ బడినది. ప్రక్కనే 40 అడుగుల ఎత్తున సువర్ణ త్రిశూలం కనిపిస్తుంది. ఆలయం రాతి దర్వాజా గుండా చూస్తే 1.5 చదరపు అడుగుల విస్తీర్ణంలో నిరంతరం ఆగకుండా జ్వాలలు జ్వలిస్తూ వుంటాయి. జ్వాల అడుగు భాగం తెల్లగా మల్లెపువ్వులాగ ఉం టుంది. అమ్మవారికి పాలు, నేతితో చేసిన మధుర పదార్థాలు నివేదన చేస్తారు.

అక్బరు చక్రవర్తి అమ్మవారికి వెండి ఛత్రమును కానుకగా ఇచ్చాడు. అది ఇప్పటికీ ఉన్నది. దీనికొక కారణం చెపుతారు. అక్బరు ఈ జ్వాలను ఆర్పివేయడానికి ఇనుపరేకులు కప్పించి, జలధారను జ్వాల మీదికి చిలికించి ప్రయత్నించాడట. జ్వాల ఆరకపోగా అక్బరుకు దృష్టి పోయిందట. అంతట అతడు అమ్మవారి శరణుజొచ్చి ప్రార్థనలు చేయగా దృష్టి మరల పొందినాడట. అపుడు దేవికి రజతఛత్రం సమ ర్పించుకున్నాడని చెపుతారు.

**4. పూరీ :**

పూరీ క్షేత్రము ఒరిస్సాలో బంగాళాఖాత తీరములో నున్నది. ఇక్కడ వున్న జగన్నాథస్వామి దర్శనము కొరకు వచ్చు భక్తులు జాతికుల భేదము లేకుండా ఆరా ధించి, స్వామి ప్రసాదమును పుచ్చుకుంటారు. సర్వం జగన్నాథం అను లోకోక్తి ఇందుకే ఏర్పడినది. జగన్నాథుడనగా శ్రీకృష్ణ భగవానుడే.

జగన్నాథుని రథయాత్ర లోక ప్రసిద్ధమైనది. ఈ రథయాత్రను శ్రీకృష్ణ భగవా నుడు గోకులము నుండి మధురకు చేసిన యాత్రగా పరిగణిస్తారు. రథము మీద బలరాముడు, జగన్నాథుడు, సుభద్రల విగ్రహములనుంచుతారు. రథము 14 మీటర్ల ఎత్తు, 10 మీటర్ల చతురస్రంగా ఉంటుంది. రథానికి 16 చక్రాలుంటాయి. ఒక్కొక్క చక్రం 2 మీటర్ల వెడల్పుగా గుండ్రంగా వుంటుంది. ఈ బ్రహ్మాండమైన రథచక్రాలను కాలచక్రంతో పోలుస్తారు. ఏ ఏటికాయేడు క్రొత్త రథం తయారు చేస్తారు. ప్రతి సంవత్సరం ఆషాఢ శుద్ధ విదియనాడు రథయాత్ర జరుగుతుంది. ఇచటి మహారాజు ''జగన్నాథుని రథ మార్గమును చీపురుతో ఊడ్చువాడు''గా పరిగణించుకుంటాడు.

కబీరు, చైతన్యుడు పూరీ జగన్నాథుని అర్చించారు. కబీరు మఠం ఇప్పటికీ ఇచట వున్నది. పూరీలో ఆదిశంకరులు స్థాపించిన గోవర్ధన పీఠమున్నది.

పూరీ సమీపములో 17 కి.మీ. దూరములో సాక్షీగోపాలుని దేవాలయము

న్నది. ఒకానొకప్పుడు ఒక వివాదములో శ్రీకృష్ణుడు స్వయముగా వచ్చి సాక్ష్యము ఇచ్చినందున దేవునికీ పేరు వచ్చినది!

**5. అజంతా ఎల్లోరా గుహలు :**

మహారాష్ట్రలోని అజంతా, ఎల్లోరా గుహలు జగత్ప్రసిద్ధమైనవి. ఔరంగాబాద్ నుండి జలగాం వెళ్ళే మార్గంలో జల్గాంకు 59 కి.మీ. దూరంలో వున్నాయి. ఇందు మొత్తం 29 గుహలున్నాయి. ఇందు శిల్పకళ, చిత్రకళ మేలి కలయిక కానవస్తుంది. క్రీ.శ. 200 నుండి 650 వరకు చిత్రించబడి వుంటాయి. ఆనాటి రంగులు ఇప్పటికీ చెక్కు చెదరలేదు. వీటిలో గౌతమబుద్ధుని జీవిత చరిత్ర చెక్కబడినది.

ఎల్లోరా గుహలు ఔరంగాబాదు నుండి 15 మైళ్ళ దూరములో నున్నవి. ఇందు హిందూ, బౌద్ధ, జైనమతములకు చెందిన శిల్పములున్నాయి. ఇవి మొత్తము 34 మహాలయములు. వీటిలో 16వది కైలాసనాథుని దేవాలయము. ఇది ఒకే కొండలో పై నుండి దిగువకు తొలచబడిన శివాలయము. ఇందులోనే శివలింగము, నంది, ధ్వజస్తంభము అన్నియు ఒకే శిలలో తొలచబడినవి. ఇది చూచి తీరవలసిన దేవాలయం!

ఇట్లే 11వ గుహ రెండంతస్తులు, 12వ గుహ మూడంతస్తులుగా తొలచబడి నవి!

**6. పక్షి తీర్థం :**

తమిళనాడులో మహాబలిపురానికి 14కి.మీ. దూరములో పక్షితీర్థం వున్నది. ఇచట కొండమీద వేదగిరీశ్వర ఆలయమున్నది. ప్రతిదినం సరిగ్గా 12 గంటలకు దేవునికి పెట్టబడిన నైవేద్యమును పుచ్చుకొనుటకు ఎక్కడ నుంచో రెండు అందమైన గరుడ పక్షులు వచ్చి చూపరులను ఆశ్చర్యపరుస్తాయి. ఇట్లు కొన్ని వందల సంవత్సర ముల నుండి జరుగు చున్నది. ఆ పక్షులు అత్యంత సుందరముగా వుంటాయి. అవి ప్రసాదం స్వీకరించి ఆలయం చుట్టూ మూడు ప్రదక్షిణలు చేసి వెళ్ళిపోతాయి. వాటిని చూచుటకై ప్రతిదినము మధ్యాహ్నం 12 గంటలకు వందలాది పర్యాటకులు అచట నిలిచి వుంటారు.

**7. కన్యాకుమారి:**

భారతదేశమునకు దక్షిణపు చివర కన్యాకుమారి అగ్రమున్నది. దీనికి ఎదురుగా సముద్రములో నున్న శిల మీద స్వామి వివేకానందుని నిలువెత్తు విగ్రహము, ధ్యాన మందిరము బహుసుందరముగా నిర్మింపబడినవి. 1962లో వివేకానందుని

శతజయంత్యుత్సవములు దేశమంతటను జరిగినవి. ఆ సందర్భముగా శ్రీ ఏకనాథ రానడే కార్యదర్శిగా ఏర్పడిన శ్రీ వివేకానంద శతజయంత్యుత్సవ కమిటీవారు దేశమంతటా కోటి రూపాయలు సేకరించి నిర్మించిన శిలా స్మారకమిది. ఈ శిలమీదనే 1892 డిసెంబరు 25న వివేకానందుడు ధ్యాన నిమగ్నుడై భారతదేశ పునరుజ్జీవనము కొరకు పథకమును సంకల్పించినాడు.

కన్యాకుమారి అగ్రము భారతదేశానికి దక్షిణపు చివరన మూడు సముద్రములు కలిసే చోట నున్నది. పౌర్ణమినాటి సాయంకాలము అస్తమించే సూర్యుని, ఉదయించే చంద్రుని ఎదురెదురుగా చూడగలము. పార్వతీదేవి కన్యాకుమారిగా ఇచట ఆరాధింపబడు చున్నది. అమ్మవారికి వజ్రాలు, మణులు, మాణిక్యాలు పొదిగిన ఆభరణాలెన్నియో వున్నవి. ఆమె ముక్కుపుడక ''నాగమణి''తో పొదగబడి అత్యంత ప్రకాశవంతముగా నుండును.

**8. గురువాయూరు :**

కేరళలో త్రిచూర్ నుండి 18 మై. దూరములో గల గురువాయూరులో శ్రీకృష్ణ దేవాలయమున్నది. గురువు (బృహస్పతి), వాయుదేవుడు కలిసి ద్వారక నుండి శ్రీకృష్ణ విగ్రహమును ఇచటికి తెచ్చినందువలన ఈ క్షేత్రమునకు గురువాయూరని పేరు కలిగినది. అనేకులు ఈ స్వామిని సేవించి వ్యాధి విముక్తులై ఆరోగ్యవంతులైనారు. ఒక పాండ్య రాజు ఈ స్వామిని అర్చించి పాము కాటు నుండి రక్షింపబడుటచే ఈ దేవాలయమును కట్టించెనని గాధ కలదు.

క్రీ.శ. 1588లో నారాయణభట్టు అను కేరళ భక్త కవి తన కీళ్ళ జబ్బు నివారణ కొరకు 'నారాయణీయ'మను గొప్ప కావ్యము రచించెను. నేటికిని కేరళలో ఈ గ్రంథమును వ్యాస భాగవతమువలె పారాయణ చేయుదురు.

గురువాయూరు స్వామి చేతిలోని పద్మము మందుల పెట్టె అనియు, అందులో నుండి స్వామి మందులను పంపిణీ చేయుచుండుననియు జనుల విశ్వాసము. ఆ స్వామి రోగులకు కల్పతరువు. ఇచ్చట నిత్యము స్వామికి తలంటి నీరు పోయుదురు. అందుకై మడికట్టుకొని పెద్ద పెద్ద గుండిగలతో వేడి నీళ్ళు కాచి మహాశుచిగా పోసెదరు. ఇట్టి పద్ధతి మరెచ్చటను చూడము.

**9. వారణాసి :**

పవిత్ర గంగానదీ తీరంలో ఉత్తరప్రదేశ్‌లో గల పుణ్యక్షేత్రం వారణాసి లేక కాశీనగరం. వరుణ, అసి అను రెండు నదుల నడుమ ఉండుటచే వారణాసి అని

పేరు వచ్చింది. అతి ప్రాచీన కాలం నుండి వేద విద్యలకు కేంద్రం కాశీనగరం. ఇచటనే విశ్వామిత్రుని పరీక్షకెదురు నిల్చి హరిశ్చంద్ర మహారాజు తన సత్యనిష్ఠను చాటాడు. గౌతమబుద్ధుడు ఇచటికి సమీపంలోని సారానాథ్‌లో తన శిష్యులకు మొదటి ప్రవచనాన్ని చేశాడు. ఆదిశంకరులు ఇచటనే అద్వైత మతస్థాపన చేశాడు. తులసీదాస్ ఇచటనే రామచరిత మానస్ రచించాడు. పండిత మదన్‌మోహన్ మాలవ్యా ఇచటనే హిందూ విశ్వవిద్యాలయాన్ని స్థాపించాడు. భారత ప్రభుత్వ ముద్రలో కానవచ్చే మూడు సింహముల గుర్తు సారానాథ్‌లోని అశోకుడు నిర్మించిన స్తంభంలోనిది.

అతి పురాతనమైన కాశీ విశ్వేశ్వరాలయాన్ని ఔరంగజేబు ధ్వంసం చేసి అచట మసీదు నిర్మించాడు. ఇందూరు రాణియగు అహల్యాబాయి 1778లో నురొక చోట మందిరాన్ని నిర్మించింది. విశ్వేశ్వరాలయానికి సమీపంలో మాత అన్నపూర్ణేశ్వరి దేవాలయం వున్నది.

కాశీలో గంగానదీ తీరంలో 64 స్నాన ఘట్టాలున్నాయి. అందు ప్రతి దానికీ చరిత్ర వున్నది. దశాశ్వమేధఘాట్‌లో బ్రహ్మదేవుడు పది అశ్వమేధ యాగములు చేశాడట. హరి శ్చంద్రఘాట్‌లో హరిశ్చంద్రుడు పాము కాటుచే మరణించిన తన కుమారుడు లోహితాస్యుని దహనం చేశాడట. మణికర్ణికా ఘాట్ పార్వతీదేవి కర్ణకుండలం క్రిందపడిన పవిత్ర స్థలమని ప్రతీతి.

ప్రతి హిందువుడు జీవితంలో ఒక్కసారి అయినా కాశీ క్షేత్రాన్ని దర్శించాలని ఉవ్విళ్లూరుతాడు.

### 10. రామేశ్వరం :

దేశములో గల 12 జ్యోతిర్లింగములలోరామేశ్వరం పదనది. కాశీ వెళ్ళి గంగాజలం తెచ్చి రామేశ్వరంలోని శ్రీ రామలింగేశ్వరునికి అభిషేకం చేయడం హిందువుల ఆచారం. ఈ విధంగా దేశ సమైక్యత గుర్తు చేయబడుచున్నది. ఇచ్చట మూడు ప్రాకారములు గల విశాలమైన ప్రాంగణంలో శ్రీరామలింగేశ్వరస్వామి, పర్వతవర్థని అమ్మవారి దేవాలయము లున్నవి. ఇచ్చట గల 4000 అడుగుల పొడవు 216అ. వెడల్పు గల బ్రహ్మాండమైన మండ పము చూడదగినది. శ్రీరామచంద్రుడు రావణ సంహారానంతరం ఇచట శివలింగ ప్రతిష్ఠ చేశాడని పురాణ గాథ.

రామేశ్వరము ఒక ద్వీపము. అచ్చటికి చేరుటకు రామనాథపురం నుండి సముద్రంలో రైలులో ప్రయాణం చేయాలి. ఆ ప్రయాణం అత్యంత కుతూహలం కలిగిస్తుంది. ఇచ్చట గల గంధమాదన పర్వతము మీద నుండియే హనుమంతుడు

ఎగిరి లంకకు వెళ్ళాడు. ఇచ్చట గల ధనుష్కోటి వద్దనే వానరులు సేతువు నిర్మించారు.

**11. తిరుపతి – తిరుమల :**

యావద్భారతములో ప్రసిద్ధి చెందిన తిరుమల తిరుపతి క్షేత్రం చిత్తూరు జిల్లాలో నున్నది. కలియుగమున భక్తుల బ్రోచుటకై శ్రీ మహావిష్ణువు వేంకటేశ్వర స్వామిగా అవత రించెనని పురాణగాథ. తిరుమల కొండమీద శ్రీ వేంకటేశ్వరస్వామి, కొండ దిగువన తిరు చానూర్‌లో పద్మావతీ అమ్మవారి ఆలయములున్నవి. తిరుమల కొండమీద దేవాలయ విమానము, కలశము బంగారు తొడుగుతో శోభాయమాన ముగనున్నవి. కొండ మీద పాపనాశనం జలపాతం, గోగర్భ నీటి యూట దర్శించదగినవి.

ప్రతి దినము 6వేల మందికి పైగా యాత్రికులు స్వామి దర్శనం చేసుకుంటారు. తిరుపతిలోని ఏడు కొండలు ఆదిశేషుని ఏడు పడగలుగా పరిగణిస్తారు. అందుచే దీనికి శేషాచలమని పేరు. ఏటా దేవునికి భక్తులు సమర్పించు కానుకలు వగైరాలు 50 కోట్ల రూపా యలను మించుచున్నవి.

## బ్రిటిష్‌వాళ్ళు కట్టించిన దేవాలయము

కోరిన వరాలిచ్చే కొండంత దేవుడైన భోళాశంకరుడికి సప్త సముద్రాలు దాటి వచ్చిన బ్రిటిష్ దంపతులు మధ్యప్రదేశ్‌లోని షాజాపూర్ సమీపంలో ఆగర్ గ్రామంలో కట్టించిన గుడి అది.

జీర్ణావస్థలో కూలిపోవడానికి సిద్ధంగా వున్న ఆ శివాలయంలో పూజిస్తే కోరిన కోరికలీడేరుతాయని స్థానికులు చెప్పడంతో ఆఫ్ఘనిస్థాన్‌లో ఆంగ్లసైన్యం తరపున పోరాడుతున్న భర్త మార్టిన్ కోసం భార్య ఆ గుడిలో పూజలు చేసింది. 1898లో ఆఫ్ఘన్ యుద్ధంలో ఆంగ్లేయుల విజయం తర్వాత ఇల్లు చేరిన భర్తకు ఆమె ఆగర్ గ్రామంలో ఉన్న ఆ గుడి మహత్యం గురించి చెప్పింది. అన్ని మతాలవారూ దేవునికి సమానమేననీ, ఆయన అందరినీ చల్లగా చూస్తాడనీ స్థానికులు చెప్పారనీ, అందుకు అక్కడ పూజలు చేశాననీ ఆమె చెప్పింది. బ్రిటిష్ అధికారి మార్టిన్ కృతజ్ఞతా సూచకంగా జీర్ణమందిరం స్థానే భవ్యమైన గుడి కట్టించాడు. విదేశీయులు కట్టించిన ఏకైక హిందూ మందిరం అది! నేటికి 100 ఏళ్ళు పూర్తికావస్తున్నా మార్టిన్ కుటుంబ సభ్యులు ప్రతి ఏటా ప్రత్యేక పూజలు చేసేందుకు కుగ్రామంలో ఉన్న ఆ గుడికి ఇంగ్లండు నుండి వస్తూ ఉండడం ఒక విశేషం!

– 'వార్త' దినపత్రిక, *26-8-96*

# 50. దేశభక్తి స్వరూప స్వభావాలు

- డా. చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి, ఎం.ఎ, పి.హెచ్‌డి.

(డా. చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధ్యక్షులుగా పని చేశారు. రాష్ట్రీయ స్వయంసేవక సంఘంలో ఆంధ్ర ప్రాంత సంఘచాలకులుగానున్నారు. వారితో జరిపిన ఇష్టాగోష్ఠి)

ప్రశ్న : సుబ్రహ్మణ్యశాస్త్రిగారూ! దేశభక్తి గురించి కొన్ని విషయాలు మీరు చెపితే తెలుసుకోవాలని వచ్చాను.

జవాబు : పరస్పరంచెప్పుకుందాం. దేశభక్తి గురించి మీకు కలిగిన సందేహాలేమిటి?

ప్ర: ఏమిటంటే...మేము కళాశాలల్లో చరిత్ర, రాజనీతిశాస్త్రములను బోధిస్తూ మన దేశంలో జాతీయవాదము, దేశభక్తి అనేవి ఇంగ్లీషువారు వచ్చి మనలను ఆక్రమించడం వలన కలిగాయని చెపుతూ వుంటాము. వారి వలననే మన దేశం ఒక రాజ్యంగా ఏర్పడిందని చెపుతూ వుంటాము. మీరేమంటారు?

జ : దేశభక్తి అనేది ఇంగ్లీషువారి వలన కలిగిన భావన కాదు. అనేక వేల సంవత్సరాల క్రిందట వ్రాయబడిన వేదములలో 'ఈ భూమి నా యొక్క తల్లి' అనే భావన ఇవ్వబడినది.

పురాణాలలో కెల్ల ప్రాచీనమైన విష్ణుపురాణంలో ''సముద్రమునకు ఉత్తర ముగాను, హిమవత్పర్వతాలకు దక్షిణంగాను ఉన్న ఈ భూమి భారతవర్షము. ఇందు నివసించువారు భారతీయులు''

అని చెప్పబడినది. కనుక దేశము, దైవభక్తి అనే భావనలు అనాది నుండి మనలో వున్నవే గాని ఇంగ్లీషువారి వలన మనలో ఏర్పడినవి కావు.

ప్ర : దేశాన్ని 'మాత'గా పరిగణించడం ఎందుకు జరుగుచున్నది?

జ : పశుపక్ష్యాదులలో మాతృభావన సరిగా ఏర్పడదు. బిడ్డకు తల్లి తినడం వరకు నేర్పుతుంది. ఆ తరువాత బిడ్డలకు రెక్కలు, కాళ్ళు రాగానే ఎగిరిపోతాయి. వాటిలో ఆడ, మగ భావన మాత్రమే వుంటుంది గాని మాతృభావన కొనసాగదు. మనుష్యులలో అలాగాక తల్లికి బిడ్డల మీద జీవితాంతమూ వాత్సల్యం వుంటుంది. వయసు వచ్చిన కొడుకు, కూతుళ్ళ మీదనేగాక వారి సంతానం మీద గూడ తల్లికి ఆప్యాయత వుంటుంది. బిడ్డలు తమ కృతజ్ఞతను తల్లి యెడ చూపుతారు. తల్లి స్తన్యమిచ్చి పోషించినట్లే గోవు క్షీరమును, నదులు జలమును, దేశము సకల

సంపదలను ఇస్తాయి. మనం వాటి వలన జీవిస్తున్నాం. కనుక గోమాత, నదీ మాత, భూమాత అనే భావనలేర్పడ్డాయి. తల్లి కేవలం స్త్రీ మాత్రమే కాదు, ఆమె వాత్సల్య రూపిణి. అలాగే దేశం కేవలం మట్టి మాత్రమే కాదు, అది మన ఉనికికి కారణం.

ప్ర : దేశంలో ప్రధాన స్థానం ప్రజలది. అందుచేత ప్రజలను ప్రేమించాలిగాని నేలను ప్రేమించడమేమిటి?

జ : గురజాడ అప్పారావుగారి దేశభక్తి గీతమును దృష్టిలో పెట్టుకొని మీరీ ప్రశ్నవేసి వుంటారు. ''దేశమంటే మట్టికాదోయ్'' అని ఆయన అన్నారు. ఆయన చెప్పదలచిన భావం దేశమంటే మట్టి మాత్రమే కాదు, మనుషులు గూడాను అని అయి వుంటుంది. అంతేగాని దేశమంటే నేల కానే కాదని ఆయన అభిప్రాయం కాదు. పోనీ మనుషులే దేశమైతే వారు నిలబడే తావు ఎక్కడ? భూమి అనేది ఒకటి వుంటే గదా మనుషులు వర్ధిల్లడానికి? కనుక భూమితో గూడిన మనుషులు దేశంగా రూపొందుతారు. ఇరువురినీ మనం ప్రేమించాలి. భూమిని వదలివేసి ఆలోచిస్తే మరొక ప్రమాదం గూడా వున్నది.

ప్ర :ఏమిటది?

జ : భూమి మీద ఏ చైనావాళ్ళో దురాక్రమణ జరిపితే సరిహద్దులు కాపాడుకోవాలనే పట్టుదల వుండదు. గడ్డి మొలవని ప్రదేశాలు ఉంటే ఏమి, పోతే ఏమి అనే భావం కలుగుతుంది. కనుక మాతృభూమి మీద మక్కువ కలిగి వుండాలి.

ప్ర :మరి ప్రజల మీద ప్రేమ?

జ : ఈ ప్రజలు నా వాళ్ళు అనే భావన పెంపొందాలి. ఆ భావన కలిగితేనే తోటి ప్రజలకు నష్టం కలిగించి తాను సుఖపడుదాం అనే దుర్బుద్ధి కలుగదు. ప్రజల మీద ప్రేమ లేకపోవడమే అవినీతికి, అక్రమాలకూ మూలకారణం. ఇకపోతే ప్రజలలో 'సంస్కృతి' పెంపొందాలి. అందుకై కృషి జరగాలి.

ప్ర :సంస్కృతి అంటే ఏమిటి?

జ : ప్రకృతి, వికృతి, సంస్కృతి అనే మూడు మాటలను వివరిస్తాను. సకల జీవరాసులకు ఆకలి అనేది వున్నది. ఆకలి తీర్చుకొనడం వాటికి ముఖ్యావసరం. అందుకై కొంత శ్రమపడి ఆ శ్రమ ఫలితంగా ఆహారాన్ని సంపాదించి భుజిస్తాయి. ఇది వాటి ప్రకృతి. ఈ లక్షణం జంతువులకు, మనుష్యులకు గూడా వుంటుంది.

ఇకపోతే కొందరు తాము ఎలాంటి శ్రమపడకుండా మరొకరు శ్రమపడి సంపాదించి సేకరించిన ఆహారము వగైరా అవసరాలను దొంగిలించి, లేదా బల ప్రయోగంతో లాగుకొని అనుభవిస్తారు. ఇలా పరులను దోపిడీ చేసి బతకడం వికృతి. ఈ గుణం కొన్ని జంతు వులలోను, కొందరు మనుష్యులలోను గూడా కనిపిస్తుంది.

తరువాత తాను శ్రమపడి సంపాదించిన ఆహారము అవసరాలు వున్నగువాటిని పొం దలేని అశక్తులకిచ్చి వారికి తోడ్పడడం 'సంస్కృతి'. ఇది ప్రధానంగా హృదయ గతమైనది.

వ్యక్తి తన కొరకు తాను జీవించడం మాత్రమేగాక పరుల కొరకు గూడా జీవించడమే 'సంస్కృతి'. నాకు ఏమి లభించింది అని గాక నేను ఏమి ఇవ్వగలను అనే గ్రహింపు 'సంస్కృతి'. జంతువులకు, మానవులకు గూడ ప్రకృతి, వికృతి అనే రెండు గుణాలు వుంటాయి. సంస్కృతి మాత్రం మానవులకు మాత్రమే వుంటుం ది. ఈ సంస్కృతి కారణంగానే మానవుడు జంతువుల కంటే ఉన్నతుడవుతున్నాడు.

**ప్ర : బాగున్నది. సంస్కృతికి మంచి అర్థం చెప్పారు. అయితే మరొక సందే హం. భరతమాతను ఇటీవల ఏకాత్మతా యజ్ఞ రథంలో విగ్రహంగా రూపొందించి పూజించారు. హృషీకేశ్‌లో భరతమాత దేవాలయం గూడా నిర్మించారట. ఇలా దేశానికి దేవతాస్థానం కల్పించి ఆరాధించడం సముచితమా? దేశమనేది ఒక రాజకీయ భావన. దానిని గౌరవించి అభిమానించవలెనేగాని పూజించ దగునా?**

జ : మంచి ప్రశ్న అడిగారు. మరొక సంగతి చెపుతాను. మన దేశంలో పుదుచ్చేరిలో అరవిందాశ్రమం వున్నది. అచ్చట అరవిందుడు ధ్యానం చేసుకొనే మందిరంలో అమ్మవారి ప్రతిమకు వెనుకగా ఒక సుందరమైన భారతదేశ చిత్రపటం గూడా వున్నది. అది అఖండ భారత చిత్రపటం. అరవిందులు దివంగుతులైన పిదప ఒక భారత ప్రభుత్వ అధికారి అచ్చటికి వెళ్ళి ''అఖండ భారత చిత్రపటం పూజా మందిరంలో ఎందుకు? దీనిని తొల గించండి. దీనిని తొలగిస్తే మీ ఆశ్రమానికి కావలసిన ధనసహాయం ప్రభుత్వం ఇస్తుంది'' అన్నాడట.

అపుడు అరవిందాశ్రమ మాత ఇలా అన్నారు : ''అరవిందుడు భారతదేశ మును జగజ్జనని యొక్క రూపంగా భావన చేసి ధ్యానించేవారు. అందుకు కారణం మన దేశంలో 52 శక్తి పీఠములు వేరు వేరు చోట్ల వెలయడమే. ఆయనకు భారత దేశము, జగజ్జనని రెండూ ఒకటే. ఆ శక్తి పీఠములు ఇప్పటి పాకిస్థాన్, బంగ్లాదేశ్‌లలో గూడా వున్నాయి. అందుచేత ఆ చిత్రం అలా అక్కడ ఉండవలసినదే''.

కనుక భారతదేశం మనకు గౌరవనీయమేగాక పూజనీయం గూడాను!

***ధన్యవాదాలు సుబ్రహ్మణ్యశాస్త్రిగారూ! దేశభక్తి గురించి అమూల్యమైన విషయాలు చెప్పారు.***

## పురుష ప్రయత్నం - దైవకృప

విత్తనము వృక్షముగా మారుటకు ప్రధాన హేతువు దానియందలి జీవ శక్తియే. అయి నను, అది ఫలించుటకు మేఘము నుండి జలమునపేక్షించును. అట్లే మనుష్యుడు తన ప్రయత్నము సఫలమగుటకు ఈశ్వర కృపను ఆపేక్షించును. – ఆదిశంకరాచార్యులు

# 51. దీర్ఘకాలం జీవించాలంటే

– ''వైద్య ప్రవీణ'' డా. పాటీలు నారాయణరెడ్డి

(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి ఇదివరలో ఆయుర్వేద సలహాదారుగానున్న 'వైద్యప్రవీణ' డా. పాటీలు నారాయణరెడ్డి (అనంతపూర్) గారితో ఇష్టాగోష్ఠి)

ప్రశ్న : మీరు మానవులు వంద సంవత్సరాలు జీవించడానికై మార్గాలు గురించి గ్రంథం వ్రాశారు గదా. ఆ మార్గాలలో కొన్నింటిని తెలుపుతారా?

జ : నూరేండ్లు జీవించడానికి మార్గాలలో ముఖ్యమైనది ఏమిటంటే, ప్రతిదినం నీరు పుష్కలంగా త్రాగడం, శరీరంలో నీరు తగ్గితే తల తిరగడం వంటి జబ్బులు వస్తాయి. జపాను దేశంలో 'జలచికిత్స' ఆచరిస్తారు. ప్రతిదినం సూర్యోదయానికి ఒకటిన్నర గంటలు ముందుగా నిద్రలేవాలి. వెంటనే ఒకటి లేక రెండు లీటర్లు కూజాలోని నీటిని గడగడ త్రాగాలి. ఆ పిదప కాలకృత్యాలకు వెళ్ళాలి. ఇందువలన అన్నవాహిక సాఫీ అవుతుంది. మలబద్ధకం ఉండదు. ఆకలి కలుగుతుంది. దీనినే ఆయుర్వేదంలో ఉషఃపానము అంటారు. దీర్ఘకాలం జీవించడానికి ఇది ఉపకరిస్తుంది.

**ప్ర : ఇంకా ఏమైనా అలవాట్లు చెపుతారా?**

జ : దీర్ఘకాలం జీవించాలంటే వారానికొకసారి అభ్యంగన స్నానం చేయాలి. ఆముదంతో తల అంటుకొని, శరీరానికి నువ్వుల నూనెతో మర్దన చేసి వేడి నీటి స్నానం చేయాలి. 'తద్దినము నాటి కూటికి, తలగడిగిన నాటి నిద్రకూ సాటి ఉందా?' అని సామెత గూడ వున్నది.

**ప్ర : మరికొన్ని అలవాట్లు చెప్పండి?**

జ : ముఖ్యమైనవి మరికొన్ని అలవాట్లు చెపుతాను.

1. ముఖము కడుగుకొనునపుడు చల్లని నీటితో 'నస్యకర్మ' ఆచరింపవలెను. అనగా అరచేతిలోనికి నీటిని తీసుకొని ముక్కుతో పీల్చి వదలవలెను. ఇట్లు స్వచ్ఛమైన జలమును ముక్కుతో పీల్చువాడు తీక్షణ బుద్ధిగలవాడై గ్రద్ధ యొక్క దృష్టి వంటి దృష్టి గలిగి వుంటాడు. అకాలములో వెంట్రుకలు తెల్లబడకుండ వుండును. పడిశెము, జలుబు, దగ్గు రావు.

2. ప్రతి దినము అలవాటుగా నువ్వుల నూనెగాని మరొక తైలమునుగాని రెండు బొట్లు ఒక్కొక్క ముక్కులో వేసుకొని పీల్చి, గొంతులోకి వచ్చిన దానిని

ఉమ్మివేయవలెను. ఇందుచేత కన్నులు, చెవులు, ముక్కు చెడకుండా నుండును. ముఖ్యముగా బట్టతల రాదు. వెంట్రుకలు బాగుగా వృద్ధి పొందును.

3. గరుత్మంతుని వద్దకు సర్పములు చేరలేని విధముగా వ్యాయామము చేయువారికి వ్యాధులు దరి చేరవు. ముసలితనము త్వరగా రానీయదు. ఆసనాలు వేయుట, బస్కీలు తీయుట, కొంత దూరము నడుచుట చేయవలెను.

4. ఉసిరికాయ పచ్చడిని ప్రతిదినము పుచ్చుకొనుట ఆరోగ్యానికి చాలా మంచిది. ఉసిరిక భూలోక వాసులకు అమృతమని చెప్పదగును.

**5. ఇంద్రియ వృద్ధికర పదార్థములు :**

ఎ. పాలు, మినుములు, ఉసిరిక - ఇవి శుక్రమును పుట్టిస్తాయి.

బి. చెఱకు, నాగబలి, దూలగొండి విత్తులు, రత్నపురుష - ఇవి శుక్రాన్ని వృద్ధిజేస్తాయి.

సి. జాజికాయ, బెండకాయ, చేమదుంపలు మున్నగునవి శుక్రాన్ని స్తంభింప జేస్తాయి.

డి. పెన్నేరు, నేలతాడి, పిల్లి తీగలు, పంచదార మున్నగునవి రతియందు ఆనందాన్ని కలిగిస్తాయి.

ఇ. నిమ్మకాయ, పెద్ద దోస, నిమ్మగడ్డి మున్నగునవి శుక్రాన్ని క్షీణింపచేస్తాయి.

కనుక ఇట్టి విషయాలు తెలుసుకొని ఆహారం స్వీకరించాలి.

**ప్ర :** పండ్లు, కూరలు వేటి వేటిని తినాలి?

**జ :** కొన్ని సంగతులు చెపుతాను.

1. ఎరుపు రంగు గల పండ్లు, కూరలు దేహంలో రక్త కణాలను ఎక్కువ చేస్తాయి. క్యారట్, బీట్‌రూటు, యాపిల్ పండు లాంటివి.

2. ఒక విచిత్రమైన సూత్రం వున్నది. శరీరంలోని ఏ అవయవం మాదిరిగా వున్న పండు తింటే ఆ అవయవానికి ఆరోగ్యం చేకూరుతుందని ఒక సిద్ధాంతం. దీని ప్రకారం:

ఎ. బాదంకాయ మానవుల కన్ను వలె ఉంటుంది. అందుచేత సీమబాదం పప్పులు తింటే కళ్ళకు ఆరోగ్యం. బాదం పప్పులో A విటమిన్ అధికంగా వున్నది.

బి. సీతాఫలం పండ్లు ఊపిరి తిత్తులవలె ఉంటాయి. ఆ పండు తింటే ఊపిరి తిత్తులకు బలం.

సి. యాపిల్ పండు గుండెకాయ వలె వుంటుంది. దానిని తింటే గుండెకు బలం.

డి. బొప్పాయి పండు పొట్టవలె వుంటుంది. దాన్ని తింటే కడుపుకు ఆరోగ్యం.

ఇ. మామిడి పండు తింటే మూత్రపిండములకు ఆరోగ్యం.

ఎఫ్. కాశ్మీర్‌లో వాల్‌నట్ అనే కాయలు పండుతాయి. అవి మనిషి మెదడువలె ఉంటాయి. వాటిని తింటే మెదడుకు ఆరోగ్యం.

**ప్ర : చాలా చక్కని విషయాలు చెప్పారు. కాయగూరల గురించి చెప్పండి?**

జ : ఎ. అరటి ఊచ కూర చేసుకు తింటే మూత్రనాళాల్లో రాళ్లు కరిగిపోతాయి.

బి. వెల్లుల్లి పాయలు నేతితో వేయించుకు తింటే వాతం హరిస్తుంది.

సి. నీరుల్లి గడ్డలు కూరల్లో వేయడం వలన ఆహారం జీర్ణమవుతుంది.

డి. కరివేపాకు, మిరియాలు, ఇంగువ, ఉప్పు, కలిపి నూరి కుంకుడు గింజంత తింటే జీర్ణక్రియ బాగా జరుగుతుంది.

ఇ. అమీబియాసిస్ అని ఒక జబ్బు వుంది. పల్చగా విరేచనం కావడం, విరేచనం కొద్ది కొద్దిగా చాలాసార్లు కావడం దీని లక్షణం. లేత వేపాకులు, పసుపు, రెండు మిరియపు గింజలు నూరి వేసుకుంటే ఇది తగ్గుతుంది.

**ప్ర : అతి మూత్రవ్యాధికి మందు ఏమిటి?**

జ : పచ్చడి పెట్టుకొనే ఉసిరికాయ ముక్కలకు పసుపు కలిపి వేసుకుంటే అతిమూత్రం తగ్గుతుంది. దీన్ని 'నిశామలకి' అనే పేరుతో ఆయుర్వేద మందుగా వాడుతారు.

**ప్ర : అధికంగా తుమ్ములు రావడం, ముక్కులు బిగదీసుకుపోవడం, దీనికి మందు ఏమిటి?**

జ : ఎ. ఎలర్జీవల్ల ఇలా వస్తుంది. దీనికి నేతిక్రియ చేయాలి. కొమ్ము చెంబులో మంచినీరు తీసుకొని ఒక ముక్కులో గుండా పోస్తూ మరొక ముక్కులోగుండా వదలాలి. ఇలా వారం రోజులు చేయాలి. పిదప రెండవ వారంలో నీటిలో ఒక చెంచాడు పాలు కలిపి నేతిక్రియ జరపాలి. మూడవ వారంలో నీటిలో ఆరు చుక్కలు తేనె కలిపి నేతిక్రియ చేయాలి. ఇలా మూడు వారాలు చేస్తే ముక్కుకు సంబంధించిన వ్యాధులు నివారణ అవుతాయి.

బి. ముక్కు దిబ్బడపడి గాలి పీల్చలేనపుడు తులసి ఆకురసం ముక్కులో పిండాలి.

సి. జలుబు తగ్గడానికి గూడా తులసి ఆకు బాగా పనిచేస్తుంది. టీ త్రాగేవాళ్ళు టీలో తులసిరసం పిండుకుని త్రాగితే జలుబు హరిస్తుంది.

**ప్ర : రాత్రి నిద్రపట్టకపోతే ఏమి చేయాలి?**

జ : ఆముదంగాని, చందినాది తైలంగాని అరికాళ్ళకు రుద్దుకుంటే నిద్రపడుతుంది.

**ప్ర : రక్తపు పోటుకు మందు ఏమిటి?**

జ : రోజూ పరగడుపున ఒక్క అరటిపండు తింటే రక్తపుపోటు తగ్గుతుంది. రోగికి మానసిక విశ్రాంతి కావాలి. అందుకై ఆముదంతో తల అంటుకొని అభ్యంగన స్నానం చేయాలి.

మరొక ప్రక్రియ కూడా ఉన్నది. 'కొండపిండి' అనే మొక్క వున్నది. దీనిని సంస్కృతంలో 'పాషాణభేది' అంటారు. ఈ మొక్క రాళ్లను తొలుచుకుంటూ పైకి వస్తుంది గనుక ఆ పేరు వచ్చింది. దీని పూలు తెల్లగా ఉంటాయి. ఆ పూలను తెచ్చి దిండుక్రింద పెట్టుకొని పడుకుంటే, లేదా ఆ పూలను దిండులో కలిపి కుట్టించి దానిపై తలవాల్చి పడుకుంటే రక్తపుపోటు తగ్గుతుంది.

**ప్ర : మధుమేహవ్యాధికి మందు ఏమిటి?**

జ : షుగర్ వ్యాధికి అత్యుత్తమమైన మందు 'వసంతకుసుమాకరం' దీనికి King of Medicines అని పేరు. ఈ మాత్ర రాత్రి పరుండబోయేముందు ఒకటి వేసుకుంటేచాలు. ఇలా నెలరోజులు వాడి, ఒక నెల విరామమిచ్చి మరల నెల వాడాలి. దీని వలన బలం కూడా వస్తుంది.

**ప్ర : ఎండాకాలంలో సూర్యతాపం భరించలేకపోవడం, ఎండలోకి వెళ్లలేకపోవడం దీనికి మందు ఏమిటి?**

జ : మిరియాలు లేకుండా బెల్లంతో పానకం చేసుకొని త్రాగడం వలన ఎండ ప్రభావం ఉండదు. మరొక మందు ఏమిటంటే పెసలు, పెసరపప్పు (పొట్టుతోసహా) బాగా తినాలి. పెసలు నానవేసి మొలకెత్తిన వాటిని తినాలి.

**ప్ర : సుఖ విరేచనం కావడానికి మందేమిటి?**

జ : 'నీలతంగేడు' ఆకులు తెచ్చి ఎండబెట్టి వాటితో పచ్చడి చేసుకొని రాత్రిపూట తినాలి. మజ్జిగ పోసుకోకూడదు. మరునాడు సుఖ విరేచనమవుతుంది.

త్రిఫలచూర్ణమాత్రలు అమ్ముతారు. వాటిని రాత్రి రెండు వేసుకొని పడుకుంటే మరునాడు విరేచనమవుతుంది.

**ప్ర : 'సర్వవ్యాధి నివారిణి' ఏదైనా ఉన్నదా?**

జ : వున్నది. నామోషి పడకుండా అమలుపరిస్తే అద్భుతంగా పనిచేస్తుంది.

**ప్ర : ఏమిటది?**

జ : స్వమూత్ర చికిత్స. సర్వవ్యాధులకూ ఇది పనిచేస్తుంది. థాయిలాండు, జపాను దేశాలలో దీనిని ఎక్కువగా అమలుపరుస్తున్నారు. హర్యానా నాయకుడు దేవీలాల్‌కు దీనిద్వారా తామర నయమైనది. చంద్రమండల యాత్రచేసిన నీల్‌ఆమ్‌స్ట్రాంగ్ ఈ చికిత్స అనుదినం పొందుతాడు. మొరార్జీదేశాయ్ ఆరోగ్య రహస్యమిదే.

**ప్ర : స్వమూత్ర చికిత్స ఎలా చేసుకోవాలి?**

జ : ఖాళీ కడుపులోకి తన మూత్రాన్ని రెండు లేక మూడు ఔన్సులు

పుచ్చుకోవాలి. ఉదయం 6 గంటలకు, సాయంకాలం 6 గంటలకు పుచ్చుకోవచ్చు. మూత్రంలో మొదటిభాగం, చివరిభాగం వదిలివేసి మధ్యభాగాన్ని పుచ్చుకోవాలి.

ప్ర : దీనివలన ఏఏ వ్యాధులు నయమవుతాయి?

జ : ఏ వ్యాధులు నయంకావు? అన్నీ నయమవుతాయి. ఉబ్బసం, మధుమేహం, కాన్సరు, చర్మవ్యాధులు అన్నిటికీ ఇదేమందు.

ప్ర : మూత్రము పైన పూయడం వలన ఏవైనా నయమవుతాయా?

జ : కండ్లకలక, చెవులకు చీము, కీళ్లవాపు, గాయములు, తామర, వ్రణాలు నయమవుతాయి. అరచేతిలో మూత్రం పోసుకొని రెడు కళ్లనూ దానితో తడపాలి. కీళ్లనొప్పులకు దూది మూత్రంలో తడిపి కట్టుకట్టాలి. మూత్రమును వేడిచేసి పైన కాపు కాయవచ్చు.

చాలా ప్రయోజనకరమైన విషయాలు చెప్పారు. ధన్యవాదాలు.

## వేయిసార్లు పారించెద నా రక్తంబును!

వీరేంద్రనాథ చటోపాధ్యాయ (1880 - 1942) శ్రీమతి సరోజిని నాయుడు యొక్క సోదరుడు. గొప్ప దేశభక్తుడు, విప్లవకారుడు, మంచి కవి. అతడు వ్రాసిన "My Hindustan' అనే కవితలోని కొన్ని భాగాలు ఇవి :

తపించను నీ సంపదకై నా ప్రతిమలకై
శత్రు ధూళి ధూసరితంబగు నీ తనువును
తపింతును నా రక్తధార కడుగగ
ఓ హిందూదేశమ! మా హిందూదేశమ !!
నీ మీది ప్రేమ ఒక పవిత్రజ్వాల
దహించునది నా పాపశోకముల
మరి నన్జేయును నీ యోగ్య పుత్రులీల
ఓ హిందూదేశమ! మా హిందూ దేశమ!
వదలింపగ నీ బానిస తనమును
వేయిసార్లు జన్మించెద నీ గర్భంబున
వేయిసార్లు పారించెద నా రక్తంబును
ఓ హిందూ దేశమ! మా హిందూ దేశమ !!

ఇట్టి దేశభక్తుడు తన మాతృభూమి స్వాతంత్ర్యం పొందటం చూడకుండగనే 1942లో దివంగతుడైనాడు.

– ''యువభారతి'' నుండి

# 52. ప్రతి వ్యక్తి 120 ఏళ్లు జీవించవచ్చు

- ప్రొ. సుందరేశ్వరశాస్త్రి

*(కర్ణాటక రాష్ట్రానికి చెందిన ప్రొ. సుందరేశ్వరశాస్త్రి 31.7.1984 న గుంటూరు హిందూ కళాశాలలో అధ్యాపకుల సమక్షంలో అత్యద్భుతంగా 'హిప్నటిజం' ప్రదర్శించారు. వారితో జరిపిన ఇష్టాగోష్ఠి)*

ప్రశ్న : సుందరేశ్వర శాస్త్రిగారూ! నమస్కారం. గత 31వ తేదీన మీరు ప్రదర్శించిన 'సమ్మోహన విద్య' (హిప్నటిజం) చూచి ఆశ్చర్యం చెందాను. మీతో కొన్ని విషయాలు మాట్లాడి తెలుసుకుందామని వచ్చాను.

జ : నమస్కారం గిరిధరరావుగారూ! మీరు ఆ ప్రదర్శనను తిలకించి ఆకర్షితులై నందుకు సంతోషం. ఏదీ అడగండి మీ ప్రశ్నలు.

ప్ర : మీరు ఒక లెక్చరర్‌కు గాఢ నిద్ర కలిగించారు. పిదప అతని మనస్సు మీ కంట్రోలులో పెట్టుకున్నారు. అతని శరీరాన్ని మీరు ''ఇందులో రక్తం ప్రవహించడం లేదు. ఇది ఉక్కు, ఇది ఇనుము, ఇది టన్నుల బరువు మోయగలదు'' అని బిగ్గరగా మైకులో చెప్పారు. పిదప అతని చేతిలో సూది గుచ్చితే రక్తం కారలేదు. ఉక్కువలె కఠినమైపోయింది. అతని శరీరాన్ని రెండు కుర్చీల నడుమ అడ్డంగా పెట్టి దానిమీద మనిషి నిలబడినా వంగిపోలేదు. నిజముగా ఉక్కువలె పనిచేసినది. ఇది ఎలా సాధ్యం?

జ : గిరిధరరావుగారూ! మానవుని మనస్సు సర్వశక్తివంతమైనది. మనస్సు యొక్క ఆజ్ఞలను పూర్తి విధేయతతో నిర్వర్తించే ఉపకరణమే శరీరం.

మనస్సూ, శరీరమూ అతుక్కొని విడదీయరానివిగా లేవు. మనం ప్రయత్నించి శరీరం నుంచి మనస్సును వేరు పరచవచ్చు. ఆ మనస్సు ఎంత కఠినమైన ఆజ్ఞలను జారీచేసినా శరీరం అమలు పరుస్తుంది.

నేను ఆ వ్యక్తిని గాఢ నిద్రలోనికి పంపించి, అతని లోపలి మనస్సును (Sub-conscious mind) నా ఆధీనంలో పెట్టుకొని, అతని శరీరానికి ఆజ్ఞలు ఇచ్చాను. ఏ వ్యక్తి అయినా సమ్మోహన శక్తికి లోబడి వున్నప్పుడు అతని శరీరం యంత్రం వలె వర్తిస్తుంది. తెలివిలో ఉన్నప్పటి కంటే హిప్నటైజు చేయబడినపుడు ఎనిమిది రెట్ల శక్తి కలిగి వుంటుంది. అందుకే అతడు అలా చేయగలుగుతాడు.

ప్ర : అయితే మానవుని శరీరము, మనస్సు ఒకదానితో ఒకటి అతుక్కొని లేవా?

జ : మనస్సు అనేది యజమాని, శరీరం సేవకుడు. శరీరంలోనే మనసు ఉన్నప్పటికీ, ఈ రెండూ వేరు వేరు. విడదీయదగినవి.

ప్ర : మీరు లోపలి మనస్సు అన్నారేమిటి? రెండు మనస్సులు ఉన్నవా?

జ : వెలుపలి మనస్సు (Outer mind) లౌకిక విషయాలను గ్రహించి సందర్భానుసారంగా ఆలోచనలు చేస్తుంది. అది అప్పటి అవసరం కొరకు అక్రమము అయిన ఆలోచనలు గూడా చేస్తుంది. దీనిని చేతనము అంటారు.

లోపలి మనస్సు వేరే వున్నది. అది సుషుప్తిలో పనిచేస్తుంది. దానిని సుప్త చేతనము అని అంటారు. అది సత్యమును అనుసరిస్తుంది. అది సర్వశక్తివంతమైనది. దానిని Sub-conscious mind అంటారు.

ప్ర : మరి మెదడూ, మనస్సూ వేరు వేరా?

జ : మెదడు అనేది అనేక అనుభవాలను, సమాచారమును యాంత్రికంగా దాచి వుంచేచోటు. ఆయా విషయాలను ఆధారం చేసుకొని ఆలోచనలు చేసేది మనస్సు. తగిన నిర్ణయాలు చేసి అవయవాలకు ఆజ్ఞలు జారీ చేసేది గూడా మనస్సే.

ప్ర : మనస్సు ఎలా తయారయినది?

జ : మానవ శరీరము పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను అయిదు తత్త్వములతో తయారైనది. అందు మనస్సు కేవలం ఆకాశము space మరియు వాయువు అను రెండు అంశములతో రూపొందినది.

ప్ర : మిగతా అవయవములు?

జ : కళ్లు అగ్ని మరియు నీటి నుండి ఏర్పడినవి. నీరు మరియు పృథ్వి యొక్క అంశలతో మాంస ఖండములు, రక్తము ఏర్పడినవి. పంచ భూతములలో ప్రతి యొక్కటి మరల ఐదు భాగములుగా విడిపోయినవి. ఇలా 25 భాగాలైనవి. ఈ 25 భాగముల యొక్క మిశ్రమములతో శరీరంలోని వివిధ అవయవాలు నిర్మాణమైనవి.

ప్ర : అయితే మనస్సు కేవలం ఖాళీ ప్రదేశం మరియు వాయువు మాత్రమేనా?

జ : అవును. అది ఆలోచనల కూడలి. చేతితో తాకితే దొరికే పదార్థం కాదు. అది చైతన్య పదార్థం. మనస్సు యొక్క ఏకాగ్రత, దృఢత్వం, నిశ్చలత మీద ఆధారపడి మానవుని చర్యలు వుంటాయి.

మనస్సు సర్వశక్తివంతమైనది. పంచేంద్రియాలు చేసే పనులను పంచేంద్రియాలు లేకుండా మనస్సు ఒక్కటే నిర్వర్తించగలదు. అందుకే మనస్సును ఆరవ ఇంద్రియముగా పరిగణించి sixth sense అని అంటారు. దానికి అతీంద్రియ శక్తి (extra sensationary power) వున్నదని చెపుతారు.

ప్ర : మనస్సుకు గల ఈ ఆశ్చర్యకరమైన శక్తిని పెంపొందించుకోవడం ఎలా?

జ : అందుకై మొట్టమొదట మనస్సుకు ఏకాగ్రత సాధించాలి. ఏదైనా ఒక అంశం మీద మనస్సు కేంద్రీకరింపచేయాలి. అలా చేయడానికై ఉచ్ఛ్వాస నిశ్వాసముల మీద కంట్రోలు ఏర్పరచుకోవాలి.

ప్ర : ఉచ్ఛ్వాస నిశ్వాసములకూ, మనస్సుకూ సంబంధమేమిటి?

జ : అలా అడగండి చెబుతాను. శరీరంలోని అన్ని అవయవములు మనస్సు యొక్క ఆధీనములో వుంటాయి. ఈ మనస్సు అనేది కేవలం వాయువు, ఆకాశం (space) అనే రెండే రెండు తత్త్వములతో తయారైనది. కనుక మనము పీల్చే గాలి మనస్సునకు అత్యంత ముఖ్యమైనది. ఆ గాలిని పీల్చుట విడుచుటలను కంట్రోలు చేసినట్లయితే మనస్సు కంట్రోలు అవుతుంది. మరియొక సంగతి కూడా మనం చెప్పుకోవాలి.

ప్ర : ఏమిటది?

జ : రైలు ఇంజనుకు బొగ్గు ఎలా ఇంధనమో, కారు నడవడానికి పెట్రోలు ఎలా ఇంధనమో, మానవుని శరీరం నడవడానికి గాలి అలా ఇంధనం. గాలి వలన మనం బ్రతుకుతున్నాం; పనులు చేస్తున్నాం. అందుచేత మానవుడు నిరంతరం స్వచ్ఛమైన గాలిని అత్యధికంగా పీలుస్తూ ఉండాలి. అందుకై ప్రకృతి పరిసరాలు, పొలాలు, ఖాళీ స్థలాలు, నదీ తీరాలు, నీటి నడుమ కొంత సమయం గడుపుతూ ఉండాలి.

ప్ర : మనం తినే ఆహారం ఇంధనం కాదా?

జ : ఆహారం, నీరు కారులోని యంత్రం తుప్పు పట్టకుండా, అరిగిపోకుండా వేసే ఇంజనాయిల్ వంటివి. గాలి కారును నడిపించే పెట్రోలు వంటిది. ఆహారం రోజూ రెండుసార్లు పుచ్చుకుంటాం. ఉచ్ఛ్వాస నిశ్వాసములు రాత్రింబవళ్ళు నిద్రలో కూడా జరుగుతాయి. మనకు తెలియకుండా, మన ప్రయత్నం లేకుండానే గాలి పీలుస్తున్నాం. గాలియే మన ప్రాణశక్తి. అదే మనస్సును ఆలోచింపచేస్తున్నది. గాలి బాగా లభించని గదులలో నివసించే వారికి మానసిక వ్యాధులు వస్తుంటాయి.

ప్ర : మనస్సును ఏకాగ్రతలో ఉంచడం ఎలా?

జ : రెండు రంధ్రాలలో పూర్తిగా ఒకసారి గాలిపీల్చండి. వీలయినంత సేపు పట్టి వుంచండి. ఇక వదలునపుడు పీల్చునప్పటి కంటే వీలయినంత ఎక్కువ సమయం తీసుకోవాలి. అత్యధిక సమయంలో గాలి వదలాలి. ఆ తరువాత ఒక్క క్షణం ఆగి మరల వేగంగా గాలి పీల్చాలి. పీల్చడం, వదలడం గూడా రెండు ముక్కులగుండా చేయండి. ఇలా రోజులో ఏ సమయంలోనైనా చేయవచ్చు. అయితే ప్రభాత సమయం, సంధ్యా సమయం దీనికి ఎక్కువ ప్రయోజనకరం.

ప్ర : బాగున్నది. ఇలా ఉచ్ఛ్వాస నిశ్వాసములను అదుపు చేయడం వలన ప్రయోజన మేమిటి?

జ : మనస్సుకు ఏకాగ్రత లభిస్తుంది. దానితో బాటు మరొక గొప్ప ప్రయోజనమున్నది. అదేమిటంటే, మనుష్యుని ఆయుః పరిమాణం పెరుగుతుంది.

మానవుని ఆయుష్షు ఇన్ని సంవత్సరాలని సృష్టికర్త నిర్ణయించడు. ఇతడు ఇన్ని కోట్ల ఉచ్ఛ్వాస నిశ్వాసములు జరిపే వరకు జీవిస్తాడని నిర్ణయిస్తాడు. వాటిని జరపడంలో దీర్ఘకాలం తీసుకోవడం ద్వారా మన జీవిత కాలాన్ని పొడిగించుకోవచ్చు. మహర్షులు ఈవిధంగానే వందలకొలది సంవత్సరాలు జీవితాన్ని పొడిగించుకున్నారు. మనం కూడా రమారమి 120 ఏళ్ళ వరకు ఆయుష్షును పెంచుకోవచ్చు.

మరొక విశేషమేమిటంటే, ఈ ఊపిరిని లోపల అత్యధిక కాలం నిలుపుకొనడం వలన శరీరంలో అనేకమైన దీర్ఘవ్యాధులు గూడా నయమవుతాయి. సంపూర్ణ ఆరోగ్యం లభిస్తుంది. ఎంతోకాలంగా నయంగాని జబ్బులు నయమవుతాయి.

ప్ర : ఇలా మనస్సును ఏకాగ్రం చేయడం వలన జరిగేదేమిటి?

జ : ఆ తరువాత, ''నేను అనగా శరీరమును కాను, నేను సర్వశక్తి వంతమైన మనస్సు (Inner mind) రూపంలో వున్న చైతన్య శక్తిని. శరీరం నా యొక్క సేవకుడు మాత్రమే'' అనేటువంటి భావనను పెంపొందించుకోవాలి. ఆ భావన బలవత్తరం అయినపుడు మనస్సు ఆరవ యింద్రియంగా (6th sense) పనిచేసి అద్భుత శక్తులను వికసింప చేసుకుంటుంది. ఈ శక్తులు అసలు మనసులోనే వున్నాయి. అవి ఇపుడు వికసిస్తాయి.

ప్ర : ఏమిటా శక్తులు?

జ : మీరు మొన్న నేను చేసిన ప్రదర్శన చూచారు. దానిని గురించి ఇపుడు ఏమైనా అడిగితే చెప్పగలరు. ఆ ప్రదర్శన యావత్తూ మీ మనస్సులో మెదలుతుంది. దాన్ని గురించి చెప్పగలరు. అలాగే ఇపుడు మీరిక్కడ కూర్చున్నారు. ఇపుడు మీ యింట్లో ఏమి జరుగుచున్నది అని అడిగితే, మీ శరీరం ఇక్కడే ఉంటుంది గాని మీ మనస్సు పోయి చూచి వచ్చి ఏమి జరుగుతున్నదో చెప్పగలదు. ఇలా కండ్లు, చెవి, ముక్కు, నాలుక, చర్మము - ఈ పంచేంద్రియాలు చేసే పనులను ఒక్క మనస్సే చేయగలుగుతుంది.

ప్ర : మీరు చెప్పే ఈ లోపలి మనస్సు ఏదైతే వున్నదో దాన్నే మీరు చైతన్యశక్తి అంటున్నారు. దీనికే ఆత్మ అని పేరు గదా?

జ : నేను sub-conscious mind అని దేనినైతే అంటున్నానో, దానినే సుప్త చైతన్యమనీ, ఆత్మ అనీ గూడ అంటారు.

ప్ర : ఇంకా ఏమైనా చెపుతారా?

జ : మానవుడు ఏమైనా సాధించగలడు. కాని ఓపికతో మనస్సును దృఢపరచి సాధించడానికి ప్రయత్నిస్తే మాత్రమే ఏమి కావలసినా సాధించగలడు - ఇదే నేను చెప్పదలచాను.

*ధన్యవాదములు శాస్త్రిగారూ! చాలా అద్భుతమైన విషయాలు చెప్పారు.*

*(1984 సెప్టెంబరు)*

# 53. హిందూ భావనను ''కమ్యూనల్'' అనతగునా?

– శ్రీ మన్నవ గిరిధరరావు

1893 సెప్టెంబరు 11వ తేదీన చికాగో నగరంలో జరిగిన బ్రహ్మాండమైన ప్రపంచ మత మహాసభలో ఉపన్యసిస్తూ ''మతములకు మాత (Mother of Religions) అగు హిందూ మతము ప్రపంచానికి మత సహనమే గాక మత ఏకత్వమును బోధించినది. నేను మిగతా మతములను సహించడమేగాదు అన్ని యితర మతములను నా మతమంత సత్యమైనవి అని నమ్ముతాను'' అని ప్రకటించారు స్వామి వివేకానంద.

హిందువుల విశాలదృష్టి, హిందూ ధర్మం యొక్క విశ్వ జనీనత దీనిని బట్టి గ్రహించ వచ్చు. కాని ఈనాడు కొందరు హిందూ భావనను 'కమ్యూనల్' అనీ, సంకుచితత్వమనీ నిందిస్తున్నారు. దేశంలో పలువురు వ్యక్తులు తాము హిందువులమని చెప్పుకోవడానికి కూడా ఇష్టపడడంలేదు. ఇది చాలా విచారకరమైన పరిస్థితి.

ఏదేశంలోనైనా అధిక సంఖ్యాకుల ఆలోచనలు, ఆకాంక్షలు ఆదేశపు జాతీయతకు ప్రాతిపదికగా వుంటాయి. మన దేశంలో గూడ హిందూ చింతన జాతీయతకు, దేశభక్తికి పునాదిగా ఉన్నది.

లోకమాన్య తిలక్, మహాత్మాగాంధీలను మినహాయిస్తే జాతీయోద్యమమే లేదు. వారిద్దరూ భగవద్గీత నుండి స్ఫూర్తి పొందారు. రామస్మరణ చేసిన పిదపనే గాంధీజీ ఉపన్యాసం చేసేవారు. ఆంధ్రరాష్ట్రంలో ప్రసిద్ధ జాతీయ నాయకుడు ''ఆంధ్రరత్న'' దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు ''రామభజన'' చేసి ప్రజలను ఆకట్టుకునేవాడు. ఊరూరా రామమందిరాలను నెలకొల్పాడు. ''రామదండు'' అనే వాలంటీరు సంస్థను ఏర్పాటు చేశాడు.

నేతాజీ సుభాష్‌చంద్రబోస్ తనకు వివేకానందుడే ఆదర్శమని ప్రకటించాడు. అరవిందఘోష్ భారతమాతను జగన్మాత యొక్క రూపంగా భావన చేసి సేవించాడు. విప్లవ వీరుడు బాలముకుంద్ భగవద్గీతను చేతబట్టుకొని ఉరికంబమెక్కాడు. 1775లో తూర్పు ఇండియా కంపెనీ ప్రభుత్వం మీద బెంగాలులో హిందూ సన్యాసులు విప్లవం జరిపారు. ఇలా హిందూ భావన దేశభక్తికీ, స్వతంత్ర పోరాటానికీ స్ఫూర్తినిచ్చింది.

**జాతి జీవితానికి హిందూ భావనతో లంకె :**

భారత ప్రభుత్వ సూక్తి ''సత్యమేవ జయతే'' ముండకోపనిషత్తు నుండి,

భారత నౌకాదళ సూక్తి ''శన్నోవరుణః'' వేదము నుండి, జీవితభీమాసూక్తి ''యోగ క్షేమం వహామ్యహం'' భగవద్గీత నుండి స్వీకరింపబడినవి. క్రొత్త నౌకను జలప్రవేశం చేసేటప్పుడు, క్రొత్త విమానం ఆకాశంలోకి ఎగిరేటపుడు కొబ్బరికాయ కొట్టడమనే హిందూ ఆచారాన్ని పాటిస్తున్నారు.

ప్రధాని ఇందిరాగాంధీని ఒక విదేశీ పత్రికా విలేఖరి ''చారిత్రక పురుషులలో మీకు ఎవరంటే ఎక్కువ ఇష్టం?'' అని ప్రశ్నించగా ఆమె ''ఆది శంకరాచార్యులు'' అని జవాబు చెప్పారు. ఆమె తరచు కంచికామకోటి జగద్గురువులను సందర్శించి స్ఫూర్తి పొందెడిది. రాష్ట్రపతి డా. శంకర్‌దయాళ్ శర్మ తిరుమలలో శ్రీ వెంకటేశ్వరస్వామి దేవాలయంలో పొర్లు దండాలతో దేవుని సేవిస్తూ వుంటారు. కోటానుకోట్ల భారతీయులు అనుదినం పార్వతీ పరమేశ్వరులనుగాని, సీతారాము లను గాని స్మరించి మనశ్శాంతిని పొందు తుంటారు. ''జో అచ్యుతానంద జోజోము కుందా'' అని బిడ్డలను జోకొడుతూ తల్లులు పాడే పాట ఇంటింటా వినవస్తుంది.

అలాంటప్పుడు ''హిందూ'' భావన స్వాగతించతగినది, స్వాభిమానంతో గూడినది అవుతుందేగాని విసర్జించ తగినది ఎలా అవుతుంది?

మరికొన్ని తార్కాణాలు : 1. ఒక్క విషయమాలోచించండి. మనదేశంలో ఇండియన్ ముస్లిములున్నారు. ఇండియన్ క్రిస్టియనులున్నారు. కాని ''ఇండియన్ హిందువు''లనబడేవారు లేరు. ఎందువలన? ఇండియన్, హిందూ అనే పదాలు ఒకే అర్థాన్నిస్తాయి గనుక. ఈ దేశం యొక్క స్వతస్సిద్ధమైన పౌరులు హిందువులని దీనిని బట్టి గ్రహించవచ్చు.

2. 1840లో జర్మన్ పండితుడు మాక్సుముల్లర్ ఇంగ్లండులో ఐ.సి.ఎస్.లో ఎంపికై భారతదేశానికి అధికారులుగా వచ్చేవారికి భారతదేశ చరిత్ర సంస్కృతి, మతములను పరిచయం చేస్తూ "India : What it can teach us?" అనే అంశము మీద ఏడు ఉపన్యాసాలిచ్చేవాడు. అందులో ఒక ఉపన్యాసము హిందువుల శీలము గురించినది. ఈ దేశ ప్రజలనతడు ''హిందువులు''గా పేర్కొన్నాడు.

3. 1947లో దేశ విభజన జరిగినపుడు ముస్లిములు అధిక సంఖ్యాకులుగా నున్న ప్రాంతాలు దేశం నుండి విడిపోయి వేరేదేశంగా ఏర్పడ్డాయి. హిందువులు అధిక సంఖ్యాకులుగా నున్న ప్రాంతాలు భారతదేశంలో కలిసివున్నాయి. దీనిని బట్టి దేశ సమైక్యతకు, సమగ్రతకు హిందూ భావన ప్రాతిపదికయని స్పష్టమవుతుంది.

4. హిందువుల విశ్వాసం ప్రకారం ఎవరు ఏ దేవుని ఆరాధించినా ఆ ప్రార్థనలన్నీ ఒకే పరమేశ్వరునకు చేరుతాయి.

''ఆకాశాత్ పతితం తోయం

యధాగచ్ఛతి సాగరం

సర్వదేవ నమస్కారః

కేశవం ప్రతి గచ్ఛతి''

ఆకాశము నుండి భూమి మీద పడిన నీరంతా ఏవిధంగానైతే తుదకు సముద్రమునే చేరునో, అట్లే వివిధ దేవతలకు చేసే నమస్కారములన్నీ ఆ కేశవునకే అందుతాయి అని హిందువు భావన చేస్తాడు. ఈ భావనయే సర్వమత సమదృష్టికి, తద్వారా నిజమైన సెక్యులర్ తత్వానికీ ప్రాతిపదికగా నిలుస్తుంది. అందుచేత హిందూ భావనను కమ్యూనల్ అనీ, సంకుచితత్వమనీ నిరసించడం తగదు. అది ఈ దేశం యొక్క సమైక్యతకు సర్వధర్మ సమభావనకు ఆలంబనగా ఉన్నది.

## మానవుడు నూరు సంవత్సరాలు జీవించే మార్గం

1. ఆహారము తీసుకొనునపుడు కడుపులో సగ భాగను ఆహారం, మిగతా సగములో సగము నీరు, సగము వాయువునకు వదలవలెను. 2. శరీర తత్వమును బట్టి ఏదో ఒక వ్యాయామము చేయుట చాలా అవసరము. ఏ వ్యాయామము చేయని వారు సూర్యనమస్కారములు గాని సర్వాంగాసనము గాని చేయుట ముఖ్యము. 3. భోజనమైన వెంటనే నూరు అడుగులు నడువలెనని శాస్త్రము చెప్పును. అందు వలన ఆహారము పక్వమునకు వచ్చి జీర్ణమగును. కదలకుండా కూర్చున్నవారికి పొట్ట పెరుగును. 4. ఊపిరితిత్తులు సక్రమ మార్గంలో ఉంచుకొనుటకు ప్రతి మనుష్యుడు రోజుకు కనీసము 10 ప్రాణాయామములు చేయవలెను. 5. నరముల పటుత్వమునకై సూర్య నమస్కారములు, సర్వాంగాసనము ప్రతిదినం చేయవలెను. 6. దీర్ఘకాలిక జీవితమునకు దోహదకారియగు మూలిక 'బ్రహ్మి'. దీనికే సరస్వతి ఆకు అనిపేరు.

ఎ. రోజూ రెండు మూడు పచ్చి ఆకులు నమిలి తింటే జ్ఞాపకశక్తి వృద్ధి చెందును. బి. మనస్సుకు నిశ్చలత్వము రావడానికి, తద్వారా ఓజస్సు (Vitality) వృద్ధి చెందుటకు ఈ మూలిక ఉపయోగపడును.

సి. ఈ ఆకురసముతో ఒక చెంచాపాలు, పంచదార కలిపి త్రాగితే మంచి ఫలితముండును. ఇలా ఒక ఏడాది తీసుకుంటే దీర్ఘాయుర్దాయము గ్యారంటీ.

– డా. ఎస్. శేషాచలపతిరావు

# 54. ముచ్చటగా మూడు కథలు

- ''సౌమిత్రి''

మనం ఎలా ఆలోచించాలి? ఎలా నడుచుకోవాలి? ఏఏ దోషాలు సరిదిద్దుకోవాలి? అనే ప్రశ్నలకు సమాధానంగా మూడు చిన్న కథలను పేర్కొంటున్నాము. ఇవి మనకు మార్గదర్శకంగా వుంటాయని ఆశిస్తున్నాము.

**1.** కుల ప్రసక్తి తేవద్దు :

తిలకం ధరించి రైలులో ప్రయాణం చేస్తున్న ఒక ధనవంతుడు భోజనం చేద్దామని తన టిఫిను డబ్బా తెరవబోయాడు.

కాని తనముందరే ఖద్దరు ధరించి కూర్చొనియున్న ఒక నాయకుని చూచి అనుమానపడ్డాడు. ''మహాశయా ! మీదే కులం? ఇట్లా అడుగుతున్నందుకు క్షమించండి. కొంచెం ప్రత్యేకమైన పని ఉంటే సాహసించాను. లేకపోతే..''

''జాత్ న పూఛియే సాధుకీ పూఛలీజియే జ్ఞాన్'' (సాధువు యొక్క కులం అడగవద్దు. జ్ఞానం గురించే అడగాలి) అన్న సూక్తి మీరు వినలేదా సేఠ్‌జీ'' అన్నాడాయన.

''మహాశయా! సాధువు అయితే కులం అడుగను. కాని మీరు కాషాయబట్టలు కట్టుకోలేదు. ఈ రోజుల్లో మేతర్ (పాకీ) మొదలుకొని బ్రాహ్మణ, వైశ్యులవరకు అందరూ నాయకులు కావడం కోసం ఖద్దరు ధరిస్తున్నారు. మీరు కూడా ఈ కోవకే చెంది యుండవచ్చు. కులం చెప్పడానికి మీకు అభ్యంతరమేమిటి?''

''కాదు సేఠ్‌జీ! కులం చెప్పినా చెప్పకపోయినా తేడా ఏమీలేదు'' అని చెప్పి ఆ నాయకుడు తన దృష్టి మరల్చి ఏదో పేపరు చదువుకోనారంభించాడు.

కాని సేఠ్‌జీ అంతటితో వూరుకోక మళ్ళీ అదే ప్రశ్నను అడగడం చూచి ''ఏదైనా ఒక కులానికి చెందిన వాడనైతే గదా మీకు నా కులం పేరు చెప్పడానికి'' అని ఆయన సమాధానం ఇచ్చాడు.

''అయితే మహాశయా! మీరు వర్ణసంకరులని అనుకొంటున్నాను. మీ తండ్రిగారు వేరే కులానికి చెందిన స్త్రీని వివాహం చేసుకొని ఉంటారు'' అన్నాడు.

అది తన తండ్రి శీలాన్ని కించపరచే మాట అయినా ఆ నాయకుడు వ్యంగ్య గర్భితంగా ఇలా అన్నాడు :

''శేఠ్‌జీ! మీకు కావాలంటే వినండి. గాంధీజీ ఆదర్శం ప్రకారం ఉదయం ఇల్లు, దొడ్డి శుభ్రం చేసుకొనేటప్పుడు నేను పాకీ వాణ్ణి. చెప్పులు శుభ్రం చేసుకొనే

టప్పుడు మాలవాణ్ణి. క్షవరం చేసుకొనేటప్పుడు మంగలిని, బట్టలు ఉతికేటప్పుడు చాకలిని, డబ్బు లెక్క చూచుకొనేటప్పుడు వైశ్యుడను. కాలేజీలో పాఠం చెప్పేట ప్పుడు బ్రాహ్మణ్ణి. ఇప్పుడు నా కులమేదో మీరే నిర్ణయించండి'' అని అన్నాడు.

ఈ సమాధానం విని రైలు పెట్టెలో ఉన్న ఇతర ప్రయాణీకులు గూడా ప్రసన్నులై నారు. ఇంతలోకి స్టేషను వచ్చింది. ప్రజలు తండోపతండాలుగా వచ్చి ఆ నాయకుడికి పూల హారాలు, వస్త్రాలు బహూకరించి పాదాభివందనాలు గూడా చేస్తున్నారు. ఇవి చూచి సేఠ్‌జీ ఆశ్చర్యపోయాడు.

ఆ నాయకుడు మరెవరో కాదు ''ఆచార్య జె.బి.కృపలానీ'' అన్న విషయం తెలుసుకొని చాలా సిగ్గుపడ్డాడు. క్షమించమని చేతులు జోడించి ప్రార్థించాడు.

''వృధాగా కులం గురించిన ఎక్కువ తక్కువలు మనసునుండి తొలగించు కోండి. కుల ప్రసక్తి తేకండి. ఇదే క్షమించడం'' అని కృపలానీ హితవు చెప్పాడు.

**2. ధర్మవ్యాధుడు :**

ఒక అడవిలో కౌశికుడను ముని చెట్టుకింద కూర్చొని తపస్సు చేసుకుంటు న్నాడు. అతనిలో ఆత్మశక్తి పెంపొందుతూ వున్నది. కాని అహంకారమతనిలో మిక్కుటముగా నున్నది.

ఒకనాడు చెట్టుకింద కూర్చొని ధ్యాన నిమగ్నుడై యుండగా చెట్టు మీద నుండి కొంగ రెట్ట వేసింది. వెంటనే అతడు రౌద్రంగా తలయెత్తి కొంగ వంక చూచాడు. తక్షణమే ఆ కొంగ గిలగిలా కొట్టుకొని నేలమీద పడి ప్రాణం విడిచింది. తనలో దివ్యశక్తి వున్నదని అతడనుకున్నాడు.

మధ్యాహ్న సమయానికి భిక్షాటన కొరకు బయలుదేరాడు. ఒక యింటి ముందు నిలిచి ''భవతీ భిక్షాందేహి'' అని కేకవేశాడు. ఆ యింటిలోని ఇల్లాలు అపుడే యింటికి వచ్చిన భర్తకు పరిచర్య చేస్తూ వున్నది. భిక్ష తెచ్చి యివ్వటంలో కొద్ది ఆలస్యమైనది.

కౌశికుడు కోపం తెచ్చుకొని ఆమె వంక ఉగ్రంగా చూచాడు.

ఆమె ఒక్క క్షణం ఆగి ''స్వామి! ఎందుకలా కోపంగా చూస్తున్నారు? నేల మీద పడి చచ్చిపోవడానికి నేనా కొంగను కాదు సుమా!'' అని సవినయంగా పలికింది.

అంతటితో కౌశికునిలో అహంకార తామసాలు తగ్గిపోయాయి. ఆమెకు సాష్టాంగ నమస్కారం చేశాడు. తనకు జ్ఞానభిక్ష ప్రసాదించమని వేడుకున్నాడు. తాను జ్ఞానబోధ చేయడానికి తగిన దానను కానని, ఊరి వెలుపల కసాయి వృత్తిలో జీవించుచున్న ధర్మవ్యాధుని కలుసుకొనమని ఆమె చెప్పింది.

ఆమె సూచన ప్రకారమతడు వెతుక్కుంటూ ధర్మవ్యాధుని వద్దకు వెళ్లాడు. ధర్మవ్యాధుడు ఉదయమే లేచి జంతువులను చంపి మాంసం అమ్మి జీవిస్తుంటాడు. కౌశికుడు తనకు జ్ఞానబోధ చేయవలసిందిగా అతనిని అర్థించాడు.

ధర్మవ్యాధుడు కౌశికుని తన యింటికి తీసుకుపోయాడు. అచట కుష్ఠురోగు లైన తన తల్లిదండ్రులకు సపర్యలు చేశాడు. పిదప కౌశికునితో ''నా తల్లిదండ్రులకు సేవ చేయడమే నాకు తెలిసిన విషయం. ఇంతకంటే నాకే విషయాలు తెలియవు'' అన్నాడు.

కర్తవ్యనిష్ఠ, మాతాపితరుల సేవ ద్వారా మోక్షసాధన అనే పరమ సత్యాన్ని కౌశికుడు ధర్మవ్యాధుని ద్వారా గ్రహించాడు.

**3. మంచి పనులకు మంచి ఫలితం :**

అది ఎండాకాలం. మిట్ట మధ్యాహ్నం. వేడి భరింపరానిదిగా ఉన్నది. భూమి అంతా మండుతున్నట్లుగా ఉంది.

కాళిదాసు మహాకవి ఏదో పనిమీద వెళ్ళి ఆ మండుటెండలో నగరానికి తిరిగి వస్తున్నాడు. మార్గమధ్యంలో ఒక దుర్బలుడైన వ్యక్తి పాదరక్షలు లేకుండా ఆ మండు టెండలో నడిచి వస్తున్నాడు. అతని కాళ్లు ఎండవేడికి బొబ్బలెక్కుతున్నాయి. అతడా బాధను భరించలేక నిట్టూర్పులు విడుస్తూ నడవలేక పోతున్నాడు.

కాళిదాసుకు ఆ వ్యక్తి మీద సానుభూతి కలిగింది. అపుడు తన పాదరక్షలు అతనికిస్తూ ''నాయనా! నీవు వీటిని తొడుక్కొని ప్రయాణించు'' అన్నాడు. ఆ వ్యక్తి కాళిదాసుకు కృతజ్ఞతలు తెలియజేసి ఆ చెప్పులు తొడుక్కొని హాయిగా వెళ్ళిపో యాడు. కాళిదాసుకు పాదరక్షలు లేనందున అతని అరికాళ్లు బొబ్బలెక్కుతున్నాయి. అయినా ఆ మహాకవి బాధ పడక ఆనందించసాగాడు. ఎందుకంటే ఒక దుఃఖితుడైన వ్యక్తికి తాను సహాయం చేశాడు గనుక.

ఆ సమయంలోనే రాజుగారి పట్టపుటేనుగును తోలుకుంటూ మావటివాడు అటు వైపుగా వస్తున్నాడు. అతడు మహాకవిని గుర్తించి రమ్మని పిలిచి పట్టపు టేనుగుపై కూర్చుండ బెట్టుకున్నాడు. వాళ్ళు క్రమంగా నగరానికి చేరుతున్నారు.

భోజరాజు తన మందిరంలో నుండి గజారూఢుడై కాళిదాసు రావడం గమనించాడు. చక్రవర్తి అతనిని సమీపించి ''మహాకవీ! మీకీ మదపు టేనుగు ఎక్కడ దొరికిందండీ?'' అని ప్రశ్నించాడు.

అందుకు కాళిదాసు ''మహారాజా! నేను నా శిథిలమైన చెప్పులను దానం చేశాను. అందుకు భగవంతుడు ఈ భద్రగజం మీద నన్ను కూర్చోపెట్టాడు. దానం యొక్క ఫలం అప్పటికప్పుడే అనుగ్రహించాడు'' అన్నాడు. మనం చేసే ప్రతి పనికీ ఫలితం వుంటుంది. మంచి పనులకు మంచి ఫలితాలు, చెడ్డ పనులకు చెడ్డ ఫలితాలు ఒనగూడుతాయి. కనుక మంచి పనులు చేస్తూ ఉండాలి. ఇదే ''కర్మ సిద్ధాంతం''.

# 55. ముగింపు

- శ్రీ మన్నవ గిరిధరరావు

భారతవర్షం పుణ్యభూమి. ఇచట అడుగడుగునా పిలిస్తే పలికే దేవతలున్నారు. తిరుపతిలో శ్రీ వెంకటేశ్వరస్వామి, వేదాద్రిలో శ్రీ లక్ష్మీ నరసింహస్వామి, శ్రీశైలంలో భ్రమరాంబిక, అన్నవరంలో శ్రీ సత్యనారాయణస్వామి, విజయవాడలో కనకదుర్గాదేవి, సింగరకొండలో శ్రీ ఆంజనేయస్వామి - ఇలా ఆర్తులకు అభయమిచ్చి కాపాడే దేవతలు మనకున్నారు. అనుదినం భక్తులు ఆయా దేవతలకు సమర్పించే మొక్కుబడులే ఇందుకు తార్కాణం.

భగవంతుడు ఈ నేలమీద మానవ రూపంలో దిగివచ్చి నడయాడాడు. శ్రీరామ కృష్ణాది అవతారములే గాక షిర్డీ సాయిబాబా, శ్రీ రాఘవేంద్రస్వామి, శ్రీ రామకృష్ణ పరమ హంస, పోతులూరి వీరబ్రహ్మంగారు లాంటి యతీశ్వరులెందరో ఇచట ఉద్భవించారు. జనులకు ఆధ్యాత్మిక చైతన్యాన్ని ప్రసాదించారు. సమాజంలో నైతిక విలువలను ప్రోది చేశారు. వారి జీవితాలు మానవాళి మనుగడకు కరదీపికలవలె నిలుస్తాయి.

అయితే మరొక్క సంగతి కూడా చెప్పుకోవాలి. కాలక్రమేణా తమలో ప్రవేశించే దోషాలను ఎప్పటికప్పుడు పరిహరించుకొని ముందుకు పోవడం ఆరోగ్యవంతమైన జాతి యొక్క లక్షణం.

''వేదకాలం తరువాత భారతదేశ పతనానికి రెండే రెండు కారణాలున్నాయి. మొదటిది: ఇహలోకం పట్ల వైముఖ్యం చూపి పరలోకాసక్తులై పురుష ప్రయత్నం మాని అదృష్టానికి ప్రాముఖ్యమివ్వడం. రెండవది : సంఘంలో అర్ధభాగమైన స్త్రీలను అశక్తులను చేయడం'' అన్నారు పండిత శ్రీపాద దామోదర సాత్వాలేకర్.

ఈ రెండు లోపాలను తొలగించుకోవాలి. ఇహలోకంలో వైఫల్యం చెందగూడదు. మహిళల పరిపూర్ణ వికాసానికి కృషి జరగాలి.

''ఇపుడు భారతదేశంలో ముగ్గురు మనుషులు ఐదు నిమిషాల సేపు కలిసి పనిచేయ లేరు. ప్రతివారూ పదవి కొరకు ప్రాకులాడుతారు. అట్టి స్థితిలో త్వరలోనే సంస్థ అంతరిస్తుంది. ఈ పరిస్థితి మారాలి'' అని వివేకానందుడు ఆనాడు చేసిన

హెచ్చరిక ఈనాటికీ వర్తిస్తుంది. ఇపుడు దేశంలో సర్వత్రా కనిపిస్తున్నదిదే. మనలో పరస్పర అవగాహన, కలిసి పనిచేసే తత్వం పెంపొందాలి.

బొంబాయి హైకోర్టు న్యాయమూర్తిగా పనిచేసిన జస్టిస్ మహదేవ గోవింద రానడే మాటలను గుర్తుంచుకోవడం అవసరం. ''వెలుపలి ప్రపంచంతో సంపర్కానికి వైముఖ్యం, అంతరాత్మ ప్రబోధానికి గాక బలమైన అధికారం పట్ల విధేయత, సాంఘిక అసమానతల పాటింపు, చెడు పట్ల సహనభావం, లౌకిక ప్రయోజనాల పట్ల నిర్లక్ష్యం వంటి దోషాలు హిందూ సమాజంలో తిష్ట వేసుకొని వున్నాయి'' అన్నారాయన. అక్షర సత్యాలివి.

చెడును ఎదిరించాలిగాని దానిపట్ల సహనభావం అనర్థదాయకం. దానికి దాసోహమనగూడదు. ఇది మనలోని ఒక ముఖ్యమైన దోషం.

అన్నిటికంటే ప్రధానంగా హిందువులలో సామాజిక దృష్టి లోపించింది. నేను, నా కుటుంబం అనే చింత తప్ప సమాజం ఎలా ఉన్నది? దాని ఎడల నా కర్తవ్యం ఏమిటి? అనే ఆలోచన లేదు. సంఘం నిలిస్తేనే కుటుంబంగాని వ్యక్తిగాని జీవించగ లరు. సమాజము, దేశము - ఈ రెండింటి ఎడ తమ కర్తవ్యాన్ని హిందువులు నిరం తరం మననం చేసుకోవాలి. కులాల రొంపిలో కూరుకుపోగూడదు. అప్పుడే హిందూ ధర్మం చిరస్థాయిగా వర్ధిల్లగలదు.

## హెచ్చరిక!

ప్రొఫెసర్ ఎ.ఎల్.బాషమ్ లండన్ విశ్వవిద్యాలయంలో ప్రాచ్యచరిత్ర శాఖాధ్యక్షు లుగ పనిచేశారు. ఆయన ''ఆశ్చర్యకరమైన భారతదేశం'' (The wonder that was India) అనే పుస్తకం వ్రాశారు.

1964 జనవరిలో భారతదేశానికి వచ్చారు. మదరాసు విశ్వవిద్యాలయంలో విద్యార్థులనుద్దేశించి ప్రసంగిస్తూ ''స్త్రీ పురుషులు స్వేచ్ఛా ప్రణయ కార్యకలాపాల వలన ఐరోపాలో ప్రజలు మరింత సుఖపడిపోతున్నారని ఇచట భారతీయులు అనుకుంటారు. అది నిజం కాదు. నిశ్చితమైన వివాహ పద్ధతి వలన భారతీయులు సుస్థిరమైన దాంపత్య జీవనం గడుపుకుంటున్నారు.

అట్టి స్థిరమైన సంసారజీవితం ఐరోపాలో లేదు. అక్కడ భార్య భర్తను అనుమా నిస్తూ, భర్త భార్యను అనుమానిస్తూ, తల్లీ తండ్రి తమను ఎప్పుడు వదిలివేసి వెళ్లిపోతా రోనని నిరంతరం భయంతో బిడ్డలు బతుకుతున్నారు. అట్టి దుస్థితికి మీరు దిగ జారకండి''

– ''యువభారతి'' నుండి

# రచయితల పరిచయం

## రచనలు, రచయితల చిరునామాలు

| రచన | రచయిత, చిరునామా |
|---|---|
| 1. సృష్టి ఎలా జరిగింది? | డా. జి.ఎల్.ఎన్.శాస్త్రి, M.Sc., Ph.D.<br>(డా. గొర్తి లక్ష్మీనారాయణ శాస్త్రి)<br>రీడర్ & భౌతికశాస్త్ర శాఖాధ్యక్షులు,<br>టి.జె.పి.ఎస్.కళాశాల, గుంటూరు - 6 |
| 2. భారతీయ పంచాంగ విశ్లేషణ<br>3. బహుదేవతారాధనలోని అంతర్యం | శ్రీ వడ్లమూడి వెంకటేశ్వరరావు, M.Sc.<br>రిటైర్డ్ గణితశాస్త్ర అధ్యాపకులు,<br>3వ లైన్ 4వ అడ్డ రోడ్డు, అరండలపేట, గుంటూరు - 2 |
| 4. మహర్షులు బోధించిన ఉత్తమ జీవితము | డా. అనుమోలసెట్టి రాఘవరావు, M.S<br>రిటైర్డ్ ప్రిన్సిపాల్, గవర్నమెంట్ మెడికల్ కాలేజి,<br>ఆర్. అగ్రహారం, గుంటూరు - 3 |
| 5. భారతీయ సంస్కృతి ప్రతిపాదించే ఉత్తమ జీవితము | స్వర్గీయ మోపిదేవి కృష్ణస్వామి M.A., Ph.D.<br>సత్యనారాయణపురం, విజయవాడ |
| 6. దేవాలయాలు – ఆరాధన | శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామివారు<br>శ్రీ కంచికామకోటి పీఠం, నెం.1, శాలయ్<br>స్ట్రీట్, కంచిపురం, తమిళనాడు - 631 502 |
| 7. షోడశోపచార పూజ అంతరార్థం | శ్రీ గొల్లపూడి గౌరీశంకర శాస్త్రి<br>బ్యాంక్ ఆఫ్ బరోడా, గుంటూరు - 1 |
| 8. సత్కర్మల నాచరిస్తేనే ప్రార్థన వలన ప్రయోజనం | పూజ్యశ్రీ బ్రిజమోహన గౌర్<br>గాయత్రీ పరివార్ యుగ నిర్మాణ యోజన,<br>శాంతికుంజ్, హరిద్వార్ (పోస్ట్)<br>ఉత్తరప్రదేశ్ - 249 411 |
| 9. పవిత్ర గ్రంథముల ప్రత్యేకతలు | స్వర్గీయ డా.ఎ.వి.ఎల్. నరసింహం<br>సత్యనారాయణ స్వామి గుడి వీధి,<br>పాత గుంటూరు |

| | |
|---|---|
| 10. విపత్తు నుండి కాపాడిన లలితా సహస్రనామ మంత్రం | శ్రీ కె.జి.సి. హరివిఠల్<br>ప్రిన్సిపాల్, ఎస్.ఆర్.ఆర్. మరియు<br>సి.వి.ఆర్. గవర్నమెంటు కాలేజి, గిరివీధి,<br>సత్యనారాయణపురం, విజయవాడ - 11 |
| 11. దైవప్రార్థన గొప్ప సాధనము | హిందీ : పండిట్ శ్రీరామ శర్మ ఆచార్య<br>తెలుగు : శ్రీ తుర్లపాటి శంభయాచార్య<br>ఎల్.ఐ.జి. 125, హౌసింగ్ బోర్డు కాలనీ,<br>నల్లపాడు రోడ్, గుంటూరు - 5 |
| 12. శ్రీరామనామ మహిమ | స్వర్గీయ దేవగిరి వెంకటరెడ్డి<br>గుంటూరు సమీపంలో అంకిరెడ్డి పాలెం.<br>ఉపాధ్యాయులుగా పనిచేసి స్వర్గస్థులైనారు |
| 13. సహస్ర ఘటాభిషేకం అనంతరం కుంభవృష్టి | శ్రీవణుకూరి శూరారెడ్డి<br>స్తంభాల గరువు, గుంటూరు - 6 |
| 14. వేదాద్రి క్షేత్ర మహాత్మ్యం | స్వర్గీయ తుర్లపాటి వెంకట మల్లికార్జున వర ప్రసాదరావు<br>రిటైర్డ్ దేవాలయాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్,<br>నందిగామ - కృష్ణాజిల్లా |
| 15. సగుణారాధన | స్వర్గీయ రామశరణ్ కుందుర్తి వెంకటనర్సయ్య<br>శ్రీరామ భక్తులు, బుద్దాం |
| 16. వేదములలో ఏమున్నది? | శ్రీ ఎస్.వి.ఎస్. సోమయాజి, B.Com, Fd.A.<br>హైదర్‌గూడా, హైదరాబాద్ - 29 |
| 17. పురాణాలలో ఏమున్నది? | శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య, M.A.<br>రిటైర్డ్ సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్,<br>16-1-24/3/6/1, శ్రీసాయి అపార్ట్‌మెంట్స్,<br>కమ్యూనిటీ హాలు వద్ద, సైదాబాద్ కాలనీ,<br>హైదరాబాద్ - 500 059 |
| 18. ఆధునికులు శ్రీమద్రామాయణాన్ని చదువవలసిన ఆవశ్యకత | శ్రీ శ్రీ శ్రీ మధుసూదన సరస్వతీ స్వామి<br>మైత్రేయాశ్రమం, ఎల్.ఎమ్.డి.కాలనీ,<br>కరీంనగర్ - 505 527 |

| | |
|---|---|
| 19. రామాయణ సందేశం | శ్రీ చలమచర్ల శేషాచార్యులు, M.A.<br>లెక్చరర్, శ్రీ వెంకటేశ్వర వేదాంత వర్ధనీ<br>సంస్కృత కళాశాల, 3-35, రామమందిరం వద్ద,<br>కుకట్‌పల్లి, హైదరాబాద్ - 500 872 |
| 20. మహాభారత విశేషాలు | స్వర్గీయ పరాశరం గోపాలకృష్ణమూర్తి, M.A.<br>రిటైర్డ్ ప్రిన్సిపాల్, గవర్నమెంటు డిగ్రీ కాలేజి,<br>14వ లైను, 1వ అడ్డ రోడ్డు, అరండల్‌పేట,<br>గుంటూరు - 500002 |
| 21. భాగవత ప్రాశస్త్యము | డా. ప్రసాదరాయ కులపతి, M.A, Ph.D.<br>రిటైర్డ్ ప్రిన్సిపాల్, హిందూ కళాశాల, 4వ లైను,<br>రవీంద్రనగర్, గుంటూరు 6 |
| 22. శ్రీ కృష్ణతత్వంలో అంతరార్థం | స్వర్గీయ డా.కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి<br>గుంటూరు (రవీంద్రనగర్‌లో ఉండెడివారు) |
| 23. శ్రీకృష్ణుడు చోరుడా? | స్వర్గీయ కొత్త రామకోటయ్య<br>(గుంటూరు జిల్లా వినకాకానిలో ఉండెడివారు) |
| 24. జీవిత సమస్యలకు భగవద్గీత ఇచ్చే పరిష్కారాలు | డా. ఎస్.బి. రఘునాథాచార్య, M.A, Ph.D.<br>వైస్ - ఛాన్సలర్, రాష్ట్రీయ సంస్కృత<br>విద్యాపీఠం - తిరుపతి - 517 507 |
| 25. శ్రీకృష్ణుని సందేశామృతం | శ్రీ కొల్లిపర పాండురంగారావు<br>వాసవీ కాన్వెంటు, స్వర్ణరోడ్, చీరాల |
| 26. భక్తి తత్త్వం | స్వర్గీయ పరకాల చంద్రశేఖరరావు,<br>సీతమ్మధార, విశాఖపట్నం - 530 013 |
| 27. యోగం ద్వారా మృత్యుంజయత్వం | శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ మహారాజ్,<br>'విశ్వమందిరం', 3వ లైను, కృష్ణనగర్,<br>గుంటూరు - 522 006 |
| 28. అవధూత పిచ్చమ్మ | శ్రీ ఎం.ఆర్. నాగేశ్వరరావు<br>సంపాదకుడు 'రమణస్థాన్' పత్రిక,<br>గుడివాడ - కృష్ణాజిల్లా |

29. రమణవాణి
'వినీలాకాశంలో వింతకాంతులు' గ్రంథం నుండి,
స్వర్గీయ శ్రీ అత్యం సూర్యం,
మెయిన్‌రోడ్, పాలకొల్లు (పోస్ట్)

30. ఆలోచనామృతం
'జగద్గురు బోధలు' నుండి
ప్రచురణ : శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి,
సాధన గ్రంథమండలి, నాజర్‌పేట, తెనాలి (పోస్ట్)

31. సర్‌జాన్ ఉడ్రాఫ్
స్వర్గీయ వాసిరెడ్డి పార్థసారథి,
తెనాలి తాలూకా, తుమ్మపూడి గ్రామ వాస్తవ్యులు,
1961-62 'ఆంధ్రపత్రిక' ఉగాది సంచికలో
వారి వ్యాసం ఆధారంగా

32. వివిధ రంగములలో హిందువుల ఆధిక్యత
స్వర్గీయ హరివిలాస శారదా, రాజస్థాన్‌లోని
అజ్మీర్ వాస్తవ్యులు, 1905లో వీరు వ్రాసిన
'హిందూ సుపీరియారిటీ' నుండి
గ్రహించబడింది.వారు కేంద్ర లెజిస్లేటివ్ కౌన్సిల్
సభ్యులు, ప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు

33. హిందువులు ఆలోచింపవలసిన సంగతులు
స్వర్గీయ డా.శ్రీ ప్రకాశ్,
మద్రాస్ గవర్నరుగాను,
కరాచీలో భారత రాయబారిగాను పనిచేశారు.
'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'లో వారి వ్యాసమునకు అనువాదము.

34. దేశభక్తి స్వరూప స్వభావాలు
డా. చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి, M.A, Ph.D.
'ప్రసన్న మారుతి' - 8-6-1, విద్యానగర్,
విశాఖపట్టణం - 3

35. దీర్ఘకాలం జీవించాలంటే
'వైద్యప్రవీణ' పాటీలు నారాయణరెడ్డి
నాగార్జున నిలయం, నెం. 96, హౌసింగ్ బోర్డు కాలనీ
అనంతపురం - 1

36. ప్రతి వ్యక్తీ 120 ఏళ్ళు జీవించవచ్చు
ప్రొ. సుందరేశ్వరశాస్త్రి
S/o ఎం.ఏ. మంజునాథ్, నెం. 120
పోలీస్ క్వార్టర్స్ - హసన్ (పోస్ట్), కర్ణాటక

37. శ్రీరాముని అర్చించిన ఆంగ్లేయ కలెక్టరు
శ్రీ ఆకొండిరాజారావు, పిఠాపురం



# శ్రీ మన్నవ గిరిధరరావు

ఎం.ఏ, మాజీ ఎమ్.ఎల్.సి.

'సౌమిత్రి' కలంపేరు

జననం 13-7-1930. శ్రీ మన్నవ సీతాపతిరావు, శ్రీమతి సామ్రాజ్యమ్మ గారల ప్రథమపుత్రుడు. స్వగ్రామం మన్నవ (మం॥) పొన్నూరు.

విద్యాభ్యాసం - నిడుబ్రోలు హైస్కూలు, గుంటూరు హిందూ కాలేజి, గుంటూరు ఆంధ్రాక్రిస్టియన్ కాలేజి, బనారస్ హిందూ విశ్వవిద్యాలయం.

గురువర్యులు - శ్రీ పులిపాక లక్ష్మీనారాయణగారు, మన్నవ; శ్రీ వావిలి సుబ్బారావుగారు, పొన్నూరు. 1954లో వి.ఎ.వి. లక్ష్మీ రాజ్యంతో వివాహం. 1942 నుండి రాష్ట్రీయ స్వయంసేవక సంఘలో కార్యకర్త.

గుంటూరు హిందూ కళాశాలలో రాజనీతి శాఖాధిపతిగా పనిచేసి 1990లో పదవీ విరమణ చేశారు.

ఆంధ్రప్రదేశ్ శాసనమండలికి గుంటూరు ఉపాధ్యాయ నియోజక వర్గం నుండి 1968లో ఎన్నికై 1974 వరకు ఎం.ఎల్.సి.గా వున్నారు.

జాగృతి వారపత్రికలో ''ఇచ్ఛావర్తన్'' - ఆంధ్రప్రభ దినపత్రికలో ''అప్రస్తుత ప్రసంగం'', ''గిరికీలు'' శీర్షికలు నడిపారు.

1958 నుండి ''సాధన'', ''భారతీయ తత్వప్రచార్'' పత్రికలకు సంపాద కత్వం వహించారు.

1969 నుండి శ్రీ కంచికామకోటి జగద్గురు శ్రీశ్రీశ్రీ జయేంద్రసరస్వతీ స్వామి వారి ఆనతిననుసరించి ''యువభారతి'' మాసపత్రికకు, 1983 నుండి ''భారతీయ మార్గము'' మాసపత్రికకు సంపాదకులుగానున్నారు.

1956లో ''ఎం.ఎల్.ఏ ఆత్మకథ'' నవల రచించారు. విద్యార్థుల శీల నిర్మాణానికి ఉపకరించే ప్రచురణలు వెలువరించడానికి 1969లో ''యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ''ని స్థాపించి దాని పక్షమున కాంతిరేఖలు - 1,2,3 భాగాలు, పనికొచ్చే కథలు 1,2 భాగాలు, మణిపూసలు 1,2 భాగాలు, మన మాతృభూమి, సూక్తి సుధ, ఎలా చదవాలి? వగైరా గ్రంథాలు రచించారు.

1990 నుండి 1997 వరకు శ్రీ సరస్వతీ విద్యాపీఠం యొక్క రాష్ట్ర విద్వత్ పరిషత్ అధ్యక్షులుగా ఉన్నారు.

ఆకాశవాణి విజయవాడ కేంద్రం నుండి అనేక హాస్యప్రసంగాలు, విద్యావిషయక ప్రసంగాలు చేశారు.

1996 ఉగాది నాడు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్ వారు హాస్య రచయితగా శ్రీ సర్వారాయ బహుమతి రూ. 1,116/-లతో సత్కరించారు.

1998లో జాతీయ సాహిత్య పరిషత్, వికారాబాద్‌వారు వీరు వ్రాసిన ''మన మాతృభూమి''కి ఉత్తమ బహుమతి ఇచ్చారు.


<u>చిరునామా</u>

**మన్నవ గిరిధరరావు,** *M.A., M.L.C. (Ex)*

S- 2, శ్రీ సత్యసాయి హోమ్స్,

6వ లైను, 15వ అడ్డరోడ్,

బ్రాడీపేట, గుంటూరు - 522 002

ఫోన్ : 238331

# ఎల్లరు చదువదగిన పుస్తకాలు

1. కాంతిరేఖలు (మొదటిభాగం) రు. 18-00
2. కాంతిరేఖలు (రెండవభాగం) రు. 18-00
★ 3. కాంతిరేఖలు (మూడవభాగం)
4. పనికొచ్చే కథలు (మొదటిభాగం) రు. 16-00
5. పనికొచ్చే కథలు (రెండవభాగం) రు. 16-00
★ 6. సూక్తిసుధ (53 సూక్తులు)
★ 7. చదువుకుంటే బహుమతి (23 నీతికథలు)
★ 8. ఎలా చదవాలి? (పరీక్షలకు చదివేపద్ధతి)
★ 9. మణిపూసలు - 1 (Telugu Quotations)
★ 10. మణిపూసలు - 2 (Telugu Quotations)
★ 11. మన మాతృభూమి
12. ఏది సెక్యులరిజం? రు. 10-00
13. లోకజ్ఞానం (General Knowledge) రు. 30-00
14. హిందూధర్మ వైభవం రు. 100-00
15. ఎం.ఎల్.ఏ. ఆత్మకథ (హాస్యరచన) రు. 20-00
16. Selected Quotations రు. 10-00


గ్రంథకర్త :

**మన్నవ గిరిధరరావు, ఎం.ఏ.,** *Ex. M.L.C.*


★ గుర్తు గల పై పుస్తకాలు పునర్ముద్రణ జరగవలసి ఉన్నది.